అంతర భారతీయ పుస్తకమాల

# కథాభారతి
# బెంగాలీ కథానికలు

సంకలన కర్త

అరుణ్‌కుమార్ ముఖోపాధ్యాయ

అనువాదం

రాధాకృష్ణమూర్తి చల్లా



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

1991 (శక 1912)



*Original title in Bengali.*

Ekushti Bangla Chhotagalpo compiled by Arun Kumar Mukherjee.

*Telugu Translation:*

Bengali Kathanikalu

రూ. 32.00

డైరెక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5 గ్రీన్‌పార్కు,
కొత్తఢిల్లీ - 110 016 చే ప్రచురింపబడినది.

# భూమిక

భారతీయ పాఠకలోకానికి తమతమ మాతృభాష ద్వారా మరొక దేశ భాషలోని కథాసాహిత్యాన్ని పరిచయం చేసుకొనే అవకాశం కల్పించేందుకు, 'నేషనల్ బుక్ ట్రస్ట్' సంస్థ "అదాన-ప్రదాన" పథకం రూపొందించింది. అధికారికంగా ఆమోదింపబడ్డ ప్రధాన దేశ భాషలలోని ఆయా కథా సంకలనాలని పారస్పరికంగా అనువదింపజేసే ఆ ఏర్పాటుని అనుసరించి సేకరించిన 21 బెంగాలీ కథానికల సంపుటి ఇది. మనకి పరిచితమైన కాలానికి చెందిన వ్యక్తి యొక్క, సమాజం యొక్క, సాధారణ స్వరూపాన్ని ఈ సంకలనం మూలాన గ్రహించవచ్చు.

బెంగాలీ భాషలో చిన్న కథకి ప్రప్రథమంగా సఫలమైన రూపకల్పన చేసినది రవీంద్ర నాథ్ ఠాకూర్. ఈ ప్రక్రియకి ప్రాణం పోసిన ఆయన పవిత్ర హస్తం కథానిక యొక్క అన్ని కోణాలపైన తన ప్రతిభావంతమైన ముద్ర వేసింది. ప్రేమా, ప్రకృతీ, సామాజిక సమస్యా దార్శనికతా, కావ్యమర్యాదా, కాల్పనికతా, ఐతిహాసికమూ, వ్యంగ్యమూ, మొదలైన అన్ని క్షేత్రాలలోనూ ఆయన స్వచ్ఛంద విహారం చేశారు. 1890 నుంచి 1940 వరకూ ఆయన కథలు వ్రాశారు.

రవీంద్రుని సమకాలికులైన త్రైలోక్యనాథ్ ముఖోపాధ్యాయ్, ప్రభాత్ కుమార్ ముఖోపాధ్యాయ్,, శరచ్చంద్ర చటోపాధ్యాయ్, ప్రమథ్ చౌధురీ, ప్రభృతులు బెంగాలీ కథా క్షేత్రాన్ని మరింత చిత్రవిచిత్రంగా పోషించి పండించారు.

అయితే రవీంద్ర, శరచ్చంద్రాదులు వాస్తవానికి నేటి దృష్ట్యా ఆధునికులు కారు. ప్రస్తుత సంకలనం మనకి పరిచితమైన కాలానికి సంబంధించిన రచనల నుంచి సంగ్రహింపబడింది. రవీంద్ర శరచ్చంద్రుల సంప్రదాయాన్ని అతిక్రమించిన బెంగాలీ కథా విధానం గడిచిన నాలుగు దశాబ్దాలలోనూ వంగ దేశీయుల మనస్తత్వాన్ని ఒక విశిష్టమైన మెలకువతో చిత్రిస్తూ వస్తూంది. అందుచేత ఈ సంపుటిలో శరత్‌బాబు తదనంతరం నుంచి నేటివరకూ ఒక విలక్షణ రీతిలో వ్రాయబడిన కథానికలకు మాత్రమే ప్రవేశం కలిగించటమైంది.

వంగ సాహిత్యంలో రవీంద్ర శరచ్చంద్రుల పద్ధతిని విడిచి వెంటనే వచ్చిన రచనాకాలాన్ని 'కల్లోల పర్వం' అంటారు. దాని ముఖ్య వ్యవధి 1923 నుంచి 1939 వరకూ రెండు ప్రపంచ యుద్ధాల మధ్యా గడిచిన ఈ కాలంలో ఆ నాటి ఆర్థిక, నైతిక మాంద్యాల వల్లనూ; భారత స్వాతంత్ర్య సమరం వల్లనూ;. అసహజమైన శాంతి భద్రతలవల్లనూ; ప్రభావితులై ఆనాటి కథకులు తమ రచనలను సాగించారు. ఆయా కల్లోల పర్వంలో ముందుకి వచ్చినవారు- తారాశంకర్ వంద్యోపాధ్యాయ, అచింత్యకుమార్ సేన్‌గుప్తా, ప్రేమేంద్ర మిత్రా,

బుద్ధదేవ్ బోస్, మనీష్ ఘటక్ (యువనాశ్వ), ప్రబోధ్‌కుమార్ సాన్యాల్, భవానీ ముఖోపాధ్యాయ్ మున్నగువారు. 'విచిత్రా', 'శనివారేర్ చిఠీ' అనే పత్రికల ద్వారా పరిచితులైన ఈ యుగపు రచయితలు ఈ దిగువ వారు: విభూతి భూషణ్ వంద్యోపాధ్యాయ్, మానిక్ వంద్యోపాధ్యాయ్, అన్నదా శంకర్‌రాయ్, బన్‌ఫూల్, విభూతి భూషణ్ ముఖోపాధ్యాయ్, శరదిందు వంద్యోపాధ్యాయ్, రవీంద్రనాథ మైత్రా, పరిమళ్ గోస్వామీ, సజనీ కాంత్‌దాస్, ప్రేమాంకుర్ ఆతర్థీ, సరోజ్ కుమార్ రాయ్ చౌధురీ, ప్రమథనాథ్ బిశీ, గజేంద్ర కుమార్ మిత్రా, ఆశాపూర్ణా దేవీ, మనోజ్ బసూ, బిమల్ మిత్రా. ఈ యుగంలోనే హాస్యానికీ, వ్యంగ్యానికీ పేరు గడించిన ప్రముఖ రచయిత 'పరశురామ్' (రాజశేఖర్ బసూ).

'కల్లోల పర్వం' తర్వాత వచ్చిన సాహిత్య యుగకాలం ద్వితీయ ప్రపంచ సంగ్రామం నుంచి మన దేశ స్వాతంత్ర్య సిద్ధి వరకూ (1939-1947). కొద్ది సంవత్సరాల ఈ దశ వంగ సంఘంలోనూ, వంగ రాష్ట్రంలోనూ ఒక భయంకరమైన 'కాలాంతర పర్వం' అని చెప్పవచ్చు. తీవ్ర క్షామమూ, విమానాల దాడీ; కంట్రోళ్లు రేషనింగూ; మిలిటరీ సప్లై బ్లాక్ మార్కెట్; ఆర్థికంగానూ, నైతికంగానూ, సాంఘికంగానూ, అధోగతి, దేశ విభజనతో కూడుకొన్న స్వాతంత్ర్యం, మత కలహాలూ, తూర్పు పాకిస్తాను నుంచి శరణార్థుల రాకా - ఇటువంటి విపరీత పరిస్థితుల మధ్య నడిచింది ఈ స్వల్ప యుగం.

ఆనాటి రచనలు అప్పటి అశాంతినీ, విషమ సంఘటనలనీ ప్రతిబింబింప జేస్తూనే వచ్చాయి. అంటే ఆ వాతావరణం యొక్క కాలుష్యాన్ని, అవి స్వయంగా పంచుకుంటూ, చిత్రించక తప్పలేదు. 'కల్లోల పర్వం' నాటి రొమాంటిక్ కాల్పనికతా, బోహేమియన్ మనోవిలాసమూ, స్వేచ్ఛా ప్రేమకలాపమూ, ఈ యుగంలో మటుమాయమయ్యాయి. మన సమాజంలో ఆ నాడు అతి త్వరితంగా అసంఖ్యాకమైన పరివర్తనలు చెలరేగాయి. వైయక్తికంగానూ, సామాజికంగానూ, ఎన్ని విచ్ఛిత్తులూ, ఎన్ని క్లిష్ట సమస్యలూ, ఎన్ని విపరీత వ్యవహారాలూ ఉత్పన్న మయ్యాయో, వాటన్నిటి ప్రబల శక్తులూ ఆనాటి కథకుల కౌతుకాన్ని, ఆలోచనా సరళినీ తీవ్ర తరంగా సానపెట్టాయి. సుస్థిర నీతి నియమాలు శిథిల మయ్యాయి. ఈ పర్వంలోని భావ వైపరీత్యమూ, అస్వాభావికతా, మానవ జాతిని పీడించిన సూక్ష్మమైన అసంతృప్తి, వికృతమైన విషయాసక్తీ, వినూత్నమైన శపథాలూ, వాటిని స్వీకరించడం వల్ల జీవన సంగ్రామంలో జరిగిన వింత మార్పులూ ఇటువంటివి యుద్ధ పూర్వపు యుగంలో ఊహాతీతంగా ఉండేవి. నిజానికి యుద్ధం ఒక భయావహమైన భూకంపం వంటిది. దాని ఫలితంగా శాంతీ, నీతీ, కుటుంబ గౌరవం, అన్యోన్యానురాగం, వాత్సల్యం, ధర్మ సంస్కారం-అన్నీ విధ్వంసం

అయిపోతాయి అయినా ఆ రణధ్వనిలోనే ఒక నూతన సమాజ నిర్మాణం గురించిన స్వప్నాల యొక్క, దృఢ వ్రతాల యొక్క ప్రకటన కూడా వినబడుతూనే ఉండాలి.

పైన వర్ణింపబడిన మార్పుల వల్ల ప్రభావితులైన వారు–సుబోధ్ ఘోష్, సతీనాథ్ భాదురీ, సంతోష్‌కుమార్ ఘోష్, నారాయణ్ గంగోపాధ్యాయ్, నరేంద్రనాథ్ మిత్రా, నవేందు ఘోష్, ననీ భౌమిక, సుశీల్ జానా, జ్యోతిరింద్ర్ నందీ. వీరితోపాటు తత్పూర్వులైన కల్లోల పర్వపు రచయితల జాబితాలో చేర్చదగిన వారిలో పేర్కొన దగిన ప్రముఖులు- జగదీశ్ గుప్తా, మానిక్ వంద్యోపాధ్యాయ్, అచింత్యకుమార్ సేన్ గుప్తా, ప్రబోధ్ కుమార్ సాన్యాల్. అలాగే 'విచిత్రా', 'శనివారేర్ చిఠీ', పత్రికల కథకుల పట్టీలో స్మర్తవ్యులైన వారిలో ప్రధానులు: విభూతి భూషణ్ వంద్యోపాధ్యాయ్, తారాశంకర్ వంద్యోపాధ్యాయ్, మనోజ్ బసూ, సరోజ్ కుమార్ చౌధురీ, ఆశా పూర్ణా దేవీ, ప్రమథ్‌నాథ్ బిశీ, పరిమళ్ గోస్వామి, బన్‌ఫూల్, బాణీరాయ్, సుశీల్ ఘోష్, చారు చంద్ర చక్రవర్తి, మొదలైనవారు.

ఈ అంధకార పర్వం తర్వాత రక్తసిక్తమైన, విభజనాత్మకమైన దేశ స్వాతంత్ర్యం వచ్చింది. దానితో పాటు కాందిశీకుల ప్రవాహం, అస్తవ్యస్తమైన సాంఘిక వైకల్యం కూడా రానే వచ్చాయి. స్వాతంత్ర్య ప్రాంగణంలో వినిపించిన ఆశా నినాదాలూ, ఆనంద ధ్వనులతోనే శరణార్థుల, వంచిత ప్రజల రోదనలూ, హాహాకారాలూ కూడా ప్రతిధ్వనించాయి. ఈ ఆక్రోశాలను విని, రక్తపాతాలను చూసి, కథలు వ్రాసిన వారిలో ముఖ్యులు: సమరేశ్ బసూ, బిమల్ కర్, రమాపద్ చౌధురీ, సయ్యద్ మూజ్‌తబా అలీ, హరినారాయణ్ చటోపాధ్యాయ్, ప్రభాత్ దేవ్ సర్కార్, శాంతిరంజన్ వంద్యోపాధ్యాయ్, స్వరాజ్ వంద్యోపాధ్యాయ్, ప్రాణ్‌తోష్ ఘటక్, సుధీర్ రంజన్ ముఖోపాధ్యాయ్. సుశీల్ రాయ్, రంజన్, శచీంద్ర్‌నాథ్ వంద్యోపాధ్యాయ్, సులేఖా సాన్యాల్, గౌర్ కిశోర్ ఘోష్, ఆశుతోష్ ముఖోపాధ్యాయ్, సత్యప్రియ ఘోష్, ఆశిష్ బర్మన్, అమియ భూషణ్ మజుందార్, కమల్‌కుమార్ మజుందార్, గౌరీ శంకర్ చటోపాధ్యాయ్, దీపక్ చౌధురి, మహాశ్వేతా, దేవీ, తదితరులూ.

ఈ యుగపు కథకులు అంతకు ముందుగా వచ్చిన వారితో సరిగా పోల్చదగిన వారే. న్యాయానికి ఈ రెండు తరాల రచయితల మధ్యా పెద్ద తేడా లేదు. నరేంద్రనాథ్ మిత్రా, నారాయణ్ గంగోపాధ్యాయ్, సంతోష్ కుమార్ ఘోష్, ననీ భౌమిక్, సుశీల్ జానా, శాంతి రంజన్ వంద్యోపాధ్యాయ్, స్వరాజ్ వంద్యోపాధ్యాయ్, ప్రాణతోష్ ఘటక్, ఆశుతోష ముఖోపాధ్యాయ్ వీరందరూ 1916-1922 మధ్య జన్మించిన వారు. ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యేసరికి కలకత్తాలోనూ మిగతా వంగ దేశంలోనూ పూర్వపు పాలక వర్గం దిగ్భ్రమచెందుతున్న రోజుల్లో వీరు

తమ యౌవన దశలో అడుగు పెట్టారు. నాటి నుంచీ నేటి వరకూ వీరందరూ ప్రతిభావంతంగా తమ రచనలను సాగిస్తున్నారు. సమాజంలోనూ వ్యక్తిలోనూ కలిగిన విచిత్ర పరివర్తనకు సాక్షిభూతమైనది 1940 నుండి 1970 వరకూ వీరు గ్రహించిన కథావస్తువు.

బెంగాలీ కథానికల మరొక యుగం ఈ శతాబ్దపు ఉత్తరార్థమందు మొలకెత్తింది. ఈ యుగపు యువ కథకులు 1930-1940 మధ్య పుట్టినవారు. వీరు ఒక వినూతన తరానికి చెందిన లేఖకులు. సయ్యద్ ముస్తాఫా సిరాజ్, మతినందీ, సునీల్ గంగోపాధ్యాయ్, శ్యామల్ గంగోపాధ్యాయ్, బరేన్ గంగోపాధ్యాయ్, శీర్షేందు ముఖోపాధ్యాయ్, ప్రఫుల్ల రాయ్, అతీన వంద్యోపాధ్యాయ్, దివ్యేందు పాలిత, దీపేంద్రనాథ్ వంద్యోపాధ్యాయ్, దేవేశ్ రాయ్, సందీపన చటోపాధ్యాయ్, కవితా సింహ, లోకనాథ్ భట్టాచార్య, శంకర్ ప్రభృతులు ఈ నవ యుగ కథకులు.

ఈ యువ రచయితలకూ వారికి సన్నిహిత పూర్వులకూ ఏమీ సంబంధం లేదు. వీరిది ఒక అతి నూతన బృందం. వీరు గతాన్ని ఏ విధంగానూ దర్శించలేదు, వారికి ముందు జరిగిన చరిత్ర గురించి వీరికి ఏ విధమైన కృతజ్ఞత కానీ, స్మృతి కానీ లేదు. వీరు పెరిగినది బ్లాకౌట్, క్షామం, మత కలహాలు, స్వతంత్రత తర్వాత కలిగిన రక్తపాతం, కాందిశీకుల డేరాలు, మొదలైన వాటి అర్వాచీన వాతావరణంలో. తత్పూర్వులదీ, వీరిదీ విభిన్నమైన బ్లడ్ గ్రూపు; వీరికి వారితో ఏ ఆత్మీయతా ఏర్పడలేదు. వీరు పెద్ద వాళ్లయ్యేసరికి ఉమ్మడి కుటుంబం యొక్క సౌమ్యసౌధం చాలా కాలంగా పతనమై ముక్క ముక్కలై పోయింది; శ్రద్ధా భక్తుల వంటి మాటలు వీరికి నీటి మూటలు. స్త్రీ-పురుష సంబంధం ఒక క్రొత్త రకపు సెక్సుయల్ రివల్యూషన్ గా మారింది. (అంటే ప్రకృతి సహజమైన సంయోగంలో మౌలికమైన మార్పు లేకపోయినా). వీరికి వెనుక గడిచిన కాలం తాలూకు ఏలాంటి భ్రాంతి యుతమైన స్మరణా లేదు. తమ బైట ఉన్న వైరి జగత్తులో ఏదో విధంగా నివసించేందుకు వీరు రాజీ పడ్డారు. ఎప్పుడో ఏదో గుంపుగా పరిణమించేలా కనుపించినా, అసలు వీరి స్వభావం ఒంటరితనం. ఏమీ కారణం లేకపోయినా ఎప్పుడూ ఏదో ఆందోళనా, ఏదో ప్రతీకార వాంఛా, అంతులేని మనోవికారం, చిత్త క్షోభా వీరిలో గోచరమవుతుంటాయి.

ఈ నవ యువ రచయితల రూపురేఖలనూ, వారికి కొద్దిగా ముందు వచ్చిన లేఖకుల తత్త్వాలనూ చూడగా చూడగా ఈ రెండు తరాల వారూ వేర్వేరుగా విడిపోయిన ద్వీపవాసులలా అనిపించక తప్పదు. కల్లోల పర్వపు రచయితలకూ రెండవ ప్రపంచ సమరం నాటి లేఖకులకూ ఉన్న మానసిక, వైజ్ఞానిక దృక్పథాలలోని భేదాల కంటె, ద్వితీయ ప్రపంచ యుద్ధం నాటి రచయితలకూ ఈ నవ కథకులకూ ఉన్న తేడా వేయి రెట్లు. కల్లోల పర్వం నాటి కాల్పనికత తర్వాత

తరంలో కనపడక పోయినా, ఆ రెండు తరాల వారికీ జీవితం యొక్క సుఖ సంపదల విషయంలోనూ మౌలికమైన విలువల గురించి కూడా ఒక ప్రత్యేకమైన శ్రద్ధ ఉండేది. ఈనాటి యువరచయితలకు అటువంటి నమ్మకాలు ఏమీ లేవు. వీరికి, వీరికి వెనుక వారితో గల అంతర్యాలు సమానాంతర రేఖల లా కలియ లేనివి.

పైన చెప్పబడిన నూతన-తదవ్యవహిత పూర్వ యుగాల రెండింటి మధ్య ఉన్న వ్యత్యాసాలు కేవలం మానసిక మైనవే కావు. అవి భౌతికమైనవీ, పైగా (వ్యావహారిక) భాషా సంబంధమైనవీ కూడా. జీవిత దృక్పథంలో మాత్రమే కాదు; అసలు జీవన విధానంలోని కాయిక, వాచిక, మానసిక ప్రక్రియల ప్రయోగంలోనే వారు భిన్న ధ్రువాలకి చెందినట్లుగా కనుపిస్తారు.

పూర్వోక్త విషయాలను పరిశీలించి చూస్తే మనం ఒక నిర్ణయానికి రావచ్చు: రవీంద్రనాథ్ తోనే బెంగాలీ కథకు ఒక పరిపూర్ణత కానీ, చరమసిద్ధి కానీ కలగలేదని, బెంగాలీ కథానిక మాటిమాటికీ ముందుకి సాగుతూనే వచ్చింది. క్రొత్త మలుపులు తిరిగింది; క్రొత్త గంటలు మ్రోగించింది, తను గురి అయిన పరీక్షలకు గాని, చేసిన నిరీక్షణకు గాని ఎప్పుడూ తట్టుకోలేని అవస్థకు గురి కాలేదు; జీవితం యొక్క నవనవోన్మేషమైన భావాల గవేషణలో తన ఉత్సాహాన్ని ఎన్నడూ కోల్పోలేదు.

ఈ సంకలనం ఒక నిర్దిష్టమైన కాలానికి, పరిమాణానికి అనుగుణంగా పేజీల, కథల యొక్క సంఖ్య విషయంలో చేయబడింది. ఇది అందరికీ పూర్తిగా సంతృప్తి కలిగిస్తుందన్న నమ్మకం లేదు కానీ, ఇటువంటి ప్రచురణలలో ఇంతకంటె వైవిధ్యాన్ని కాని విపులత్వాన్ని కాని సాధించడం కుదరదు. రవీంద్ర శరచ్చంద్రుల తర్వాతి 3 తరాల కథా భాండారం లోని వైచిత్రినే, సమృద్ధినే ఎంచి పంచడంలో బహుశా ఏ సంకలనం కూడా సంపూర్ణమైన తృప్తిని చేకూర్చలేదేమో! అయినా ఈ విషయం పాఠకుల సానుభూతి, సహృదయతల పై విడవక చేయగలిగినది మరేమీ లేదు.

కాపీరైటు సమస్యా పరిష్కారం కాకుండా కాలహరణం జరిగి, ఆఖరి క్షణం దాటిపోబట్టి బెంగాలీ కథా సాహిత్యంలోని ఉభయ దిక్పాలురన దగిన విభూతి భూషణ్ వంద్యోపాధ్యాయ్, మానిక్ వంద్యోపాధ్యాయ గారల, క్రమశః, "అహ్వాన్", "నమూనా" అనే కథానికలను ఈ పుస్తకంలో చేర్చలేకపోయినందుకు చింతిస్తున్నాను.

వంగభాషా సాహిత్య విభాగము
కలకత్తా విశ్వవిద్యాలయము — అరుణ్ కుమార్ ముఖోపాధ్యాయ

# విషయసూచిక

# చివరి మాట

*తారాశంకర్ వంద్యోపాధ్యాయ్*

పూర్వచక పరగణాలలోని లాట్ భరతపురం సర్వ సంపదలతో తుల తూగుతూ ఉండేది.

అక్కడి చెట్ల ఆకులు చేటల్లాగ, కొమ్మలు దూలాల్లాగ ఉంటాయి. గడ్డి హరి చందనంలాగ, మట్టి సున్నితంగానూ కనుపిస్తాయి. అరకతో దున్ని, విత్తనాలు నాటారో, లేదో, వెంటనే పొలం నిండా పంటలు పండుతాయి. అంతకంటె భరత పురానికి కావలిసింది ఏముంది? బంగారపు సంపత్తి అంటే అక్కడ ఊరికే మాటవరసకు అనడం కాదు. అక్కడి పూర్వ ప్రజలు నదీ సైకతాలనుంచి బంగారపు కణికలు బైటకి తీసేవారు. అక్కడి భూగర్భంలో నిజంగా బంగారం ఉండేది. ప్రజలందరూ ఒక వెర్రి గుంపులా తోచేవారు. పంట పండించి తినడం, పొట్ట చెక్కలయ్యే లాగ నవ్వడం "నువ్వెవరయ్యా మా కంటె చెప్పొచ్చావ్". బైరాగి బట్టలు కట్టుకోవడం, నుదుటిపై గంధపు తిలకం, మెడలో తులసీదళాలమాల, నల్లటి శరీర ఛాయ. వీటి వల్లే వెర్రి వాలకం స్పష్టమౌతుండేది.

పొలం దున్నేవారు, అందరూ వ్యవసాయ దారులే; జమిందారు వైపు కూడా పొలం దున్నే రకమే; ఒకప్పుడు.

పూర్వం పొలం దున్నడం, పొగ త్రాగడం, పూజా పురస్కారాలు పూర్తిచేసుకుని ఇటూ అటూ తిరగడం.

ఇప్పుడు ఆ రోజులు మారాయి. కలియుగ ప్రభావం పూర్తిగా పడింది భరతపురం పైన. పొట్ట సగం మట్టుకే నిండే తిండి; రోగంతో ఊపిరి పీల్చుకో లేకపోవడం, ఏదో రకం పంట పండించడం; కొందరు దేవుణ్ణి సేవించడం, కొందరు అసలు భగవంతుణ్ణి తలచుకోకపోవడం; అంటే, కొందరు ఏడవడం, మరికొందరు ఊరికే కూర్చుని పళ్లు ఇకిలించడం.

పద్మాపార నగరం షావుకార్లు ఇప్పుడు భరతపురపు జమీందార్లు. ఒకప్పుడు మంగళకాటపురం నవాబులు ఇక్కడ జమీందార్లుగా ఉండేవారు. అప్పుడు షావుకార్లు ఇక్కడ వ్యవసాయం చేసేందుకు వచ్చారు. నవాబులు ఇళ్లల్లోని అంతఃకలహాల మూలాన ఆ షావుకారుల దగ్గర అప్పులు చేసేవారు. అప్పులు వెయ్యిరెట్లు పెరిగేసరికి, వేరే గతి ఏమిటి? పైగా రైతు పెద్దా, అందరు రైతులూ కూడా దావాలు పడేటప్పుడు షావుకార్ల తరఫునే సాక్ష్యం ఇచ్చేవారు.

సరే ఆ సంగతి అలా ఉంచుదాం. గత జలసేతు బంధనం వల్ల ప్రయోజనం లేదు. ప్రస్తుత పరిస్థితి ఏదో అదే మనకి సంబంధించినది. ఈనాడు పద్మాపార

పురం షావుకార్లే భరతపురం యొక్క జమీందార్లు. మెల్లి మెల్లిగా కోర్టు కెక్కడం, కోర్టుల నుంచి ఏజెంట్ల చేతుల్లో పడడం, ఎల్లాగైతేనేం పూర్వపు భూస్వాముల ఆస్తులు షావుకార్ల చేతుల్లోకి వచ్చాయి. ఇదీకాక, పద్మాపారపు షావుకార్లు వారి ప్రాంతాన్నుంచి నౌకర్లను కూడా తీసుకువచ్చి వాళ్లకి భరతపురంలో స్థిర నివాసం కల్పించే ఏర్పాట్లు చేశారు. ఇంకా ఆ షావుకారుల జ్ఞాతులు చాలామంది వచ్చి భరత పురంలో దుకాణాలు పెట్టి, వ్యవసాయం చేస్తూ అక్కడ స్థిరపడ్డారు. ఆపైన పరిశ్రమ కేంద్రాలు స్థాపించారు; వాటిల్లో చాలా మంది కర్మకారులు పనిచేస్తూ భరతపురంలో నివాసం ఏర్పరచుకున్నారు.

వీళ్లందరిలో కొందరు ఏడుస్తూనే, లేక కొందరు పళ్లికిలిస్తూనే కాలక్షేపం చేస్తూ ఉంటారు. మరి కొందరు మంచి గానే చెడ్డగానే ఇటూ అటూ తచ్చాడుతూ ఉంటారు.

జమీందార్ల నౌకర్లతో చెట్లపై యాజమాన్యం గురించి పేచీలతోనే, భూముల స్వాధీనం విషయంలో ఏదో గొడవ పడడంతోనే, కూలివాళ్ల రోజువారీ జీతాలు, భృత్యాలు (ఆహారాలు) గురించి ఏదో 'లేదు, కాదు' అంటూనే; షావుకారు దుకాణ దారులతో ఉప్పు బేరాలతోనే, నూనె బేరాలతోనే, బట్టల బేరాలలో ఎత్తు పైఎత్తులతోనే; కార్ఖానా పనివాళ్ల జీతాలివ్వడంలో తగాదాలతోనే. –ఇలాగ ఏదో విధంగా అనేక అల్లకల్లోలాలతో రోజు గడుస్తూ ఉంటుంది. నూనె మిల్లు నాలుగు వైపులా, కళ్లకు గంతలు కట్టుకొని తిరిగే గానుగ ఎద్దు వంకర కొమ్ముల్లా, ఏదో అలజడి. నూనెను తిలఘాతకుడు బైటికి తీసాడు; తెలకపిండి ఎద్దులు తిన్నాయి.

ఇది ఇలా ఉండగా హఠాత్తుగా భూకంపం వచ్చినట్లు అంతా పెల్లగిల్లి పోయింది. ఒక భయానకమైన భూఛిద్రం ఏర్పడింది. షావుకారు జమీందారులకీ స్థానిక హాల్దీటాడీ జమీందారులకీ మధ్య సరిహద్దుల గురించి క్రిమినల్ కేసులు బయలుదేరాయి. అసందర్భమైన క్రిమినల్ కేస్ –చెప్పడానికేం లేదు, ఫిర్యాదు లేదు, నోటీసు లేదు, పత్ర వ్యవహారం లేదు. స్థానిక జమీందారుల నౌకరులు హఠాత్తుగా వన సంపదలను ధ్వంసం చేశారు. కర్రలు, కఠారులు, బల్లెములు మొదలైనవి తీసుకుని భరతపుర ప్రజ ధర్మపురం పై దండెత్తింది. న్యాయాలయం వదిలి కొట్టుకు చావడం, రక్తం కార్చడం, గాయాలు తగల్చడంలోకి దిగారు అందరూ. షావుకారు యజమానుల దళాలు వచ్చి భరతపురపు కోర్టు నుంచి న్యాయాధికారం తొలగించారు. అంతే కాదు; 'స్థానిక' యజమానుల ముఠా యొక్క వ్యవహారం చూసి భరతపురం యొక్క ఆచార వ్యవహారాలు మారిపోయాయి. కత్తి కఠార్లకు తైలం పూసి తల్వారులు సాన పెడుతూ భరతపురంలో ఎటువంటి

ఏర్పాట్లు మొదలయాయి యంటే అక్కడి సాంఘిక వ్యవస్థ అంతా ఆఖరికి ఒక హంగామా క్రింద మార్చబడింది అనడంలో ఏమీ సందేహం లేదు. నాలుగు దిక్కుల నుంచీ హాహాకారాలు ప్రతి ధ్వనిస్తున్నాయి. భరతపురపు కచేరీ లనుంచి రణగొణ ధ్వని బైటపడింది. వ్యవసాయదారుల జనాభా అందరూ ఒక్కమాటు ఉలికి పడిలేచారు. వాళ్ల అవస్థ ఇద్దరు మల్లయోధుల కాళ్ల క్రింద నలిగే పచ్చగడ్డిలాగ ఉంది. వాళ్లందరూ కలవరపడి పోతున్నారు.

వృద్ధుడు లాలా మోహన్ పాండే భరతపురపు రైతుపెద్ద. కష్టజీవితం గడపడం మూలాన జుట్టు ఊడిపోయింది, పళ్లు అన్నీ ఊడిపోయాయి, మాట ఒణుకుతూ ఊడిపడుతుంది; బోసినవ్వు; వార్ధక్యం వల్ల చేతులు వణుకు తున్నాయి.

గుంపులుగుంపులుగా భరతపుర జానపదులందరూ వచ్చి పాండే చుట్టూ నిలబడ్డారు.

సాదరంగా చేతులు జోడించి, అద్దాల్లో బిడ్డలాగ బోసి చిరునవ్వు నవ్వుతూ, "మీరంతా తండ్రులూ, పినతండ్రులూ, సోదర సోదరీమణులూ వచ్చి కూర్చోండి" అన్నాడు తాత.

అందరూ కూర్చున్నారు ఆ తర్వాత ఒక్కటే మాట అన్నారు. "కర్తా? ఆ ఒక్క మాటలో అన్నీ చెప్పబడినట్లే. 'కర్త' (నాయకుడు) అన్నీ తెలుసుకున్నట్లే.

ముసలివాని సంతోషపు నవ్వు, దుఃఖపు నవ్వు, భావనా గర్భితమైన నవ్వు అలా నవ్వుతూనే ఉన్నాడు అర్థయుతంగా.

గౌరపురం నుంచి వచ్చిన ఒక ఆసామీ అన్నాడు: "షావుకారు బాబులు మా భూముల మీద మా హక్కులను మన్నించడం లేదు. మాకు క్రయ విక్రయాల విషయంలో ఏమిటి సౌకర్యం? షావుకార్లు జమీందారులు, 'స్థానిక' స్వాములు జమీందార్లు: కాగా, ఆ "స్థానిక" యజమానులు మా భూముల హక్కులు మాకు వదిలేస్తే, వాళ్ల తరఫున మేము సాక్ష్యం ఇవ్వవచ్చునా?"

వృద్ధుడు బుజాలు ఆడిస్తూ అన్నాడు: "ఉహూహూ అది పాపం అవుతుంది."

అప్పుడు ఆసామీ అన్నాడు: "అయితే మేము కూడా క్రిమినలు కేసులో ఇరుక్కోవలసి వస్తుందా?"

మళ్లీ ముసలిపెద్ద బుజాలాడిస్తూ "ఉహూ" అన్నాడు.

"ఏం? భయం వేస్తోందా?" అంటూ అరిచాడు ఒక కుర్రాడు.

ముసలివాడు నవ్వాడు. ఆ నవ్వు ముందు కుర్రవాడు నిరుత్తరుడయ్యాడు. పెద్ద అన్నాడు. "తమ్ముడూ, భయం లేదు కాని, పాపం ఉంది".

"అయితే ఏం చేయమంటావు? చెప్పు పాపం లేని పద్ధతి సెలవియి" అన్నాడు యువకుడు.

వృద్ధుడు "హూ నిలబడరా, తమ్ముడూ! నీ మనస్సుని శోధించు. అప్పుడు భగవంతుడే నీకు త్రోవ చూపిస్తాడు" అన్నాడు.

రతన్‌లాల్ అన్నాడు: "ఏది అయినా సరే, నిక్కచ్చిగా ఫలించేలాగ చెప్పు, కత్తా నువ్వు ఏం చెపితే నేను అది చేస్తాను".

వృద్ధుడు మళ్లీ నవ్వాడు. రతన్‌లాల్‌పై అతనికి చాలా నమ్మకం ఉంది. చాలా మంచి యువకుడు. పైగా వాడి కెంత సాహసం!

మెల్లిమెల్లిగా కచేరీ నుంచి బైటకొచ్చాడు ముసలిపెద్ద. గుమాస్తాని చూసి 'రామ, రామ' అని నమస్కారం పెట్టాడు.

"ఏం లాల్‌మోహన, రా, రా!" అన్నాడు ఆయన (భూస్వాముల గుమాస్తా)

"ఆ, వస్తా ఒక్కసారి"

"వస్తా, గిస్తా" కాదు. అందరూ నడుం కట్టుకుని నడవండి ఒకేసారి . 'స్థానిక' ముఠాదారుల కొకసారి బుద్ధి చెప్పాలి. అందరూ కలిసి వాళ్ల వళ్లంతా చింతకాయ పచ్చడి చేసి రావాలి. ఒక ప్రక్క నుంచి డొక్క చీల్చేసి నాశనం చేయాలి".

వృద్ధుడు నవ్వాడు: "ఏంటంటున్నారు, బాబూ గుమాస్తా గారూ?"

"ఏం?"

"అదే. డొక్క చీల్చేసి రక్తపాతం చేస్తారేం?"

వాళ్లంతా చస్తే పాపం కాదూ?" అంటూ అశ్రువులు రాల్చాడు ముసలివాడు.

ముసలివాడి ఈ భండారం అంతా చూస్తూంటే గుమాస్తా యొక్క ఒళ్లు మండుతోంది. "ఒక్కొక్కళ్లకోసరం సానుభూతితో ఒక్కొక్కళ్లపై కోపం చూపించడం ఏమిటో తెలుస్తూందిలే. వాళ్ల రక్తం చూస్తే, నీ కళ్లమ్మట నీళ్లొస్తాయేం? అంతా తెలిసిందిలే" కస్సు కస్సుమంటూ మరి కొన్ని కాగితాలు వ్రాస్తూ, మళ్లీ అన్నాడు: "మన వాళ్లకి గాయాలు తగిల్చి రక్తం ప్రవహింపజేసినప్పుడు, అప్పుడేం....?

వృద్ధుని పెదవులు వణకడం మొదలుపెట్టాయి.

కళ్లమ్మట నీళ్లు ఇంకా రెట్టింపుగా కారుతున్నాయి.

ఆ మాటలు విని ఇంకా ఏడుస్తూ: "గుమాస్తా బాబూ! అయ్యో వాళ్లకు తగిలే దెబ్బల గురించి తలచుకుంటే నా గుండె పగిలిపోతోంది. ఓ భగవంతుడా, ఏం చెయ్యను?"

గుమాస్తా తీక్షణంగా వృద్ధుని వైపు చూస్తూ కూర్చున్నాడు. లోకులంతా వేషగాళ్లు, పాషండులూనూ! ఎక్కడైనా నిజంగా న్యాయం ఉందా? గొర్రె కొమ్ములు తిరిగి పోకపోనీ, వజ్రపుటంచులు శిథిలమవ్వనీ, సరిగ్గా అలాగే గుమాస్తా యొక్క కఠిన హృదయాన్ని మరల్చే శక్తీ, ముసలివాని ఛాదస్తపు ఇంటి తలుపుల కి చిల్లుపట్టే సామర్థ్యమూ, ఎవరికీ ఉండదు.

చాలా సేపు అల్లా ముసలివాడికేసి చూశాక, గుమాస్తా అన్నాడు: "అయితే ఏం చేయాలంటావో చెప్పు"

"అదే మనవాళ్లకు చెప్పాను" అంటూ, ఒక ప్రక్కనుంచి కన్నీళ్లు కారుస్తూనే నవ్వుతూ లేచాడు ముసలివాడు.

"ఏం చెప్పావు".

"ఏం చెప్పానంటే, మా భూముల శిస్తు నువ్వు గ్రహించు, అందరి నౌకర్ల ప్రతినిధులనూ వేరు చేయి- అప్పుడు స్థానిక యజమానులు మనల్ని ప్రతిఘటిస్తారేమో చూడు".

"ప్రతిఘటిస్తారు? నీ కసలు క్రిమినలు కేసు అర్థం అయిందా? వ్యవసాయం చేయి, అన్నం తిను. లాఠి పట్టుకోవడం తెలుసా? బల్లెం విసరడం తెలుసా?"

ముసలివాడు నవ్వాడు

"నవ్వుతావేం?"

"నీ మాట వింటూంటే నవ్వు వస్తుంది. నేను లాఠీ బల్లెం పట్టుకోవడం ఉత్తి మాటలే".

"అయితే ఎలా ప్రతిఘటిస్తావు?"

"వాళ్లు వస్తారు. నా వీపు తిప్పి నిలబడతాను. 'కర్రతో కొట్టు' అంటాను. నా గుండె వాళ్లకు చూపిస్తాను: 'బల్లెం విసురు' అంటాను. నా రక్తం కారుతుంది, నేల ఎర్రపడుతుంది, నేను చస్తాను. అప్పుడు ప్రతి ద్వంద్వులకి బుద్ధి వస్తుంది; వాళ్ల హృదయాలు స్పందిస్తాయి; కళ్ళమ్మట నీళ్లు కారుతాయి. భగవంతుడు వాళ్లకు సత్య జ్ఞానం కలుగజేస్తాడు. సిగ్గుపడి వాళ్లు వెనక్కి వెళ్లిపోతారు".

గుమాస్తా 'హాహ్హా' అంటూ నవ్వుతూ లేచాడు. "ఇదా నీ బుద్ధి?"

వృద్ధుడు మట్టుకు ఆశ్చర్య పడ్డాడు. అతనింకా నిరుత్సాహపడలేదు. వడిలిపోయిన అతని ముఖంపై అదే ఆశ్చర్యం ఇంకా ప్రస్ఫుటిస్తోంది. చంటి పిల్లవానిలా నవ్వుతూ లేచాడు. "అయ్యో, నా మనస్సు దేవుడు పరీక్షించుగాక! నా మనస్సు శుద్ధి పరచుగాక! లేకపోతే ఎవరికీ అర్థం కాదు నా మాట"

దేవుణ్ణి బట్టి దేవత మోస్తరుగా ముసలివాడిలాగే ముసలమ్మ ఉంది.

అంతా విని ఆ భయానక విషయం గురించి చింతిస్తూ ఉండిపోయింది. ఆ షావుకారు గుమాస్తా గురించి చింత అతణ్ని ఆమెనూ వదలలేదు. "ఇది తేలిక మాట, తిన్నని మాట. ఎవరు ఎలా అతణ్ని అర్థం చేసుకోగలరు? అంతేకదూ, ముసలివాడా?" అంది ఆమె.

"అంతేలే, ముసలీ" అన్నాడు.

"అయితే ఏమవుతుంది? ఏం చేస్తావు నువ్వు?"

"నేను బాగా చింతించి నవ్వుకున్నాను. "జరుగవలసిందేదో జరిగింది"

"ఏమిటి?"

"నేను చస్తాను"

"చస్తాను అంటే?"

"ఆ, నేను చస్తాను. నేను చస్తే, అప్పుడు ప్రతిపక్షుల మనస్సు క్షోభిల్లుతుంది. దేవుడు వాళ్లకు జ్ఞానం కలిగిస్తాడు. అప్పుడు వాళ్లకి నా మాట సరిగ్గా అర్థమవుతుంది.

ముసలమ్మ సంతోషంతో లేచింది, కొంచెం సేపు ఆలోచించి.

నవ్వుతూ మళ్లీ మళ్లీ బుజాలు ఆడిస్తూ అంది "ఆ, నువ్వు సరిగ్గా చెప్పావు".

"చెప్పాను కదూ?" నవ్వుతూ అంటూ వృద్ధుడు వృద్ధురాలి వైపు సాభిప్రాయంగా చూశాడు.

"ఆ అలాగే చెయ్యి. చావు. చచ్చి, వాళ్లకు బుద్ధి చెప్పు"

బైట నుంచి రతన్‌లాల్ పిలుపు వినపడింది: "పెద్దయ్యా!" (కత్తా= కర్తా= master) అని.

'అబ్బాయి, ఒరేయ్, అబ్బాయి!" అంటూ కులుకుతూ పలికాడు లాల్‌మోహన్.

ప్రసన్న వదనంతో వచ్చి నిలబడ్డాడు రతన్‌లాల్.

"పెద్దయ్యా అందరూ వచ్చి నిలబడ్డారు. చెప్పు, ఏమవుతుందో, ఏం చేయమంటావో", అన్నాడు దీపశిఖలా ప్రజ్వలిస్తూ.

వృద్ధుడు బయటకి వచ్చి చేతులు జోడించి అన్నాడు: "పంచాయితీకి నమస్కారం".

కానీ అంతకు ముందే ఒక గందరగోళం బయలుదేరింది. షావుకారు యజమానుల బంట్రోతులు వచ్చి చుట్టుముట్టారు. షావుకారుల పెద్ద గుమాస్తా చారుశీల, మొండి ధైర్యవంతుడు. అతను ఎవరినీ లెక్కచేయుడు: "ఈ పిచ్చి మేళాన్నంతా పట్టుకోండి. ఒక్క వెర్రి పెద్దనే కాదు, రతన్‌లాల్-గితన్‌లాల్, కుర్రాడు-గిర్రాడు అందరినీ అరెస్టు చేయండి", అని ఆజ్ఞాపించాడు.

వృద్ధుడు నవ్వుతూ అన్నాడు "నడవండి" - రతన్‌లాలు మొదలైన యువకులు అందరివైపూ చూస్తూ, నడవండి అబ్బాయిలూ" అన్నాడు.

వృద్ధురాలు బిగ్గరగా నవ్వుతూ ముందుకు వచ్చి అంది: "నేను?"

షావుకారుల బంట్రోతులు అన్నారు: "ఆ, ఆ, మా ఆర్డర్లు అలాగే ఉన్నాయి. అందరూ రావలసిందే".

ముసలిది అంది: "దాండా బాబూ, కొంచెం ఓపిక పట్టు, నాయనా! మా

ముసలాడి గోచీ, నా చీర గుడ్డా, ఇంకా మా లోటా తెచ్చుకోవాలి. ఆ లోటాతో మంచినీళ్లు త్రాగితే గాని మాకు దాహం తీరదు".

ముసలివాడు నవ్వుతూ బుజాలాడించాడు. "లక్ష గొడవలు జరగనీ, ఈ ఆడాళ్ల ఛాదస్తం పోదు. ఈ లోటా పై వ్యామోహం పోవడం లేదు ముసలమ్మకి!" అనుకున్నాడు.

పావుకారు బాబులు వృద్ధుణ్ని ఆటంక పెట్టేందుకు పెద్ద పట్టు పట్టేరు. వాడి వల్ల ఇంతవరకూ ఏ నేరం జరగలేదు. కానీ ముసలివాడు వాడికి వాడే సాటి; బందీఖానా మధ్య ఉండే నవ్వుతున్నాడు. దేవుణ్ణి పిలిచి, ఇలా అన్నాడు: "మనస్ఫూర్తిగా చెప్పు భగవంతుడా, నా మనస్సు లోకి చూసి చెప్పు, ఏం చేయను? చావనా? నేను చస్తే వాళ్లకు దుఃఖం వస్తుందా? నీవు వాళ్లకు బుద్ధి చెపుతావా జ్ఞానం ప్రసాదిస్తావా?"

బందీలో ముసలమ్మ అటూ ఇటూ తచ్చాడుతూ, ముసలివాడి ఆహార పానీయాల గురించి ఏర్పాటు చేస్తూ, ప్రక్క పరుస్తూ, కంబళీ ఝాడిస్తూ; లోటా మెరిసేలాగ తోముతూ ఉంది. ఆమెకి ఈ అవస్థంతా బాగున్నట్లే తోస్తోంది. ఇక్కడైతే తన ముసలివాడితో చాలా సాహచర్యం లభించింది. బయట అయితే వాడికి లక్ష పనులు, ఒక క్షణం తీరిక ఉండదు, ఒక్క రెండు మాటలు ఆమెతో కూర్చుని మాటాడేందుకు ఉండదు; ఇంటి సంగతి పట్టించుకోడు.

అక్కడ అతనికెప్పుడూ ఏవో భరతపురపు గొడవలో, లేక మానవ జాతి క్షేమం గురించి ఆలోచనలో. ఈ వేళ ఇక్కడా, రేపు అక్కడా - వీడు వస్తాడు, వాడు వస్తాడు అతన్ని కలుసుకునేందుకు; అతని చుట్టూ తిరుగుతూనే ఉంటారు ఎవరో ఒకరు. ఇక్కడ చక్కగా తన భర్తతో ఎప్పుడూ కలిసి ఉండవచ్చు... కాని కొన్నాళ్లకి ముసలిదాని అపోహకు ఆఘాతం కలిగింది. ముసలివాడి స్వభావం మారదు కదా! చుట్టూ జనాభా యొక్క హడావుడి లేదు కాని, అతని బుర్రలోని హడావుడి మట్టుకు ఎప్పుడూ తగ్గలేదు. ప్రజలు పైకి మాటాడుతారు; ముసలివాడు తనలోనే అలా నిస్సంశయంగా అనిపించింది ముసలిదానికి.

"ముసలయ్యా ఒక మాట చెప్పు!" అంది.

"ఊ?" అంటూ ఆమె వైపు చూస్తూ అన్నాడు.

ముసలిది గ్రహించింది, నిజానికి అతను తన వైపు కాదు- అతని దృష్టి ఏవో దిగంతరాళాల పైననో, ఏ దూర సీమల పైననో, ఏదో కొండపైని దైవ మందిరం పైననో, ఆ మందిర శిఖరం పైననో, ప్రసరించబడి ఉంటుందని.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"ఆలోచనా?" ముసలివాడు నవ్వాడు.

"నవ్వకు, ముసలయ్యా! నీ నవ్వు నా కేమిటో అంత నచ్చడం లేదు".

"హూఁ" అంటూ ముసలివాడు ఊరుకున్నాడు.

భయపడుతూ, . విస్మయపడుతూ, ముసలమ్మ మనుస్సులోనే దైవాన్ని ప్రార్థించింది. "దేవుడా, నా ముసలాణ్ణి కాపాడు "అని తను అలా ప్రార్థించపోతే ఇంకేం చేస్తుంది?

హఠాత్తుగా ఓ రోజు వృద్ధుడు అన్నాడు. "నేను చచ్చిపోతాను".

వృద్ధురాలి గుండె ఎంత తీవ్రంగా కొట్టుకుందో, అంత గట్టిగా నోటి నుంచి మాట బైటకు రావడం లేదు. ముసలివాడు మట్టుకు అలా నవ్వుతూనే ఉన్నాడు, పైగా అంటాడు."ఛీ" అని, తను బాధపడితే, కానీ ఆమె గుండె దెబ్బతింటూనే ఉంది అతని మాటవిని. "అసలు చెప్పు, పెద్దయ్యా ఎందుకు నువ్వు చావడం?"

"చస్తాను. షావుకార్లు పిలిచారు, నేను బైటివాళ్లను పిలుచుకుని వచ్చాను, క్రిమినలు కేసు పడింది అలజడి జరిగాక. పై జనానికి షావుకారు నౌకర్లకి మధ్య దొమ్మిలాట జరిగింది. అందులో వాళ్లు కొంతమంది మరణించారు, కొంతమంది గాయపడ్డారు. షావుకార్లు అన్నారు ఇదంతా నేను మన వాళ్లతో చెప్పి చేయించానని".

రతన్‌లాల్ అన్నాడు "పెద్దయ్యా, అది సరే కానీ షావుకారుల నౌకర్లు కూడా మనవాళ్లను చావగొట్టారు కదా?"

వృద్ధుడు మామూలుగా నవ్వుతూ బుజాలాడించాడు. "అదే, రతన్! మనవాళ్లు ఎప్పుడైతే కొట్టారో, అప్పుడే వాళ్లకు పాపం చుట్టుకుంది. నేను చచ్చిపోతాను, చచ్చాక దేవుడి తో అంటాను. -'దేవుడా, పాపాన్ని క్షమించు, కేవలం మా పాపాన్నే కాదు; మా వైరుల పాపాన్ని కూడా మన్నించు' ఇంకా..."

"ఇంకా ఏమిటి, పెద్దయ్యా?"

ముసలివాడు నవ్వాడు. "అప్పుడు వాళ్లు అర్థం చేసుకుంటారు నేను పాపిని కాదని".

వృద్ధుడు మరణోన్ముఖుడై కూర్చున్నాడు. ఏమీ తినడు, ఏమీ పుచ్చుకోడు, ఊరికే అలా పడిఉన్నాడు. వృద్ధురాలి సంభాషణ ఇంక అణగిపోయింది. అతను అలా నిశ్శబ్దంగా ఉండబట్టి. అయ్యో ముసలివాడు పూర్తిగా క్రుంగిపోయాడు, ఆమెవైపు ఒక్కసారైనా తిరిగి చూడడానికేనా అతనికి అవకాశం లేదు. ఏడిస్తే సిగ్గు ముసలిదానికి ఏడిచేందుకైనా ఉపాయం కనుపించడం లేదు.

బందీఖానా నుంచి బైటకు ఒక పెద్ద కేక వినపడింది. "దేవుడా! మా ముసలి పెద్దను రక్షించవయ్యా!" అని.

రతన్‌లాల్ తదితర యువకులూ ఉదాసీనులై కూర్చున్నారు. ముసలమ్మ

ఇంక ఊరుకోలేకపోయింది. అయినా ముసలివానితో ఏమైనా మాట్లాడడానికి కూడా సాహసించలేకపోయింది. మనస్సులోనే దేవుణ్ణి రక్షించమంటూ మరీ మరీ అర్థించింది. ఇంత మంది జనం ఉన్నారు. వీళ్లకేసి చూడు, నా ముఖం కేసి చూడు; ముసలమ్మ అనుకుంది: "ముసలివాని మనస్సుకంటె దేవుని మనస్సే మెత్తనిది"

దేవుడు నవ్వాడేమో అనిపించింది ఆమెకు.

కానీ నిజానికి వృద్ధుడింకా మరణించలేదు. మృతి లక్షణాలు అన్నీ మట్టుకు కనిపిస్తున్నాయి. షావుకార్లు పెద్ద వైద్యులను పిలిపించారు. వాళ్లు పరీక్షించి అన్నారు. "మేం ఏం చేయలేం" అన్నం తినక పోతే మానవుడు బ్రతకడు, అటువంటి వాడిని బ్రతికించలేం. కానీ వృద్ధుడు బ్రతికే ఉన్నాడు. ఆశ్చర్యం ఏమిటంటే, అంతసేపూ వాని ముఖంపైన ఆ మొండి యువకుని చిరునవ్వు వంటి నవ్వు మట్టుకు ఏ మాత్రం సమసిపోలేదు. మెల్లిమెల్లిగా మరో సూచనలు తొలగిపోయాయి; కళ్లల్లోని కాంతిహీనత పోయి, శ్వేతపద్మ పత్రం వంటి ఒక కాంతి ప్రజ్వరిల్లింది; ముఖవర్చస్సు తేజరిల్లింది. తల్లి పాలు త్రాగే చంటి పిల్లవాడి ముఖంలా వాని ముఖం తళతళలాడింది. "నేను రక్షింపబడ్డాను భగవంతుడు నా అంతరాత్మతో పలికాడు".

"నీవేం పాపం చేయలేదు" అని అన్నాడు ముసలిపెద్ద.

ముసలమ్మ ముఖంపై చిరునవ్వు తాండవిస్తోంది.

ఆమె భర్తతో అంది "ముసలీ, ఈసారి నేను చచ్చి పోతాను"

"ఎందుకూ"

"నా శరీరం కృశించిపోయింది మళ్లీ"

"మళ్లీ' - ఏమిటి?"

ముసలమ్మ మరేం సమాధానం చెప్పలేదు. ఊరికే నవ్వుతూ ఉండిపోయింది.

ముసలమ్మ నిజంగా మరణించింది. పెద్ద జ్వరం ఏమీ రానేలేదు. కాని ఆ స్వల్ప రోగం వల్లనే చనిపోయింది. మరణించే ముందు ఒక్కసారి ముసలివాని వైపు సాభిప్రాయంగా చూసింది. రాయి లాంటి పెద్ద లోకం ఎప్పుడూ అబద్ధమాడదు. వెంటనే వృద్ధురాలు మరొకలా భావించింది. లోకపు పలుకు బూటకం, అంతా బూటకం, లోకంలో నిజంలేదు, నిజాయితీ లేదు.

ముసలివాని కళ్లనిండా నీళ్లు, అవును, అవును, వృద్ధుని చక్షువులు అశ్రుపూరితాలు.

ఆమె అంది: "ముసలయ్యా!"

కళ్లల్లోని నీళ్లు పొంగిపోతున్నాయి, అయినా వృద్ధుని ముఖపద్మంపై

మందహాసం వికసిస్తూనే ఉంది. ముసలివాడు అన్నాడు: "చెప్పు, ముసలిదానా! ఏమిటి అంటున్నావు?"

"ఓ పెద్దయ్యగారూ! చావు చాలా చక్కనిది. చావు చాలా చక్కనిది!"

ముసలివాడు ఇంకా నవ్వుతూనే ఉన్నాడు. కళ్లమ్మట నీళ్లు ఇంకా ధారాపాతంగా కారుతూనే ఉన్నాయి.

ఆ వృద్ధుని అశ్రుధార వృద్ధురాలి చెక్కిలిపై కురుస్తోంది.

ముసలివాడు ఆ కన్నీటి ధారలను తుడి చేద్దామని ప్రయత్నిస్తున్నాడు.

ముసలిది అంది: "కాదు, ఆగు".

---

(మొదటి ముద్రణ : "శనివేరేర్ చిఠి", 1944)

# పేటరు సావిత్రీవాలా

బన్‌ఫూల్

వాడి పేరు చాలా విచిత్రంగా ఉంటుంది- 'రిపునాశ్'. వాడి పెద్దన్నయ్య పేరు 'తమోనాశ్'. కాని కాలమహిమ ఎటువంటిదంటే ఇద్దరూ కూడా శత్రువులను కాని అంధకారాన్ని కాని నాశనం చేయలేదు. అసలు వాళ్లు దేన్నయినా నష్టపరచారంటే వాళ్ల మట్టుకు వాళ్లనే పాడుచేసుకున్నారు.

తమోనాశుని జీవితంలో ఏమీ జ్యోతి ప్రవేశించలేదు. ఆఖరికి "అ, ఆ", "క, ఖ" వరకైనా చదువు కోలేదు వాడు. పూర్తిగా నిరక్షరకుక్షి. బ్రాహ్మణ సంతతివారు కాబట్టి ఇద్దరికీ సంస్కృత నామకరణ చేయుటమైంది. అంతే వాళ్ల తండ్రి ఒక సంస్కృత పండితుడు. మోహనాశ్ తర్కతీర్థ. ప్రజలు మామూలుగా అతణ్ని మోహన్ పండిత్ అని పిలిచేవారు. నేటి సమాజంలో సంస్కృత పండితుల ప్రతిభ క్షీణించింది కదా. అందుచేత కడు పేదవాని గానే జీవించాడు అతను. ఏదో పౌరోహిత్యం చేసుకుని సంపాదించుకునే వాడు. అతడు మరణించేసరికి తమోనాశ్ వయస్సు ఆరు సంవత్సరాలు; రిపునాశ్ వయస్సు మూడు సంవత్సరాలు. వాళ్ల అమ్మ వంట పనిచేసి వాళ్లని పెంచింది. తమోనాశ్‌కి 16 ఏళ్లు వచ్చే సరికి వాడొక అతి సమర్థుడుగా తయారయ్యాడు. సురాపానం చేస్తూ విచ్చలవిడిగా తిరగడం మొదలు పెట్టాడు. ఒక గూండా ముఠాలో చేరాడు. వాడి పేరు 'తమ్‌నా'గా మారింది. గూండా పని ఏదో చేసి రోజులు ఎలాగో గడుపుకునే వాడు. అయితే అంతా తన సుఖ సంతోషాల కోసమే కాని తల్లికి తన సంపాదనలో ఏమీ సహాయపడేవాడు కాదు. ఈ జీవితమైనా వాడు ఎక్కువ కాలం జీవించలేదు. గూండా పనిలో ఒకనాడు ప్రత్యర్థుల బాకు పోటుకి గురి అయి మరణించాడు. వాడి శవం కొంత సేపు రోడ్డు మీద పడి ఉంది. దాన్ని శవ పరీక్ష కోసం పోలీసులు హాస్పిటల్‌కు తీసుకువెళ్లారు. డాక్టర్లు శవాన్ని ముక్కలు ముక్కలు చేసి పరీక్షించారు. పరీక్ష చేయగా మిగిలిన దేహాన్ని హాస్పిటలు సేవకులు కైవశం చేసుకున్నారు.

తమోనాశుని తల్లి అతని శవం కోసం తన హక్కుని ఉపయోగించేందుకు ప్రయత్నించలేదు. వాడి శవ దహనం, తదితర శవ సంస్కారం ప్రజల చేత చేయించేందుకు కావలసిన సొమ్ము ఆమె దగ్గర లేదు. ఇది వరకే ఆమెకి అన్ని చోట్లా అప్పులు తీర్చవలసి ఉంది, ఇంకా అప్పు పెంచుకోవడానికి ఇష్టపడలేదు. సేవకులు తమోనాశుని ఎముకలను శుభ్రపరచి వైద్యవిద్యార్థులకు విక్రయించి సొమ్ము చేసుకున్నారు. అంతటితో తమోనాశుని జీవిత చరిత్ర ముగిసింది.

తమోనాశుని తల్లి సావిత్రి పెద్దగా ఏడవనైనా లేదు. ఆమె కళ్లనుంచి ఒక విధమైన గుప్తాగ్ని ప్రజ్వరిల్లింది. అది మాటల ద్వారా కాని, చూపుల ద్వారా కాని వ్యక్తమవలేదు కేవలం దారుణమైన విషాదాన్ని ప్రకటించింది. సావిత్రి వంటపని చేసే ఇంటి యజమానులు, తమోనాశుని మృత్యువు కారణంగా, ఆమె నెల జీతం రెండు రూపాయిలు పెంచేందుకు తమ అభిప్రాయాన్ని సూచించారు. కాని సావిత్రి అంగీకరించలేదు. 'ఏమీ అవసరం లేదు' అని క్లుప్తంగా చెప్పి ఊరుకుంది.

ఇక రిపునాశ్ కూడా రోడ్లమ్మట తిరగడం మొదలు పెట్టాడు. వాడి స్నేహితులందరూ ఇంటిలో నివసించడానికి అవకాశం లేనివారో, వాడిలాంటి దేశద్రిమ్మరులో; లేకపోతే రోడ్లపై తమాషా చూసేందుకో, బాతాఖానీ కొట్టేందుకో మోటారు ఏక్సిడెంట్లు కాని జనం గుంపుగా పోగయిన చోట చేరేందుకు కాని తిరిగేవాళ్లే. ఈ ముఠాలో వాడి పేరు 'రిపున్'గా మారింది.

'తమ్‌నా' లాగ 'రిపున్' బలవంతుడు కాదు. నీరసపు ముఖం. బజారులో తిరుగుతూ మూటలు మోస్తూ రోజు గడిపే వాడు ఎలాగో. బీడీ కాల్చడం నేర్చుకున్నాడు. రోజుకో బీడీ కట్ట కొన్నాక ఏమైనా డబ్బులు మిగిలితే అవి తల్లి కిచ్చేవాడు. ఇలా రోజులు నడుస్తున్నాయి. రిపున్‌కి 16,17 ఏళ్లు వచ్చేసరికి హఠాత్తుగా ఒక సంఘటన జరిగింది. ఒకరోజు కూరల బుట్ట మోసుకుని ఒక కారు యజమాని కారు వెనక్కాల 'బూటు'లో పెడుతూండగా వాడికంఠంలోంచి బాధాకరమైన దురదా, నొప్పీ బయలుదేరాయి. వెంటనే దగ్గు రావడం మొదలయింది. కారు యజమాని వాడి కూలి వాడికిచ్చేసి డ్రైవు చేసుకుంటూ వెళ్లిపోయాడు. రిపున్ రోడ్డు మీద కూర్చుని దగ్గుతున్నాడు. కొంత దగ్గాక రక్తం కూడా నోటమ్మట బైటపడింది. కొంతసేపు అలా రక్తం కేసి చూస్తూ కూర్చుని, తర్వాత మెల్లిగా లేచి ఇంటికి వెళ్లాడు.

తల్లికి జరిగిన సంగతి చెప్పాక, ఆమె వాడిని ఆ పేటలో ప్రైవేటు డాక్టరు దగ్గరికి తీసుకుని వెళ్లింది. ఆయన గుండె, వీపు పరీక్ష చేసి క్షయరోగం అని నిర్ణయించాడు. ఆయన అన్నాడు: "నా ఫీజు నాకేమీ అవసరం లేదు. కాని మందులూ ఇంజెక్షనులూ కొనవలసి ఉంటుంది. అటు పైన బలమైన ఆహారం తీసుకోవలసి ఉంటుంది. కోడిగ్రుడ్లు, వెన్న, చేపలు, మాంసం, పండ్లూ మొదలైనవి". సావిత్రి మాట్లాడకుండా డాక్టరు వైపు చూస్తూ ఉండిపోయింది. బహుశా ఆమె కళ్ల నుంచి ప్రజ్వరిల్లుతున్న గుప్త దీపశిఖ యొక్క సందేశం డాక్టరుగారి మనస్సుకి అంది ఉండవచ్చు. ఆయన అన్నారు: "నాకు నీకు సహాయం చేసే శక్తి లేదు గాని, నీకు చీటీ వ్రాసి ఇస్తాను, అది తీసుకుని వెళ్లి ప్రభుత్వపు ఆసుపత్రిలో మీ అబ్బాయిని చేర్పిస్తే మంచిది".

చిటీ తీసుకుని జెనరల్ హాస్పిటల్ చుట్టూ వారం రోజులు తిరిగింది. కాని రిపున్‌ని ఇంకా వాళ్లు చేర్చుకోలేదు. ఒక రోగి ఆమెతో అన్నాడు. "ఇక్కడ డబ్బు చూపిస్తే కాని ఏమీ ప్రయోజనం లేదు. లంచాలు ఇవ్వాలి" ఆ మాటలు విన్న రిపున్ ఇంక ఆసుపత్రికి వెళ్లడానికి ఒప్పుకోలేదు. అయితే ఇక డబ్బు ఎక్కడ నుంచి సంపాదిస్తాడు? చికిత్స చేయించుకోకపోతే వాడి రోజు మామూలుగా గడవదు. ఇక రోడ్లమీద మూటలు మోసే శక్తి మాటేమిటి? ఒక రోజు వాడి స్నేహితుడొకడు వచ్చి అన్నాడు. "చూడు, నా బుర్ర కో ఆలోచన తట్టుతోంది. నువ్వు ఎల్లాగో ఆలిపూర్ జైలులో 6 నెలలు గడప గలిగితే, నీ క్షయ రోగం తగ్గుతుంది...."

ఒక నిమిషం ఊరుకుని మళ్లీ అన్నాడు: "జైలుకి వెళ్లి క్షయరోగం పోగొట్టుకునే విషయం గురించి నువ్వేమంటావు?"

మొట్టమొదట మిత్రుని మాటలు నమ్మలేకపోయాడు రిపున్.

స్నేహితుడు తిరిగి అన్నాడు: "హరూగాడు జైలు నుంచి ఆరోగ్యం చేకూర్చుకుని తిరిగి వచ్చాడు. జైలు దగ్గర మంచి హాస్పిటలు ఉంది. అందులో వాడి క్షయకు చికిత్స లభించింది. చేతికి ఒక్క పైసా ఖర్చు లేదు. నువ్వు కూడా వాడిలాగ జైలుకి పో".

కొన్ని రోజులు పోయాక రిపున్ ట్రాము కారులో జేబు కత్తిరించి పట్టుబడి పోయాడు. నలుగురూ వాణ్ని చితక కొట్టి పోలీసులకు వప్పజెప్పారు.

కోర్టులో జడ్జి అడిగాడు రిపున్‌ని: " నీ తరఫున వాదించేందుకు నువ్వు ప్లీడరుని నియమించుకోవచ్చు. నీకు స్వయంగా ప్లీడరుని పెట్టుకునేందుకు శక్తి లేకపోతే, ప్రభుత్వం నియమించిన ప్లీడరే నీ తరఫున వాదిస్తాడు".

చేతులు జోడించి నమస్కరిస్తూ, రిపున్ అన్నాడు: "లేదు ప్రభూ, నాకు ప్లీడరు పనిలేదు. పోలీసుల కేసు నిజమైనదే. ఫిర్యాదు చేసిన పెద్దమనిషి యొక్క జేబు నేను కత్తిరించి దొంగ తనం చేయబోయాను నిజంగా".

జడ్జి తన నిర్ణయం తెలియజేసాడు: "50 రూపాయాలు జరిమానా, లేకపోతే ఒక నెల కారాగార వాసం".

న్యాయాధికారి తీర్పులో మార్పులేదు. జైలులోని హాస్పిటలులో రోగం ఏమీ తగ్గలేదు. ఒక నెల తర్వాత దగ్గుతూనే రిపున్ జైలు నుంచి బయటకు వచ్చాడు.

ఒక నిబిడాంధకారపు రాత్రి బాగా దగ్గిదగ్గి లేచి కూర్చుని, తన తల్లి పాదాలపైననే ఎంతో రక్తం వమనం చేసుకుని, ఈ లోకం నుంచి వెళ్లిపోయాడు పాపం వాడు.

సావిత్రి నిస్తబ్ధురాలై కూర్చుండిపోయింది. ఆమె దృష్టి ప్రసారంలో అగ్నికణాలు ఆవిర్భవిస్తూనే ఉన్నాయి. చివరికి ఒక్క చిన్న అశ్రు బిందువు కళ్ల నుంచి రాల్చింది ఆమె.

ఇది జరిగిన రెండు నెలల తర్వాత ఎన్నికలు వచ్చాయి. అందులో 'సావిత్రివాలా' అనే వాడొకడు వేటరు. వాని ద్వారా ఎన్నికలలో నిలబడ్డ అభ్యర్థి ఒకడు ఆమె వద్ద వచ్చి కూర్చున్నాడు.

సావిత్రి అతని వైపు తన అగ్నిదృష్టిని ప్రసరిస్తూ అంది. 'తమకి నా వోటు ఇవ్వనా? నాకు ఇంతకు ముందు మీరేం ఉపకారం చేశారు? తమరు ఇదివరలో పదవిలో ఉండగా విద్వాంసుడైన నా భర్త ఒక మామూలు ముష్టివాడిలా మరణించాడు. నా పెద్దకొడుకు చదవడం కాని, వ్రాయడం కాని నేర్చుకోలేక గూండా వాడై కత్తిపోటుకి చచ్చిపోయాడు. నా రెండవ బిడ్డ క్షయ నివారణ కోసం ఎక్కడికి వెళ్లినా లంచం కోరారు కాని, ఎవ్వరూ వాడికి చికిత్స చేయలేదు. మీకు నేను వోటు ఎందుకు వెయ్యాలి? అసలు నే నెవ్వరికీ వోటు వేయదలచు కోలేదు...."

ఎలెక్షను అభ్యర్థి జవాబు చెప్పాడు "చూడండి, ప్రజా స్వామ్యంలో...."

కాని సావిత్రి ఆయన్నీ వాక్యం పూర్తి చేయనీయలేదు.

బిగ్గరగా అరుస్తూ లేచి నిలబడింది. "ముందు నా ఇంట్లోంచి బైటకు పొండి!"

కంగారుగా పెద్దమనిషి బైటకు వెళ్లిపోయాడు.

ఠప్పుమని చప్పుడయ్యేలా వీధి తలుపు మూసి లోపలికి వెళ్లిపోయింది సావిత్రి.

---

(రచనాకాలం : వంగశకం 1377 సం||, మాఘమాసం, 30వ తేదీ)

# సరంగు

**అచింత్య కుమార్ సేన్ గుప్తా**

నాసిమ్‌ని వాడి తల్లి కొట్టింది. తల్లి కొడితే కొట్టింది కాని, అసలు కొట్టవలసిన పని ఏముంది? సంగతేమిటి?

ఆవునీ, దూడనీ మేపనీ మేపకపోనీ; అరక దున్నడం, విత్తనాలు నాటడం మొదలైన పనులు చేయనీ, చేయకపోనీ ఆమె ఎందుకు బుర్ర పాడు చేసుకోవడం? ఇంటిపై కప్పు మీద దుబ్బు గడ్డి మార్చవలసిన అవసరముందో లేదో అది నేను చూసుకుంటాను - తడిసి ముద్దయిపోతే అది నా కర్మ. ఆమెని ఎవరూ ఇది చేయి అది చేయి అని గుండె పగలుకొట్టుకుంటూ పిలవరు.

తల్లి గోలాబానూ అంది: "పోనీలే ఇక అన్ని వ్యవహారాలు గహరాలీ చక్కబెడతాడులే".

"ఏం గహరాలీ" అంటూ బుజాలెగరేస్తూ చుర్రుమని లేచాడు నాసిమ్.

"ఆయన చాలా గొప్పవాడు. ఐదెకరాల భూమి ఉంది. పెద్ద ఆఫీసు ఉంది. ఎన్ని కోర్టు కేసులు ఆయన చేతుల మీద నడుస్తున్నాయో!" అంది.

"అయితే నా కేం" అన్నాడు.

"ఆయన స్వాధీనంలో ఉంటే మన భూమీ, పుట్రా బాగుంటాయి. కూడూ, గుడ్డకీ శ్రమ పడక్కరలేదు. పూరిల్లు మార్చి రేకు కప్పు వేయించవచ్చు".

"నాకేం అక్కర లేదు. నాకీ శిథిల గృహమే బాగుంది. నేను ఆకూ, అలమూ తిని బతుకుతాను నువ్వే అతణ్ని బైటకు పంపించెయ్యి".

శక్తికొలదీ కొట్టాడు గహరాలీ. కూడా గోలాబానూ చేయి కలిపింది నాసిమ్‌ని కొట్టడంలో.

తన తండ్రి గతించాక ఈవిధంగా ఎవరూ కొట్టలేదు వాడిని. పొలం పనులకి వెళ్లేందుకు వాడేమీ హడావుడి పడలేదు. వల తీసుకుని చేపలను పట్టేందుకు ఆడుకుంటూ పాడుకుంటూ వెళ్లే వాడు. తండ్రి అనేవాడు:"బజారులో నీకో బట్టల కొట్టు కాని టెయిలర్ షాపుకాని ఏర్పాటు చేస్తాను". నాసిమ్ "అంతకంటె నాకో పడవ కొనిపెట్టు" అనేవాడు. 'అలాగే కొనిపెడతాను అన్నాడు తండ్రి. నాసిమ్ అన్నాడు. "మట్టికంటె నాకు సముద్రపు నీరే ఎక్కువ ఇష్టం".

కానీ తండ్రికి పడవ కొనే శక్తి లేదు. ఇప్పటికంటె చిన్న వయసులో నాసిమ్ ఒక అద్దె పడవ నడుపుతూ ఎలాగో పొట్ట నింపుకొనే వాడు. కానీ ఎప్పుడో వాడి వల చిల్లులు పడిపోయింది. అయినా వాడు వలను వాడడం మరచి పోయే వాడు కాదు. నది ఒడ్డున నిశ్శబ్దంగా కూర్చుని, నిష్ప్రయోజనమైన వలను గురించి తలచుకుని చెక్కిళ్ల నుంచి కన్నీళ్లు కారుస్తూ ఉండేవాడు....

వాడు విన్నాడు, తల్లి గహారాలీ తో రెండవ పెళ్లి చేసుకుంది అని. గహారాలీతో తనూ ఒకే ఇంటిలో వాడయ్యాడు. నాసిమ్‌కి వేరే ఆస్కారం ఎక్కడ? ముందు నుయ్యి, వెనుక గొయ్యి...ప్రజలెవ్వరైనా అతనెవరని అడిగితే "నా మొదటి భర్త సంతానం వీడు" అని జవాబు చెప్పేది తల్లి. ఎవరు నిన్ను పోషిస్తున్నారు?" అని నాసిమ్‌నిఎవరైనా అడిగితే 'గహారాలీ' అని చెప్పేవాడు వే ప్రక్కనుంచి తన హృదయంలో నుంచి అగ్ని జ్వాలలు రేకెత్తుతున్నప్పటికీ....

ఒక మైలు దూరంలో బ్రాంచిలైను తాలూకు స్టీమరు ఆగింది జనుము చేను ప్రక్కన. అక్కడ ఏమీ 'జెట్టి' కాని 'ఫ్లాట్' కాని లేక పోయినా, ఒక బాదం చెట్టు మొదలుకు త్రాటితో కట్టబడి నది ఒడ్డున చేరుగ ఉంది. ఆ ఆశ్చర్యకరమైన స్టీమరు. తిన్నగా ఒడ్డు ప్రక్కనే రెండు నిచ్చెనలు వేసి ఉన్నాయి. నిచ్చెన చెరో ప్రక్కనా ఇద్దరు కళాసీలు కర్రలు పుచ్చుకుని నిలబడ్డారు. యాత్రికులు ఎక్కుతూ దిగుతూ ఉన్నారు. బాదం చెట్టు క్రింద కూర్చుని ఒక చిన్న తగరపు పెట్టె లోంచి తీసి టిక్కెట్లు అమ్ముతున్నాడు ఆ స్టీమరు గుమాస్తా. దిగుతున్న వాళ్ల దగ్గర నుంచి టిక్కెట్లు తీసుకుని ఎవళ్లైతే అన్యాయంగా స్టీమరులో ప్రయాణం చేశారో వాళ్లతో తనూ అన్యాయంగా డబ్బు వసూలు చేస్తాడు. అటు పిమ్మట ఎక్కౌంటు పుస్తకాలు తీసుకుని వేలకొలది ప్రయాణీకులతో పాటు స్టీమరులోకి వెళతాడు. ఆ గుమాస్తా స్టీమరు ఎక్కేవరకూ నిచ్చెనలు తీసెయ్యరు. ఒకటి తీసి మరొకటి అట్టే పెడతారు. - గుమాస్తా స్టీమరు ఎక్కిన వెంటనే.

వర్షాకాలంలో అక్కడంతా జలమయ మవుతుంది. చెట్ల మొదళ్ల దగ్గర నుంచి ఒక చెరువులా తయారవుతుంది. ప్రయాణీకులు నీళ్లలోంచే కొంత దూరం నడుస్తారు. ఒకడు చేతులతో నడిపిస్తూ ఒక చిన్న పడవ తీసురువచ్చాడు. దాంట్లో సామానుకి పై కప్పు లేదు. పిల్లలూ, జెల్లలూ బుజం బుజం పట్టుకుని నీరు దాటారు. భార్యను చేతుల్లో ఎత్తి దాటించారు.

'నిచ్చెన వెయ్యి' అని స్టీమరు డెక్ నుంచి సరంగు ఆజ్ఞాపించాడు.

"గుమాస్తాగారు ఇంకా స్టీమరు ఎక్కలేదా?" 'ఆ, ఎక్కారులే తన ఎక్కౌంటు పుస్తకాలూ గిస్తకాలూ పట్టుకుని" మిగతా నిచ్చెన కూడా ఎత్తబడింది. 'కట్-కట్, 'కట్-కట్' అని చప్పుడు చేస్తూ మొత్తం గొలుసంతా లాగి లంగరు ఎత్తేశారు.

"ఒకడెవడో హడావుడిగా వచ్చాడు. ఏడీ, ఎక్కడ ఉన్నాడు? పది పన్నెండేండ్ల కుర్రాడు ఒకడు. వాడు యాత్రికుడేనా? ఎవరికేనా తెలుసునా? "ఓడ చూసేందుకు వచ్చాడేమో అయితే వచ్చే పాతాకాలూ రేవులో దిగిపొమ్మను. సాయంత్రం వేళ అప్పుడు గబగబా ఒక సామాను పడవలో మెడ్డుతూ వచ్చాడు. "సరే, చీకటి పడింది, ఇంటికి వెళ్లి ఏం చేస్తాను? ఓహో, అమ్మా, నాన్నా

ఏమనుకుంటున్నారో"! అనుకున్నాడు నాసిమ్.

చిన్న స్టీమరు రేకు డెక్ పైన అంతా తర్డు క్లాసే.

దానికి ముందు ఫస్టుక్లాసు వైపు రెండు పిచుక గూళ్ళకు ఒక మూలలో సరంగు మకాం. అక్కడ హఠాత్తుగా కనుపించాడు నాసిమ్. మొట్టమొదట వాడిని ఎవరూ చూడనైనా లేదు. లేకపోతే ఎవరో ఊరికే ఎంజిను ఎలా పనిచేస్తుందో చూడడానికి వచ్చాడేమో అనుకున్నారు. అయినా, ఏమో, కదలలేదు కుర్రాడు. ఇంతలో

"ఏం కావాలి నీకు?" అన్నాడు హుక్కా పీలుస్తూ, చేతి కర్ర పట్టుకుని, నావికుని టోపీ ధరించిన ఒక సరంగు భుజాలు ఎగరేస్తూ.

"దొరగారు నా కేదైనా పని ఇప్పించగలరేమో అని వచ్చాను, బాబూ!" అన్నాడు నాసిమ్.

"నీదే ఊరు?" అని అడిగి నాసిమ్ ముఖం కేసి కొంతసేపు చూస్తూ ఉండిపోయాడు సరంగు.

"ఇక్కడే దొరా, 'కనకదియా'.

"తల్లీ తండ్రీ ఉన్నారా?"

"ఎవ్వరూ లేరండి"

మళ్లీ కొంతసేపు చూస్తూ ఊరుకున్నాడు సరంగు. తర్వాత అన్నాడు: "ఏం పని చేయగలవు నువ్వు?"

"ఏం ఏం పని ఉంది ఇక్కడ, దొరగారూ?"

"వండడం, వడ్డించడం, తుడవడం, బట్టలు ఉతకడం, అంట్లు తోమడం, ఇలాంటివి. చేయగలవా?" "సరే" "బాగుంది, వెళ్లి పనిచూసుకో". "ఊరికే పని చేసేందుకు కుర్రాడు దొరికితే, అంతకంటె కావలసింది ఏముంది?" అని ఎంజిను తాలూకు పనివాడు ఇయాదాలీ కేసి తీక్షణంగా చూసి అన్నాడు: "ఆఖరికి హుక్కా సిద్ధ పరిచి, వళ్లు మర్దనా చేసి కాళ్లు పట్టగలిగితే వీడి పనికి విలువ ఉంది".

ఇయాదాలీ అంటాడు: "నెల జీతం ఇవ్వరా?"

"నెలజీతం లేదు గిల జీతం లేదు" అంటూ సరంగు ఉలిక్కి పడి లేచాడు. మళ్లీ నాసిమ్ తో అన్నాడు: "నదిలో నాచుతో కూర వండి తినాలి. నేను చెప్పేది చెప్పేశాను. నీ కిష్టమయితే ఉండు, లేకపోతే దిగిపో వెంటనే, ఏం నీకు, టిక్కెట్టు ఉందా?"

"లేదు, దొరా, నాకు జీతం అక్కరలేదు".

నాసిమ్‌కి కావలసింది అల్లా ఒడలో ఏదో చోటు దొరికింది, అదే గొప్ప విషయం. తండ్రిలేదు, పిన తండ్రి లేదు, గురువు లేదు, యజమాని లేదు, తన్ను ఇక్కడ

దండించేందుకు అదే పదివేలు నాసిమ్‌కి. నూతన ప్రాంతాలకు ఒడ్డు విడిచి ఓడ సముద్రం లో పయనిస్తూంటే వాడికి అదే స్వర్గసుఖంలా ఉంటుంది.

అనుకుంటాడు: "చక్కగా ఇక్కడ పనిచేశానంటే ఒక రోజు ఓడంతా నా స్వాధీనంలోకి వస్తుంది". "మొదట నిచ్చెన, తర్వాత డెక్, అటుపైని చుక్కాని-పనులు, అటు తర్వాత సరంగు. ఎవ్వరు చెప్పగలరూ! మొదట జీతం లేకుండా కుర్రాడు దొరికాడు, రేపు ఈ ఓడకు యజమాని అవుతాడు". సరంగు తన గెడ్డం సవరించుకుంటూ ఆలోచించడం మొదలు పెట్టాడు.

కాని మొదటి రాత్రే సరంగు చేత దెబ్బలు తిన్నాడు నాసిమ్. వాడు చేసిన తప్పల్లా ఒక గాజు పళ్లెరం పగలగొట్టాడు. కాని ఇంకెక్కడికి పోగలడు? సంజాయిషీ చెప్పడం లేదు; ముఖం, వీపు, వళ్లంతా గాయాలు పడ్డాయి దెబ్బలతో. వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టాడు నాసిమ్. అంతకంటె గోల పెట్టాడంటే కాళ్లూ, చేతులూ కట్టేసి నల్లటి నీళ్లల్లో పారేస్తారు.

దుఃఖం కంటె నాసిమ్‌కి ఆశ్చర్యం ఎక్కువగా కలిగింది. కాని ఇందులో ఆశ్చర్య పడేందుకు ఏం లేదు. ఇది ఇక్కడ మామూలుగా జరిగే విషయమే. అందరు పనివాళ్లూ ఎప్పుడో ఒకప్పుడు సరంగు చేతుల్లో దెబ్బలు తిన్నవాళ్లే. నిచ్చెన వేయడంలోనే, డెక్ శుభ్ర పరచడంలోనే, లంగరు పడెయ్యడంలోనే లైటు వెలిగించడంలోనే ఎవరైనా ఏ మాత్రం చిన్న తప్పు చేసినా వెంటనే దెబ్బలు తినడం తప్పదు. మేస్త్రీ క్రింద మనుషులు వీళ్లందరూ. వాడి చుట్టూ పని చేయవలసిన వాళ్లే. బొగ్గు వేసేవాడూ, నిప్పు మండించేవాడూ ఇంజిన్ నడిపేవాడూనూ. అయితేనేం, అందరి పైన అధికారం సరంగు చేతిలో ఉంది. ఎవ్వడైనా పొరపాటు చేస్తే, ఒక మర త్రిప్పడంలో మరొక మర త్రిప్పినా, ఒక పార్టు బదులు మరొక పార్టు పెట్టినా, వాడిని రక్షించే వాడెవరూ లేరు. తన్నడమో, లెంపకాయ కొట్టడమో, 'అమ్మా, ఆలీ' బూతులు తిట్టడమో జరుగుతుంది. ఆఖరికి చెప్పు దెబ్బలు కూడా తగులుతాయి. అప్పటికి ఇంకా శిక్ష చాలలేదనిపిస్తే, పనిలోంచి తప్పించేయడమే.

ఎవరికైనా చెప్పుకుంటే వినే వాళ్లున్నారా? కంపెనీ వాళ్లు కేవలం సరంగు మాటే గమనిస్తారు, అతని మీదే అంత పూచీ వదిలి పెట్టారు. వాడే ఓడ యొక్క "జిల్లా మేజిస్ట్రేటు". అంత ఉత్తర దాయిత్వం వాడి చేతిలోనే ఉంది.

ఓడ నడుస్తూ ఉంటే ఎప్పుడైనా నౌకా భంగం అయితే, నష్ట పరిహారం సరంగుకి మాత్రమే ఇవ్వబడుతుంది. దురదృష్ట వశాత్తూ, ఒక వేళ ఓడ పూర్తిగా మునిగిపోతే దానికి పూచీ ఎవరిది? కంపెనీ వాళ్లదేం కాదు. ఏదైనా సరుకు గురించి దావా పడితే, దాని గురించిన లాభాలాభాలు సారంగువే. ఒకప్పుడు ఏదైనా తుఫాను వచ్చి స్టీమరు ఒడ్డున చేర్చేసి ఉంచినా సరంగు జీతం, భత్యం అన్నీ వాడికివ్వవలసినదే.

మేస్త్రీ, కళాసీలు మొదలైన వాళ్లు ఎంతైనా హడావుడి పడి, ఇటూ అటూ పరుగు లెత్తి, ఓడను అదుపు పెట్టడంలో శాయశక్తులా శ్రమ పడినా, వాళ్ల కొక పైసా అయినా అధికంగా దక్కదు. ఏమైనా బహుమానాలు ఇవ్వబడితే అవి సరంగుకే. అన్ని మెడళ్లూ వాడి మెడలోనే అలంకరింపబడతాయి.

"ఏమైంది హఠాత్తుగా?"

స్టీమరు ఇసుక మట్టానికి తగులుకుంది. కనిపెట్టలేనట్టి ఇసుక మట్టం. స్టీమరు అడుగు భాగం ఉన్న చక్రం మట్టి మధ్యన కూరుకు పోయింది. వెంటనే దాన్ని ఎలా బైటకు లాగాలో ఉపాయం తట్టడం లేదు. ఓడరేవుకి లైఫ్‌బోటు లో ఒకణ్ని పంపించి అక్కడ దగ్గరలో ఉన్న స్టేషను నుంచి ఓడను పైకి లాగే ఉపాయం కోసం టెలిగ్రాము పంపాలి. స్టేషను, చెట్ల మధ్య, పొలాల మధ్య దూరంగా ఉంది. అక్కడి నుంచి వెళ్లి వచ్చి అన్ని ఏర్పాటులూ చేసే సరికి కనీసం 7,8, గంటలు ఆలస్యం అవుతుంది. ఈ మధ్యలో యాత్రికు లందరూ స్టీమరులో ఎదురుచూస్తూ, దూరాన్నుంచి మరొక ఓడ నుంచి వెలువడే పొగను చూసి విజిల్ వినేందుకు ఆశతో కూర్చున్నారు.

తప్పు ఎవరిది?

తప్పు చుక్కాని నడిపే వాడిది, రెండవ మేట్‌ది. మంచి ఒడ్డూ, పొడుగూ ఉన్న యువకులు. వాళ్లను కొడితే తన చేతులే గాయపడతాయి. కాని గత్యంతరం ఏమిటి? అతగాడి ఈ నెల జీతం అంతా నష్ట పరిహారం క్రింద పోతుంది. ఆహారం అంతా తన సొంత డబ్బు పెట్టి కొనుక్కోవాలి ఓడ పని వాళ్లు.

సరంగు ఒక్కడే ఈ ఓడ యొక్క కంట్రాక్టరు. పెర్మనెంటు కంట్రాక్టు (లీజు) వాడిది. వివిధ రకాల పెట్టుబడి కోసం, మరమ్మతుల కోసం, మేస్త్రీ, ఖలాసీ మొదలైన వాళ్ల జీతం కోసం ఇవన్నీ లెక్కపెట్టి ఒకే నిక్కచ్చి అయిన మొత్తం డబ్బు సరంగు చేతిలో పెడుతుంది, కంపెనీ. బిల్లులు చూపించడం మొదలైన వ్యవహారాలు చూసే యజమాని కూడా సరంగే. ఎవడికి పూర్తిగా నెల జీతం ఇవ్వాలో, ఎవడికి జరిమానా క్రింద జీతం తగ్గించాలో నిర్ణయించేది సరంగే. ఎవడి భత్యంలో గాని, ఆహారపు ఖర్చు లివ్వడంలో గాని, తగ్గించడమో లేక పూర్తిగా ఇవ్వడమో ఇతని చేతిలోనే ఉంది. ఇతనికి వ్యతిరేకంగా ఫిర్యాదు చేయడం కానీ, వేరే ఫైసలా చేయడం గాని మరెవ్వరి చేతిలోనూ లేదు. ఓడలో జరిగే బందోబస్తు గురించి కంపెనీ వాళ్లు తమ బుర్ర ఏం పాడు చేసుకోరు. వాళ్లు చూసేదల్లా ఒడ్డు నుంచి సరుకు ఓడలో నిండిందా లేదా, స్టీమరు ద్వారా సంపాదించే లాభాలు వసూలు చేయడం జరుగుతుందా లేదా -అని.

స్టీమరంతా సరంగు మాట మీద నిలబడాలి. అందరు పనివాళ్లూ వాడి క్రింద

బానిసల లాంటి వాళ్ళు. వాడి ప్రభుత్వం స్టీమరు మీద మాత్రమే కాదు, వాళ్ళందరి మీదానూ.

సరంగు చేతుల్లో స్టీమరే కాదు, వీళ్ళందరూ కూడా ఉన్నారు.

ప్రక్కనున్న మక్‌బూల్ అన్నవాడొకడన్నాడు: "ఏడ్చి ఏం ప్రయోజనం? ఇలా చాలాసార్లు దెబ్బలు తినాలి. దెబ్బలు తినగా తినగా అప్పుడు ప్రొమోషను వస్తుంది".

మొదట మక్‌బూల్ కూడా ఒక చిన్న పనికుర్రాడులా ప్రవేశించాడు. వంటి పని కాదు; సరంగు బట్టలు ఉతకడం, ఓడ శుభ్ర పరచడం ఇలాంటి పనులు. మూడేళ్ళు పోయాక వాడికి నిచ్చెన పని అప్పజెప్పాడు. తర్వాత డెక్ మీద పని, తర్వాత పగ్గాలు, కేబుల్స్ పని. వాడికి బాగా తెలుసు ఓడలో దెబ్బలు తినకుండా ఎవ్వడూ పైకి రాలేదని.

"దొరగారి చల్లని చూపు మన మీద పడితే కాని మనకేం పని జరగదు. 10,12 ఏళ్ళు అయ్యాక, దొరగారికి దయ కలిగితే, సర్టిఫికేటు వస్తుంది. ఆ సర్టిఫికేటు సంపాదించాక ఆ అర్హతను బట్టి సరంగు పరీక్షకు కూర్చోనిస్తారు". ఒక ఉపాధ్యాయుడి మాదిరిగా అఫ్‌సారుద్దీన్ అన్నాడు. "ఆ సర్టిఫికేటు లేకపోతే ఇంకేమీ లేదు. అది పొందేందుకు ముందు సరంగు కాళ్ళకి బాగా తైలం మర్దన చేయాలి. ఇంక పొందలేనిది ఏముంది? తర్వాత జమీందారో కోటీశ్వరుడో అయిపోతాడనుకో!"

"లేదులే అలా జరిగే ముందు మరో మాట ఉంది. ఎవరైతే చాట్‌గావ్ ప్రాంతాల్నుంచి వస్తారో వాళ్ళ మీద దొరగారికి ఎక్కువ అభిమానం". గొంతు తగ్గించి అన్నాడు బాయిలర్ కలాసీ విలాయత్ ఆలీ. "అసలు తన స్వగ్రామం చాట్‌గావ్ కాదులే. కాని, చాట్‌గావ్ నుంచి కాకపోతే సరంగు ఎక్కడి నుంచి వస్తాడు? మాములుగా అంటారు కదా- 'సరంగు, రొయ్య, మసీదు- ఈ మూడు కలిసి చాట్‌గావ్, వరి, దొంగతనం, కాలువ - మూడూ కలిసి బరిశాల్', అని. అయినా సరంగు పని చేయడం దారి కొట్టడం లాంటిది కాదు కదా?"....

"నీదే ఊరురా, అబ్బాయీ," అని అందరూ ఒక్కసారి అడిగారు. "ఇదే ప్రాంతం" అని నసీమ్ నిరాశతో కూడుకున్న ముఖం ప్రదర్శిస్తూ జవాబు చెప్పాడు. అప్పుడు మిగతావాళ్ళ ముఖంపైన తనపై ఒక చిన్న చూపు చూసే లక్షణం కనిపించింది. మరునాడు చావు దెబ్బలు తిన్నాడు అబ్దుల్. నీటి కొలత చూసే ఒక ఇనుప పరికరాన్ని పోగొట్టాడు.

దెబ్బలు తగిలే సమయంలో వాణ్ని పట్టుకునేందుకు గానీ, వాణ్ని విడిపించేందుకు గాని ఎవరూ రాలేదు. ఇటువంటి దేహశుద్ధి వాళ్ళకి ఒక

నిత్యాచారం అయిపోయింది. అయినప్పటికీ కన్నీటి ప్రవాహంలో మట్టుకు తగ్గుదల లేదు. నదీ జలంలో కళ్ళు తుడుచుకుంటూ అబ్దుల్ అన్నాడు: "నెల జీతంలో దాని ఖరీదు తగ్గించాడు, వడ్డీతో సహా; అయినప్పటికీ శరీరం గాయపడేలాగ కొట్టడం మానలేదు".

ఇన్ని బాధలు పడినా సరంగుకి వ్యతిరేకంగా మాట్లాడటం, వానిపై ద్రోహం చేయడం వాళ్లెవరూ తలపెట్టలేదు. తమ తప్పు సమర్థించేందుకు రెండు మాటలైనా పలకరు. దెబ్బలు తింటున్నప్పుడు అడ్డుపడితే శరీరంలోని ఎముకలూ, మాంసమూ గట్టిపడవు కదా!

నాసిమ్ ఆలోచించుకున్నాడు, ఇదంతా అర్థం చేసుకున్నాక 'తల్లి తండ్రులు కొట్టడంలో ఏమీ ఉపయోగం లేదు' అని ఎందుకంటే అందరూ కూడా నిచ్చెన పని నుంచి ఓడలో 'ఫన్నెలు'లో ప్రవేశించే అభివృద్ధి కోసం పాటుపడతారు. అందరికీ కావలసిన దల్లా సరంగు యొక్క సర్టిఫికేటు. దెబ్బలు తగలకపోతే కలం పట్టుకుని చదువు నేర్చుకునే దెవరు?

అబ్దుల్ నీటికొలత 'గొట్టం' పోగొట్టడం దెబ్బలు తిన్న రోజునే, నాసిమ్ కూడా నదిలో బాల్చి పోగొట్టాడు. ఆ రోజున దెబ్బలు తిన్నప్పుడు వాడికింక సిగ్గు, అవమానం అనిపించలేదు. మక్బూల్‌తోనూ, మిగతా ఖలాసీలతోనూ స్నేహం పెంచుకున్నాడు.

"నీ పనే బాగుంది నాకు జీతం లేదు, గీతం లేదు– దెబ్బలు మట్టుకు ఇచ్చాడు" అన్నాడు మక్బూల్ ఓ పక్కనుంచి ఏడుస్తూ. "ఏమయ్యిందంటే నా నెల జీతం అంతా బాల్చి నష్టపరిహారం క్రింద కోసేసాడు. నెలాఖరుకి ఏదైనా అడ్వాన్సు ఇమ్మంటే రెండణాలు మాత్రం ఇచ్చాడు. ఓడలో ఉండే వడ్డీ వ్యాపారం చేస్తున్నాడు. ఎవ్వరూ నా సంగతి చూసేవాళ్ళు కానీ వినేవాళ్ళు కానీ లేరు". అంటూ అలా పైకి చూశాడు– పై నున్న దేవుడు తన రొద వింటాడేమో అన్నట్లుగా.

"ఇంకో ఓడలో పనిచేద్దామని వెళ్లినా ఇదే గతి కదా?"

"నువ్వెళ్లితే నిన్ను తీసుకునే వాడెవ్వడు? ఒక ఓడ విడిచి వెళ్లిన వాడికి మరో ఓడలో ప్రవేశం ఉండదు. సరంగుల మధ్య ఒక ఒడంబడిక ఉంది. అంచేత ఎన్ని దెబ్బలు తిన్నా మొత్తానికి ఓడలోంచి గెంటేయకుండా ఉంటే చాలు అనుకుంటాము. ఒక్కమాటు మనల్ని గెంటేసారంటే ఇక మనకి సర్వనాశనమే. నీళ్లు విడిచి పోయామంటే మనకింక రోజు గడవదు".

"అసలు నువ్వు మరో ఓడలోకి వెళ్లి చూశావా?" ప్రక్కనుచి ఇయాదలి వెక్కిరిస్తూ అడిగాడు. "అన్ని ఓడల్లోనూ ఇదే పరిస్థితి".

"మాట్లాడక పారిపోవాలన్నా పోయేందుకు లేదా?" అందరూ ఒక్కసారి నవ్వారు.

నిచ్చెన పని నుండి ఫన్నెల్ పనిలోకి ప్రవేశించినవాడు ఈ పిచ్చి ప్రశ్న వేశాడు.

"ఇక్కడ నుంచి పారిపోయి మరొక చోటికి వెళ్లడం ఏమంత సులభం కాదు". గంభీరమైన ముఖంపెట్టి అన్నాడు ఇంకొకతను. "నీ పేరూ ఊరు అన్నీ దొరగారి నోట్‌బుక్‌లో వ్రాయబడి ఉన్నాయి. పారిపోతే పోలీసుకి రిపోర్టు ఇస్తాడు. ఏమంటాడంటే, 'నా జేబులోంచి డబ్బు దొంగిలించాడు. నా వాచీ తీసుకుపోయాడు" అని కంపెనీ వాళ్లు సరంగు తరఫునే వాదిస్తారు. ఒడ్డు విడిస్తే, జైలుకే ప్రయాణం".

అయితే నాసిమ్ రోజూ ఇలా గడప వలసిందేనా? ఎప్పుడూ ఇదే విసుగుపుట్టే నీటి సొద వినవలసిందేనా? జీతం లేదు, మరేం కాలక్షేపం లేదు, పగలూ రాత్రి ఇల్లా ఎంతకాలం గడపడం?

"దొరగారికి సంతోషం కలిగించే ప్రయత్నం చేయి. అంతకుమించి వేరే మార్గంలేదు. చూడు ఒక్కసారే నిచ్చెన అన్ని మెట్లూ ఎక్కలేవు కదా?"

సరే ఏం పని చేసి దొరగారికి ఖుషీ కలిగించాలి? ఏముంది? తను చేయవలసిన పనులు కాకుండా సాహేబుగారి ఒళ్లూ, చేతులూ, కాళ్లూ పట్టడం, స్నానానికి ముందు తలకి తైలం మర్దన చేయడం; జుట్టు దువ్వడం, కత్తిరించడం. అలాగైతే వంట చేసేటప్పుడు చుక్కాని పట్టుకొచ్చి కాళ్లూ, చేతులూ విరగగొట్టడు. అయినా ఏం తోచడం లేదు, నెల జీతం లేదు. జరిమానా వేయడంలో ఏమైనా తగ్గించవలసి వస్తే సాహేబుగారికి పెద్ద దుఃఖం వచ్చేస్తుంది. అందుచేత మధ్య మధ్య ఉపవాసం ఉండవలసి వస్తుంది. అలాంటప్పుడు ఏదో మిరపకాయ, ఉల్లిపాయ కయే ఖర్చు దాచుకోవచ్చు.

బియ్యం, ఉప్పు, మిరపకాయ, ఉల్లిపాయి సరంగు పట్టుకొస్తాడు. ఎవరికేది ఇష్టమో అది వండాలి. నూనె, మసాలా, చేపలూ, కూరలూ నెలాఖరుకి ఇచ్చే జీతంలో ఎవరెవరికి ఈ వంట సరకుల ఖర్చు ఎంత అయిందో అది కత్తిరించేస్తాడు సరంగు. అది కూడా అతని కిష్టం వచ్చినట్లు.

"సరంగుకు సంతోషం కలిగించాలంటే దొంగతనం చేయి" అన్నాడు ఒకడు రహస్యంగా.

ఈ స్టీమరుకే అప్పుడప్పుడు ఒక చిన్న పడవ ప్రక్కన కట్టుతారు. అందులో ధాన్యం, ఉప్పు మిరపకాయల బస్తాలు వేస్తారు. ఆ చిన్న పడవలో మనిషి ఒకడుంటాడు. వాడికీ సరంగు-మేస్త్రీకి మధ్య స్టోరు రూముకి సంబంధించిన లావాదేవీలలో ఏదో లాభం కొట్టవచ్చు.

లేదు, ఇదేం బాగులేదు. నాసిమ్‌కి ఏమీ ఆశ లేదు. స్టీమరు వ్యవహారం రోజూ ఒకేవిధమైన హడావుడితో జరుగుతుంది. సాయంత్రం అవనీ, అర్ధరాత్రి కానీ, మరునాటి ఉదయం కానీ, ఎప్పుడు ఒకటే వైచిత్ర్యం. లేకపోతే నీటి శబ్దం,

యాత్రికుల త్రొక్కుడూ, లంగరు వేయడం తీయడంలో డబడబ చప్పుడూ, నిచ్చెనా పగ్గాలూ వేసేటప్పుడు కేకలూ-అంతా ఒకే మోస్తరు. ఇంక ఇదేం బాగులేదు. ఇదంతా తిరిగితిరిగి ఈ స్టీమరు మళ్లీ 'కనకదియా' కు ఎప్పుడు తిరిగి వెళుతుందో కదా! నది ఇంత చిన్నది; ప్రవాహం ఇంత మందం- ఇదంతా ఊహించలేకపోయాడు నాసిమ్. ముందుకి ఆలోచిస్తే ఈ నది ఏ సముద్రంలో సంగమిస్తూందో కూడా తెలియడం లేదు. లేక ఈ దేశం విడిచి మరే పరదేశంలోకి పోతుందో.

అంధకారపు ఏకాంతంలో నది కేసి చూస్తూ ఒంటరిగా కూర్చున్నాడు నాసిమ్. ఆ దట్టమైన నల్లటి నీళ్లలోంచి ఒక మిణుగురు పురుగు వెలుగు కనిపించింది. ఈరోజు 'కనకదియా' చేరుకుంది ఓడ. అర్థరాత్రి సమయంలో ఇంటి సంగతి ఆలోచనకు వచ్చింది నాసిమ్‌కి. అనుకున్నాడు ఇంకెక్కడ ఇల్లూ, వాకిలీ? ఇంకేం ఇల్లూ లేదూ, వాకిలీ లేదు- అదంతా భూతకాలపు నివాసం. మళ్లీ ఒక భావం మనసుకి తట్టింది తల్లి ముఖం. కానీ అనుకున్నాడు, ఆమె ఇంక తల్లి కాదు. తన తల్లి ఎప్పుడో చచ్చిపోయింది. ఈ నల్లటి నీళ్లల్లో ప్రతిబింబించే వెన్నెల తన చనిపోయిన తల్లి ముఖంలా తోచింది అతనికి.

పెద్ద దొంగతనం చేయలేకపోయినా, త్రోవలో పడి పోయిన ఒక చిన్న వస్తువుని ఎవరు దొంగిలించలేక పోతారు? చేతిలో కత్తి పుచ్చుకుని కొబ్బరి బొండాలు అమ్మే ఒక పల్లెటూరి వాడు వచ్చాడు. సరంగు సాహేబుగారి కోసం 12 పైసలది ఒక బొండం కొన్నాడు. నిచ్చెన లాగే సాక, ఓడ కదులుతూండగా సరంగు దగ్గర నుంచి ఒక 6 పైసలు (అణా) పుచ్చుకుని ఒడ్డుమీద వాడికి ఆ డబ్బులు విసిరి ఇచ్చాడు. "మిగతా 6 పైసలు ఏవి?" అని కొబ్బరికాయల వాడు అడిగితే, నాలుక జాపి వెక్కిరించాడు నాసిమ్. కొబ్బరికాయల వాడు నాసిమ్ వైపు నదిలోంచి మట్టి తీసి విసిరాడు. ఓడ నడుస్తూ ఉండబట్టి నాసిమ్‌కి దెబ్బతగలలేదు. సరంగూ, నాసిమ్ ఒక్కసారి నవ్వుకున్నారు.

చేపలు అమ్మబడికి వచ్చాయి తర్వాత. "బాంశ్‌పాడా" అనీ, "గావ్-ఖాయూ" అని రెండు రకాల చేపలు. వాటిని సంపాదించేందుకోసం కొంత ఉపాయం పన్నాలి. పాలు మరొకడు తీసుకుని వచ్చాడు గిన్నెలో; అది ఒక బొంగు చెంబు తో కొలిచి పోస్తాడు. ఇంకొకడు అప్పుడే తోట లోంచి కోసిన దోసకాయ తీసుకు వచ్చాడు తట్టలో. "చిన్న రొయ్యలతో కూర అవుతుంది, లేకపోతే ఉత్తిదే తినాలి. నీకు డబ్బు ఇవ్వకుండా పారిపోంలే. నేను సగంగు సాహేబుగారి కుర్రవాణ్ణి". ఇలా చెప్పి అందరి దగ్గరా చమత్కారంగా డబ్బు కమీషన్ కొట్టాడు సరంగు తరఫున. ఇన్నాళ్లకు ఒక బనీను అందుకున్నాడు నాసిమ్. తువ్వాలూ, లుంగీ ఎప్పుడు

సంపాదించుకోగలడే!.

నాలుగు పైసలు కోరాడు నాసిమ్.

ఈ విధంగా పట్టుదలతో అడిగే మాట సరంగు ఎప్పుడూ వినలేదు తన జీవితంలో. నెత్తి పైకి కళ్లెత్తి అన్నాడు: "ఏంటంటున్నావ్? డబ్బులా?" అని తిట్టాడు. ఏమంత భయంకరమైన బూతు మాట పడడానికి తనేం చేశానని భయపడి సరంగుకేసి వెర్రిగా చూశాడు నాసిమ్.

"డబ్బులు తీసుకుని ఏం చేస్తావు"

"ఒక కప్పు టీ కొని తాగుతాను".

పెద్ద రూపాయి ముద్రంత లెంపకాయ కొట్టాడు సరంగు. కళ్లు తిరిగి పడిపోయాడు నాసిమ్. సరంగు గర్జిస్తూ లేచాడు: "ఇలా మర్యాద తెలియకుండా ప్రవర్తిస్తావుట్రా! ఇటు పైన బీడీ కోసం డబ్బులడుగుతావు! బీడీ కొనుక్కోవాలి! ఏదో కొనుక్కోవాలి ! మరి కొన్నాళ్లు పోతే ఏదో వైన్ బోటిలు కొనాలంటావు! ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాలు వేశావంటే నది మధ్యలో నీ జాడ లేకుండేలా తోసేస్తా!"

కళ్లమ్మట నీరు కారుస్తూ మళ్లీ తల్లిమాట తలచుకున్నాడు నాసిమ్. చనిపోయిన తల్లి ముఖం ఎలా ఉంటుందా అని ఆ చీకటి రాత్రి నీళ్లలోకి చూస్తూ ఆలోచించుకున్నాడు. తల్లి మృతముఖాన్ని తలచుకుంటే ఒక విధమైన వింత శక్తి మనస్సులో ఉత్పన్న మవుతోంది. ఆ శక్తి తెచ్చుకుని ఇటువంటి దెబ్బలు సహించుకుంటున్నాడు. 'అమ్మా' అని ఏడ్చే అవకాశం లేనప్పుడు, నిశ్శబ్దంగా తన బాధలను తనలోనే జీర్ణింపచేసుకోక మరేం ఉపాయం ఉంది వాడికి?

అయినప్పటికీ ఈ అత్యాచారం విషయంపై ఆ నావికులందరికీ ఐకమత్యంతో కూడిన ఒక అభిప్రాయం కలగలేదు. పైనున్న అల్లాని విడిచి మరెవ్వరికీ వాళ్ల మొర వినిపించుకునే అవకాశం లేదు. ఈ ఓడ యొక్క బందిఖానా నుంచి విడుదలంటూ లేదు. ఎప్పుడు నిచ్చెన పై అధికారం వస్తుందా, తర్వాత డెక్ మీద ఉద్యోగం, ఆ పైన పగ్గాల పని, లేక లంగరు పని, లేక మేస్త్రీ పని లభిస్తుందా- ఇల్లాంటి లెక్కలు వేసుకుంటూనే ప్రతి రోజూ గడుపుకుంటున్నాడు. ఎవరెల్లా సరంగు పూజ చెయ్యాలో! వడ్డీ ఇచ్చో, లంచం ఇచ్చో దొంగతనం చేసో, దెబ్బలు తినో! చాలా చమత్కారమైన ప్రభుత్వం చలాయిస్తున్నాడా సరంగు.

అదే రాత్రి ఒక యాత్రికుని చెప్పుల జోడు దాచేసాడు నాసిమ్. అది చూసి వెంటనే ఆ జతను నదిలోకి పారేశాడు; సరంగు అన్నాడు: "నీ తెలివి తేటలు చాలా గొప్పవయ్యా! ఆ జోళ్లతో చప్పుడు చేసుకుంటూ నేను నడిచానంటే నన్ను పోలీసులు పట్టుకుంటారు కదా!"

మరునాడు ఎక్కడినుండో ఒక తగరపు సూటుకేసు లాక్కొచ్చాడు నాసిమ్. అది కూడా నదీ గర్భానికి అర్పింపబడింది. ఆ సూటుకేసులో ఏవేవో కోర్టు కేసుల కాగితాలు, దస్తావేజులు, నకళ్లు మొదలైనవి మాత్రమే ఉన్నాయి.

నాసిమ్‌కి ఏమీ తోచడం లేదు. అయినా ఏదో చేయగలను, చేయగలను, మెల్లిమెల్లిగా, అన్న ధైర్యం పోలేదు. సరంగు కొట్టే లెంపకాయల వల్ల వాడి చెవిలో అదే సందేశం నెమ్మదిగా వినిపిస్తూ ఉంటుంది. తన మొండిపట్టుదల, అసామర్థ్యం గురించి, సరంగు కోపగించుకుని, అందుకు తగ్గ శిక్ష తనకు విధించకపోతేనే, నాసిమ్‌కి ఏదో పట్టుదల లోపిస్తుంది.

కంపెనీ వాళ్ల దీపాలలో కాంతిలేదు; వర్షం వస్తే వేసే తార్పాలిన్ లేదు; స్త్రీలకీ, పురుషులకీ వేరు వేరు గదులు లేవు: అయినా అందరి కళ్లల్లోనూ నిద్ర ముంచుకుంటూ వచ్చింది. వీళ్లంతా ఏమంత సరదాగా ఉండే యాత్రికులు కారు. పేకాడడమో, పాటలు పాడడమో, వినోద కథలు చెప్పడమో వీళ్లకేం చేతకాదు. పల్లెటూరి దద్దమ్మలు. వరద ప్రవాహం లాగ ఎక్కడ వీలైతే అక్కడ తల అన్చి మొద్దుల్లా పడుకున్నారు.

నిద్రపోతున్న వాళ్ల వెనక ఉన్న టాంకు ప్రక్క నుంచి ఎవరిదో బైటకి ఒక డబ్బు సంచి వచ్చింది. నాసిమ్ దాన్ని, వ్రేళ్లు తెలివితేటలగా ఉపయోగిస్తూ స్వాధీనం చేసుకున్నాడు. ఒకసారి అందులో ఎంత డబ్బు ఉందో లెక్కపెట్టి చూద్దామనుకున్నాడు. వచ్చే స్టేషను (ఒడరేవు)లో పారిపోవచ్చు అనుకున్నాడు. కాని ఎవరు చెప్పగలరు - సరంగు వైపు నుంచి తిరస్కరించలేనట్టి ఎటువంటి ఆకర్షణ వచ్చి తనని ఇంకా అక్కడ ఉంచేస్తుందో? ఇంచుమించు సరంగు వల్ల మంత్రముగ్ధుడయాడని చెప్పవచ్చు- పులిముందు ఆవులాగ. వాడు ఎంత గట్టిగా కొట్టనియ్యి, చిరునవ్వు ముఖంపెట్టి ఏమీ మాట్లాడక పోనియ్యి; న్యాయంగా కోరినా ఒక చిల్లిగవ్వైనా ఇవ్వక పోనియ్యి: ఇంకా వాడికే సంతోషం కలిగించాలి అనిపిస్తుంది నాసిమ్‌కి, తదితర నావికులూనూ వెనకాలే ఎన్ని తిట్లు తిట్టుకున్నా, వాళ్లందరూ ఒకడితో మరొకడు కలిసి సరంగుపై తిరుగుబాటు చేద్దామనే ఉద్దేశం ఉన్నవాళ్లు కాలేకపోతున్నారు. ఎవరైనా మరొకరిని కాదని ఏదైనా తిరస్కారం చేసారంటే వారికింక అక్కడ ఆస్కారం లేదన్నమాటే.

"మొత్తం మీద ఏడు రూపాయిల తొమ్మిదణాలన్నర" మక్‌బూల్ అన్నాడు: "దాని వల్ల ఏం ప్రయోజనం? '280 రూపాయిలుంటే కాని ఆట ఆడదు అంటాడు మన సరంగు సాహేబుగారు".

అయినాసరే, బట్టా, గిట్టా కంటె చేతిలో డబ్బులే మేలు అన్నింటిలోకి వజ్రం కానీ, బంగారం కానీ, వెండికానీ దొరికితే చాలా మంచిది. ఈ రోజుల్లో ధరలు ఎంత

దారుణంగా ఉన్నాయో! పేపరు రూపాయి నోట్లు ఎందుకూ పనికి రావు.,

ఈసారి ఇన్నాళ్లకు ఒక క్రొత్త లుంగీ లభించింది. మరొకసారి పొట్టిచేతుల చొక్కా కాని వ్యవసాయం పెట్టుబడికీ, పెళ్లానికీ, కూతుళ్లకీ వస్తువులకీ డబ్బు ఎక్కడ నుంచి వస్తుంది? ఎంతో కష్టపడి దాస్తే కాని వాళ్ల చేతికి గాజులేనా కొనలేరు కదా, ఇంక బంగారం వస్తువుల బహూకరణ గురించి అసలు ఆలోచనే లేదు'.

కాదు, ఉంది నూతన వధువు వెళుతుంది అత్తవారింటికి. మెడలో బంగారపు గొలుసు, చేతిలో వట పుష్పం. కాళ్లకు వెండి కడియం, వ్రేళ్లకు ఉంగరం. వంగ పండు రంగు చీర కట్టుకుని, పైన ముసుగు వేసుకుని నిద్రపోతోంది ఒక ప్రక్కన,. పెళ్లికొడుకు పార్టీ వాళ్లు చిందరవందరగా వస్తున్నారు ఆ ప్రక్కనుంచి, ఈ ప్రక్కనుంచి. ఎవరు ఎక్కడ ఏం జేస్తున్నారో అవగతం కావడం లేదు. ఈ వేళ ఓడలో చాలా రద్దీగా ఉంది. అయినా ఆ గందరగోళం మధ్యనే ఎక్కడైనా సందు కోసం వెతుకుతున్నాడు నాసిమ్.

క్రొత్త పెళ్లికూతురు మెడలో చేయివేశాడు నాసిమ్, ఆమె మెత్తని మెడ తగిలినా నాసిమ్ వ్రేళ్లు ఏమీ కంపించలేదు. ఒక్క ఊపులో లాగేశాడు ఆమె మెడలోని బంగారు గొలుసు.

"దొంగ! దొంగ!" అని ఆ గుంపులోంచి ఒక కేక బైట పడిందో లేదో యాత్రికులు పట్టేసుకున్నారు ఈ నాసిమ్‌ని. దాని మీదట అందరూ కలిసి ఇష్టం వచ్చినట్లు తన్నారు వాణ్ణి. ఏం జరిగిందని అడగడానికి వచ్చిన వాళ్లు కూడా వాణ్ని చితకకొట్టడం మొదలు పెట్టారు. దొంగకి దొంగిలించిన సరుకుతో పారిపోవడం వీలులేక పోయింది. కాబట్టి వధువు పడుకునే ప్రక్కలో పారేశాడు గొలుసు. అయితే ఏం? ఆడపిల్ల ఒంటిమీద చేయి వేస్తాడా? మెడలోంచి హారం లాగేయబడింది కదా! తన్నండి, తన్నండి, ఎవరికి ఇష్టం వచ్చినట్లు వాళ్లు చందావేసుకుని తన్నండి!"

"బాబోయ్-" అంటూ అరిచాడు నిస్సహాయుడైన నాసిమ్.

ఇంతలో ఒంటిమీద శర్వాణీ తొడుక్కుని, నెత్తి మీద టోపీ ధరించి, పాదాలకు స్లిప్పర్లు వేసుకుని, హాజరయ్యాడు సరంగు. "ఏమయ్యింది? ఎందుకలా కొడుతున్నారు. మా అబ్బాయిని? "అబ్బాయి!" అందరూ ఒక్కమాటు ఊరుకున్నారు. సరంగు సాహేబుగారి కొడుకు! కొందరన్నారు: "వాడు మీ నౌకరు అనుకున్నాము"

"నౌకరా! అబద్ధపు మాట! వాడు మా ఇంటావిడ కొడుకు- వాళ్ల అమ్మ చనిపోయింది. వాణ్ని ఎందుకు తన్నారు?"

"వాడు క్రొత్త పెళ్లికూతురు బంగారపు గొలుసు తస్కరించాడు- మెడలో లాకెట్

లాగేసాడు!"

"వట్టిమాట! వాడి చేతిలో గొలుసు లేదే! నడవండి. నేను ఆ వధువుని అసలు సంగతి ఏమిటో అడగుతాను".

సరంగు అందరిలోకి ముందుగా వదువు దగ్గరకు వెళ్లాడు. అన్నాడు: "మీ మెడలో నుంచి గొలుసు ఎవరు లాగారు?"

పరదాలో ముఖం దాచుకుని, మెడ తడుముకుని, పెళ్లి కూతురు అంది: "ఎవ్వరు లాగలేదు; ఒళ్లు తెలియకుండా నిద్రపోతున్నప్పుడు మెడలోంచి జారి అది నా ప్రక్కలో పడింది అంతే...."

'లతాబాడి' స్టేషను (ఒడరేవు) సమీపిస్తోంది. పెళ్లి కొడుకు వైపువారు అక్కడ దిగిపోతారు. ఓడ సిబ్బంది అంతా సిద్ధమయ్యారు గరగరలాడిస్తూ లంగరు వేయడానికి. ఓడను త్రాడుతో కట్టారు ఒక చెట్టు మొదలుకు.

"నిచ్చెన వెయ్యి, నిచ్చెన వెయ్యి"! అని పై నుంచి అరుస్తున్నాడు సరంగు. "నాసిమ్ ఏడి? నాసిమ్‌ని పిలవండి ఈవేళ వాడికి నిచ్చెన వేసే పెత్తనం వచ్చింది"

ఖలాసీల మధ్య కల్లోలం బయలుదేరింది. నాసిమ్ తర్ఫీదు ఇన్ని తక్కువ రోజులే జరిగింది. అప్పుడే వాడికి ప్రొమోషను వచ్చేసింది. దొంగతనం చేసి పట్టుబడ్డాక వాడి అదృష్టం బాగుపడింది. ఎవళ్లైతే పట్టుబడలేదో వాళ్ల కర్మ ఇంకా అధోగతిలోనే ఉంది. వాళ్లకింకా నిచ్చెన పనినుంచి డెక్‌పై పనికి ప్రొమోషను దొరకలేదు. మరి వీడో? వీడీవేళ నిచ్చెన అధికారి, రేపు డెక్‌పై అధికారి, ఆపైన త్వరలో చుక్కాని అధికారి: మరి వెంటనే సరంగు, ఓడకు కాప్టెను".

"వెయ్యండి, పట్టుకోండి చూస్తారేం? వాడికి సాయం చేయండి. పాపం ఆ చిన్నకుర్రాడు ఒక్కడూ ఎలా నిచ్చెన వేయగలడు?" అని పై నుంచి సరంగు గట్టిగా ఖలాసీలపై కేకలు వేస్తున్నాడు.

పెద్ద దీపపు కాంతిలో నాసిమ్ అశ్రుపూరితనయనాలు రెండూ తళతళ లాడుతున్నాయి.

నూతన వధువు 'లతాబాడి'లో దిగిపోతుంది. పాదాల పట్టాలు చప్పుడు చేసుకుంటూ నడిచింది.

దీపం వెలుగు చాలాదూరం ప్రసరిస్తోంది- చెట్లూ, చేమల శిఖరాలపై. నిచ్చెన వేసి వాసం కఱ్ఱ పట్టుకున్నాడు నాసిమ్. పెళ్లికూతురితో అన్నాడు: "జారి పడిపోతారు. ఈ వాసంకఱ్ఱ పట్టుకు నడవండి".

"అక్కరలేదు", అని కఱ్ఱ పట్టుకోకుండా నూతన వధువు తూలుతూ నడిచింది.

వెనకాలనుంచి ఎవరో నాసిమ్‌ని తన్ని గెంటారు. ఉలిక్కిపడి చూసేసరికి వాడే కనుపించాడు- ఎవడైతే అందరిలోకి తనని ఎక్కువ దెబ్బలు కొట్టాడో. ఆ కాంతిలో

వెంటనే వాణ్ని గుర్తించాడు..

వాడు గహారాలీ.

కాంతి వైపు నుంచీ ముఖం త్రిప్పి నడుస్తోంది గోలాబానూ. గట్టి మేలిముసుగు వేసుకుంది. ఒంటిపైన శాలువాను బురఖా మాదిరిగా శరీరమంతా కప్పేసుకుంది.

ఒడరేవులో అనేకమంది పరాయి మగవాళ్లు రావడం, పోవడం.

గట్టిగా పట్టుకుని నిచ్చెన ఎత్తివేశాడు నాసిమ్. ఒక్కొక్క మెట్టునీ పైకి నెడుతూ

ఒడ్డు ప్రక్కన మురికి నీళ్లలో తన తల్లి యొక్క మృతముఖపు నీడ కనపడింది వాడికి. ఓడ పై భాగం నుంచి సరంగు పెద్ద గొంతుకతో 'సెహాబాన్' అని కేక వేస్తూ నాసిమ్‌ని అభినందించాడు: అతగాడి తెల్ల శర్వాణీ, తెల్ల గెడ్డం గాలిలో ఊగుతున్నాయి. ప్రొద్దున్నా, సాయంత్రం కూడా బాగా 'గెడ్డం గీసినంత తళతళలాడుతోంది అతని ముఖం!'

---

·(మొదటి ముద్రణ 1946)

# రాణీ పసందు

*అన్నదా శంకర్ రాయ్*

చాలా రోజులు ఎదురు చూశాక లాంచి దొరికింది.

ఇంకా కొన్ని ఇన్స్పెక్షనులు చేయవలసి ఉంది. ఈ ఏడాది ముగిసే లోపల తనిఖీ చేసే పని పూర్తి చేయాలి.

రెండు ప్రక్కలా నదీ దృశ్యం, ఎదురుగా జేగురు రంగు శిఖరాలతో రాజిల్లే పర్వత శ్రేణి; కర్ణపులి నగరం దిక్కుగా లాంచిలో ప్రయాణం చేస్తూంటే ఎంత రొమాంటిక్ గా ఉంటుందో చెప్పలేం. కూడా కాగితం, కలం తీసుకుని బయలు దేరాను. చాలాకాలం తర్వాత కవిత్వం వ్రాస్తున్నాను. నాతోటి ప్రయాణికులు సరంగూ, స్టీరింగు వీలు త్రిప్పేవాడు, వాళ్ల సిబ్బందీ. నా బంట్రోతూ, వంటవాడూను. నన్ను ఎవ్వరూ వచ్చి డిస్టర్బు చేయవద్దని వాళ్లని గట్టిగా ఆజ్ఞాపించాను.

డెక్ చైర్ పై కూర్చుని లంగరు ఎత్తడం మొదలెట్టే పని చూసేసరికి ఇంతట్లో గబగబా ఒక పోలీసు సబిన్స్పెక్టరు వచ్చాడు. చేతిలో ఏదో ఉత్తరం. ఏమిటో సంగతి? మళ్లీ ఏం అడ్డు తగులుతుందో? నన్ను అసలు స్టేషను విడిచి వెళ్లనివ్వరా వీళ్లు? ఉత్తరం విప్పి చూశాను. కలకత్తా నుంచి ఒక పెద్ద పోలీసు అధికారి గారు విచ్చేశారు. ఆయనతో 'రావుజాన్' నగరం వెళ్లవలసి ఉంది. 'ఆయన నాతో కూడా ప్రయాణం చేస్తే, నాకు చాలా చికాకు కలగకుండా ఉంటుందా? లేకపోతే చట గ్రామంలో ఒక రోజు ఇంకా ఆగిపోవలసి వస్తుంది. పోలీసు లాంచి రేపు తిరిగి వెళ్లి పోతుందన్న మాట ఒకటి తెలియ వచ్చింది.

కొంచెంచికాకు తప్పదనుకుందాం. కానీ ఆ మాట కాగితం మీద ఎలా పెట్టడం? నేను కవిత్వం వ్రాయడం అనేదేదో తేలింది. మనస్సులో తిట్టుకుంటూనే పైకి పళ్లు ఇకిలించి చిరునవ్వుతో పోలీసు ఆఫీసరుగారితో ఇలా చెప్పమన్నాను: "మీరు రావడం నా పరమ సౌభాగ్యం" అని. సబిన్స్పెక్టరు బూట్లు నేల మీద టక్కుమనిపిస్తూ ఒక పెద్ద మిలిటరీ సాల్యూట్ చేసి సెలవు తీసుకున్నాడు. నేను పడుకుని ఆలోచించడం మొదలుపెట్టాను. "నేను అడ్డుపెట్టానంటే ఏమంత పెద్ద అశాంతి జరుగుతుంది? ఒక్క రోజు లాంచిలో కూర్చుని షైరుకి ఏమి తిరిగి బాగు చేయలేనంత నష్టం కలిగే జరుగురు పని వచ్చి పడింది?".

మంచి నడవడి విషయంలో, పోలీసు ఆఫీసర్ ఖాన్ బహాదురు గారితో పోల్చదగిన వాళ్లు లేరు. ఆయన చెప్పే మాటలకు సరిగ్గా కృతజ్ఞత తెలియజేయాలంటే బెంగాలీ భాష సరిపోదు. ఇంగ్లీషులోనే, ఉర్దూలోనే చెప్పవలసి ఉంటుంది. అతగాడు పంజాబీ ముస్లిము. వయసులో చాలా పెద్ద. గెడ్డం, మీసం

లేకపోతే ఇంకా తక్కువ వయసు వాడిలా కనుపించేవాడు. చిరునవ్వు నవ్వుతూ సరదాగా మనస్సిచ్చి మాటాడే స్వభావం గల మనిషి.

ఇంతట్లో తేలిన విషయం ఏమిటంటే ఆయన తెలుసుకున్నాడు నేను రచయితనని. ఆయన అన్నాడు: "మీతో సంభాషించాలని నాకు చాలా కాలం నుంచి అభిలాష. ఆ కోరిక ఈ విధంగా తీరుతుంది అనుకోలేదు ఎప్పుడూ. నిజానికి, నేను మీ ఏకాంతానికి భంగం కలిగించదలచుకోలేదు. ఒక్కరోజు ఊరుకుందాం అనుకున్నాను గాని, ఎన్.పి. గారు లాంచిలో మిమ్మల్ని కలుసుకోమని పంపించేశారు నన్ను. సరే మీరు అసలు సంగతి విన్నా రనుకుంటా".

నేను ఒక్కసారి ఉలిక్కిపడి అన్నాను: "ఏమిటి? లేదే! ఏం సంగతి?"

"చాలా పెద్ద సంగతి". ఆయనగారు నా చెవి దగ్గర నోరు పెట్టి పలికాడు: "అదేం కాకపోతే, మహాశయా, నేను కలకత్తా నుంచి ట్రంకు కాల్ మీద పరిగెట్టుకుంటూ వస్తానా? అరే! ఛీ!ఛీ! షేమ్‌ఫుల్! బేశరమ్! సిగ్గుమాలిన మాట".

నేను తగురీతిని ఉత్సుకతను చూపించాను. నాకు తెలుసును ఖాన్ బహాదుర్ తనంతటతనే చెప్పేస్తాడని, అయినా నటించాను ఇతరుల గొడవల్లో నాకేమీ కుతూహలం లేదన్నట్లు.

"మీరు సాహితీపరులు. మీరు మాటిమాటికీ 'సత్యం, శివం, సుందరం' అంటూ ఉంటారు. కానీ నాకు నా 45 ఏళ్ల జీవితంలో అనుభూతికి వచ్చిన దేమిటంటే, సత్యమైనదల్లా సుందరమైనది కాదు. నే నెప్పుడైనా పుస్తకం వ్రాస్తే ఏం వ్రాస్తానో చెప్పనా? తరచు సుందరమైన స్త్రీ పెద్దదవుతుందని, పెద్ద స్త్రీ చరిత్రే సుందరంగా ఉంటుందనీ" - అని చెప్పి 'హహ్హ' అని నవ్వడం మొదలు పెట్టాడు ఖాన్ బహాదుర్.

కూడా నవ్వాను నేనూను. అయినా కూడా ఈ మాట అన్నాను: "కాని, మన బెంగాలు రాష్ట్రం లో అలా కాదు".

వ్యంగ్యంగా అన్నాడు ఆ పెద్ద మనిషి: "బెంగాలులో కాదేం? వంగదేశంలో పనిచేసే సరికి జుట్టూడిపోయింది బాబూ: పైగా ఈ 'రావ్‌జాన్ ఉందే..."

"రావ్‌జాన్!"

"రావ్‌జాన్ ఉందే అది వంగదేశానికి బైట".

చూడగా చూడగా సంగతి చాలా కుతూహల జనకంగా ఉంది. నేను నా వంట వాణ్ని పిలుస్తూంటే, ఆయన అన్నాడు; "మరేం వద్దు, దాదా! తమరే నా అతిథి!"

ఎల్లాగని నేను ఆయన అతిథినయ్యాను? లాంచి నా అధీనంలో ఉంది. కానీ ఎవరు వింటారు నా మాట? అతగాడు సాయంకాలం నాలుగు గంటలకు ఆర్డరు

ఇచ్చాడు. లాంచి అప్పుడు సదార్‌ఘాట్ విడిచి వెళ్లింది.

దగ్గర వున్న డెక్ చెయిర్ వేసుకుని కొండల వైపు ముఖం త్రిప్పి కోపావిష్టుడనై కూర్చున్నాను. ఖాన్ బహాదుర్ ఇంకా ఇలా అన్నాడు: "దాదా వాడేం మామూలు మనిషి కాడు. ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరు. అదే సమయంలో నేను వాడి పై ఎన్.పి. గా ఉన్నాను. వాడి ఉద్యోగ ధర్మ నిర్వాహణ గురించి ప్రశంసించాను. బుర్రకేమీ వెర్రిలేదు, కవికాడు - నా మొరటు మాటలు మన్నించాలి. వాడి గురించి ఎప్పుడూ మంచే వినబడేది. ఎటువంటి వాడంటే సర్వీస్‌లో ఉండే కపటోపాయాలకు లొంగకుండా, ఆడపిల్లలకేసి చూడకుండా, కాలం గడిపేవాడు. వాడికి భార్యలేదు, లేకపోతే చాలా దుఃఖ కరమైన పరిణామం కలిగేది. అటువంటి మనిషి హఠాత్తుగా మాయమయిపోయాడు".

"మాయమయి పోయాడా!" అని ఆశ్చర్యంతో అరిచాను నేను.

"ఇంక మరేం అనుకుంటున్నారు సిగ్గుపడవలసిన సంగతి అంటే" ఖాన్‌బహాదుర్ సిల్కు జేబు రుమాలు తీసి, నోరూ, కళ్లూ తుడుచుకున్నాడు. "ఏదో మర్డరు కేసులో ఆరా తీసేందుకు వెళ్లాడు. బర్మా దేశపు పిల్ల మహాశయా! సైతాను యొక్క కూతురు! మీ బెంగాలీ మహమ్మదీయులున్నారే, మీకు దమ్ము ఉంటే కదా! రంగూన్ నుంచి పెళ్లి చేసుకుని తీసుకు వచ్చాడు. మర్డరుకి గురి అయిన వాడి గురించి మాటాడుతున్నాను. అటువంటి అందకత్తె బర్మాలోనే లేదు. సరే, వాడికి మరో భార్య ఉందని చూసే సరికి వాడి మెడను కత్తితో కోసి పారేసింది".

"నేను చెవులు నిక్క పెట్టి విన్నాను. కాని ఎక్కడా ఈ సంగతి నాకు వినిపించలేదే!"

"అదే చెపుతున్నాను ఆచూకీ తీసే పనిమీద వెళ్లాడు. సబ్ ఇన్‌స్పెక్టరు దర్యాప్తు చేశాడు. ఆ అమ్మాయి బెంగాలీ భాష మాటలాడ లేకపోవడం వల్ల ఇన్‌స్పెక్టరుకి వెళ్లవలసి వచ్చింది. అదే అతని చావుకి కారణం అయింది. ఒక రోజు గడిచింది. రెండు రోజులు గడిచాయి. కానీ ఆచూకీ తీయడం పూర్తి అవలేదు. మిగతా వ్యవహారం చూసేందుకు అసామీ లేదు, ఆఫీసరు లేదు. హహ్హాహ్హాహ్హా!"

కానీ ఇది నవ్వవలసిన విషయం కాదు. స్త్రీల అపహరణ విషయంలో నేనెన్నడూ ఎవరికీ బాధ్యత విడిచి పెట్టలేదు. నేను ఒక్కసారి పైకి లేచి అన్నాను. "ఇన్నాళ్లూ మీరు ఏం చేశారు? ఎందుకు ఆమెని అరెస్టు చేయలేదు? ఇది కేవలం డిపార్టుమెంటు వ్యవహారం కాదు. ఇది కోర్టులో దాఖలు చేయవలసిన కేసు కూడాను".

ఖాన్ బహాదుర్ గంభీరంగా అన్నాడు: "ఇది కోర్టు వ్యవహారం అవునా కాదా

అన్నదే సమస్య. ఆడపిల్ల ఏతంతువు: ఏమాత్రం దొంగ మాటలాడి తీసుకువచ్చా దనడానికి వీలు లేదు. వయస్సొచ్చిన పిల్ల, లేవతీసుకువచ్చాడని కేసు పెట్టడానికి వీలుండదు. ఎవరిని అరెస్టు చేసి వాళ్లని అపరాధి అని మీరు ఋజువు చేయగలరు? వింటున్నారా?"

నేను జవాబు చెప్పలేకపోయాను. పంకరగా చిరునవ్వు నవ్వి అన్నాడు: "తర్వాత అది పెళ్లి చేసుకు కూర్చుంటే? లేదు, బాబా, అంత తేలిక కాదు. ఉద్యోగం నుంచి అందరూ డిస్మిస్ అయిపోయినాసరే, కలకత్తా పోలీసు వాళ్లు ఈ వ్యవహారం నడిపిస్తారు. కానీ శవంపైన కత్తితో పొడుస్తున్నప్పుడు మీ చేయి దురద వదిల్చేందుకు తర్వాత చట్టం తగు చర్య తీసుకుంటుంది".

ఆ మాట నిజమే. నా పని ఎలా ఉందంటే గాలంలో చిక్కుకున్న పెద్ద చేపలా ఉన్నాను. కానీ ఖాన్ బహాదుర్ ఈ విషయంలో ఏమీ దుఃఖిస్తున్నట్లు లేదు. అన్నాడు: "వాడెక్కడో చటుగ్రామపు పర్వతాలలో దాక్కున్నాడు అని విన్నాను. అక్కడ నుంచి నడిచి బర్మా వెళ్లిపోయి ఉంటాడు. ఆ తర్వాత ఆ అందకత్తె అనుగ్రహం ఎప్పుడు కలుగుతుందో ఎవరు చెప్పగలరు? మగవాడిని కోతిలా ఆడించి ఎప్పుడు ఏ విధంగా కోసి పెట్టుతుందో, లేక తన్నుతుందో, ఆడదాని మనస్సు దేవుడికే తెలుసు. అందమైన ఆడపిల్ల ముఖం కనుపిస్తే దూరం నుంచే సలామ్ పెట్టి నేను పారిపోతాను?"

చట్టపు పుస్తకం నా దగ్గర లేదు. అందుచేత పరారీ అయిన వాడికి సాయపడిన వాడికి ఎటువంటి శిక్ష విధింపబడుతుందో నేను చెప్పలేను. మనస్సులోనే ఏదో గాభరా పడుతున్నాను. అది చూసి ఆ పెద్దమనిషి అన్నాడు: "కాలం ఎలా ఉందంటే, మీరే మనుకుంటారో నాకు తెలుసు - పోలీసు వాడు పోలీసు వాళ్లతోనూ, మహమ్మదీయుడు మహమ్మదీయుడితోనూ సానుభూతి చూపిస్తాడని, నిజం చెపుతున్నాను, అల్లాగేం కాదు. నేను మగవాణ్ని, నా సానుభూతి మగవాడిపైనే ఉంటుంది: ఈ విషయంలో ఆడదే మగవాడిని కిడ్నాప్ చేసింది".

ఈ మాట విన్నాక, నాలో స్త్రీల యందు పక్షపాతం ఉన్నా అందుకు వ్యతిరేకంగా ఏమీ చెప్పలేకపోయాను. ఆయన ఇంకా అన్నాడు: "ఎవరిలో ఒక అణుమాత్రం చివల్రీ (స్త్రీలపై అభిమానంతో కూడుకున్న గౌరవం) ఉన్నా, వాడు ఇటువంటి విషయాలలో ఆడదానిపై నేరం, మోపడని నాకు తెలుసు. తప్పు ఎప్పుడూ-మగవాడిదే. అయినా ఎవరి నుదుటి వ్రాత ఎలా ఉందో అలా జరుగుతుంది. కర్మఫలం తప్పించే వాడెవడూ లేడు".

"అవునవును, ఆమాట రైటే! కర్మ!"

ఖాన్‌బహాదుర్ సంతోషించి అన్నాడు: "ఇటువంటి విధి విలాసమే నా ప్రథమ

యౌవన దశలో చూశాను. ఒక మిత్రుని జీవితంలో. అతను హిందువు. మీరు ఇదేం సంగతో అనుకుంటున్నారేమో! హిందువెప్పుడైనా ముస్లిముకి స్నేహితుడవుతాడా అని సందేహిస్తున్నారేమో! కాని ఆ రోజుల్లో ఈనాటి విషమ పరిస్థితి ఏమీ ఉండేది కాదు. 20 సంవత్సరాల క్రితం జరిగింది. మొదటి ప్రపంచ యుద్ధం ముగిశాక మేమిద్దరం మిలిటరీ విడిచి పోలీసు సిబ్బందిలో చేరాం: అప్పుడు ముస్లిము ఏమిటి, హిందువు ఏమిటి? ఓహో, అటువంటి రోజులు మళ్లీ ఎప్పుడైనా తిరిగి వస్తాయా!"

అతని కంఠంలో స్వచ్ఛమైన అనుభూతి గోచరిస్తోంది. స్మృతి పథంలో 20 సంవత్సరాల వెనక్కు పయనించి ఆ ఓల్డు లైన్ యొక్క రుచి మళ్లీ అనుభవిస్తున్నాడు. ఏమరి పాటుగా అన్నాడు: "ఆ సంఘటన ఏనాటిదో. ఇంతవరకూ అది నా మనస్సుకి తట్టలేదు. కానీ ఎందుచేతనో హఠాత్తుగా అది ఇప్పుడు స్మరణకు వస్తోంది. ఎంతగానంటే కళ్లెదుట జరిగినట్లుంది. చూడగా చూడగా అదంతామనే వీధిలో చక్కగా ప్రకాశిస్తోంది".

ఆతని వైపు కళ్లు త్రిప్పి తేరిపార చూశాను. అతనిప్పుడదే మనిషి అవునా కాదా! ఒక నవ యువకుడు అర్థ నిద్రలో కల కంటున్నట్లుంది. 'హెూ, హెూ' అంటున్నట్లు గాలి వీచడం ప్రారంభించింది. గాలితో గెంట బడి వేగంగా నడవడం మొదలెట్టింది లాంచి. లాంచి యొక్క రెండు వైపుల నీరూ రెండు ముక్కలు చేసిన బట్టలా చీలినట్లు ప్రవహిస్తోంది. వెనకాల కెరటాలు లేస్తున్నాయి. ఆ కెరటాల మధ్య ఉయ్యాల ఊగుతున్నట్లు నడుస్తోంది పడవ.

ఖాన్ బహాదుర్ ఇంకా మాట్లాడటం మొదలుపెట్టాడు.

## 2

మెహర్‌బాన్ సింగ్ రాజపుత్ర వంశానికి చెందినవాడు. మా పూర్వులు కూడా రాజపుత్రులే. మీరేమన్నా సరే, రక్తం యొక్క విశేష ప్రభావం ఒకటి తప్పకుండా ఉంటుంది. రాజపుత్రుల తో నా కిప్పుడెంత ఆత్మీయత ఉందో అంత ఇక్కడి మహమ్మదీయులతో నాకు లేదు. అయినప్పటికీ హిందూ మతం పై నా కంతగా నమ్మకం లేదు. మత విషయంలోనే పూర్తిగా ఛాదస్తపు మహమ్మదీయుణ్ణి. అప్పుడు ఈ సరంగు, చుక్కాని పట్టుకునే వాడు, నౌకరు వంటవాడు అందరూ మా మతస్థులే. అలా ఉండగా మెహర్‌ఖాన్ సింగు ఒక్కడే నాకు స్నేహితుడుగా ఉండేవాడు.

అటువంటి మిత్రుడు నాకు ఆ రోజుల్లో మరెవడూ లేడు. రోజూ నన్ను కలుసుకునే వాడు. మేము కలుసుకున్నప్పుడు ఏదో ఆనంద దాయకమైన సంభాషణలో కాని, పగటి కలలు కనడంలో కాని గంటల కొలదీ కాలం

గడిచిపోయేది. ఒక్కొక్కప్పుడు ఇద్దరం చదరంగం ఆడుకునే వాళ్లం; మరొకప్పుడు షికారుకి వెళ్లే వాళ్లం. ఆ రోజుల్లో ఇప్పటి లాగ అక్కడ సినిమా హాళ్ళు లేవు. మేము పనిచేసే చోట ఎప్పుడైనా టూరింగ్ సినీమాలు వస్తూ ఉండేవి. అప్పుడు మేమిద్దరం కలిసి వెళ్లేవాళ్లం సినిమాకి. ఏవో తమాషాలు చేసే వాళ్లం. మిగతా ఆఫీసర్లలాగా మేమెప్పుడూ పాటలు వినేందుకూ, నాట్యం చూసేందుకూ, డాన్సింగ్ గర్ల్ ఇళ్లకూ వెళ్లేవాళ్లం కాదు. ఇద్దరం ప్యూరిటన్సు లాగ సత్య ధర్మ బద్ధమైన జీవితం గడిపే వాళ్లం. అతని పెళ్లిమాటలు అప్పుడు జరుగుతూ ఉండేవి; మా ఆవిడ పుట్టింట్లోనే ఉండేది. అతను చదువుకున్న భార్య కావాలనే వాడు. ఆ రోజుల్లో ఆడవాళ్లకి చదవడం, వ్రాయడం అలవాటు చాలా తక్కువ.

ఆ రోజుల్లో పంజాబులోని ఆ కంటోన్మెంటు నగరంలో ఒక కోటీశ్వరుడైన మిలిటరీ కంట్రాక్టరు ఉండేవాడు. నేను అక్కడికి వెళ్లే నాటికి ఆయన మరణించాడు. అతని ఆస్తిలో ఒక సగం పెద్ద భార్యకు. మరొక సగం చిన్న భార్యకు సంక్రమించింది. పెద్ద భార్యకు దైవ సంబంధమైన కాలక్షేపం, చిన్న భార్యకు కులాసా సరదాలపై వ్యామోహం. ఇద్దరికీ కూడా పిల్లలు లేరు. వాళ్లకీ వేరే వేరే ఇళ్లు వేరేవేరే నౌకర్లూ, చాకర్లూ, వేరే వేరే రెండు గుర్రాల బండ్లు. అంతా వేరే బందోబస్తు స్వర్గస్థుడికి 'రాజా' అనే బిరుదు ఉండేది కాబట్టి, అతని భార్యలను పెద్దరాణి, చిన్న రాణీ అని పిలిచేవారు ప్రజలు.

నేను అక్కడికి వెళ్లిన రోజుల్లో ప్రజల నోటమ్మట విన్నదేమంటే సూర్యభాను (చిన్న రాణి) వంటి సౌందర్యవతి ఇంకెక్కడా లేదని. సౌందర్యవతి అయితే అయింది కాని, ఆమె నడత అంత సుందరమైనది కాదు. ఆమెకి పరదా వేసుకునే అలవాటు లేదు. క్లబ్బులకు వెళ్లేది. దొరలతో డాన్సు చేసేది. మిలిటరీ స్టేషనులో ఉన్న ఆఫీసర్లనందరినీ పిలిచి పార్టీలు ఇచ్చేది. ఎవళ్లూ కూడా ఆవిడ ఒకసారి కట్టిన చీర మళ్లీ కట్టడం చూడలేదు. కనీసం ఆమెకి 1000 జోళ్ల జతలుండేవి. ఆవిడ బహుశా పాలతో తల రుద్దుకుని పాల తొట్టిలో స్నానం చేసేదేమో కూడా. ఆ పాలే తర్వాత బజారులో అమ్మేవారేమో!

ఒక గట్టి పుకారు ఉండేది: ఆమె చల్లని చూపు ఎవరి మీదనైతే పడుతుందో వారికి ఇంక తీరవలసిన కోరిక ఏమీ మిగలదని. ఆ వ్యక్తి ఎవరైనా సరే. ఆమెకు వాడి డబ్బు గురించి, బహుమతుల గురించి ఆలోచించనక్కరలేదు. కేవలం ఆమెకు పసందు అయితే చాలు. కాని ఆమెకు పసందు అవడం అంత సులభం కాదు.

నేను డ్యూటీలో చేరిన రెండు మూడు వారాల తర్వాత నా పేరిట సూర్యభాను

నుంచి ఆహ్వానం వచ్చింది. . అది ఒక గార్డెను పార్టీకి ఆహ్వానం. మెహర్బాన్‌ని అడిగితే తనకి కూడా ఆహ్వానం వచ్చిందని చెప్పాడు. కాని అతను వెళ్లనన్నాడు. ఎందుకు వెళ్లడు అంటే అతనికి అటువంటి స్త్రీల తో సంబంధం పెట్టుకోవడం ఇష్టం లేదు.

నేను చమత్కారంగా అన్నాను: "ఒక జాతి మామిడి పండు ఉంది. దాని పేరు రాణీ పసందు. నీకు రాణీ పసందు అవడం ఇష్టంలేదా?"

"నేనేమీ మామిడి పండును కాను నాకు ఆత్మాభిమానం ఉంది. చాలా కాలం నుంచి ఒక వస్తువుని ఇష్టపడడం విషయంలో మగవాడికి అధికారం ఉంటూ వస్తూంది. కాని ఇక్కడ అలాకాదు. సూర్యభాను నా పై కన్ను వేసి నన్ను పరీక్షిస్తోంది. బహుశా అనుకుంటోంది నేను నీకు ఇష్టం అవునా కాదా అని" - అని ఉడుకురక్తంతో పలికి లేచాడు.

"ఏం? స్వయంవరం రాజపుత్ర సంప్రదాయం కదా?"

"అవును స్వయంవరంలో ఎవరినైనా ఎంచుకోకపోతే అతడు బలాత్కారంగా ఆ స్త్రీని లాక్కుపోతాడు. అదీకాక, ఇక్కడ పోలిక ఏమిటి? ఒక కన్య స్వయంవరానికీ, ఒక షోకేళీ ఆడదాని (వితంతువు) యొక్క వినోద విలాసానికీ చాలా తేడా ఉంది".

ఆ పైన మెహర్‌బాన్‌ని నేనేం బలవంతం చేయలేదు. ఒక్కడినే పార్టీకి వెళ్లాను. ఆ సుందరి అక్షరాలా సూర్యభాను'. ఆమెను ఏమని వర్ణించను? నేను మీలాగ కవిని కాను. ఆ చీకటి రాత్రిలో ఫైర్‌వర్క్సు వెలిగించేసరికి ఆకాశమంతా జ్యోతిర్మయమయింది. అనేక రంగుల జ్యోతులు పైకి తళతళలాడుతున్నాయి. ఆ బాణసంచా గంధక విస్ఫోటపు కాంతులలో ఒక్కక్షణం గతాన్ని విస్మరించారు అక్కడ పోగయిన వాళ్లు. నిజానికి వాళ్లందరి దృష్టిలో ఆ 'సూర్యభాను' సూర్యోదయానికి ప్రతీకగా తోచింది. ప్రతి ఒక్కడికీ ఏదో కొంత మహత్తరమైన ఆత్మచైతన్యం కలిగింది ఆ సమయంలో. అద్దం ఉంటే అద్దంలో ప్రతిబింబం చూస్తే తెలుస్తుందేమో. ఆ ముఖం 'రాణీపసందు'ది అవునో కాదో!

ఆ తర్వాత ఎన్ని సార్లు ఆహ్వానం వస్తే అన్ని సార్లు ఆమె మహల్‌కి వెళుతూ ఉండేవాడిని. రాణీ పసందు కోసం కాదు. అటువంటి బాణాసంచా, తమాషా చూసేందుకు. కాని నాక్కూడా మెహర్‌బాన్‌ని తీసుకు వెళ్లడంలో ఇబ్బంది కలిగేది. అతనికి వెళ్లడం ఇష్టం లేదు, ఉండడం ఇష్టం లేదు, బదలీ చేయించుకుని పారిపోవడం ఇష్టం లేదు. అతని గర్వం అతణ్ని సూర్యభాను పార్టీలకు వెళ్లనిచ్చేది కాదు. అయితే అతని కుతూహలం అతణ్ని నిశ్చింతగా ఉండనిచ్చేది కాదు. అతని స్వధర్మ పరిపాలనా బుద్ధి అతణ్ని బదిలీ కోసం ప్రయత్నించ నిచ్చేది కాదు. అతని ఆందోళన నాకు అర్థమయింది. అతనితో అన్నాను: "నువ్వు సెలవు

తీసుకుని మీ స్వగ్రామం వెళ్లు. పెళ్లి చేసుకో" నిశ్శబ్దంగా విన్నాడు నా మాట. జవాబు చెప్పలేదు.

ఒక రోజు సూర్యభాను నన్ను అడిగింది: "సరే కాని, మెహర్‌బాన్ సింగు మీ మిత్రుడు కదా? ఆయన ఎందుకు రాడు ఇక్కడకు? ఆయన్ని మీరిక్కడకు తీసుకురాలేరా?"

నేనెల్లాగో మాట తప్పించుకున్నాను. నిజం చెప్తే ఏమవుతుంది? మన పాఠ్య పుస్తకాలు 'ఎప్పుడూ సత్యం పలుకు' అని ఉద్బోధిస్తాయి. అయినా, జరిగిన సంగతంతా మెహర్బాన్ కి చెప్పాను. అతను నా మాటలన్నీ విని, కర్తవ్య మూఢుడయ్యాడు. సంతసించాడో లేక కోపగించాడో ఏమో తెలియడం లేదు. నన్ను విడిచి బైటకు వెళ్లిపోయాడు.

తర్వాత సూర్యభాను ఇచ్చిన పార్టీకి మెహర్‌బాన్ హాజరయ్యాడు. నేను వాళ్లిద్దరినీ ఒకరికొకరికి పరిచయం చేశాను. అద్దం ఎక్కడ దొరుకుతుంది? దొరికితే ఒకటి ముందు పెట్టి చూపిద్దును. అయినా అప్పుడు దాని అవసరం ఉండేది కాదు. సూర్యభాను యొక్క కళ్లే ఒక అద్దం లాంటివి. ఆ నల్లటి అందమైన కళ్లు చూసేసరికి మెహర్‌బాన్ యొక్క ముఖం ఉప్పొంగింది. ఒకటి రెండు క్షణాలలో ఎంతో అగాధమైన ఒక సంఘటన ఘటిల్లింది. దాని భావం ఎవరూ గ్రహించలేరు. నేను అక్కడి నుంచి వెళ్లి పోయాను.

మెహర్‌బానును నేను అధోగతి నుంచి రక్షించదలిచాను. కానీ సహించలేకపోయాను. అతని ముఖం చూస్తే ఒక విధమైన వికారం ద్యోతకమయ్యేది. అతను ఒక యంత్రంలా పనిచేయడం మొదలు పెట్టాడు. తన డ్యూటీలు తను నిక్కచ్చిగా నిర్వర్తించే వాడు. నాతో మామూలుగానే కలిసి మెలిసి తిరిగేవాడు. అయినప్పటికీ అతని అంతరంగంలో ఏదో మార్పు స్పష్టంగా గోచరిస్తూనే ఉంది. అతనంతట అతను నాకేదైనా చెప్తే వినేవాడిని. నా అంతట నేను కలగజేసుకుని అతడిని ఏమీ అడిగే వాడిని కాదు. అతని మనస్సూ, శరీరం ఒక వ్యక్తి వైపే కేంద్రీకరింపబడ్డాయి. కాని ఆ మాట అతను ఒప్పుకోవడం లేదు. అనేవాడు: "నేను ఆమెను ద్వేషిస్తున్నాను. ఆమె శరీరం కలుషితమైనది. ఆమె సాంగత్యం దోష భూయిష్ఠమైనది. ఆమెకూ సానిదానికీ తేడా ఏమిటి? ఆవిడ డబ్బు తీసుకోదు, అంతే భేదం. నాకు అంతగా అవసరం అనిపిస్తే తిన్నగా ఒక భోగం దాని దగ్గరకు వెళతాను. అక్కడ నాకు కావలసిన కాలక్షేపం జరుగుతుంది. ఆమెకు డబ్బు ఇచ్చి ఆమెను అనుభవిస్తాను. సూర్యభాను ద్వారా ఎవరు దుఃఖితుడవడానికి సిద్ధ పడతాడు? నా కెవరైతే ఇష్టమో, వారికి డబ్బు ఇచ్చి అనుభవిస్తాను వాళ్లను. కాని నేనేమైనా 'రాణీపసందు'నా?"

ఇలాంటిదే ఏదో రోజూ రోజూ పిచ్చాపాటీ చెప్తూ ఉండేవాడు నాతో. అతని మనస్సులో ఏదో ద్వంద్వయుద్ధం జరుగుతోంది. అతనికేమీ మనశ్శాంతి లేదు. నాతో అంతా విప్పి చెప్పకపోయినా నాకు విషయం అంతా అవగతం అయింది. కాని నాకు అంతా తెలిసినట్లు మట్టుకు అతనితో నేను చెప్పలేదు. నేనన్నాను: "ఎవరూ నిన్ను అక్కడికి పంపించేందుకు ప్రయత్నించరు. నువ్వు అక్కడకు వెళ్లకపోతే ఇంతగా మనస్సు గాభరా పడేదికాదు. సూర్యభాను అందరికీ ఆహ్వానం పంపినట్లే నీకూ పంపింది. ఆమెకి ఎవరు పసందో ఎవరు కాదో పైకి ఎలా తెలియజేస్తుంది? దానికి కొన్ని గుర్తులుంటాయి. చాలా రాత్రులు ఆమె బండి వచ్చి ఒక సంకేత స్థానంలో నిలిచి ఉంటుంది. ఎవరినో ఒకరిని లేవదీసుకుని మాయమవుతుంది. ఎవరైనా గుర్తుపట్టారని అనుమానం కలిగితే తర్వాత మరొక చోటుకి సంకేత స్థానం మారుస్తుంది".

"దుర్మార్గపు ఆడవాళ్లు! దౌర్జన్యపు ఆడవాళ్లు!" అని తిట్లు మొదలు పెట్టాడు మెహర్‌బాన్. "దొంగ ఆడవాళ్లు! పిశాచపు ఆడవాళ్లు!" అలాగే ఇంకేవేవో వినరాని తిట్లు తిట్టాడు.

నేను జవాబు చెప్పాను:"నిన్నెవ్వరూ బాధించలేదు. నువ్వేమిటి ఇటువంటి చవకబారు మాటలు మాట్లాడుతున్నావు? ఈ పద్ధతి ఏమంత సభ్యంగా ఉంది?"

కొన్నాళ్ల తర్వాత అతనన్నాడు:"నేనో రోజుని అన్నానే అన్నీ సంజ్ఞల ద్వారా సిద్ధమవుతుందని? బజారులో తిరగే ఒక భోగం దాన్ని పొందాలి. అలాంటిది ఒకర్తె సంజ్ఞచేసింది". నేనన్నాను: "నువ్వేమంటున్నావు? నువ్వలాంటి పనిని నిజంగా చేయలేదు కదా!"

"నేను అటువంటి చోట్లకు వెళ్లడమా! అసంభవం! నా పేరు మెహర్‌బాన్‌సింగు. నేను చౌహాను రాజపుత్ర వంశానికి చెందిన వాడను. పరిస్థితుల ప్రభావం వల్ల ఈ మిలిటరీ పని ఒప్పుకోవలసి వచ్చింది. నేను అధోగతి పాలవుతాననుకుంటున్నావా? ఆఖరికి నువ్వు కూడా నన్ను అపార్థం చేసుకుంటున్నావా? పైగా నువ్వేదో రాథోడ్ వంశానికి చెందినవాడివి అనుకున్నాను!"

ఇంకేం చేయగలను? మాట్లాడకుండా విన్నాను. అతగాడు ఆ రోజుకారోజు మతి తప్పిన వాడిలా ప్రవర్తించాడు. అతని మనస్సు ఏం వాంఛిస్తుందో అదే తలపెట్టుకున్నాడు. ఆహా, ఆ సౌందర్యవతి యొక్క ఆకర్షణశక్తి ఎంత దుర్వార్యమైనది! ఈ పాపిష్టి స్త్రీలు వాళ్లకెవరు నచ్చితే వాళ్లతో తిరుగుతారు. ఇనుముని అయస్కాంతం ఆకర్షించినట్లే కదా!

నా కిదంతా చూస్తుంటే ఏమీ బాగుండలేదు. మెహర్‌బాన్ ఒక వలలో చిక్కుకున్నాడు. వశీకరణ విద్య ఏదో ఉందంటారే, దానిలో నాకు నమ్మకం

ఒకప్పుడు ఉండేది కాదు. కాని క్రమంగా ఇప్పుడు నమ్మకం కలిగింది. మెహర్‌బాన్ నా ప్రక్కన ఉంటున్నాడు. అతని నడతను పరిశీలించాను. రాత్రి 10 గంటలకు బైటకు వెళ్లడం రాత్రంతా తిరగడం. ముఖం చూస్తే వికారంగా ఉండడం. పిచ్చివాడిలా కనుపించడం. మాటలలో నిలకడలేదు. ఆ మాటలు కూడా అర్థరహితమైనవి. ఒక్కొక్కప్పుడు ఏమేమి తిట్లు తిడతాడో తెలిసేవి కావు. అదంతా బూతుల బుట్ట. లెక్కపెట్టి చూస్తే ఆ అశ్లీలాల సంఖ్య దినదిన ప్రవర్ధమానంగా ఉంది.

అతని ఇంటికి కబురుపెట్టి పెద్దవాళ్లను పిలిపించనా? అని అనిపించింది. ఇక్కడి నుంచి పెద్ద దూరమేం కాదు. అన్నీ చక్కగా జరగవలసినవి జరగలేదు. అతని ఈ దుష్టబుద్ధి ఒక చక్కని స్త్రీని వివాహం చేసుకుంటే పోతుందనిపించింది. తర్వాత సియాల్‌కోట నుంచీ బదిలీ అయి లాహోరో, అమృత్‌సరో, వెళ్లిపోతే సూర్యభాను యొక్క ప్రభావం మతాబు వెలిగి ఆరిపోయినట్లు పోతుంది. కాని మెహర్‌బాను తాలూకు పెద్దవాళ్లకి కబ్బురుపెట్టే ధైర్యం లేకపోయింది, నాకు. ఒకవేళ అతనికి కోపం వస్తే! మానవులు ఎటువంటి మందస్వభావులంటే కోపం వస్తే ప్రపంచ జ్ఞానం మర్చిపోతారు.

ఆపైన సూర్యభాను ఇచ్చే ప్రతి పార్టీకి అతడు వెడుతూండేవాడు. వాళ్లకీ, అప్పుడు చూపులతోనే మాటలు. కొన్నాళ్ల తర్వాత నేను పారేడ్‌కి వెళ్లేందుకు బట్టలు మార్చుకుంటుంటే మెహర్‌బాన్ సింగు వచ్చి అడ్డుపెట్టాడు. అతని ప్రతి అంగంలోనూ ఒక విజయోల్లాసం ప్రస్ఫుటమవుతుంది. అయినా విషాద యోగంలో ఉన్నట్లే పలికాడు:

"నేను చనిపోయాను" అని.

నాకు ఆ మాటల భావం అవగతమయింది కానీ ఏదో హడిలిపోయినట్లు అడిగాను: "ఏం, ఏమయింది?"

"నేను 'రాణీ పసందు' అయిపోయాను", అని దీనస్వరంతో పలికాడు.

"హూం", నేను గంభీర స్వరంతో అన్నాను:"మంచి పని ఏం జరగలేదు. ఇందుకు నిదర్శనం ఏమిటంటే నువ్వు పారేడ్ ఎగగొట్టేశావు. ఇల్లాగయితే నీ ఉద్యోగం నిలబెట్టుకోలేవు".

అతను ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు: "నేను నిస్సహాయుడను. నా కర్మ నన్ను ఎక్కడికో ఈడ్చుకు పోయింది. నువ్వు నా స్నేహితుడివి; నా కొక సలహా ఇవ్వగలవా?"

"ఏం సలహా" అతని మీద సానుభూతి వల్ల నా హృదయం దుఃఖించింది.

"నేను ఖరీదు ఇవ్వదలచుకున్నాను" వణకుతూ వణకుతూ అన్నాడు:

"ఇవ్వకపోతే నేను బానిస నయిపోతాను. నా గౌరవ ప్రతిష్ఠలు భంగమై పోతాయి"!

నేను గ్రహించుకుని అన్నాను: "ఆమెకేం లోటుంది- నీ దగ్గర డబ్బు తీసుకునేందుకు? ఆమెకు నీవు 50 రూపాయిలిస్తే ఆమె నీకు 5 వేల రూపాయలివ్వ గలదు".

"నేను లక్ష రూపాయిలిస్తాను", అని ఉత్తేజితుడై అన్నాడు: "కాని లక్ష రూపాయిలెక్కడ నుంచి వస్తాయి? ఎవరి ధనాగారంపై దోపిడీ చేయను? ట్రెజరీ నుంచి లూటీ చేస్తే ఎలా ఉంటుంది?"

అతని మాటల కొక్కసారి ఉలిక్కిపడ్డాను. ఆ రోజునే అతని ఇంటికి ఒక ఉత్తరం వ్రాసి కవరులో పెట్టి పంపాను. దాని పై కట్టుదిట్టంగా కాపలా కాసేలా చూశాను - త్రోవలో ఎవరూ దొంగిలించకుండా. పారేడ్ ఎగ గొట్టేందుకు డాక్టరు దగ్గరకు వెళ్లాడు అతను. అతణ్ని హాస్పిటలు లో చేర్చుకునే ఏర్పాటు డాక్టరుతో చేసి వచ్చాను. అయితే అసలు సంగతంతా ఆయనకు చెప్పలేదు..

మెహర్‌బాన్ యొక్క పెద్దన్నగారు అతణ్ని ఇంటికి తీసుకువెళ్లేందుకు కంగారు పడుతూ వచ్చాడు. సెలవు దొరక్కపోతే మెహర్‌బాన్ ఎక్కడికి వెళ్లగలడు? సెలవుకోసం అప్లికేషను పెట్టడం అయింది. ఆ సెలవు మంజూరు అయ్యే వరకూ ఓపిక పట్టాలి. ఇంతలో ఒక విచిత్ర సంఘటన జరిగింది. ఒక రోజు తెల్లవారు ఝామున లేచేనరికి మెహర్‌బాన్ సింగు మాయమయిపోయాడన్న కబురు విన్నాను. విచారించి చూడగా సూర్యభాను కూడా పరారీ అయిందని తెలిసింది.

పట్టణమంతా ఈ పుకారు విని సిగ్గుపడింది. సూర్యభాను యొక్క భక్తులంతా ఒకళ్లతో ఒకరు అన్నారు: "ఒక క్షణికమైన మోహం కొరకు జీవితమంతా మట్టిపాలు చేసుకుంది" అని.

కేవలం నలుగురైదుగురు మట్టుకు చమత్కారంగా అన్నారు: "రాజకన్య అర్ధరాజత్వం పొందితే, మేమూ మాయమైపోయేవాళ్లమే! అయినా సూర్యభాను ఏమీ తెలివితక్కువది కాదు. అతను ఎంత గొప్పవంశంలో పుట్టాడో, అంత అందగాడు, పెద్దమనిషి".

నా మనస్సు బాగా వికలమయింది. అతని పెద్దన్న ఏడుస్తూ ఏడుస్తూ ఎక్కడెక్కడికి వెతుకుతూ తిరిగేవాడో అక్కడక్కడికి అతనితో కూడా కొంత దూరం వెళ్లే వాడిని. అతను అన్నాడు: "విధి!" నేనన్నాను "కిస్మత్"! మనం హిందూ ముస్లిములం ఒకే అభిప్రాయం గలవాళ్లం ఎవరి కర్మ ఎల్లా ఉంటే అల్లా జరుగుతుందన్న విషయంలో.

నెలపై నెల గడుస్తోంది. మెహర్‌బాన్ ఆచూకీ ఏం దొరకలేదు. ఈ ప్రక్క

సూర్యభాను ఇల్లంతా అంధకారమయం. ఆమె నౌకర్లు ఆమె ఎక్కడ ఉందో తెలియదన్నారు. నేను నా డ్యూటీలో నిమగ్నుణ్ణయ్యాను.

ఒక ఏడాది గడిచాక మెహర్‌బాన్ యొక్క చిరునామా దొరికింది. అతను అప్పుడు అజ్మీర్‌షెరిఫ్‌లో ఉన్నాడు. నాకు ఉత్తరం వ్రాశాడు: అజ్మీరు తీర్థయాత్ర చేసేందుకు రమ్మని. సెలవు పెట్టి నేను అజ్మీరు వెళ్లాను, అతను నా సలహా కోరుతున్నాడేమో అని. మెహర్‌బాన్ నన్ను తన క్వార్టర్సుకి తీసుకు వెళ్లాడు. చూసే సరికి వాళ్లిద్దరూ సుఖంగా ఉన్నారు. భార్య రూపంలో సూర్యభాను చాలా బిడియం ప్రదర్శించింది. నా ముందు సగం పరదాలో కనుపించింది.

మెహర్బాన్ చెప్పిన సంగతి చెప్తున్నాను.

సియోల్‌కోట నుంచి పారిపోయాక వాళ్లు చాలా చోట్లు తిరిగారు. ఎక్కడికి వెళ్లినా వాళ్లని ఒకటే ప్రశ్న వేసేవారు. "మీ పరిచయం ఎటువంటిది? మీరు భార్యా, భర్తలేనా? దీనికి సూర్యభాను జవాబు చెప్పేది: "అవును" అని కాని మెహర్‌బాన్ నోరు మూతపడే ఉండేది. అతని నోటి నుంచి ఎప్పుడూ కూడా వాళ్లు మొగుడూ, పెళ్లాం అన్నమాట వెలువడలేదు. కేవలం అసత్యమని కాదు, అప్రియమైనది కూడా ఆ మాట అతనికి. అయితే అటువంటి సంబంధం నిరూపించలేకపోతే ఒక ఇల్లు అద్దెకు దొరికేది కాదు, నౌకర్లు దొరికే వారు కాదు, ఎటువంటి సాంఘికమైన సాహాయ్యం లభించేది కాదు. అలాగే ఉండిపోతే బజారు రకమై పోయినట్లేగా! అటువంటి ప్రస్తావన వస్తే సూర్యభానుకి వళ్లు మండేది. ఆమేం తక్కువ గర్వం గలది కాదు. ఆమె ఏమైనా పణ్యాంగన కనకనా?

తరువాత వాళ్లెక్కడికి వెళ్లినా వాళ్లిద్దరికీ పెళ్లి అవలేదన్న సంగతి అందరూ గ్రహించారు. ప్రపంచంలో ఒక రకం యువకులు సమాజం నుంచి తమ హక్కులను పూచీ లేకుండా పొందదలచుకుంటారు. కాని సౌందర్యం ఎటువంటిది అంటే, తన పూచీ తను నిర్వర్తించకుండా ఎవ్వరూ దాన్ని అనుభవించడం సమాజానికి ఇష్టం ఉండదు. అటువంటి వాళ్లను సంఘం బెత్తలతో కొట్టి తరిమి వేస్తుంది. పోలీసులతో ఏదైనా కంప్లెయింటు చేసేందుకు వెళ్తే, వాళ్లు 'మీ ఇద్దరికీ వివాహం అయినట్లు ఋజువు ఏమిటి " అని అడుగుతారు. లేకపోతే వాళ్లకి చాలా పెద్ద లంచం ఇవ్వాలి. మెహర్‌బాన్ యొక్క అభిప్రాయం ఏమిటంటే ఏ వస్తువు నైనా అనుభవించాలంటే దాన్ని కేవలం స్వాధీనం చేసుకుంటే చాలదు; దాన్ని అనుభవించేందుకు తగ్గ అర్హతా, శక్తీ ఉండాలి అని. అందుచేత సూర్యభాను తనకు చట్టబద్ధమైన భార్య అని ఋజువు చేసేందుకు ప్రయత్నించాలి అనుకున్నాడు.

రాజపుత్రుల బిడ్డ. వైశ్యుని ఏతంతువుని ఎలాగ పెళ్లి చేసుకోవడం? ఒక వేళ

ఆమె పతివ్రతా స్త్రీ అయితే! గుండె పగిలేలా దుఃఖం ఉబికి వచ్చింది. సిగ్గుతో తల వంచుకున్నాడు. ఇంక మట్టిపాలవవలిసి నదేనా తన జీవితం? మెహర్‌బాన్ గ్రహించుకున్నాడు ఇంక ఈ విధిని తప్పించుకుని పోవలసిన వేరే మార్గం లేదని. ఉద్యోగం మళ్లీ దొరికే అవకాశం లేదు. స్వగ్రామం తిరిగి వెళ్లి వ్యవసాయం చేద్దామంటే పగలూ, రాత్రీ తన పెద్దల యొక్క తిరస్కార భావం తనని బాధించక తప్పదు. మరి తన్నిప్పుడు ఎవ్వరు పెళ్లి చేసుకుంటారు? పెళ్లి చేసుకోకుండా స్త్రీ సాంగత్యం పొందేందుకు ఉపాయం ఏమిటి? అయితే ఈ వయస్సులో సన్యసించ వలసినదేనా?

ఒకవేళ పారిపోకపోతే, ఇక రెండే తనకు మార్గాలు మిగిలాయి. పెళ్లి అయినా అవ్వాలి, లేక ఆస్తి పంచుకోవాలి ఈ రెండింటి విషయంలోనూ మెహర్‌బాన్‌కి ఇష్టంలేదు. ఇక సూర్యభాను మాట? మెహర్‌బాన్ యొక్క నమ్మకం ఏమిటంటే ఆమెకు ఆ రెండు మార్గాలూ సమానమేనని.

బ్రతికి ఉండగా అతనికి ఆస్తి పంచుకోవడం ఇష్టం ఉండదు. అంతకంటే మరణమే మేలు. ఇకపోతే ఆవిడతో వివాహం చేసుకోవాలి. పెళ్లిమాట ఎత్తేసరికి అతని కళ్లల్లో ఒక వరద ఉత్పన్నమౌతుంది; అతని హృదయంలో 'హాహా'కారం స్పందిస్తుంది. అతని వంశ గౌరవం, అతని పౌరుషం, అతని వైయక్తిక మానాభిమానాలూ, అతని నీతి నియమాలూ అతణ్ని ఒక విషమ సంకటంలో పడేసి అతణ్ని పీడిస్తున్నాయి.

బలవత్తరమైన పరిస్థితికి లొంగవలసి వస్తే తప్ప అతను తన పేరు ప్రతిష్ఠలకు భంగం కలిగే విషయం గురించి ఆలోచించడు. అయినా పెళ్లి! ఒక కులటతో, ఒక కోమటి దానితో, ఒక అసాధ్వితో నా పెళ్లి! ఆస్తి పంచుకోకుండా ఉండేందుకు రాజీ పడ్డాడు. వాటాలు లేకుండా అంతా నిర్విఘ్నంగా అనుభవించవచ్చు. వాటాలు పంచుకోకపోతే, పూర్తి సత్వం, సంపత్తి కలిగినదై ఉంటుంది కదా ఆస్తి. పెళ్లి చేసుకున్న తర్వాతనే, ఒక తీర్పు జరుగుతుంది, ఆమె 'పర్దానశీన్' (తెరచాటునున్న ఘోషా స్త్రీ) అవుతుంది.

సూర్యభాను ఈ విషయాలేమీ అతనితో చర్చించలేదు. కాని పెళ్లి విషయంలో ఆమెకి మనస్సులో ఒక కృతార్థత ప్రకటితమయింది. ఒక రాజపుత్రునితో వివాహం అంటే ఆమె చిన్ననాటి కల నిజమవడమే. ఇటువంటి అసాధారణ సంఘటన సఫలమయితే భార్యగా కొంచెం ఇబ్బంది పడవలసి వచ్చినా ఆమేకేమీ ఫరవాలేదు.

తన భార్య పర్దా స్వీకరించాక మెహర్బాన్‌కి కొంచెం బెంగ తగ్గింది. ఇక తన జీవనోపాధి గురించి ఏర్పాట్లు చేయాలి. అందుకోసం పంజాబు విడిచి వెళ్లడం

గురించి నిశ్చయం చేసుకున్నాడు. ఎక్కడైతే దొంగచాటుగా బ్రతకనక్కర లేదో, ఎక్కడైతే తమ యొక్క నిజ స్వరూపాన్ని సులభంగా తెలియజేసుకోవచ్చో అక్కడికి పోవాలనుకున్నారు. అలా తిరగ్గా తిరగ్గా అజ్మీరుకి చేరుకున్నారు. అతని యుద్ధ కాలపురికార్డు చూపించి రైల్వే లో ఉద్యోగం సంపాదించుకున్నాడు. జీతం ఏమంత ఎక్కువ కాదు. ఏదో కూడుకూ, గుడ్డకూ లోటుండదు.

కాని ఇక్కడ కూడా ఒక క్రొత్త సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. రైల్వే ఉద్యోగం మూలాన నెలలో ఎక్కువ రోజులు ప్రయాణంలో గడపాలి. భార్యను కూడా తీసుకు వెళ్లడం కష్టం. ఒకర్తెనూ ఇంట్లో విడిచి పెట్టి వెళ్లడం అంటే కొంచెం చింత కలుగుతుంది. ఇంకా మరొక విషయం: రాత్రి కాపలా లేకపోతే, ఇంట్లో ఎవ్వరూ లేకపోతే, ఆ అవకాశం తీసుకుని దొంగలు ఇంటికి కన్నం వేసి పట్టుకుపోతారు ఆ అమూల్యమైన *'మాణిక్యాన్ని'. దొంగతనం తను ప్రయాణంలో ఉండగా జరుగుతుందేమో కాబట్టి దాన్ని గురించి ఊహించి ఎవరు చేసారా అని చెప్పలేడు. ఆ 'కాతా' గురించి వ్రాద్దామంటే "బంగారు వస్తువులూ, బట్టలూ, వంటపాత్రలూ అన్నీ దొంగిలించబడ్డాయి", అని వ్రాయాలి. అసలు 'దొంగతనం' గురించి వ్రాయాలంటే వీలు లేదు గామరి. దొంగతనం వల్ల నష్ట పడినవాడు ఇల్లు విడిచి ప్రయాణంలో ఉంటాడు కదా.

అయితే ఇప్పుడు మెహర్‌బాన్ ఏం చేయాలి? ఇల్లు చక్కబెట్టుకోలేక బైట చక్కబెట్టడం, భార్యను దగ్గర ఉంచుకోలేకపోతే ఉద్యోగం ఉంచుకోవడం ఇలాంటి సందిగ్ధ పరిస్థితి అతణ్ని ఎదుర్కుంది. సూర్యభానుకి ఇలాంటి సమస్య ఏమీ లేదు. ఆమెను చూస్తే ఆమె ఒక విధమైన నిలకడ సంపాదించుకుందని తోస్తోంది. ఆమె రాజపుత్రుని గురించి కలలు కన్నది, రాజపుత్రుణ్ని పొందింది. కాని మెహర్ బాన్ ఆమెను అంత ఇదిగా వాంఛించాడా? ఆమె కల వంటి కలనే అతడూ కన్నాడా?

ఇటువంటి పరిస్థితిలో ఉండగా నా సలహా పొందేందుకు అజ్మీరు పిలిచాడు.

అతడు పెళ్లి చేసుకున్నాడని విని నేను నిజంగా సంతోషించాను. నేను ముస్లిముని; నాకు ఇటువంటి సంసారపు సమస్యలు ఏమీ లేవు. మెహర్బాన్ కోపగిస్తాడేమోనని నేను మొట్టమొదట ఏం సలహా ఇవ్వలేదు. ఈ విషయంలో నా ఉద్దేశంలో నన్ను అడగకుండానే అతను చేసిన పని బాగానే చేశాడని. కానీ అతని ఈ అసూయతోనూ, పిరికితనంతోనూ కూడుకున్న భావాలను నేను అర్థంచేసుకో లేకపోయాను. నిజానికి అతని సంశయబుద్ధి పింకితనమే.ఎవరితోనైతే జీవితం

---

* సూర్యభాను యొక్క శీలం శంకించబడుతోంది.

అంతా దాంపత్య విధానంగా గడపదలచుకున్నాడో ఆమె గురించి మాటిమాటికి ఇటువంటి అపనమ్మకపు ఆలోచనలు పెట్టుకోవడం న్యాయమేనా?

నా భావం తెలుసుకుని మెహర్బాన్ ఇలా అన్నాడు: "ఈవిడుందే, ఈవిడ చెప్పలేనంత అందకత్తె. ఆమె ఇంత భయానకమైన సౌందర్యవతి కాకపోతే నాకు అనుమానాలు ఉండేవి కావు. అందకత్తె కాకపోతే ఆమెను నమ్మడం సులభమే".

ఆమె సౌందర్యం గురించి అతనికి ఉన్న బెంగ ఇప్పుడు అర్థమయింది. అయినా ఈ బెంగ వల్ల నష్టం ఎవరికి? ఎందుగురించి ఈ బెంగ? ఏడుగురైనా, ఎనిమిది మందైనా పిల్లలున్నారనా? లేకపోతే చికిత్స చేయడానికి క్లిష్టమైన సుఖరోగం ఏదైనా ఉందనా? యౌవనం గడిచి పోతుందనా? కాని ఇవన్నీ చాలా ముందెప్పుడో జరిగే విషయాలు. సూర్యభాను మా ఇద్దరికీ సమాన వయస్కురాలు. వయస్సుముదరకుండానే ఆమె ముసలిదై పోతుందను కునేందుకు అవకాశం లేదు.

నేను అన్నాను: "భాయీ, ఏమయినా అను: 'స్త్రీ కురూపి అవ్వాలి" అని మటుకు కోరకు. నీ ఇష్ట దేవత ఎవరైనా నీ ప్రార్థన సఫలంచేసి నట్లయితే అప్పుడు నీకే ఈ ఆందోళన తెలిసి వస్తుంది".

అతని మతి స్థిరంగా లేదని స్పష్టమయింది. ఆమెపై ఏదైనా ఆసిడ్ చల్లి ఆమెను అందవిహీను రాలిని చేస్తాడా అనిపించింది! అలాంటిదేదో ఆకస్మికమైన సంఘటన జరుగుతుందేమో! నేను గట్టిగా గొంతు సవరించుకున్నాను నెమ్మదిగా తల ఎత్తి అన్నాను: "అల్లాగైతే నువ్వు విడాకులిచ్చెయ్యి. లేకపోతే ఒడంబడిక ద్వారా వేరువేరుగా ఉండి పోండి".

అతను ఆ మాట ప్రస్తావించాడు. అన్నాడు: "పోలీసు ఉద్యోగంలో ఉండిపోయినట్లయితే జీతం, పెన్షను కలిపి నేను కొన్ని లక్షల రూపాయిలు సంపాదించి ఉందును. తీసెయవలసిన ఖర్చులు అన్నీ తీసేశాక, నాకు ఒక లక్ష రూపాయిలు మిగిలాయి. అవి ఆమెకు వివాహపు కట్నంగా ఇచ్చేశాను. ఆ సొమ్ముకి ఏ విధమైన రసీదు లేదు నా దగ్గర. ఇప్పుడింక ఎవరికి విడాకుల్విను? ఎవరినుంచి వేరు పడనూ విధి నన్ను ఆమెతో వీడిపోని సూత్రంతో బంధించి వేసింది".

హఠాత్తుగా నాకొక ఆలోచన తట్టింది. అన్నాను:"ఆమె నీ లక్ష రూపాయిలూ నీకు వాపసు చేస్తే ఆమెను విడిపోనిస్తావా?"

మెహర్బాన్ ఒక్కసారి గాభరా పడినట్లు ముఖం పెట్టేశాడు. ఊరికే నా వైపు వెర్రిగా చూస్తూ ఉండిపోయాడు కొంతసేపు. ఏమి ఆలోచిస్తున్నాడో అతనికే తెలుసు! అన్నాడు: "వేళాకోళం చేస్తున్నావా!"

"కాదు వేళాకోళం కాదు". అని ఇంకా గట్టిగా నొక్కి చెప్పాను: "ఇదొక్కటే ఈ సమస్యకు పరిష్కారం".

మెహర్బాన్ దీన స్వరంతో అన్నాడు: "నువ్వు ఆ మాట కనక ఆవిడితో అన్నావంటే, ఆ లక్ష రూపాయల నోట్లు చింపి అవతల పారేస్తుంది. అప్పుడు నేను ఆమెకు పూర్తిగా అమ్ముడయిపోతాను. రాణీ పసందు"!

అతని మనసులో మాట ఏమిటంటే: సూర్యభాను అతనికి యజమానురాలు కాకూడదు, తనే ఆమెకు యజమాని అవాలి. ఆ తర్వాత ఆమె సౌందర్య వతి అయిన నాయకురాలు కాకూడదు, కురూపిణి అయిన పెళ్లి కూతురు అయి ఉండాలి. అలాగయితేనే అతనికి చీకూ, చింతా ఉండదు. కాని ఈ మాట సూర్యభానుతో నేరు తెరిచి చెప్పలేదు...

ఖాజా సాహేబుగారి మసీదులో కానుక చెల్లించేందుకు నేను అజ్మీరు వెళ్లి తిరిగి వచ్చాను. కొన్నాళ్ల తర్వాత సూర్యభాను ఇంట్లో దీపాలు వెలగడం నిర్ఘాంతపోయి చూశాను. ఏం జరిగింది? ఏమయింది? రాణీ తిరిగి వచ్చేసిందా? ఇంకెవరైనా వచ్చారా? లేదు, ఇంకెవ్వరూ రాలేదు.

3

(ఖాన్‌బహాదూర్ ఇంకా చెప్పడం మొదలు పెట్టాడు): "ఆ తర్వాత నాకు మెహర్బాన్ కనుపించలేదు. అతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు. పంజాబు నుంచి నేను బెంగాలుకి బదిలీ అయాను. అంటే నిక్కచ్చిగా బదలీ కాదు, ఒక సీక్రెట్ సర్వీసులో నియమించబడ్డాను. తర్వత ఈ ప్రాంతానికి వచ్చేశాను. నాకు తెలిసినంత మట్టుకు ఈ కథ పూర్తి అయింది"....

"ఇది పూర్తి అయిందా"! నా కంఠం నుంచి కుతూహలంగా వెలువడింది: "లేదు, లేదు, ఇంకా చెప్పండి తర్వాత ఏమయింది? సూర్యభాను ఏమయింది? మెహర్‌బాన్ ఏమయ్యాడు?"

లాంచి నీటిలో కటకటలాడుతూ నడుస్తోంది. నీటి బిందువులు ఎగిరి వచ్చి నా శరీరంపై పడుతున్నాయి. కొంతసేపు టీ తీసుకున్నాము. డిన్నరుకు ఆర్డరిచ్చాను. ఖాన్ బహాదూర్ నా అతిథి.

"ఇంకేముంది. బాబా చెప్పాలంటే సుఖం లేదు. ఈ లోకం చూడగా చూడగా ఏసిగెత్తి ముసలి వాణ్ణయి పోయాను. కాని ఆ రోజుల్లో తెలుసుకోలేక పోయాను. అందుకే నిర్వీణ్ణున్నయి పోయాను".

"ఏమిటి? ఏమిటి?" నా కుతూహలాన్ని అదుపులో పెట్టలేకపోతున్నాను.

"ఏముంది? అతగాడు నిజంగానే ఆమె ముఖంపై ఆసిడ్ చల్లేశాడు. ఒక చుక్క చెక్కిలి పైనే మెడపైనే- పడింది. అందు మూలాన ఇంక సూర్యభాను పార్టీలు

ఇన్వదు. ఎక్కడికీ బైటకు వెళ్లదు. అయితే, మరేం పెద్ద గాయం తగల లేదు. సూర్యభాను దగ్గర ఒక లక్ష రూపాయిల విలువ గల ఆభరణాలున్నాయి. అవన్నీ మెహర్‌బాన్ చేతిలో పడేసి ఒక్క పరుగున స్టేషనుకి వెళ్లిపోయింది. అటుపైన తిన్నగా సియాల్ కోటకు వచ్చేసింది"!

నాకు అసహ్యంపుట్టి చేతులతో చెవులు మూసుకున్నాను. తర్వాత వినాలన్న సరదా పోయింది.

"వస్తువులు చేతిలో పడేసరికి మెహర్‌బాన్ చాలా వ్యాకుల చిత్తుడైపోయాడు. కూడా పరిగెత్తి వెళ్లి ఏం చేయగలడు? రెండింటిలో ఏది ఎక్కువ మూల్యమైనది – ఆభరణమా? ఆడదా? సమయం వచ్చేసరికి, ఆభరణమే!" కాన్‌బహాదుర్ ఏదో బాధతో అలా అన్నాడే కాని, నా మనస్సుకి అతను స్త్రీ పైననే సానుభూతి కలవాడని తోచింది. చేతుల వ్రేళ్ల మధ్య కొంచెం ఖాళీ చేసాను.

కాని అదే నా పొరపాటు.

అంతా చీకటి వ్యాపించింది. గమ్యస్థానం చేరడం ఆలస్యం అయింది. భోజనానికి కూడా ఆలస్యం అయింది. కథ అంతా పూర్తి అయిపోయింది. నేను ఇక ఎందుగురించి అలా ఉండిపోవడం? చెవుల పైనుంచి చేతులు తీసేసాను.

ఖాన్‌బహాదుర్ అన్నాడు: "జరిగిందేదో జరగవలసినట్లే జరిగింది మహాశయా! ఏదో కొంతలో తేలిపోయింది వ్యవహారం. ఇటువంటి సంఘటన మరెక్కడా జరిగినట్లు చూడలేదు. అలాగ ఉండిపోతే ఒక రోజున మెహర్‌బాన్ ఆమెను ఖూనీ చేసి ఉండును. సౌందర్యవతి ఎప్పుడు చంచలంగానే ఉంటుంది కదా. ఒకరోజు కాకపోతే మరొక రోజున ఏదో విధంగా ప్రాణం తీసేయవలసిందే. ఈ విధంగా బ్రతికిపోయారు. ఆసిడ్ చుక్క వల్ల ముఖంపై పడ్డ మచ్చ ఉంది చూశారూ, అది ఒక పాప పరిహారం అనుకోండి".

నేనేం మాట్లాడలేదు. 'పాపం' విషయంలో నాకేమీ నమ్మకం లేదు. పైగా, పాపికి శిక్ష మరొక పాపి విధించడం నాకేమీ నచ్చలేదు. మెహర్‌బాన్ ఏమీ తక్కువ పాపాత్ముడు కాదు.

"ఆలోచించి చూడండి", ఖాన్ బహాదూర్ ఇంకా చెప్పడం మొదలుపెట్టాడు. "స్త్రీకి ఏమంత భంగపాటు కలిగింది! నిజానికి నష్టం మొగవాడిదే. ఈ ఆభరణాలు అతనికేం నష్ట పరిహారం కలగజేయలేవు కదా! ఆ నష్టం పరిహరించడానికి వీలులేనిది. అతను ఉద్యోగంలో ఉండిపోతే డి.ఐ.జి. యో లేక ఐ.జి యో అయి ఉండేవాడు. అయ్యో కర్మ! విధివ్రాత ఎలా ఉందో అలా జరిగింది. ఇంక ఆ రైల్వే ఉద్యోగం అయినా నిలబెట్టుకున్నాడా? ఆ లక్ష రూపాయిల వస్తువులు పొందే సరికి అతని బుర్ర తిరిగింది. ఆ వస్తువులు కన్యాశుల్కంగా ఇచ్చి పెళ్లి

చేసుకున్నాడు — రాజపుత్ర స్థానం లోని ఒక ఉన్నతమైన కుటుంబంలో పిల్లని. అతన్ని వాళ్లు ఆంగ్ల ప్రభుత్వపు ఉద్యోగం చేయనీయ లేదు. ఏదో సామంత రాజుల సేనలో చేర్చారు అతణ్ని.

అందులో పదవి తప్పితే ఇంకేం పని ఉంది, మహాశయా!"

నేను నిశ్శబ్దంగా ఊరుకున్నాను. ఏమనడానికీ మాట తోచలేదు.

"ఇప్పుడు మన ఇన్స్పెక్టర్ ఏమయ్యాడో చూడాలి. ఇతను కూడా ఒక 'రాణీ పసందే'. అమ్మాయి ఏమంత అపురూప సుందరి కాదేమో! సౌందర్యవతి అయితే పెద్దదవుతుందనడంలో ఆశ్చర్యం ఏముంది? ఎవర్తె ఎంత ఎక్కువ పెద్దదయితే అంత సౌందర్యవతి!" అని ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు ఖాన్ బహాదుర్.

---

(1953)

# జాడ తెలియదు

ప్రేమేంద్ర మిత్రా

ఆ రోజు వాతావరణం చాలా ఖరాబుగా ఉంది. చలి, ఆకాశంలో మబ్బులూ, అంతా ఎంత చిరాకుగా ఉందంటే ఏమీ తోచడం లేదు. వర్షం పడడం వల్ల అదేం కాదు. కానీ, ఆ మేఘావృతమైన ఆకాశం, ఆ గజిబిజిగా ఉన్న నేలా, అదంతా చూస్తూ ఉంటే ఒక శవంలా అసహ్యంగా కనుపిస్తోంది.

సోమేశ్ కనుక హఠాత్తుగా వచ్చి ఉండకపోతే మధ్యాహ్నపు వేళ ఎంత కష్టంగా గడిపి ఉండేవాడినో చెప్పలేను. అయితేనేం సోమేశ్ ఎల్లాగో రానే వచ్చాడు.

వార్తాపత్రిక ఒకటి రెండు సార్లు తిరగా మరగా వేసి సోమేశ్ ముందు పడేసి, అన్నాను: "ఒక ఆశ్చర్యకరమైన సంగతి గమనించావా?"

"ఏమిటి?"

"ఈ వేళ పేపరులో ఒక్కసారి ఏడుగురు మాయమైపోయినట్లు ప్రకటన".

సోమేశ్ ఏవిధమైన కుతూహలం ప్రదర్శించలేదు. ఊరికే సిగరెట్టు కాలుస్తూ ఉదాసీన భావంతో కూర్చుండి పోయాడు. నిశ్శబ్దంగా ఉన్న ఇంటిలో ఆ సిగరెట్టు పొగ పాములా వంపులు తిరగుతూ, కప్పు పైకి పోతుంది. ఏమీ ఎక్కడా అలికిడి లేదు. బైట ఉన్న వాతావరణ మాంద్యం నా మనస్సుపై ప్రతిబింబిస్తోంది.

ఆఖరికి ఎలాగోలాగ ఈ వ్యాకులకరమైన నిస్తబ్ధతను తొలగిద్దామని ఇలా మాట్లాడటం మొదలు పెట్టాను: "ఇలా పారిపోయిన వాళ్ల గురించిన ప్రకటనలు చూస్తూంటే నాకు నవ్వు వస్తుంది. వీళ్లల్లో చాలమటుకు ఎటువంటి వ్యవహారాలో నీకు తెలుసా? మొగపిల్లలైతే రాత్రి నాటకమో, సినీమాయో చూసి ఇంటికి తిరిగి వచ్చేస్తారు". (ఇలాంటిదే ఒక సందర్భంలో ఇలా జరుగుతుంది) "భోజనం చేసేటప్పుడు కొన్నాళ్ళు పోయాక ఇంటి యజమాని ఇలా భార్యతో అన్నాడు: ఎక్కడికి వెళ్లాడు బాబు! నీ సకల గుణాభిరాముడు! ప్రబుద్ధ పుత్రుడు?"

మళ్లీ యజమానురాలిని నిందిస్తూ అన్నాడు. "కల్లబొల్లి సణుగుడు కట్టిపెట్టు. ఇలాగ కుర్రాళ్లు వెళ్లడమే మంచిది".

తల్లి ఏడుపు ఇంకా పెరిగింది.

తండ్రి ఈసారి పళ్లు ఇకిలిస్తూ తన మనోభావాన్ని ప్రకటిస్తున్నట్లుగా పలికాడు: "వాడు వెళితే బ్రతికి పోయామనుకో. ఈ పాటికి చూడు ఒళ్లు గోక్కుంటూ మళ్లీ తిరిగి వచ్చేస్తాడులే. ఇలాగ డబ్బు ఖర్చులేని హోటలు ఎక్కడ దొరుకుతుంది కనుక!"

తల్లి అశ్రుపూరిత స్వరంతో అంది: "ఇంత దారుణమైన చలికాలపు రాత్రిలో

ఎక్కడ ఉండగలడో ఎవరికి తెలుస్తుంది? ఏం కష్టపడుతున్నాడో అని నా భయం".

"అవును భయం!" తండ్రి వ్యంగ్యం పెంచుతూ ఇంకా ఇలా అన్నాడు: "నీ కొడుకు ఏం చేయలేదు, ఏం చేయలేదు. ఒక దివ్య పురుషుడు నాక లోకం నుంచి స్నేహితుల ఇంటికి దిగివచ్చాడు! ఎంతో శ్రమ తీసుకుని దర్శనం ఇచ్చేందుకు వచ్చాడు!"

తల్లి ఏడుపు ఇంకా ఏం తగ్గలేదు. "ఇదేం రకం విస్ఫోటమో తెలియడం లేదు!"

విసుగు పుట్టి తండ్రి బైటకు వెళ్లాడు. సాయంత్రం ఆఫీసు నుంచి తిరిగి వచ్చేసరికి ఇంట్లో పరిస్థితి ఇంకా క్షీణించింది. కుర్రవాడు ఇంటికి తిరిగి రాలేదు. తల్లి కొడుకు ఇంటికి వచ్చేవరకూ ప్రక్క దిగనని పట్టుపట్టింది.

"ఇంక ఇక్కడ ఉండలేను. ఈ అశాంతి గృహంలో ఉండడం కంటె అడవికి పోవడం మెరుగు," అని అంటూ యజమాని బైటకు పోయి, తిన్నగా న్యూస్‌పేపరు ఆఫీసు బయలు దేరాడు.

పత్రికా కార్యాలయంలో వ్యవహారం చాలా క్లిష్టంగా ఉంటుంది. ఏ మూలలో ఏం పని జరుగుతూంటుందో అర్థం కాదు. కొంచెం సేపు అటూ ఇటూ తిరిగి ఒక గదిలో ఉన్న ఒక పెద్ద మనిషిని సాహసించి అడిగాడు: "మీ పేపరులో ఈ వార్త ప్రకటించాలనుకుంటున్నాను"

ఆ అమాయకపు ముఖం గల పెద్ద మనిషి హఠాత్తుగా తల ఆడించి వ్యంగ్య స్వరంతో పలికాడు: "వార్త! ఏం, మా వార్తలు మీకు నచ్చలేదా? ఏం, మేం ఇన్నాళ్లూ రామాయణం ప్రకటించామా!" (సాయంత్రవేళ తల్లి పిల్లవానికి మిఠాయి కొనుక్కునేందుకని దాచిన డబ్బులు తీసి ఇచ్చింది. ఆమె ఆ విషయం గురించి, అంతా తెలిసి కూడా, అబద్ధం ఆడలేక మాట్లాడక ఊరుకుంది).

తండ్రి ఇంకా ఇలా అనడం ప్రారంభించాడు: "ఇంత రాత్రి మన బాబు వచ్చే సమయం అవలేదు. క్రితం సారి ఎల్లాగో బుర్ర తాకట్టు పెట్టి ఫెయిల్ అయ్యాడు పరీక్షలో. ఈసారి ఏ విధంగా పాస్ అవతాడో అర్థం అయింది. నా దగ్గరేం డబ్బు దాచి బెట్టిన మూట లేదు- వాడిని రాజకుమారునిలా సంతోష పరిచేందుకు ఈసారి వాడిని ఇంట్లోంచి గెంటేస్తా, గెంటేస్తా"!

ఈ మాటలు నోటి లోంచి ఊడి పడ్డాయోలేదో, అదే సమయంలో ప్రబుద్ధ పుత్రుని ప్రవేశం జరిగింది ఇంట్లో.

తండ్రి మాట్లాడదలచుకున్న మాట పూర్తి చేయలేదు. తన దగ్గర కుర్రవాడిని గౌరవంగా ఉంచుకునే మాటేమీ ఆయన పలకలేదు.

అఖరికి యజమాని అన్నాడు: "ఇటువంటి పిల్లవాడితో నాకేం పనిలేదు. బైటకి పో"!

అభిమానం గల బాలుడు ఇంకేమీ బదులు చెప్పక వెంటనే పితృ వాక్య పరిపాలన చేసేందుకు సంసిద్ధుడయ్యాడు.

ఇద్దరి మధ్య పోరు తీర్చేందుకు ఏమీ తోచక తల్లి కేవలం ఇలా అంది: "అయ్యో, భోజన సమయంలో ఇటువంటి మాటలు మాట్లాడవచ్చా? తర్వాత మాట్లాడుకోవచ్చు కదా?"

అప్పుడు యజమాని యజమానురాలి వైపు కొట్టబోయేలాగ ముఖం పెట్టి అన్నాడు: "నీ గారం మూలాన్నే వాడిలా విచ్చలవిడిగా తిరుగుతూ బుర్ర పాడుచేసుకున్నాడు!"

తల్లి చీర కొంగుతో కళ్ళు తుడుచుకుంటూంది. కుర్రవాడు విశాల ప్రపంచంలో తన అదృశ్యయాత్రను సాగించేందుకు బైటకు నడిచాడు.

మరునాడు ఇల్లంతా భీకరమైన పరిస్థితిలో ఉంది. తల్లి ఆ రాత్రి నుంచి తిండి తినడం మానేసింది. ఆ రోజున ప్రక్కమీద నుంచి లేవాలనైనా ఆమెకు మనస్సు ఒప్పలేదు. తండ్రికూడా రాత్రంతా నిద్రపోలేదు. కాని ఆ మాట ఎవరితో చెప్పుకుంటాడు?....

యజమాని (పిల్లవాడి తండ్రి) గాభరా పడిపోయి ఒక్కసారి నిస్సహాయుడిలా నాలుగు వైపులా చూశాడు. ప్రక్కనున్న మరొక పెద్దమనిషి, ముఖం చూస్తే చాలా కఠినమైన స్వభావం ద్యోతకమైనా అతనే సానుభూతి ప్రకటించే స్వరంతో అన్నాడు: "అయ్యో! ఏం చేశారు! ఆ పెద్దమనిషి ఏం చెప్పదలచుకున్నాడో వినండి! కూర్చోండి బాబూ!".

బాబా (పిల్లవాడి తండ్రి) ఒక కుర్చీ మీద కలవర పడుతూ కూర్చున్నాక పత్రిక ఆఫీసులో అన్నాడు: "ఏమిటి మీరు చెప్పదలచుకున్న వార్త?"

"అయ్యా! వార్తా కాదు ఇది - ఇది ఒక ప్రకటన".

"ప్రకటనా? ఎటువంటి ప్రకటనా? ఎంత స్పేస్ పడుతుంది? కాపీ తీసుకొచ్చారా?"

బాబా ఇంకా వెర్రిగానే పలికాడు: "అయ్యా! నిక్కచ్చిగా ప్రకటనా కాదు- మా అబ్బాయి మా ఇంటి లోంచి పారిపోయాడు...."

అతని మాట ఇంకా చెప్పవలసిన పనిలేదు. టేబులుకి మరొక ప్రక్కనున్న ఆసామి అన్నాడు: "ఆ తెలిసింది జాడ తెలియడం లేదు! సరే గుర్తులు ఏమిటి? ముఖం యొక్క పోలికలు; తిరిగి రాకపోయేందుకు కోరిక!"

బాబా వెంటనే సర్దుకుని అన్నాడు: "కాదు సార్, తిరిగి రమ్మనమనే కోరిక! వాడి తల్లి చాలా రోదన చేస్తూ పక్క పట్టేసింది!"

"అర్థం అయింది, అర్థం అయింది. బాగా కోపగించుకుని వెళ్లిపోయాడా?"

పెద్దమనిషి ఒక కాగితం పాడ్ అతని ముందర పెట్టి అన్నాడు: "తారీఖు వ్రాయండి".

"వ్రాయడం!" - బాబా ముఖం బాధామయంగా ఉన్నట్లు స్పష్టమైంది.

దయామయుడైన పెద్ద మనిషి అన్నాడు: "సరే, నేనే వ్రాసి ఇస్తాను లెండి. మీరు ఊరికే ఊరూ, పేరూ అలాంటి విషయాలు తెలియజేయండి".

ఆ విషయాలన్నీ తెలియజేస్తూ బాబా అన్నాడు: "ఒక్క విషయం మటుకు మీరు గట్టిగా నొక్కి చెప్పాలి. కుర్రవాడి తల్లి నిన్నటినుంచి కటిక మంచినీళ్లైనా త్రాగడం లేదని".

"అదేం చెప్పక్కరలేదు. నేనెలా వ్రాస్తానంటే, చదివేసరికి మీవాడు ఏడుపులో మునిగిపోతాడనుకోండి. మీరు నిశ్చింతగా ఉండండి".

ఓదార్పుపొంది బాబా ఇంటికి తిరిగి వెళ్లాడు. కాని అశ్రుసాగరంలో ముంచే ప్రకటన ప్రచురించబడే ముందుగానే కుర్రవాడు ఇంటికి తిరిగివచ్చేశాడు.

అయితే వాడు పశ్చాత్తాపపడి ఇంటికొచ్చేశాడనుకోకండి. వెళ్లిపోయే ముందు వాడి పుస్తకాలు కొన్ని తీసుకు వెళదామని వచ్చాడు, అంతే.

ఈసారి తల్లి యొక్క క్రోధపూరిత స్వరం వినపడింది: పోయే వాడికి పుస్తకాలు కూడా ఎందుకు? వంశానికి చీడపురుగులా పుట్టావు! ఇంకెవడూ కుర్రవాడు నీలాగ చీవాట్లు ఇలా తినడానికి సిద్ధపడడు. నువ్వొక్కడివేమహా ప్రవక్తవై పోయావు! నిన్న రాత్రి నీకోసం ఎదురు చూసి, ఏడ్చి ఏడ్చి, నా కళ్లు ఎలా కాయలు కాచాయో, చూడు; నా ముఖం ఎలా కళా విహీనమైందో చూసుకో. మీ నాన్నగారేమో కోపగించుకుంటూ వెళ్లిపోయారు?

బాబా ఈసారి తనలో తనే నెమ్మదిగా సణుగుకున్నాడు: ఊ ఇంకా ఎందుకు ఈ వాగ్వివాదం?

తల్లి నిందిస్తూ ఇంకా ఇలా అంది: మీరూరుకోండి అంతగర్వం ఏం మంచిది కాదు. ఏదో తిట్లు తిట్టారని పిల్లవాడు ఇల్లు విడిచి వెళితే ఇంత గొడవా?.

"ఇదండీ, చాల మట్టుకు ఈ పారిపోయిన పిల్లల ఇళ్లల్లో కథ ఇల్లాగే ఉంటుంది".

సోమేశ్ సిగరెట్టు కాల్చడం పూర్తి అయింది.

ఇంతసేపూ అతను నేను చెప్పిన మాటలన్నీ పూర్తిగా సావధానంతో విన్నాడనుకోను. ఒక్కసారైనా అతనిలో కొంచెమయినా అసక్తి చూపించే చలనం కనపడలేదు.

కొంచెం విరక్తితో కూడుకున్న గొంతుకతో అన్నాను: "అసలు నీకేమయిందో చెప్పు నిష్కారణంగా నేనొక్కణ్ణీ ఏదో వాగుకుంటూ చస్తున్నాను".

నా మాట కేమీ సమాధానం చెప్పకుండా సోమేశ్ కాళ్ళు జాపుకుని తిన్నగా కూర్చుని, సిగరెట్టు పీక పారేశాడు. కొంచెం సేపటికి ఇలా అన్నాడు: "నీకేం తెలియదు. ఈ ప్రకటనల వెనక చాలా నిజమైన ట్రాజిడీలు ఉంటాయి".

"ఆ మాట నేను కాదనను. కొన్ని కొన్ని సందర్భాలలో నిజంగా పారిపోయిన వాళ్ళు తిరిగిరారు".

సోమేశ్ కొద్దిగా నవ్వి అన్నాడు: "కాదనడం లేదు. అయితే తిరిగి వచ్చిన వాళ్ల విషయంలోనే ఒక అతి విషాదకరమైన సంఘటన నాకు తెలుసు".

నేను కుతూహలంతో అతని కేసి చూసి అన్నాను: "అంటే?"

"చెపుతాను. విను".

బైట మళ్లీ వర్షం పడడం మొదలయింది. కిటికీ లోంచి చూస్తుంటే బైట వున్న రోడ్డు ఏదో అస్పష్టంగా కనుపిస్తోంది. నా దృష్టిలో సమస్త జగత్తూ విచ్ఛిన్నమైనట్లుగా తోచింది.

"పాత పేపర్ల ఫైలు చూస్తే, వాట్లల్లో ఒక పేరుపడ్డ వార్తా పత్రికలో రోజూ ఒక ప్రకటన పడేది. అది కేవలం ప్రకటన కాదు. ఒక ఇతిహాసం. ధారావాహిక కథానికలా ఆ ప్రకటన చదువుతూంటే, నిజంగా ఆ ప్రకటన వ్రాసే వాళ్ల ఆర్తనాదం కర్ణపుటంలో ప్రతిధ్వనిస్తున్నట్లు ఉండేది. ఆ ప్రకటన తప్పకుండా జాడ తప్పిపోయిన వాడి గురించి మొదట చూస్తే తల్లి యొక్క దుఃఖ సందేశం కొడుకు తిరిగి ఇంటికి రావడం గురించే. భాష చూస్తే ఏదో అస్పష్టంగా అస్తవ్యస్తంగా ఉండేది కాని, ఆ మాటల వెనుక ఉన్న తీవ్ర వ్యాకులత అది చదివితే కాని బోధపడేది కాదు. మెల్లిగా తల్లి యొక్క దీనపు ప్రార్థన వార్తాపత్రిక కాగితాల్లో నుంచి ఒక నిరాశా పూరితమైన వేడి నిట్టూర్పులా వెలువడేది. అటుపైన తండ్రి గంభీరస్వరం. కొద్దిగా వణకుతూ, నెమ్మదిగా ప్రశాంతంగా ఇలా వినపడేది: "శోభన్, తిరిగిరా. నీ తల్లి మంచం పట్టింది. నీ తల్లిదండ్రుల పట్ల నీకున్న కర్తవ్యం, బాధ్యత నీకు తెలియడం లేదు".

ప్రకటన ఆ తర్వాత ఇంక నెమ్మదిగా ఉండి పోలేదు. తండ్రి స్వరం ఇంక చాలా దీర్ఘంగా ఉండేది- ఏదో గొడవ జరిగుతున్నట్లుగా: "శోభన్, నువ్వెప్పుడు తిరిగి రాక పోతే నీ తల్లిని ఇంక చూడలేవు".

కాని శోభన్ హృదయానికి ఈ ఆర్తనాదం పూర్తిగా అవగతం కాలేదు. ప్రకటన అంతా ఒకే మోస్తరుగా నడుస్తోంది : పోతే, తండ్రిలో ఆత్మ సంయమం, క్షమతా క్షీణిస్తున్నట్లు తెలుస్తోంది. ఈ సారి కేవలం దుఃఖమే కాదు, దౌర్బల్యం కూడా ద్యోతకమయింది- "శోభన్, మాకెంత కష్టంగా రోజులు గడుస్తున్నాయో నీకు తెలియదు. తిరిగిరా, మమ్మల్నింక బాధ పెట్టకు".

ప్రకటన మరీ నైరాశ్యపు నినాదాన్ని ప్రదర్శిస్తోంది. అటు తర్వాత ఒక్కసారిగా అందులో మార్పు వచ్చేసింది. ఇంక 'శోభన్' పేరు పెట్టి ఏమీ వ్రాయబడేది కాదు. ఏదో ఒక సాధారణ విజ్ఞప్తి మటుకే -'ఫలానా పోలికా, ఫలానా కను,ముక్కు తీరూ; ఫలానా వయస్సూ గల ఒక కుర్రవాడు ఒక సంవత్సరం నుంచి వాడి జాడ తెలియడం లేదు. ఎవరైనా వాడి అచూకీ తెలియజేస్తే వారికి బహుమతి ఇవ్వబడుతుంది".

క్రమంగా బహుమతి యొక్క సంఖ్య పేపరులో పెరుగుతుండేది: "ఒక్క వలచటి 16-17 ఏళ్ల కుర్రాడు. గుర్తులు: బుజంపైన కుడి చెవి క్రింద ఒక పెద్ద పుట్టుమచ్చ. వాడు బ్రతికి ఉన్నాడా లేదా అని ఎవరైనా అచూకీ తెలియజేస్తే వారికి బహుమతి లభిస్తుంది".

సోమేశ్ కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా ఉన్నాడు. వర్షపు నీరు బాగా పడటం మూలాన గాజు కిటికీ ద్వారా ఏమీ కనిపించడం లేదు. ఇంటిలో ఎంత చలివేస్తూందంటే ఏదైనా గట్టి కంబళీ కప్పుకుంటే బాగుంటుంది అనిపించింది.

అన్నాను: "సరే, ప్రకటనల కథ చెప్పేశావు. అసలు సంగతి పర్యవసానం ఏమిటో నీకు తెలియదా?"

"తెలుసు ! శోభనని నాకు తెలుసు. వాడు ఏదో మహాదురభిమానంతో ఇల్లు విడిచిపోయాడనుకోకు. ఇల్లు విడిచి పెట్టడం వాడికి సులభమైన పని. కారణం ఏదైతేనేం అయిందేదో అయింది. భూమిపై ఏ ఒకరిద్దరో జన్మిస్తారు. పూర్తిగా నిర్లిప్త మనస్కులై. వాళ్లది నిక్కచ్చిగా కఠిన హృదయం అనడానికి వీలులేదు. వాళ్ల మనస్సుకి ఏదో జిడ్డు పట్టుకుందని చెప్పవచ్చు. అలా జారుడు మనస్సు అనడంలో ఉద్దేశమేమిటంటే అది పట్టుబడనూ పట్టుబడదు. దానిపై మచ్చ పడదు కూడా. ఏంటే ఆశ్చర్యంగా ఉంటుంది: కాని, వాడు వార్తా పత్రికల్లో పడ్డ ప్రకటనలు సరిగ్గా చదవనైనా చదివే వాడు కాదు. ఏ రోజునైనా అవి కంటబడితే - అవి వెంటనే చదివి మరచి పోయేవాడు. ఇల్లు విడిచి వెళ్లడం వల్ల అనుభవించవలసిన ఇక్కట్లలోనే తన జీవితం యొక్క స్వేచ్ఛాపథాన్ని రుచి చూశాడు. ఇతరులు ఏమైనా అనుకోనీ కుర్రవాళ్లు ఈ అల్ప ప్రపంచపు సత్కారం గురించి ఏమీ లెక్క జేయకుండా ప్రవర్తిస్తారు. కాని ఎప్పుడైతే అకస్మాత్తుగా పేపరులో ప్రకటనలు ఆగిపోయాయో అప్పటి నుంచి అతని ఉదాసీన స్వభావంలో ఒక విధమైన వైకల్యం ఎలా ప్రవేశించిందో చెప్పలేము పేపరు ప్రకటన ఒక అస్వాభావికమైన విధంగా ఆగిపోయింది. అంటే విసుగు పుట్టి క్రమంగా ప్రకటనలు చేయడం మానలేదు, కాని ఒకానొక భీకరమైన దుర్ఘటన వల్ల అవి స్తంభించిపోయాయి. ఒక రోజున శోభన పోలికల వర్ణనకు బదులుగా ఈ విధంగా

ప్రకటన పడింది. "శోభన, నీ తల్లి గురించి నీకు బోధించలేక పోతున్నాము. ఆమె ఇప్పుడు కేవలం నీ నామస్మరణ చేస్తూ ఉండి పోతోంది." అటు పైన ఇక ప్రకటనలు ప్రచురించబడలేదు.

అలా ఇంచుమించు రెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

అకస్మాత్తుగా ఒక రోజున ఊరిలో శోభన్ హాజరయ్యాడు. ఒకానొక వ్యవహారం శోభన్ స్వభావాన్ని పరిచితం చేస్తుంది. ఆ సంగతి ముందుగా చెప్పను. శోభన్ మామూలు మధ్య తరగతి కుటుంబానికి చెందిన కుర్రవాడు కాదు. అలాగని అతను ఒక మహాధనికుల వంశానికి చెందిన వాడని చెప్పలేము. అతని పురాతన జమీందారీ అనేక దుర్దశలు అనుభవించినా అప్పుడు ఇంతగా నశించి పోలేదు. ఆ జమీందారీకి శోభన్ ఒకే ఒక వారసుడు".

సోమేశ్ కొద్దిగా నవ్వి ఇంకేం మాట్లాడకుండా ఆ కథే చెప్పడం కొనసాగించాడు: "రెండు సంవత్సరాల స్వతంత్ర జీవితపు కష్టనష్టాలు అతనిపై తమ ముద్ర వేసి అతనిలో చాలా మార్పుని తీసుకువచ్చాయి. కానీ అతని సేవక బృందం అతనిని గుర్తించలేకపోతారని అతడనుకోలేదు".

శోభన్ తన ఊరు చేరుకుని తిన్నగా ఇంటిలోకి ప్రవేశించే సరికి, ముందుగా ఆ జమీందారీ పాత దివాను అతనికి అడ్డు వచ్చాడు.

"ఎవరు కావాలి?"

శోభన్ జవాబిచ్చాడు:"ఎవ్వరూ అక్కరలేదు. ఇంట్లోకి వెళ్లదలచు కున్నాను".

దివాను కొంతసేపు అతనికేసి తీక్షణంగా చూసి, తర్వాత చిరునవ్వు నవ్వి అన్నాడు: "ఓ కాని అంతా కంగారు ఏముంది? రండి, ఆఫీసుగదిలో కొంత విశ్రాంతి తీసుకోండి".

శోభన్ నిర్ఘాంతపోయి అన్నాడు: "ఏం, ఏమయింది దివాన్ గారూ!"

"ఏమీ లేదులే"

"మా అమ్మగారు బాగున్నారా?" అని బెంగతో అడిగాడు.

దివాను గారు వికృతంగా నవ్వి అన్నారు: "బాగానే ఉన్నారు లెండి. నాతో కూడా రండి".

శోభన్: "కానీ లోపలికి వెళ్లాలి కదా?"

దివానుగారు కొంచెం కఠిన స్వరంతో అన్నారు: "అది కుదరదు మీరు నాతో రండి".

శోభన్ ఏదో యాంత్రికంగా దివాను గారితో కూడా ఆఫీసు వైపు నడవడం మొదలు పెట్టాడు. రెండు సంవత్సరాలలో అక్కడ కొద్దిగా మార్పులు వచ్చాయి. పూర్వపు ప్రభుత్వం ఇప్పుడు కొనసాగడం లేదు. క్రొత్తవాళ్లు ఇద్దరు అక్కడ కాతాలు

వ్రాస్తున్నారు. తనకు తెలిసి ఉన్న ముసలి కోశాధికారిని చూసి శోభన్ కొంత తృప్తి ఊపడ్డాడు.

దివాను గారు అతన్ని ఒక కుర్చీలో కూర్చోబెట్టి కోశాధికారితో ఇలా అన్నాడు: "ఈయన ఇంట్లోకి వెళ్ళదలచుకున్నారు!"

దివాను గారి కంఠధ్వని ఏదో అస్వాభావికంగా తోచింది శోభన్‌కి. కోశాధికారి ముక్కుపై నుంచి కళ్లజోడు కొంచెం పైకెత్తి అతని వైపు చూసి ఇలా అన్నాడు: "ఓ ఈయన ఈవేళే వచ్చారా?"

"అవును ఇప్పుడే".

శోభన్ ఈ సారి కొంచెం విసుక్కుంటూ పలికాడు: "మీరేం చెప్పదలచుకున్నారో అది స్పష్టంగా చెప్పేసేయండి. మా అమ్మకి ఏమైనా అయిందా? మా నాన్న గారు ఎలా ఉన్నారు?"

నలువైపులా అందరూ అతని వైపు తీక్షణంగా చూశారు. అంతా నిశ్శబ్దం. కొంత సేపు పోయాక దివానుగారు అన్నారు. "వారు ఉభయులూ బాగానే ఉన్నారు. కానీ ఇప్పుడు మీరు వాళ్లను చూడడానికి కుదరదు".

ఇప్పుడు శోభన్ క్రుద్ధుడయ్యాడు:"ఎందుకు చూడడానికి వీలుపడదు? మీ బుర్రేమైనా పాడయిందా? నేను వెళుతున్నాను!"

శోభన్ లేచి నిలబడ్డాడు. కాని దివానుగారు గేటు దగ్గరకు కొంచెం ముందుగా నడిచి నెమ్మదిగా అన్నారు. "చూడండి, ఊరికే గందరగోళం చేస్తే ఏం లాభం లేదు!"

అకస్మాత్తుగా శోభన్‌కి వ్యవహారం అంతా భయానకంగా స్పష్టయింది. బీభత్స స్వరంతో అన్నాడు: "ఏంటి, మీరు నన్ను గుర్తించలేకపోతున్నారా?"

అంతా నిశ్శబ్దం.

"నేను శోభన్‌ని! నేను శోభన్‌ని అని మీకు తెలియదా?"

దివాను: "మీరు కొంచెం సేపు ఉండండి. నేనిప్పుడే వస్తాను"? ప్రక్కనున్న గదిలోకి వెళ్లి టేబులులోని డ్రాయరు నుంచి ఒక సరకు తీసి అయన శోభన్ చేతిలో పెట్టారు. మామూలుగా చూస్తే, అది ఒక పురాతన ఫొటో. ఇప్పుడు ఒక విషయం స్పష్టమయింది.

దివాను గారన్నారు: "గుర్తు పట్టారా?"

విస్మితుడై శోభన్ అన్నాడు: "ఇది నా ఫొటోయే.చూడండి. దయచేసి మీరే పోల్చండి. ఉఫ్, ఇదంతా ఎంత దుర్భరంగా ఉంది.!"

తలజుట్టు నిరాశతో చేత్తో బిగ పట్టుకుని అక్కడే చతికిల పడ్డాడు.

దివానుగారు అతని ప్రక్కన కూర్చుని అన్నాడు: "చూడండి; మరేమీ

అనుకోవద్దు. మీతో ఫోటోకి కొంచెం పోలిక ఉంది నిజంగా. కాని ఇంతకుముందు మరిద్దరా మనుషులు వచ్చారు. పుట్టుమచ్చ తో సహా. మా దగ్గర చాలా గొడవచేశారు. మేమే మీ హంగామా చేయడం లేదు. ఇప్పుడు ఇంక మీరు వెళ్లవచ్చు".

శోభన్ దిగ్భ్రాంతుడై అందరి వైపు చూశాడు. అందరి ముఖంపైన అపనమ్మకం గోచరిస్తోంది.

వ్యాకుల భావంతో శోభన్ అన్నాడు: "ఒకసారి నేను తల్లితండ్రులను చూస్తాను. మీకు నా పైన నమ్మకం లేకపోవచ్చు కాని, ఒక్కసారి నన్ను నా జననీ జనకులను చూడనీయండి".

దివానుగారు నిస్సహాయునివలె చేతులాడించి అన్నారు: "దయచేసి వినండి, ఏడు రోజుల క్రితం శోభన్ చనిపోయాడు. అతను చనిపోయిన వార్త మాకు అందింది".

శోభన్ ఆ పరిస్థితిలో నవ్వకుండా ఉండలేకపోయాడు. అడిగాడు: "ఎల్లా చనిపోయాడు?"

తన కంఠస్వరంలో వెటకారం, నిర్లక్ష్యం ప్రదర్శిస్తూ దివానుగా రన్నారు: "రోడ్డు మీద బండిక్రింద పడి చనిపోయాడు. అతని ఊరూ, పేరూ నిర్ణయించడానికి సంభవం కాలేదు. కాని పేపరులో మేము చేసిన ప్రకటనలు చూసిన కొందరు ఆ విషయం మాకు తెలియజేసారు. ఆ శవం యొక్క వర్ణన మాకు హాస్పిటలు అధికారులు అందజేసారు".

శోభన్ ఈ వార్తకు తన సమాధానం చెప్పే లోపులోనే, అతని తండ్రి ఇంట్లోంచి బైటకు వచ్చాడు. తుఫానుకి పడిపోయిన చెట్టులా, ఉన్న ఆయన దీనపు అవస్థ ఆయన నడకలో కూడా ప్రస్ఫుటంగా కనిపించింది.

అక్కడ వారందరూ పరిస్థితిని అవగాహన చేసుకునే లోగానే, వాళ్లు ఆ సందర్భంలో ఏ విధమైన చర్యా తీసుకోవడానికి అవకాశం లేకుండానే, శోభన్ ఒక్క పరుగున తండ్రి దగ్గరకు చేరుకున్నాడు.

"బాబా!"

వృద్ధుడు ఆశ్చర్య చకితుడై నిలబడిపోయాడు. ఆయన ముఖంలోని వేదనా, విమూఢతా శోభన్ హృదయాన్ని కత్తి పొడిచినట్లు పొడిచాయి.

"బాబా! నన్ను గుర్తించగలిగారా?"

తండ్రి తడుముకుంటున్నట్లుగా ఒక అడుగు ముందుకు వేసి నిశ్చేష్టుడై ఉండిపోయాడు. ప్రబలమైన భావావేశం, అతని వార్ధక్యంతో వదలిన ముఖంపై ఒక వికార స్వరూపాన్ని కల్పించింది.

ఇంతలో దివాను గారు, ఇతర గుమస్తాలు అక్కడకు వచ్చారు.

చేతులూ, గొంతుకా వణుకు తూండగా వృద్ధుడన్నాడు: "ఎవరు?"

దివానుగారు శోభన్ భుజంపై గట్టిగా చేయివేసి అన్నాడు: "ఎవరూ లేదు. ఇతను కూడా ఇదివరలో లాగే -పీడు మూడవ వాడు".

ఒక గుమాస్తా అన్నాడు: "మమ్మల్ని అడ్డుపడనీయకుండా మా చేతుల నుంచి తప్పించుకుని...."

వృద్ధుడు అతనిని అపుజేసి అన్నాడు: "ఏమీ మాట్లాడవద్దు. వెళ్లనీ"

వృద్ధుడు ఆఖరిసారి శోభన్ కేసి చూసి వ్యాకుల చిత్తుడై ఇంటి వైపు తిరిగి వెళ్లిపోయాడు.

శోభన్ స్తబ్ధుడై నిలబడిపోయాడు. దివానుగారు అతనితో ఏదో అన్నారు. చాలా సేపు అతను ఆ మాటలు వినిపించుకోలేదు. ఎప్పుడు అతను ఆఫీసు గదిలోకి వచ్చి కూర్చున్నాడో అతనికే తెలియదు.

కొంతసేపు తర్వాత అతణ్ని ఒక మూర్ఛావస్థ వంటిది ఆవరించింది. ఇంటిలో నుంచి ఒక గుమాస్తా వచ్చి దివానుగారితో ఏదో చెప్పాడు. దివానుగారు అతనికేం సమాధాన మిచ్చాడో శోభన్‌కి సరిగ్గా వినపడలేదు. పైగా ఏమీ అర్థమవలేదు కూడా. దివానుగారి చేతిలో చాలా పెద్ద మొత్తం కరెన్సీ నోటులు. ఆయన కంఠ స్వరంలో నమ్రత.

శోభన్‌కి ఒక పని చేయవలసి ఉంటుంది. ఇంటి యజమానురాలు మృత్యు ముఖంలో ఉన్నది. ఆమె తన కొడుకు 'చావు కబురు' విని వుండలేదు. ఆమెకేమీ తెలియజేయలేదు. ఇప్పుడు తను వెళ్లి ఆమెకు కనుపిస్తే ఆమె శాంతంగా చివరి ఊపిరి పీలుస్తుందనిపించింది అతనికి. తన పారిపోయిన కొడుకు దర్శనం ఆమెకు ఒక సారి కనిపించాలని శోభన్‌కి తోచింది.

చనిపోబోతున్న ఆమె కాంతి హీనపు దృష్టికి ఏమీ స్పష్టంగా కనిపించదు. పారిపోయిన కొడుకుకీ శోభన్‌కి నిజమైన పోలిక ఉంది. మృత్యుద్వారంలో నిలబడి ఉన్న ఆమెకి ఈ తుది ఓదార్పు కలగజేయాలని తన వ్యాకులపు వాంఛను ఈ విధంగా శోభన్‌కు తెలియజేసాడు జమీందారు. ఇందువల్ల అతనికేమీ నష్టం లేదు.

దివానుగారు కరెన్సీ నోట్ల కట్టను శోభన్ చేతిలో పెట్టారు".

సోమేశ్ ఊరుకున్నారు: కొంతసేపు బైట వర్షపు ధ్వని తప్ప వేరేమీ శబ్దం లేదు. నేను ఆఖరికి అన్నాను: "సోమేశ్, నీ చెవి ప్రక్కను ఒక పుట్టుమచ్చ ఉంది".

సోమేశ్ నవ్వుతూ అన్నాడు: "అందువల్లనే ఈ కథ అల్లడం సులభం అయింది".

కానీ ఎందుకో చెప్పలేను- శీతల మేఘావృతమై, అస్వాభావికమైన చిరు

చీకటిలో ఉన్న ఆ మధ్యాహ్నపు వేళ అతని నవ్వుపై నమ్మకం కలగలేదు నాకు.

---

(అక్కడక్కడ, అప్పుడప్పుడు 1962)

# భూపతనం

సతీనాథ్ భాదురీ

ఏ శిశు శవం తల్లి గుండెపై నుంచి (తన తండ్రియైన పరసాదీచే) బలవంతంగా లాగబడుతుందో దానికి శరణ్యం భూమిలో పాతిపెట్టడం కాదు- నదీ గర్భంలో పారవెయ్యడమే.

ఇంటిలో ఉన్న సమయంలో పరసాదీ ఏడవడు. ఎప్పుడైనా కంటి కొలకులలోకి అశ్రువులు ప్రవేశిస్తే, మన్‌చనియా చూస్తుందేమో అన్న బెంగతో ముఖం ప్రక్కకు తిప్పేసుకుంటాడు. కన్నూ కన్నూ కలిస్తే ఒక విధమైన లజ్జ ఉత్పన్నమవుతుంది. కాబట్టి, ఇంతసేపూ ఆమె వైపు చూడనైనా చూడలేదు. ఈ సమయంలో ఎవరికేసి ఎవరు చూస్తే ఎటువంటి భావోద్రేకం కలుగుతుందో చెప్పలేము. ఒకే ఒక రీతిగా శోకంతోనూ, సిగ్గుతోనూ, సతమతమవుతున్న మన్‌చనియా వైపు చూసి ఆమెను మరింత దుఃఖితను చేయడం ఉచితం కాదని, పరసాదీ ఇంటి బైటకు వెళ్లి దుఃఖిస్తాడు.

ఇంతకాలం ఆమెకు పిల్లలు పుట్టలేదని ఎన్ని మంత్ర తంత్రాలు, రక్షరేకులూ, వ్రతాలు, మందులు గిందులు! తను చనిపోయిన తర్వాత తన నోట్లో కాసిన్ని నీళ్లు పోసేందుకు సంతానం లేదన్న బాధ. కానీ కొన్నాళ్లకు దేవుడు దయతలచి ఆమె గర్భవతి అయ్యాక పిల్లాడు పుట్టేవరకూ రోజులు ఎంత వ్యాకులతతో లెక్క పెట్టేవాడు! మన్‌చనియా గురించి ఏ విధమైన ప్రశ్న వేయాలో తోచేది కాదు: నీకు ఏం ఎక్కువ ఇష్టంగా తినాలని ఉంది? నీకు మగపిల్లవాడు కావాలా, ఆడపిల్లా? ఏ పోలికగా ఉండాలి? కడుపులో పిల్లవాడు కదులుతున్నాడా! మామూలు గర్భిణీ స్త్రీలలాగ నీకు కాల్చిన మట్టి తినాలని ఉందా?" ఇలా ఇంకెన్నెన్ని ఊహాలూ, పిచ్చి కబుర్లు వాళ్లిద్దరి మధ్య జరిగేవో! 'చామరాశి'తో ఏమేమి పిచ్చి పిచ్చి మాటలు మాట్లాడేవాడో! చుట్టు ప్రక్కల వాళ్లంతా అతని వెర్రిప్రేమను చూసి ఎంతగా నవ్వేవారో!

తర్వాత ప్రసవించాక 2 బుధవారాలూ, ఒక గురువారం, శుక్రవారం, శనివారం - మొత్తం 17 రోజులు స్వర్గం కరతలామలకం అయింది. 17 రోజుల తర్వాత ఏ ప్రభువైతే ఆ బిడ్డను అనుగ్రహించాడో ఆ ప్రభువే మింగేశాడు. - అహా, మానవుడు ఒకటి తలిస్తే దేవుడు మరొకటి తలుస్తాడా! పోయేవాళ్లు పోతూనే ఉంటారు. చిన్న పిల్లలు అనేక రకాలుగా గతిస్తూ ఉంటారు. బెల్లపు పెనంలో పడో, కాగుతున్న పాల కుండలో పడో, పిల్లలు చావడం గురించి విన్నాము. కాని ఈ విధంగా మరణించడమా? ఒకే లేత రక్తపు ముద్ద!... మరు క్షణంలో

నల్లబడిపోయింది పాలు త్రాగుతూ మధ్యలో గాలి పీల్చుకునే టప్పుడు రెండు కళ్లూ తెల్లబోయి బైటపడినట్లుగా పడి మూసుకుపోయాయి... అయ్యో!

భయమంటే ఏమిటో, ఆపదంటే ఏమిటో తెలుసుకునే ముందే వాటి రుచిని చూడటమయింది. అకస్మాత్తుగా మాతృహృదయం భూపతన మయింది. పురిటి మంచం క్రింద గుండె పగిలిపోయేలాగ అంధకారం. ఆ అంధకారం మధ్య నుంచి తుది ఏడుపు వినపడనైనా లేదు....

మన్చనియాకు అసలు సంగతి చాలా సేపటి వరకూ తెలియలేదు. కొంతసేపు ఏదో చలిచలిగా ఉందేమిటి అనిపించింది. ఒక్కొక్కప్పుడల్లాగే అవుతుంది కంబళీ బాగా కప్పుకు నిద్ర పోతున్నప్పుడు మరొక ప్రాణి తాకిడి తెలిసిరాదు. ఎంత మొద్దు నిద్రే అది!... కానీ ఏమిటే చలిచలిగా అనిపిస్తోంది? "కాళీస్థాన్' నుంచి జేగంట వినవస్తోంది. తెల్లవారేందుకు ఇంక ఎంతో ఆలస్యం లేదు. గరగరమంటూ లేచి కూర్చుంది....ఏదైనా అతుకు బొంత ముక్కలా తడిసినది ఉంటే కంబళీ క్రింద ఇలా చలిచలిగా ఉండదే!...ఒక విధమైన అనుభవానికి ఆశిస్తే మరొకటి అనుభవానికి వచ్చింది. హృదయం కంపించింది. లాంతరు వెలిగించేందుకు నాలుగు అగ్గిపుల్లలు ఖర్చు అయాయి. లాంతరు వత్తి పెద్దది చేసి, పరుపుకేసి చూసేసరికి తన మనసులో మిగిలిన ఆశాజ్యోతి కాస్తా మటుమాయమైంది. ఆమె ఏడ్పు కేక విని పరసాదీ లేచాడు...కానీ ఆమెకు అదే దేవస్పర్శలో మరింత ఉద్వేగం ఉత్పన్నమయింది! ఏ విధంగానైనా ఏమీ లభించలేదు. 17 రోజుల మాంస పిండం వల్ల తన హృదయంపై జరిగిన అఘాతం వల్ల మన్చనియా పై భయముద్ర పడింది. అదే హృదయ భాష ఆమె కన్నీళ్ల ద్వారా పలుకుతూనే ఉంది.

మన్చనియా ముసలి కుక్క కొంతదూరం పరసాదుతో కూడా కూడా వెళ్లి తిరిగి వచ్చింది. వచ్చి మన్చనియా ప్రక్కన కూర్చుంది. నల్లరంగుది కాబట్టి ఆ కుక్క పేరు- 'కారియా'. కారియా అదే పనిగా ఆమె అశ్రుపూరిత చక్షువుల వైపూ, చిందరవందరగా ఎగురుతున్న కేశభారం వైపూ చూస్తోంది. ముసలి కుక్క చాలా కాలం నుంచి ఈ సంసారంలో నివసిస్తోంది. అంతా భారమే. సరిగ్గా ఇంటిలో మనుష్యుల మోస్తరుగానే.

తన అత్తవారింటికి (రెండవసారి) కాపురానికి వచ్చేటప్పుడు, కూడా పుట్టింటి నుంచి ఆ కుక్కను తీసుక వచ్చింది మన్చనియా. అంటే నిక్కచ్చిగా ఆమె తీసుకురాలేదు. ఆమె వెనక్కాలే ఆ కుక్కే వచ్చేసింది తనంతట తాను. అదంతా ఈ నాటి మాటా? ఆమె వివాహం తన 4వ ఏట అయింది; కాపురానికి, పెళ్లి అయిన 15 సంవత్సరాల తర్వాత వెళ్లింది. కాపురానికి వచ్చేముందు నూతన

పదువుకి కన్యాశుల్కంగా చెల్లించవలసిన సొమ్ము దగ్గర సమకూర్చుకుని, పరసాదీ అనేక సార్లు అత్తవారింటికి కబురు పంపాడు. కాని మామగారు జవాబు ఇవ్వలేదు; ఊరికే జాప్యం చేసేవాడు. ఈ విషయం ప్రజలు పది విధాలుగా చెప్పుకుంటారు. అప్పుడు అ ఊరిలో తహసీలుదారు గారింట్లో పిల్లలను సంరక్షించే ఆయా పనిచేసేది మన్‌చనియా. కేవలం ఆమె నెలజీతంపై ఆధారపడే ఆమె తల్లితండ్రులు జీవించే వారని చెప్పుకుంటారు లోకులు. ఆ మాట విని పరసాదీ యొక్క రక్తం ఉడికిపోయేది. వయస్సు యొక్క వేడిమి, దాని పైన రూపాయిల వేడిమి. వంట నూనె తీసుకుని, లాఠీ పట్టుకుని, అత్త వారింటికి వెళ్లాడు అతను. మాటల పోటీ కర్రలతో దెబ్బలాట, అన్నీ జరిపి తన భార్యపై తనకున్న హక్కుని పురస్కరించుకుని తను కూడా ఆమెను తీసుకు వచ్చాడు. ఊరి బైట పొలాల దగ్గరకు ఎద్దు బండి చేరుకునే సరికి, వెనక్కి చూస్తే ఒక నల్లకుక్క కూడా రావడం కనపడింది.

"ఈ కుక్క ఎవరిదే?"

ఇదే మన్‌చనియాతో మొదటిసారిగా పరసాదీ మాట్లాడడం.

"నాది", అని అతి భీతితో పలికింది.

"నీదా!"

మన్‌చనియా ముఖం పొంగిపోయింది. ఏమి అవుతుందోననే భయం మూలాన కఠినుడైన భర్త. పోట్లాడి తన్ను తీసుకు వెళ్తున్నాడు. కొంత సేపు తర్వాడి అడిగింది: "ఆ కుక్కని బండిలో ఎక్కించుకోవచ్చా?"

"లోపల భద్రంగా ఉంటుందా?"

"ఆ, ఉంటుంది".

బండి నడుస్తూండగా, ఆ కుక్కని ఎక్కించే ప్రయత్నంలో అడిగాడు: "ఓహో ఎల్లాగిది? నువ్వేం బాగా వంగోగలవా? ఇంకా కొంచెం ముందు వైపు తిరిగి కూర్చో!"

ఒంటిమీద బట్ట సద్దుకుని, మన్‌చనియా కుక్కను బండిలోకి ఎత్తి ఎక్కించింది. చూడగా ఆమె బాగా లావు ఒళ్లు ఉన్నదైనా, పని చేయడంలో చాలా సమర్థురాలని తేలింది. ఎప్పుడైనా ఆమె బండ ముఖం గురించి ప్రజలేమైనా అంటే కొంచెం చిరాకుపడి తన మోటు శరీరాన్ని దాచుకునేందుకు కట్టుకున్న బట్ట పూర్తిగా కప్పేసుకునేది. మొదటి రోజునే పరసాదీ ఈ విషయం కనిపెట్టాడు.

"ఎంత బరువు నువ్వు నెత్తిమీద పెట్టుకుని మోయగలవు?"

"ఒక్క మణుగైతే మోయగలను".

ఒక మణుగు బరువు బుట్టనెత్తిపై పెట్టుకుని నడవగలదని తెలుస్తోంది.

ఆమె ముఖం తీరులో కలవరపాటు ప్రస్ఫుటంగా కనుపిస్తోంది. అందు

మూలాన ఆమెను సంభాషణ ద్వారా సావధానురాలిని చేయాలని పరసాదీ, "సంత జరిగే హారదా-హాట్ మా యింటికి 3 క్రోశుల దూరంలో ఉంది. అక్కడి నుంచి గుత్త దుకాణంలో వంట కూరగాయలు కొని తీసుకు వచ్చి పట్టణంలో చిల్లరగా అమ్మడం నా పని", అన్నాడు.

ఇదే ఆమె భర్తతో ప్రథమ సంభాషణ: ఆమె కుక్క గురించి, ఆమె మోటు వళ్ళు గురించి. భర్త ఎప్పుడైతే సంత బజారు గురించీ, వంట కూరగాయల గురించీ మాట్లాడడం మొదలు పెట్టాడో, అతని మాటల యొక్క అంతరార్థం మన్‌చనియా కనిపెట్టగలిగింది.

అంతటితో పూర్తి అవలేదు. తర్వాత కొంచెం దూరం వెళ్లాక తహసీలు దారుగారి ఇద్దరు సిపాయిలు. పరసాదీ కోసం ఎదురు చూస్తూ కనుపించారు. వాళ్లకి తనని కొట్టేందుకు యజమాని అజ్ఞ ఉన్నట్లు తోస్తోంది. కానీ వాళ్లు కొంచమే అవకాశం పొందారు. యజమానికి చెడ్డపేరు తెచ్చేందుకు ఏవో తిట్లు తిట్టి అఖరికి ఇలా వేళాకోళం చేశారు. "రెండు అద నల్లకుక్కలను తీసుకుని మన గ్రామం నుంచి చీకటి పడేసరికి ఒకరు వెళుతూ ఉంటారు. అందులో మోటుకుక్క ఉంటే, బక్క పలచని కుక్క కంటె, బాగుంటుంది. చూదాం".

అల్లా వేళాకోళం చేస్తూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వి వెళ్లి పోయారు సిపాయి లిద్దరూ. ఇది 10 సంవత్సరాల క్రితం జరిగిన సంఘటన. అప్పటి నుంచీ కుక్క ఇక్కడే ఉంటోంది. అప్పటినుంచే, మన్‌చనియా మాట జ్ఞాపకం వచ్చినప్పుడల్లా, ఆమె నల్ల కుక్క గురించి కూడా తలచుకుంటూ ఉంటారు అక్కడి జనం. హైందార్ తలాయ్, హార్‌దాహట్ అలాంటి చోట్లకు తన యింటినుంచి వెళుతున్నప్పుడు, ఆమె కూడా ఆ కుక్క వెంట పడుతుంది. ఏనుగు తొండం లాంటి కుక్క, ఆమె మోటు యజమానురాలు మన్‌చనియా గురించీ, అల్లరిపిల్లలు అదేపనిగా చెప్పుకుంటూ నవ్వుకుంటారు. కుర్రకారు ఇంత నిర్లక్ష్యంగా ఎందుకు ప్రవర్తిస్తారో చెప్పలేము. చెమట కార్చుకుంటూ కూరల బుట్ట నెత్తిమీద పెట్టుకుని మన్‌చనియా రోడ్డుమీద కనుపించేసరికి, ప్లిలకాయల గోళీకాయ ఆట ఆగిపోతుంది. ఒకళ్ల కళ్లల్లోకి మరొకళ్ళు చూసి సంజ్ఞలు చేసుకుంటారు. ఒకడు గొంతెత్తి పాడుతాడు: "మన్-చ-ని-యా" అని మరొకడు శ్రుతి కలుపుతాడు. "ల-ద్-బ-ది-యా" (మోటు మనిషి పైలయ); మన్‌చనియా, లద్‌బదియా! మన్‌చనియా, లద్‌బదియా!" కారియా తోక క్రిందికి దించుకు పోతుంది. మన్‌చనియా దగ్గరగా వచ్చేసరికి ముఠాలోని ఇద్దరు పెద్ద రౌడీలు ఆమెకు చెరో వైపునా నిలబడతారు. ఆమె నడకని అనుకరిస్తూ వాళ్లూ అడుగులు వేస్తారు. "అదర్, బదర్"! "లదర్, బదర్"!"లదర్, బదర్!" (శబ్దానుకరణ).

మన్‌చనియా గుండె చీల్చుకుపోతుంది. ఆమె వాగ్ధరి ఏమంత పల్లంగా ప్రవహించదు. మరే విషయంలోనైనా ఎవరైనా ఆమె వెనకాలపడితే, వాళ్ళకి తిరిగి జవాబు చెప్పడంలో ఆమె వెనుదీయదు. బూతులు, అరుపులు మొదలైన పిల్లల అల్లరికి ఆమె ఎలాగో సద్దుకుంటుంది; కాని ఆమె శరీరం అపకరమైన మోటుతనం గురించి తనని చికాకు పరిచే వెటకారాలు వెక్కిరింతలూ సహించు కోలేదు. ఆమె అలవాటు ప్రకారం వళ్ళంతా బట్టకప్పుకుని దాచుకుందామంటే రెండు చేతులూ బరువు మూటలు పట్టుకుని ఉంటాయి. అల్లరి పిల్లల బారి నుంచి తప్పించుకుని కొంత దూరం నడిచేసరికి కారియా తోక మళ్ళీ పైకి లేచి నిలబడుతుంది. వెనక్కి తిరిగి కుర్రాళ్ల వైపు "భౌభౌ" మని రెండు సార్లు మొరుగుతుంది. మరో సారి రెట్టించి మొరిగాక, తనకి సుపరిచితమైన చోట వాసన చూసి తిరిగి రోడ్డుపై నడవడం మొదలు పెడుతుంది.

మన్‌చనియాకి ఈ చిరాకు పరిస్థితి కాలక్రమేణ కొంచెం తక్కువ బరువుగా తోచింది. మనోబలం పెరిగిన కొలదీ అననుకూల విషయాలు కూడా సానుకూలంగా తోస్తాయి. ఎల్లాగో ఇన్నాళ్లకి తన మోటు శరీరం గురించి రాజీ పడింది. కానీ ఇప్పుడు ఈ రోదనం! 17 రోజుల పట్టాభిషేకం పూర్తి అయిపోయింది మన్‌చనియాకి. దేన్ని దేహంలో ధరించి, ఇన్నాళ్ళూ అస్వస్థత సహించి, తన శ్వాసభారాన్ని భరించి, లోకుల విషయంలో తల వంచుకుని కాలం గడిపిందో, అదే ఇప్పుడు తనకు ఆఖరికి శత్రుత్వాన్ని కల్పించింది. శత్రువు ...శత్రువు.

ఇంటి గుమ్మంలో కాళ్ళు జాపుకుని కూర్చుంది మన్‌చనియా. ముసలి కుక్క ఆమె పాదాలు నాకుతోంది. కారియా కంటి కొలకుల్లో కన్నీటి బరువు గోచరమవుతూనే ఉంది. తనకి తెలియకుండానే మన్‌చనియా చేతులు ఆ కుక్క వీపునీ, గుండెనీ నిమురుతున్నాయి. వీపు మీది గరుకు జుత్తు ఆమె వ్రేళ్ల సందుల్లో నిబ్బరంగా నిలబడింది. గుండె మీద ఇంకా మెత్తగా ఉంది. ప్రక్క ఎముకలు చేతి పట్టుకి దొరుకుతున్నాయి. వడిలిపోయిన ఛాతీపై వ్రేళ్ళు నిమురుతూంటే దానికి సుఖంగా ఉండబట్టి అల్లాగే చూస్తూండిపోయింది. మొటిమలలాగ చిన్నచిన్నవి. ప్రయత్నించి చూడకపోతే ఆ నల్ల వెంట్రుకల మధ్య దృష్టి వాటి మీద పడదు. కారియా చెవిపై పేనుల కంటె చిన్నవైన చను మొనలు! వయస్సు మళ్ల బట్టి గత సంవత్సరం నుంచి ముసలి కుక్క ప్రసవించడం మానేసింది. కానీ, అదే బాగుంది.... నూరు రెట్లు బాగుంది!

కారియా అదే పనిగా చూస్తోంది. ఒక సారి మన్‌చనియా ముఖం వైపు. మరొక సారి మెడ క్రిందకు వంచి ఆమె హృదయ భారాన్ని అర్థం చేసుకున్నట్లు ప్రవర్తిస్తోంది. మన్‌చనియా ముఖ కవళికను చూస్తే, తిన్నగా ప్రేమగా

కనపడకపోతేనేం? గుండెపైన చనుమొనలు కిచకిచలు పెడుతున్నాయి.

దుఃఖమైతే అనుభూతికి వచ్చింది. అయినా ఇలాగ కడుపులోని పిల్లాడు గతించడం వల్ల కలిగిన లజ్జా శోకాల భారం మటుకు తొలగి పోవడం లేదు. "సర్కారు వారి హైదర్‌తలా" గ్రామంలో అందరూ ఆమె గురించి ఆ సంగతే చెప్పుకుంటున్నారు. ఎంతైతే ఏమని చెప్పగలదు? ఇంటి బైటకు వెళ్లడానికి సాహసించ లేకపోతోంది మన్‌చనియా. అయినా ఆమెకి ఏమంత శాంతి లభిస్తుందని? చుట్టు ప్రక్కల వాళ్లు వచ్చి ఆమెకి ఓదార్పు చేకూర్చలేకపోయారు కదా! ఆమె అంతా గ్రహించుకుంది. దుప్పటి కప్పుకుని చాప మీద పడుకునే సరికి ఎవరో కదులుతూ ఉన్నట్లు చప్పుడు. ఎవరేం మాట్లాడినా, ఆమె వాళ్లకి జవాబు చెప్పేది కాదు. పరసాదీ ఇంటిలో ఉంటే, మన్‌చనియాకి చికాకు కలిగించే వారిని లోపలికి రానిచ్చే వాడు కాదు. ఒక ముసలమ్మ సానుభూతి చెపుదామని వచ్చేసరికి 'మన్‌చనియా గాఢనిద్రలో ఉందని ఆమెని కోపపడి పంపేశాడు పరసాదీ. కారియా 24 గంటలూ మన్‌చనియా పడకున్న చాప ప్రక్కనే కాపలా కాస్తూ కూర్చునేది. ఎవరైనా తెలుసున్నవాళ్లు (సానుభూతి చెప్పేందుకు) ఇంటిలోకి ప్రవేశించబోతున్నప్పుడు. వాళ్లను చూసి ఒకటి రెండుసార్లు "భౌభౌ'మని మొరిగి తన అసంతృప్తిని ప్రకటించేది.

మన్‌చనియా ఒక మాట వల్ల, స్త్రీ స్వభావం సరిగ్గా అవగాహన చేసుకోగలిగాడు పరసాదీ. మట్టి వైపు చూస్తూ, తన భర్తకి చాలా నెమ్మదిగా "సర్కారు హైదారా'నుంచి నీళ్లు తెమ్మనమని అడిగింది. 'త్రాగేందుకా?' మన్‌చనియా మాట్లాడక ఊరుకుంది. 'స్నానానికా?' మన్‌చనియా కళ్లమ్మట నీళ్లు కారాయి. భర్తతో ఎప్పుడైనా 'సర్కార్ హైదరా' నుంచి స్నానానికి నీళ్లు తెమ్మనమని చెప్పేది భార్య. ఒక బండ వళ్లు మనిషి: స్నానం చేయకపోతే గడవదు. పైగా వంటిపై పొంగిపోయిన పాల వాసన. తన మట్టుకు తనే అసహ్యించుకుంటూ ఉంటుంది. సిగ్గుతో బాధపడి, భర్తని స్నానానికనే నీళ్లు తెమ్మనమంది. 'హైందారా-తలాయ్" చెరువులోంచి అక్కడి వాళ్లు చూస్తుండగా నీళ్ళు తేవడం ఆమెకి చాలా సిగ్గు. పరసాదీ మట్టికుండ పట్టుకుని బయలుదేరాడు. మన్‌చనియా బాల్చి చేత్తో అందిస్తూ తన 'సర్కార్ హైదరా' నుంచి కడవతో నీళ్లు తెస్తుంటే ఇరుగు పరుగు వాళ్లేమనుకుంటారు!

తన సహజబుద్ధితో ఆలోచించుకుని, ఇప్పటి పరిస్థితిలో తన భార్య మనస్సు మరొక విషయంపై మరల్చడం సముచితం అని గ్రహించారు పరసాదీ. ప్రాంగణంలోని పుష్ప కిసలయ గుచ్ఛాలతో కన్నుల పండుగలా తయారు చేసి మన్‌చనియా చేతులతో పెంచిన చెట్ల మధ్య ఆమె కంటికి చెవికి వినోదం కల్పిస్తే

బాగుంటుంది. కాని అది ఎలా సాధ్యం అవుతుంది. వరండాలో కూర్చుని పగలూ, రాత్రీ ఇదే ఆలోచన. ప్రొద్దున్నే లేచి రోజూ గోడ బల్ల చెక్క పై నుంచి కూరలు తీసుకుని బజారు వెళ్లేవాడు. ఈ మూడు రోజులూ మన్‌చనియా సీమ చిక్కుడు కాయలు కోయడం మరచిపోయింది.

తీరిక ఉన్నప్పుడల్లా మన్‌చనియాతో కబుర్లు చెప్పి ఆమె మనస్సుని ఇతర విషయాలపై మరల్చుదామని ప్రయత్నించేవాడు, అయితే మొదలెట్టేందుకు ఒకటి తర్వాత మరొక విషయం ఏదీ బుర్రకి తట్టడం లేదు. మాట్లాడాలంటే గత విషయాల గురించే కానీ అవి మాట్లాడదగిన విషయాలు కాదు. మరే కథైనా చెప్పాలంటే అనుకోకుండా ఇబ్బంది కలిగేది. కూరగాయల మార్కెట్టు గురించి సంభాషించడం వాళ్ల దీర్ఘకాలపు అలవాటు. సీమ చిక్కుడు కాయల గురించి మాట్లాడడం మొదలు పెట్టాడు పరసాదీ: "ఇప్పుడు వాటి ధర బాగానే ఉంది. ఇంకో నెలపోయిన తర్వాత కుక్క శెవుల్లాగ గట్టిగా ఉండే ఆ కూరలని ఎవరు అడుగుతారు? ఇంతకంటె బాగా కాసే చెట్ల వల్ల లాభం జాస్తిగా ఉంటుంది. 'సాత్‌పూతియా' చిక్కుడు కాయలైతే బాగా కాస్తాయి. ఒక్కొక్క ఏత్తనానికి ఏడు రెట్లు కాయలు కాస్తాయి. మన దొడ్లో దసరా ముందు అవే కాస్తాయి. నే నేమనుకుంటున్నానంటే 'ఖగరియా–హాట్'లో జరిగే దసరా ఉత్సవాలలో నీ కోసం అవడలు...."

మాట్లాడుతూ మాట్లాడుతూ ఆగిపోయాడు. మాటల సందర్భం సరిగ్గా కుదరలేదు. అప్పుడు పిల్లవాడు కడుపులో ఉన్నాడు. తన భార్య ఆ రోజుల్లో అవడలు తిందామని సరదా పడేది.

"అవునవును, అకాలంలో పండే కూరల వల్లే లాభం ఎక్కువ. సీమచిక్కుడు కాయలు నిరుటి కంటె ఈ ఏడాది ముందుగా కాస్తున్నాయి. అప్పటికప్పుడు కానీ చచ్చిపోయే చెట్లను నువ్వే పీకి పారేశావు. నా సలహాపై వైశాఖ మాసం నుంచి నీళ్లు పోయడం మొదలు పెట్టావు. చెప్పు, నేను అలా చెప్పాను కదూ?"

మళ్లీ కొంత సేపు ఏదో అవ్యక్త భావంతో మన్‌చనియా ముఖ వైఖరి గమనించి నిలిచిపోయాడు పరసాదీ.

"సొరకాయ చెట్టు ఎంత తేజోవంతంగా వికసిస్తోందో చూడు. ఎంత పెద్ద తొడిమలనుకున్నావ్? బొటనవ్రేలు కంటె లావుగా ఉన్నాయి. రోజూ అన్నంపై గంజి తీసికెళ్లి చెట్టు మొదట్లో పోస్తే అది ఎంత బాగా పెరిగి ఫలిస్తోందో తెలుసా? వాటి కాడలు కోసి అమ్మి పారేస్తే బాగుంటుందని పిస్తుంది. చూడు, ఇంకా ముదరకుండానే ఎల్లా క్రుళ్లి పోయాయో, ముదరకుండానే ఎలా క్రుళ్లి పోయాయో...."

ఇంక అంతకంటె ఏం చెప్పలేకపోయాడు అతను. భార్య ముఖం అకస్మాత్తుగా వెల వెల పోయింది ఎందుకు? పరసాదీ మాట మధ్యలో ఆగిపోయింది. లేచి నిలబడ్డాడు. ఇంక సర్దుకుని ఏం మాట చెప్పాలి? (ఏ మాట చెప్పినా పాత కథ గుర్తుకి వస్తోంది).

కుట్టుపని పట్టుకు కూర్చుంటే కొంచెం మనస్సులో బెంగ మరచి పోవచ్చు. కూరలు అమ్మాక భార్యకు 'కుర్తా' కోసం ఒక కట్‌పీస్ గుడ్డకొని తెచ్చాడు.

మన్‌చనియా అంది "ఈ గుడ్డ తడిపాక చాలా చిన్నదై పోయింది.

"అంతా మరీ నిక్కచ్చిగా బిగువు కుర్తా కుట్టించుకోవడం ఎందుకు? కొంచెం వదులుగా కుట్టించుకుంటే సరిపోను కదా?"

ఆపైన మాట్లాడేందుకూ తోచలేదు. అప్పుడు మన్‌చనియా నేలపై చూస్తూ ఉండిపోయింది. ఎన్నెన్నో కాలక్షేపం చేసే మాటలు చెబుదామనుకున్నాడు. కానీ ఏం చెప్పినా వాటికి అపార్థం తోస్తోంది ఆమెకి.

అతనిలో ప్రయత్న దోషం లేదు. మరునాడు ఒక చిన్న కుక్కను తీసుకు వచ్చాడు. ఒక్కమాటు కళ్ళు చిల్లు పడ్డాయి. "మళ్ళీ ఇదేమిటి తీసుకు వచ్చావ్?"

"కారియా ముసలి దయిపోయింది ఎప్పుడు చనిపోతుందో ఏమో. ఇప్పటి నుంచి ఒక క్రొత్త కుక్కను పెంచుకుంటే మేలు. రోడ్డు మధ్యన చలికి వణకుతూ 'కొయ్‌కొయ్'మంటూంటే దీన్ని తీసుకుని వచ్చాను?"

మన్‌చనియా ఆవేళ బైటకు వెళ్ళడం గురించి పేచీ పెట్టింది. ఎన్నాళ్ళు ఇలా ఇంటిలో ఉండిపోవడం? ఏదో అవస్థ పడిన వాళ్ళలా ఏమిటి ఇంటిలోన కుమిలిపోవడం? ఇంతట్లోకి భర్త కుక్క పిల్లను తీసుకుని హాజరాయ్యాడు.

గొడవ! ఇంతకాలం కారియా ఏటేటా పిల్లలనుకన్నా వాటి పోషణ గురించి బెంగ ఉండేది కాదు నక్కలు ఎన్నెన్నో తినేసేవి; ఇరుగు పొరుగు కుర్రాళ్ళు తీసుకపోయే వారు మిగతా వాటిని. కుక్కని పెంచే ఖర్చు భరించాలంటే ఎన్ని ఆకులూ అలములూ తినాలి? కుక్క ఇంట్లో ఉంటే కేవలం ఆకులూ, అలములూ తినాలా? ఒక ఆసామీ ఇంటి చెత్త కుప్పనుంచి మరో ఆసామి చెత్త కుప్పవరకూ 24 గంటలూ కాపలా కాస్తూ తిరగాలి!

అయితేనేం భర్త తనంతట తాను తీసుకువస్తే, దాని కోసం ఇంట్లో చోటు చేయవలసిందే.

ముసలికుక్కని దింపి కుక్క పిల్లను చేత్తో తీసుకుంది మన్‌చనియా. ఇంటి నుంచి బైటకు వెళ్ళడానికి ఆమెకి సిగ్గువేస్తోంది. పోనీ, ఏదైనా అవకాశం దొరికిందనేసరికి, కుక్కపిల్ల వచ్చికూర్చుంది. ఒక వేళ ఏ పనైనా ఆలస్యంగా చేయవలసి వస్తే ఇప్పుడొక మిషపై తప్పించుకునే క్రొత్త కాలక్షేపం కలిగింది.

ఒకసారి కుక్క పిల్ల ముక్కు ముందుకి జాపి 'పిసపిస'మని శబ్దం చేస్తూ వాసన చూసింది. బట్టల మధ్య ముఖం దూర్చదలచుకుంది. నాలుక చిగురుతో వ్రేళ్ళూ, చెయ్యి లోపలా పైనా స్పృశించింది. మన్చనియా శరీరపు గంధం దానికి అనుకూలంగా తోచింది. లోపల ఉన్న పాలు పైకి పొంగి వస్తున్నప్పుడు వచ్చే పరిమళం దానికి పరిచితమైనది. కొంచెం తగ్గి, మరొకసారి ఆ పరిమళాన్ని గ్రహించింది కుక్క పిల్ల. తన సహజ ప్రవృత్తి వల్ల ఈ వాసనే తనకొక చిమ్మిగొట్టం లాగ సంకేతం అందిస్తుందని తెలుసుకుంది.

"బాబోయ్, బాబోయ్! ఒక్క నిముషమైనా నిశ్చింతగా ఉండనియ్యి! ఊరికే కూర్చో, ఈ ప్రక్క!"

ఒళ్లోంచి తీసి కుక్క పిల్లని ప్రక్కన కూర్చోబెట్టింది.

కారియా కంఠం నుంచి ఒక శబ్దం బైటకు వచ్చింది- గర్,గర్,గర్. క్రొత్తగా వచ్చిన ఈ కుక్కపిల్ల హడావుడి దానికేం నచ్చలేదు. మొదటి నుంచి చివరి వరకూ వ్యవహారం ఎలా నడుస్తూందో అదంతా కూడా కనిపెట్టుతూనే ఉంది. ఒకసారి కుక్క పిల్ల దగ్గరకు వెళ్లి దాని శరీరం వాసన చూసింది. ఆ పరిమళం మధ్య ఏముందో ఏమి లేదో తెలిసి వచ్చింది. ఒక మాటు ఆవులించి, వరండానుంచి బైటకు వెళ్లి ప్రాంగణంలో కునుకుపాట్లు పడుతూ కూర్చుంది. కుక్క పిల్ల విషయంలో దానికి చాలా ఉదాసీనత కలిగింది.

కుక్క పిల్ల మెత్తని జుట్టుని చేత్తో నిమురుతూంది మన్చనియా. సిల్కులాగ ఎంతో హాయిగా ఉంది ముట్టుకుంటే. వాటి మధ్య వ్రేలు పెట్టినప్పుడు కలిగిన సుఖం మూలాన శరీరంలో కలిగిన గగుర్పాటు వల్ల ఏమీ చిరాకు అనిపించలేదు. తన వ్రేలి చిగురు ఆ కుక్క పిల్ల కోమల గాత్ర స్పర్శని అనుభవించినప్పుడు మన్చనియాకు ఏదో పరధ్యానంగా అనిపించింది.

ఆ రోజు కారోజు చనుపాలు వృథాగా పోతున్నాయి. ఒకసారి ఒక పళ్లెరంలోకి తన పాలు పితికి ఆ కుక్కపిల్ల ముందు ఉంచింది మన్చనియా. "రెపరెప" మంటూ త్రాగేసింది కుక్కపిల్ల. అది త్రాగుతున్న చప్పుడు ఎంతో అహ్లాదకరంగా ఉంది. దానికేసి తదేకంగా చూస్తూ ఉండిపోయింది మన్చనియా.

అటు పెరటివైపు కారియా చెవి ఎగబెట్టి లేచింది. దాని నిస్పృహ తొలగింది. ఒక్క మాటుగా వరండాలోని పాల పళ్లెం దగ్గరకు వచ్చేసింది.

"నువ్వెందు కొచ్చావ్ మళ్లీ? పో! పొమ్మంటూంటే నీక్కాదూ!"

'ఘ్యా, య్యా, య్యా' మంటూ కారియా గొంతుకనుంచి ఒక శబ్దం పైకి వినిపించింది.

"ఇదేం నువ్వు తినే వస్తువు కాదు! ఏం అలా కోపంగా చూస్తావ్? ఇంత చిన్న

కుక్క పిల్ల వైనా నీకు అసూయ? సిగ్గు లేదూ? పో అవతలకి!"

ఘుర్-ర్-ర్-ర్-ర్.

అంటే ఇదంతా కారియాకి నచ్చలేదు, కాని యజమానురాలి మాట ధిక్కరించేందుకు ఏం ఉపాయం....

ఇంటి పనులు చక్క బెట్టుకుని మన్చనియా నెత్తిపై తట్ట పెట్టుకుని బైటకు బయలు దేరింది. చిరకాలపు అలవాటు ప్రకారం కారియా ఒళ్ళు సాచి నిలబడింది.

"నువ్వెందుకు లేచావు? నువ్వుండిపో! ఈ వేళ నువ్వు నాతో రానక్కరలేదు! ఎదురు చెప్పకు! ఫో! ఫో ఇంట్లోకి!"

గేటు తలుపు తాళం వేసి మన్చనియా ఎప్పుడైతే వెళ్లిందో అప్పుడు కారియా భౌభౌమని అరుస్తూ చుట్టుప్రక్కలంతా గొడవ చేసేసింది.

ఎవరికి భయపడి ఆమె బైటకు వెళ్లేందుకు శంకించేదో, వాళ్లే ఇప్పుడు మళ్లీ ఎదురయ్యారు. వేళాకోళపు రుచికి అలవాటు పడ్డ అల్లరి కుర్రాళ్లకు జాలీ నాలీ ఉండదు. ఈ రోజు కూడా మన్చనియా కనుపించేసరికి వాళ్ల గోళీకాయ ఆట ఆగిపోయింది. ఈ వేళ 'కూరగాయల బొర్రమ్మ' ఒక్కర్తీ వెళుతోంది ఏమిటో! కాపలా కుక్క కూడా లేదే మర్రా?... పిచ్చికూతలు కూస్తూ ఆమె నడకను అనుకరిస్తూ వాళ్ళు గంతులు వేయలేదు. ఊరికే వాళ్లల్లోవాళ్ళు పూతన రాక్షసి కథ చెప్పుకుంటూ వేళాకోళాలు ఆడుతున్నారు. మన్చనియాకు అంతా వినిపించింది. కళ్ళు, చెవులూ మూసుకుని అక్కడి నుంచి పరుగు పెట్టి తప్పించుకుంది. అటుపైన ఎవరింటిలో కూరలు అమ్మడానికి వెళితే, ఆ ఇంటి స్త్రీలు ఆమెను ఈ మధ్య జరిగిన విషాద సంఘటన గురించి గుచ్చి గుచ్చి అడిగేవారు. పోలీసు వాళ్ల అచూకీ లాగ! ఎవరికేం తెలుస్తుంది? లేకపోతే తన బుర్ర దగ్ధమైనట్లు ఏ తల్లికైనా జరిగితే ఆమె ఇలా నొక్కి నొక్కి ప్రశ్నించగలదా? తన భర్త రెండు మూడు రోజులు ఇంటింటికి వెళ్లి కూరలు అమ్మే విషయంలో ఆమెను అడ్డుపెట్టాడు. బజారుకి పట్టికెళ్లి అక్కడ ఒక చోట కూర్చుని అమ్మమన్నాడు. నిక్కచ్చిగా చెప్పేశాడు. అప్పుడు పరసాదీ మాట అర్థం చేసుకోలేకపోయింది. అంటే ఇంటింటికీ వెళితే ఎక్కువ శ్రమ అయిపోతూందని అలా అన్నాడనుకుంది.

అప్పటి నుంచి ఏ గృహస్థు ఇంటికీ వెళ్లకుండా తిన్నగా బజారుకి వెళ్లేది.

ఇంటికి భార్యాభర్తలు కలిసి తిరిగి వచ్చారు. వీధి తలుపు తెరిచిన చప్పుడైనా పూర్వంలాగ తోకాడిస్తూ వాళ్లకు ఎదురు రాలేదు కారియా. వాళ్ళు వచ్చినట్లు గమనించిన శబ్దం ఏమీ రాలేదు. ఏం జరిగింది? దీపం వెలిగించి చూసేసరికి దొడ్డిలో కాళ్ళు జాపి ఒక ప్రక్కకి పడుక్కుని ఉంది కారియా; కుక్కపిల్లేమో దాని

వడిలిపోయిన ఛాతీని శక్తి కొలదీ నాకుతోంది. మధ్య మధ్య ఒక చన్ను విడిచి మరొక చన్ను కుడుస్తోంది. దగ్గరగా వెళ్లి మన్‌చనియా తన చేత్తో కుక్కపిల్లను ఇవతలికి లాగేసరికి, కారియా వళ్లు దులుపుకుని లేచి నిలబడింది. చాలాసేపు తేరిపార చూసింది. ఈ వ్యవహారం అంతా నీకథ లాంటిదే, నీ పని నీకే అర్థం అవడం లేదు, అన్నట్లు. ఒక ప్రక్కకి పడుకోగా పడుకోగా వళ్లూ, కాళ్లూ చేతులూ మొద్దుబారిపోయాయి. కారియా మట్టి వాసన చూస్తూ చూస్తూ ఇంటి బైటకు వెళ్లిపోయింది.

"ఇప్పటి నుంచి ఇంక దీనికో పేరు పెట్టాలి . నా ఉద్దేశంలో దీనిపేరు 'బచ్చా' అని పెడితే బాగుంటుంది".

"అవును 'బచ్చా' అనే పేరు బాగుంటుంది".

"బచ్చా! ఒరే బచ్చా! మళ్లీ కళ్ళు మిటమిట లాడిస్తూ చూస్తున్నావు. వేలు కరుచుకోవద్దని చెప్పలేదూ నీకు! మొద్దు తిరుగుబోతు! అదేం తినే వస్తువనుకున్నావ్? అకలేస్తోందా? అయితే నీకేదో ఇస్తాంలే! అట్టేసేపు పట్టదు. పిల్లలకు గంట గంటకీ పాలు పట్టాలి కదా! రా!"

"కుయ్, కుయ్ మని చేసే శబ్దం ఉందే, అది కుక్కపిల్లలు ఆకలి వేసేటప్పుడు పిలిచే కేక".

"ఆకలి వేసినప్పుడు మాత్రమే కాదు, మిగతా సమయాల్లో కూడా అది అలాంటి శబ్దమే చేస్తుంది".

మన్‌చనియా ముఖంలో చిరునవ్వు ప్రకాశిస్తోంది. ఆ చిరునవ్వే కనుపించకపోతే, భర్త మిగతా సంగతి అంతా పూర్తిగా గ్రహించుకో లేకపోయేవాడన్న మాట. 15 రోజుల తర్వాత ఇదే మొదటి సారిగా ఆమె నవ్వింది.

"ఆ విషయాలన్నీ నీకు బాగా తెలుసు. కుక్కను పెంచగా పెంచగా నీకు అన్ని విషయాల్లోనూ కట్టుదిట్టం అయింది".

మరునాడు రోజంతా కారియా వక్షస్థలాన్ని నాకుతూనే ఉంది 'బచ్చా'! రోజంతా కారియా వళ్లు జాపుకుని పడుక్కుంది. ఏదో బాగా విశ్రాంతి కలిగినట్లు తోస్తోంది. మన్‌చనియా తట్టనెత్తి పై పెట్టుకుని బైటకు వెళుతున్నప్పుడు ముసలికుక్క కూడా వెళ్లడం మానేసింది. అవిడ ఏమీ అలా అజ్ఞాపించకపోయినా సరే, తనంతట తానే మానేసింది. బజారు నుంచి ఆమె తిరిగి వచ్చేసరికి, ఇంత క్రితం మాదిరిగానే ముసలికుక్క పడుక్కుని ఉంటే, దాని ఛాతీ నాకుతూ 'బచ్చా' ఉంది. కారియా చనుమొనలు ఇప్పుడింక మొటిమల్లా లేవు. కొంచెం పెద్దవయ్యాయి. వాటి మొదళ్లు కూడా కొంచెం పటిష్టమయ్యాయి. కొంచెం వంగ పండు రంగులాగ మెరుస్తున్నాయి. ఏమీ గీసుకున్నట్లు పుండ్లు లేవు కదా! ఊరికే నాకుతూంటే,

కుదుస్తూంటే బచ్చా వాట్లనలా పీకుతూంటే! ఏం చెప్పలేం వ్రేలుతో పట్టుకుని చూసింది మన్చనియా.... ఏం లేదు. ఇవేమీ గోకినట్టి పుళ్లుకాదు నాడులూ, నరాలూ వంగపండు రంగులాంటి పలచని మరకలు తప్పిస్తే, అవి చక్కగా పైకి కొట్టవచ్చినట్లు కనుపిస్తున్నాయి. బాగా జిడ్డుగా ఉంది దాని చర్మం. కారియా ముఖ వైఖరి చూస్తే, మన్చనియా నిష్కారణ కౌతూహలం దానికి సందేహాస్పదంగా ఉన్నట్లు తెలుస్తుంది. ఇలా నిర్ఘాంతపోయి చూడడానికి వాళ్లిద్దరి మధ్యా ఏం రహస్యం ఉంది? ఇంత క్రితం ఇటువంటి చూపులు లేవా?

తగరపు పళ్లెరం చేత్తో పట్టుకుని మన్చనియా వరండాలోంచి పిలుస్తోంది: "బచ్చా! బచ్చా! రా రా నువ్వు! కుర్-కుర్-కుర్-కుర్- రారా బాబూ!"

'బచ్చా'కు ఎవరు పిలుస్తున్నారో అర్థమయింది. "ఘుర్ఘుర్" మని చప్పుడు చేస్తూ లేచి వరండాలోకి వచ్చింది. ఒక్కసారి ఎగిరి మన్చనియా పై పడాలని ఉంది దానికి. మోకాళ్లపై బట్టలో 'ఖరఖర'మని చప్పుడు చేస్తూ గోళ్లతో గీకడం మొదలుపెట్టింది.

"ఉండు ఉండు! ఒక్క క్షణం ఓపిక పట్టలేవా? ఎందుకొచ్చావు? కారియా దగ్గరకు వెళ్లలేకపోయావా? నీకోకొత్త తల్లి దొరికింది కాదూ? దాని రొమ్ము నాక కూడదా? ఇంకా దాన్ని వాసన చూస్తావా?"

ఏమిటి ఈ విషయం -ఏం జరిగి ఏమయింది? ఇల్లాంటిదేదో జరిగినట్లు గుర్తుకు వస్తోంది. మరచి పోవడమెలాగ!...

కారియా మెడ త్రిప్పిప్రాంగణం నుంచి చూసింది. దాని కళ్ల వెనుక నుంచి ఎక్కడకు పోయింది? మన్చనియా మాట వినబడింది. ఆమె హావభావాలను, ప్రతీ అంగ భంగిమను గమనిస్తోంది. ఆ తగరపు పళ్లెరం ఎక్కడకి తీసుకు వెళ్తుందో, అటు వైపు చెవి త్రిప్పి నిలబడి ఉండి పోయింది..'బచ్చా' చేతి నుంచి విడిపించుకుని, బైట ఒక చుట్టు తిరిగి వచ్చి దాని ప్రక్కన ఉండడం స్వాభావికమే, కాని అలా చేయడానికి సిగ్గువేసి ఊరుకుంది కారియా. ఎంతో ఆతురతతో 'బచ్చా' తిరిగి రావడం కోసం ఎదురుచూస్తోంది...పళ్లెరంలో పాలు పూర్తిగా నాకే దాక కూడా, 'బచ్చా' ఇంకా అక్కడ 'కుయ్ కుయ్' మంటూ ఉండిపోయిందేమిటి? ఆ పళ్లెం క్రింద చుట్టకుదురుని ఇంకా వాసన చూస్తూ ఉందేం?...

"అయిందా?"

ఇదేం అభిమానమో!... మన్చనియా గొంతుకలో ఇటువంటి బాధా కరమైన ధ్వనిని కారియా పూర్తిగా ఎరుగును. 'తప్పు'మని ఒక్కసారి దుమికి వరండాలో బచ్చా మెడపైన పళ్లతో పట్టుకుని దాన్ని లాక్కుని తీసుకు వచ్చింది. తర్వాత దాని యథాస్థానంలోకి వెళ్లింది. అక్కడ ఏం చేయదలచుకుందో ఏమో... తిన్నగా బచ్చా

మెడపైన నాకుతూ కొంచెం విశ్రాంతిని పొందింది. ఆ పైన ఒక ప్రక్కగా పడుకుని తను కూడా విశ్రాంతి తీసుకుంది.. లేదు ఈసారి చెప్పక్కరలేదు! ఈసారి ఏం జరుగుతుందో దాని గురించి బచ్చాకు వేరే తెలియజేయనక్కరలేదు.

కర్ర స్తంభం పట్టుకుని, నోటమ్మట మాట రాకుండా, నిర్ఘాంతపోయి చూస్తోంది మన్చనియా.... ఇంకా ముసలి కారియాకు కోరిక తీరలేదు! బాగా నొక్కిపెట్టి నలిపేసింది బచ్చాని. శరీరం కదపకుండా కేవలం తల త్రిప్పి దాన్ని అనేక విధాలుగా కుమ్మడానికి ప్రయత్నించింది కారియా. ఒకవేళ శరీరం కదిపితే బచ్చాకు చన్నుకుడవడం సౌకర్యంగా ఉండదనో లేక తన మట్టుకు తనకి విశ్రాంతి ఉండదనో ఎవరు చెప్పగలరు? ఈ ముసలి కుక్క యొక్క హృదయ పరివర్తనాన్ని పరసాదీ ఏమైనా గమనించాడా? భర్తని పిలిచి ఇదంతా చూపించాలని ఆమెకు బాగా కోరిక కలిగింది, కాని కొంచెం సందేహించింది.

ఈ సంగతి అంతటిపైనా పరసాదీ దృష్టి పడకపోలేదు, కానీ ఈ విషయం మన్చనియాతో ఎలా చర్చించడం?

ఏదో నక్క వాసన రాబట్టి ఆ రాత్రంతా కారియా మొరుగుతూనే ఉంది. దాని మూలాన ఆ రాత్రి మన్చనియాకు చాలాసార్లు నిద్రా భంగం అయింది.

మరునాడు లేచి చూసే సరికి కారియా కానీ బచ్చా కానీ ఎక్కడా కనుపించలేదు. వసారాలో ఎక్కడి కెళ్లుంటారు చెప్మా! 'సాత్‌పూతియా' చిక్కుడు కాయల పందిరి క్రింద ఒక సందుకు పెట్టెలాంటి కర్రలతో కట్టిన గూడు ఉంది. ఒకప్పుడు మన్చనియా బాతులను పెంచింది, వాటికోసం ఆ బుల్లి 'గది' కట్టించింది. వెతికి చూసేసరికి ఆ పెట్టె లాంటి చిన్న 'గది'లోకి బచ్చాను తీసికెళ్లి నిద్ర పోతున్న కారియా కనుపించింది. ఆ గూడు నాలుగు ప్రక్కలా మూసి ఉంది, కేవలం ఒక ప్రక్క బాతులు ప్రవేశించేందుకు ఒక చిన్న తలుపు లాంటిది ఉంది.

తల క్రిందకు వంచి చూస్తోంది మన్చనియా లోపల చీకటిగా ఉండబట్టి సరిగ్గా కనుపించడం లేదు.

ఘుర్-ర్-ర్-ర్-ర్... ఇప్పుడింక ఎవరి అవసర ముంది.?

"ఊ, చంపేస్తున్నావ్! నోరు మూసుకో కారియా!"

మన్చనియా అరుగుమీద నుంచి చిక్కుడు కాయ విసిరింది. 'ఖట్‌ఖట్'మని చప్పుడు అయాక, మొరుగుతూ మొరుగుతూ లేచింది కారియా. పరసాదీ వచ్చి అడిగాడు: "ఏమిటి అంత మొరుగు ఎందుకు?"

"దానికేదో అనిష్టమయింది"

"సాతపూతియా చిక్కుడు పందిరి ఇప్పుడు దాని స్వస్థానం అయినట్లు కనుపిస్తోంది, కాదూ?"

"అవును, మరింకే మనుకున్నారు?"

"క్రొత్త బిడ్డను సంపాదించింది".

"సప్త జన్మల సంతానం!"

ఆ తర్వాత ఆ విషయంలో భర్తకి మరింత మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా ఉండేందుకు కడవ పుచ్చుకుని 'సర్కార్ హైందారాతలాయ్'కి నీళ్ళు తెచ్చేందుకు వెళ్లింది.

పరసాదీ 'అమ్మయ్య!' అన్నట్లుగా విశ్రాంతిని సూచించే నిట్టూర్పు విడిచాడు. భార్యా భర్తల బాంధవ్యం ఒక కలవర పరిచే స్థానాన్ని చేరుకుంది - వాళ్లంతట వాళ్లకి తెలియకుండానే.

ఆ రోజు అతను కూరలు కొనేందుకు 'హరదా-హాట్' కి వెళ్లవలసి ఉంది. కొంత కంగారు పడవలసి ఉంది, అందుచేత తొందరగా వంట కోసం నిప్పు అంటించాడు. వంట కట్టెలు విరుస్తున్న చప్పుడు విని 'భౌ, భౌ' మంటు మొరుగుతూ లేచింది కారియా.

"తస్సాదియ్యా! కాస్త పుల్ల విరిగిన చప్పుడవడానికి వీలులేదు"....

నిజమే. గోడమీద కాకి కనిపిస్తే మొరుగుతూ లేస్తుంది కారియా; పరసాదీ వసారాలో తిరుగుతూంటే మొరుగుతుంది; ఇంటి కప్పు పై గ్రద్ద వాలితే మొరుగుతుంది; గుమ్మం బైట పిల్లి కనిపిస్తే మొరుగ్తుతుంది. అందరూ శత్రువులే, అందరి నుంచీ ఏదో ఆపద సంభవిస్తోనే ఉంటుంది. అన్నీ కాపలా కాస్తూ ఉండాలి; కనిపెడుతూ ఉంచాలి, కాస్త ఏదైనా ఆపద యొక్క వాసన ముక్కుకి తగిలితే చాలు అరిచి హడల గొట్టెయ్యాలి, 24 గంటలూ కన్నూ చెవీ, ముక్కూ, అన్నీ తెరిచి ఉంచాలి; ఎవరినీ నమ్మడానికి లేదు; శత్రువు దాడిచేసే ముందే వాడిపై ఎగిరి పడాలి; కాస్త అవకాశం దొరికితే చాలు దానితో పడలేం....

పక్క కాలువ ముందు ఒక ముంగిస కనిపిస్తే బాతు గూడు నుంచి బైటకు వచ్చేసింది కారియా. పొయ్యి ప్రక్క నుంచి తీక్షణంగా చూస్తున్నాడు కుక్కని పరసాదీ.... ఎర్ర బడ్డ దాని రెండు కళ్లూ, దాని వళ్లూ, దాని హావభావాలూ చూస్తూంటే మళ్లీ ఇంకో బిడ్డను కనే లక్షణాలు సుస్పష్టంగా గోచరిస్తున్నాయి. దాని వెనకాలే కుక్కపిల్ల కూడా బాతు గూడు నుంచి ఇవతలికి వచ్చింది. ముంగిస భయపడి పారిపోయింది. అయినా కారియా హడావుడీ, మొరుగులు తగ్గలేదు. బాగా దొర్లడం మూలాన దాని ఛాతీ పై చాలా మట్టుకు మట్టి అంటుకుంది. నడుస్తున్నప్పుడు కూడా కారియా వక్షస్థలాన్ని నాకడం మానలేదు బచ్చా కాని ఏమిటిది? అదే అది! ఏం పొరపాటు లేదు.... అయినా ఇదేలా సంభవం అయింది? వాళ్లిద్దరూ మళ్లీ బాతు గూడులో ప్రవేశించారు.... నిర్ఘాంతపోయాడు

పరసాదీ. జంతువుల విషయంలో ఇలా జరుగుతందని అతనికి తెలియదు. మన్చనియా ఏం కనిపెట్టింది? మన్చనియాకు ఇదంతా చెప్పాలా? చుట్టు ప్రక్కల వాళ్లను పిలిచి ఈ తమాషా అంతా చూపించుదామనుకున్నాడు; కాని అది సరియైన ఉపాయం కాదు. అందుచేత నోరు మూసుకుని ఊరుకున్నాడు.

హరదా-హాట్ వెళ్లే త్రోవలో మన్చనియా శునక ద్వయం విషయం తర్కించుకుంది. ఆహారం తీసుకునేందుకు పిలిచినా ఆ రోజున కారియా బాతు గూడు నుంచి బైటకు రాలేదు; తనూ తినలేదు, బచ్చాను కూడా తినేందుకు వెళ్లనీయలేదు: బచ్చా గురించే విశేషమైన ఆలోచన....

"రారా, అన్నం తినకుండా ఎలా ఉండగలవు?", అని ఎంత బ్రతిమాలినా పని జరగలేదు. ఇంతకంటె ఈ విషయం గురించి మన్చనియాతో చర్చించడానికి పరసాదీ మనసు ఒప్పడం లేదు. అయినా మన్చనియా గ్రహించలేక పోతుందా? ఏమైనా తెలిసిందా!...

ఇంటికి తిరిగి వచ్చేసరికి ప్రొద్దు పోయింది. అయినా రోజన్తమానం బచ్చా తినకుండా ఉండిపోయింది. ఇది మన్చనియాకు చాలా దుఃఖకరమైన సంగతి. తగరపు పళ్లెరంలో తీసుకుని వెళ్లింది బాతు గూడువైపు.

"బచ్చా! బచ్చా! రారా బాబూ రారా! కుర్-కుర్-కుర్-కుర్-కుర్-కుర్!"

ఇంట్లోంచి పరసాదీ అన్నాడు: "అది వచ్చేసిందే!"

వాస్తవానికి బచ్చా రాలేదు. బాతుగూడు రంధ్రం మధ్య నుంచి ముఖం బైటకి పెట్టి "భౌభౌ" మని మొరిగింది కారియా. పళ్లు బైటకు పెట్టి ఆహారం కొరకడానికి ప్రయత్నించింది.

"నిన్ను పిలిచి చచ్చిందెవరు?నువ్వు నోరు మూసుకో?"

ఒక కాలు బైటకు జాపుకుని బైటకు వచ్చింది కారియా. ఇది తనకు పరిచితమైన కారియా కాదు, ఇది పూర్తిగా మరొక మూర్తి. విషయం సరిగ్గా గ్రహించుకునే ముందరగానే, శత్రువుపై విరుచుకు పడింది; మన్చనియాని పీకి, కొరికి ముక్కలుముక్కలు చేద్దామా అన్నట్లు మీద పడింది కారియా. కంగారుగా ఎగిరిపడిపోయింది అనప పాదుపై మన్చనియా. కట్టుకున్న బట్ట పీలికలై పోయింది; వ్రేళ్ల మధ్య నుంచి రక్తం ప్రవహిస్తోంది, "ఆ, ఆ" అంటూ కర్రపట్టుకుని వచ్చాడు పరసాదీ; కాని పరసాదీకి అదంతా ఏం తెలియడం లేదు. బాతుగూడు రంధ్రం నుంచి చీల్చుకుని వచ్చేవరకూ ఆమె కారియా ఛాతీపై తన దృష్టిని ప్రసరింపచేయలేదు. కారియా చన్నుల నుంచి పాలు బైటకు వస్తున్నాయి. అదే వెచ్చని, తడిగా ఉన్న వ్రేళ్లాడుతూ ఉన్న మాంస పిండాల భారమే తన వ్రేళ్లపై పడింది- ఆ కుక్క తనపై దాడి చేసినప్పుడు.... అవును,

తడితడిగా ఉన్నది! కారియా వక్షస్థలం నుంచి పాలు కారాయి. ఇప్పుడు తన వ్రేళ్లమధ్య కారియా పాలే రక్తంతో పాటు కలిసి పడ్డాయి.

మన్చనియా శాపభారం ఒక పెద్ద రాతి బండ కంటె ఆమె గుండెపై బరువుగా పడింది.

---

('సత్రరేఖార్ బాబా', 1959)

# సరిహద్దురేఖ

ఆశాపూర్ణాదేవి

అందరూ విసుక్కుని వెళ్లిపోయారు.

ఆఖరికి సతీనాథ్ తన యింటి రెండవ అంతస్తు నుంచి లేచి వచ్చాడు. వచ్చి ఇలా తీవ్ర స్వరంతో పలికాడు: "ఛబీ, అసభ్యతకు కూడా ఒక హద్దు ఉంటే బాగుంటుంది. కానీ నువ్వు ఈ పెళ్లివారి ముందు చూపించావే, ఆ అసభ్యతకు ఏమీ హద్దు లేకుండా పోయింది. నన్ను ఇంతమంది బంధువుల మధ్య అతి నీచంగా నువ్వు అవమానించినా, నా ముఖంలో ఏం తక్కువ నవ్వు కనిపించలేదులే. ఇంక దయచేసి వెళ్ళు!"

రెండవ అంతస్తు పైన కప్పు వేసేందుకు సాంక్షను అవలేదు; అయినా ఛబీ కోసం పెంకుల కప్పు వేసి ఒక చిన్నగది కట్టటం జరిగింది. ఛబీ ఈ పెంకుల కప్పుల గదిలో వెలుగు ప్రవేశించదు. క్రింద అంతస్తు వరండానుంచి వెలిగే దీపపు ఒక సన్నని కిరణం అక్కడ ప్రతిబింబించి ఆ గది గుమ్మాన్ని కాస్త కనుపించేలా చేస్తుంది.

ఆ గుమ్మం తలుపు పై చేయి వేసుకుని నిలబడింది ఛబీ; అక్కడ తలుపు పైన ఆమె చేతి వ్రేళ్లూ, ఒక ప్రక్క చెంపా మటుకు కనుపిస్తున్నాయి. కాని అవి చూసినంత మాత్రాన ఛబీ ముఖకవళిక పట్టుబడదు.

పట్టుబడదు-ఇదివరలో లాగే మొండిగా బండగా ఉంది. సతీనాథ్ పిలుస్తూ వచ్చే ముందు ఏ మొండి పట్టులో వుందో ఇప్పుడు అంతకంటె పిచ్చి పట్టుదలతో ఉంది. ఛబీ ఈ అవస్థలోని మార్పు మట్టుకు అర్థం కావడంలేదు. ఎంతగా గొంతుతో ఛబీ ఇలా సతీనాథ్‌తో: "మళ్లీ కష్టపడి ఎందుకు వచ్చావు? నే నిదివరకే చెప్పాను...."

"అవును తెలుసు...." అని చిరాకుగానూ, కోపంగానూ అన్నాడు సతీనాథ్: "తెలుసు ఒక్కొక్కరూ ఇంటిల్లిపాది జనం నిన్ను స్తోత్రం చేసేందుకు వచ్చారని వాళ్లందరినీ నువ్వు ఇది తినకండి, ఇలా కిందకు వంగకండి' అని అరుస్తూ హదల గొట్టావని. మీ వదినగారు చేతులు జోడించుకుని తిరిగి వెళ్లి పోయిందని కూడా విన్నాను. అందుచేత - నీ-".

ఇప్పుడు ఛబీ ముఖం కనబడలేదు.

ఛబీ ఇంటిలో నుంచి కొద్దిగా బైటకు వస్తే కనుపిస్తూ ఉంటుంది. కానీ ఇప్పుడు బైటకు రానేలేదు. ఆ పెంకుటి గది తలుపు ఆమెను, సీతాదేవిని పర్ణశాల ముందు గీసిన గీత లాగ, అపుజేసింది. ఆ గుమ్మపు సరిహద్దు ఆమె దాటితే ఎవరో

రావణుని చేయి ఆమె మీద పడుతుందన్నట్లు!కానీ తలుపు మూసుకుని ప్రక్క పరచుకుని, పడుకునేందుకు ఆమెకు అవకాశం దొరకలేదు. ఆ సాయంత్రం ఒకరి తర్వాత మరొకరు వచ్చి ఆమెను పిలుస్తూనే ఉన్నారు.

"ఓ ఛబీ, 500 మంది వచ్చి ఉన్నారు క్రింద; ఎంతో మంది 'ఛబీ, ఛబీ' అంటూ నీ కోసం వెతుకుతున్నారు; ఒక్క మాటు రావే!.... "ఓ ఛబీ, మీ అన్నయ్య గారి అల్లుడు ఎలా ఉంటాడే ఒక్కసారి వచ్చి చూపించవే!" ..."మేనత్తా, పెళ్లి వారింట్లో అన్ని ఏర్పాట్లు చేయకుండా వచ్చేశావు, నాన్నగారు కోపంతో మండిపడుతున్నారు త్వరగా రా!"

కాని ఛబీ కదలలేదు.

ఛబీ దురభిమానం సడలలేదు.

ఛబీ, "తల నొప్పిగా ఉంది", అంది.

అయినప్పటికీ, రోజస్తమానం ఏమీ లేదు. ఏ రోజా ఏమీ లేదు. మొదటి నుంచి పెళ్లి పనులు ఛబీ చక్క బెట్టింది. వంటిల్లు, సామానుగది, భోజనపు గది, పూజగది, అన్నీ చక్రంలా తిరిగి చక్కగా ఏర్పాట్లు చేసింది : ఏ ఘటన మూలాన పెళ్లినాటి సాయంకాలం ఆమెలో ఈ దురభిమానం కలిగి ఆమెను పడకపై ఉండిపోయేలాగ చేసిందో చెప్పలేము. పెళ్లి సమయంలో అంతా ఆమె కోసం వెతికారు.

ఛబీ ఎక్కడ? ఛబీ!

ముహూర్తానికి కావలసిన వస్తువులు ఏవీ కనబడవేం? ఎక్కడ ఉన్నాయి?

నిజానికి దొరికాయనుకోండి, అవన్నీ ప్రక్కనే ఉన్నాయి. అయినా ఎవరైనా వాటి దగ్గర కూర్చుని అవి అందించకపోతే కష్టం కదా? అదీకాక మొత్తం పెళ్లికి సంబంధించిన వస్తువులన్నీ ఛబీ అజమాయిషీలోనే ఉన్నాయి. పెళ్లికూతురు తల్లి ఎన్ని వైపుల పని చక్కబెట్టగలదు? అతిథులని సత్కరించడానికేనా వ్యవధి లేదు ఆమెకు.

కానీ అన్నీ తెలిసి కూడా అన్నిటికంటె నిక్కచ్చిగా అవసరమైన సమయానికి ఛబీ పారిపోయిందే? ఛీ, ఛీ! తిట్లు తిన్న మొగుణ్ని సంతోషపరచడానికి వెళ్లిందా ఏం? అయినా ఇదా అందుకు సమయం? వెర్రి వెంగళప్ప, ముందే ఏం చేస్తూ ఏం చేస్తాడే, వాడికి నిద్ర బిళ్లలిచ్చేసి నిశ్చింతగా వచ్చేయ కూడదా? వధూవరులు శయ్యామందిరం లో ఉన్నప్పుడు భోజనపు ఏర్పాట్లు అన్నీ చేసి రెండవ అంతస్తు పై కూర్చుని, నిద్రనుంచి లేచిన మొగుడికి అన్నం పెట్టి తృప్తి పరచవచ్చు కదా!

ఏమిటిది!

ఇది సహించడం కష్టం కదా!

ఈ ఇంటిల్లిపాది జనం చూస్తూండగా నువ్వు గర్వంతో మొగుణ్ని తీసుకు వెళ్లిపోయి కూర్చున్నావా నీ గదిలో? ఏమన్నావు 'అతను తినడు, నేను తినను?'.... ఛీఛీ! ఇటువంటి అల్లుడున్నప్పుడు, అన్నగారికి ఎన్నో సుఖప్రదమైన సంగతులు చెప్పవలసి ఉన్నప్పుడు, పెళ్లి వేళ, స్త్రీల ముచ్చట్లవేళ, నువ్వేమైనా ఒక్కసారి వచ్చి చూశావా? తిండి తినేటప్పుడు ఇటువంటి పొగరు ఎక్కడైనా చూశావా? ఇలాంటి ఉత్సవం, ఇటువంటి జనాభాకు చక్కని వంటకాలూ, చేపలూ, మిఠాయిలూ, అలాంటివి అన్నీ ఉండగా, పట్టుమని ఇద్దరు మనుష్యులైనా ఏమీ పంటితో కొరికి రుచి చూడలేదే! ఉపవాసం ఉండిపోవాలా?

నీ అన్నగారి మంచి చెడ్డల గురించి ఏమైనా ఆలోచించావా? అన్నగారిదీని, వదిన గారిదీ శిరస్సు సిగ్గుతో వంగేలాగ చేస్తావా? నీచత్వానికి ఏం హద్దు ఉండనక్కర్లేదా?

అన్నగారే, నీ కంటె 20 ఏళ్లు పెద్దవాడైన అన్నగారే, తండ్రి లాంటివాడే, నిన్ను తండ్రి లా పెంచాడే, నీకు పెళ్లి చేశాడే! అటుపైన పన్నెండు మాసాలు, ముప్పయి రోజులూ, నిన్ను నీ వెర్రి మొగుణ్ని పోషించాడు; నీ కోసం గది కట్టించాడు. అటువంటి అన్నగారు నీ పిచ్చి మొగుణ్ని ఏదో తిట్టాడని, ఏదో కాస్త గెంటాడని, ఇటువంటి అసభ్యపు వ్యవహారానికి సిద్ధపడతావా? నీ శరీరం కృతజ్ఞతా భారాన్ని మోయలేదా?

ఛబి పట్ల ఇంత కృతఘ్నత ఏవిధంగా ఆరోపించబడిందో ఆ విధంగానే ఆమె పట్ల జాలి చూపేవాళ్లు ఆమె పెంకుటిల్లు తలుపు ముందు తీర్థ ప్రజలా వచ్చి పడ్డారు.

చాలా మంది సహానుభూతి ప్రకటించారు.

అయితే అదంతా చాటుమాటుగానే.

కారణమేమిటంటే ఎవరైనా గృహస్థుల ప్రతిపక్షుల మాట రహస్యంగానే చెపితే మంచిది. రహస్యంగా అనబడుతుంది "ఆహా!" అని. అనబడుతుంది- 'దెబ్బతిన్నాడు! చెల్లెలి భర్త పిచ్చివాడు, ఆ సంగతి తెలుసుకుని ప్రవర్తించనక్కరలేదా? నీ లాంటి తెలివైన వాడు, మంచీ చెడ్డ తెలిసినవాడు, నీ కూతురి వివాహ సమయంలో, బావగారిని బుజం పట్టుకు గెంటేస్తాడా? నీ చెల్లెలు ఇబ్బందిలో పడి నీ ఆశ్రయంలో ఉండబట్టి ఇలా ప్రవర్తించ గలిగావు కాని, అదే ఆమె ధనవంతుని భార్య అయితే ఇలా చూస్తావా?"

కానీ క్రిందకు వెళ్లి మళ్లీ తనే కోపంలో మునిగిపోయి సతమతమవుతూ కూర్చున్నాడు

కానీ కూర్చోలేదేం?

అతను ఏమైనా ఏసుప్రభువా, కృష్ణ చైతన్యుడా-కోపం లేకపోవడానికి తన తత్వంలో వాళ్ల సానుభూతికి సమాధానంగా ఛబి కళ్లమ్మట నీళ్లేం కార్చలేదు. సరికదా ఇలా అంది: "మీ మాటలేమీ నాకు నచ్చడం లేదు. మీరంతా క్రిందికి వెళ్లిపొండి"-

అయితే ఏమయింది?

ఏసూ, చైతన్యులు కూడా ఇలాంటప్పుడు కోపిస్తారేమో!

అయితే ఇదంతా ఒక సాంధ్య లీలేనా?

ఆ రాత్రి, చాలా రాత్రి గడిచాక, పై వాళ్లందరూ సెలవు తీసుకున్నాక, కేవలం ఇంట్లో వాళ్లే భోజనానికి కూర్చున్నారు. అప్పుడు సతీనాథ్ తన క్రొత్త అల్లుని రూపురేఖలూ, గుణగణాలు తన శక్తి కొలదీ పొగిడి ఆనందించాక, అకస్మాత్తుగా అడిగాడు: "క్షితీశ్ అన్నం తిన్నాడా?"

అప్పటికి అతనికి అంతా జ్ఞాపకం వచ్చింది- అసహ్యంగా చీపురు మీద ఒక మిఠాయి ముద్ద పెట్టుకుని క్షితీశ్ బంధువులందరూ మాట్లాడుతూ కూర్చున్న చోటకి వచ్చి తినడం మొదలు పెట్టడం, తను అతణ్ని తిట్టి హాలులో నుంచి పట్టి గెంటివేయడమూను.

ఆ వ్యవహారం అంతా గర్హించదగినదని సతీనాథ్ అంగీకరించక పోలేదు; అయినా, తన ప్రవృత్తి ఉప్పూ కారం తినే స్వభావాన్ని ఎలా అతిక్రమించగలదు?

ఆ క్షితీశ్ అల్లా వచ్చిన సమయంలో సతీనాథ్ పరిస్థితి గమనిస్తే అతని ప్రవర్తన అర్థమవుతోంది- కన్యాదానం చేసేందుకు శాస్త్ర యుక్తంగా ఆ పూట అన్నం తినలేదు, అటువంటి చిరాకుగా, మనస్సు ఉద్వేగకరంగా ఉన్న సమయంలో ఆ బావగారి వెర్రి వాలకం, పిచ్చి పని చూస్తే అతనెలా తట్టుకోగలడు?

నిజంగా తట్టుకోలేకపోయాడు సతీనాథ్.

కానీ, వెర్రివాడు అంత అవమానంతో చిత్తు చిత్తు అయిపోతాడని సతీనాథ్ ఊహించలేదు... తిరిగి వెళ్లి, ఏ మిఠాయి కొట్టులోనే కూర్చుని ఉంటాడను కున్నాడు. అదీ కాక, ఛబి ఇంతగా ఈ విషయం మనస్సుకి పట్టించుకుంటుందని కూడా అతను ఊహించలేదు. ఛబి కనుపించక పోయేసరికి, తనొక్కడే కాదు ఆ లోటు వల్ల బాధపడినది - ఇంటిల్లిపాదీ 'ఛబి, ఛబి' అంటూ గొడవ చేసేశారు.

అదే సమయంలో తన భార్య అక్కగారు, ఆ కన్యాదానపు సభలో జరిగిన గొడవ గురించి ఇలా లేవదీసింది మరింత గొడవ: "ఏమిటో భాయీ, నువ్వేమో మీ బావగారిని వెళ్ల గొట్టావనీ, మెడ పట్టుకు గెంటావనీ, అందు మూలాన మీ చెల్లెలు దుఃఖపడి తన గదిలో కూర్చుండి పోయిందనీ, అప్పటి నుంచీ దిగి రాలేదనీ, విన్నాను. మీ బావగారేమో మిఠాయి కొట్టులో 'తన్వీ గంధి' మిఠాయి ముద్ద

(పొట్లాం) తినడం గురించి దెబ్బలాట వచ్చిందనీ, అవన్నీ మిఠాయి ముక్కలు హాలు మెట్ల నిండా విసిరేశాడని కోపగించి పారేసి వెళ్లిపోయాడనీ - విన్నాను. అతను పిచ్చివాడయితే అవచ్చు, కానీ మీ చెల్లెలు పిచ్చిది కాదు కదా?"

ఈ యుక్తి యుక్తమైన ప్రశ్న విని, తను ఇదివరలో పెళ్లి పీటపై నుంచి కోపంతో లేచి చేసిన హడావుడి గురించి మాట సర్దుకోలేక పోయినా, ఇప్పటికి ఇంటి బంధువులతో చేస్తున్న భోజన సమయంలో తనలోని సహజమైన ఔదార్యం ప్రస్ఫుటింపచేస్తూ, అడిగాడు, "క్షితీశ్ భోజనం చేశాడా" అని.

సాయంత్రం నుంచీ, ఒక 50 మంది జనం వెళ్లి ఛబిని పెళ్లి చూసేందుకు రమ్మనీ, అతిథుల ప్రక్కకు వచ్చి కూర్చోమనీ, పంక్తి భోజనానికి రమ్మనీ బ్రతిమాలారు. కానీ, పర్వతంలా కదలకుండా కూర్చుండి పోయింది ఛబి; దిగి రాలేదు.

ఇలాగ జరిగిన అసభ్యపు వ్యవహారం గురించి మళ్లీ తన భార్య వల్ల విన్నాడు సతీనాథ్. ఆ తర్వాతనే అతని లో ఔదార్యం సంగీతం ప్రతిధ్వనించింది. "ఈ ఆశ ఇలా పని జరగదు" అని.

అంతటితో ఒక్కసారిగా లేచి వెళ్లాడు రెండవ అంతస్తు పైకి. అన్నాడు: "చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను, ఒక్క మాటు వచ్చి మాతో భోంచెయ్యవూ?"

ఛబి కంఠం ఏమైనా కంపించిందా?

లేక అదంతా సతీనాథ్ భ్రమయేనా?

భ్రమ అనే తెలుస్తోంది. ఛబి మట్టుకు శుభ్రంగా గొంతుక సవరించుకు అంది: "ఇదంతా ఎందకు చెపుతున్నావు అన్నాయ్యా, నేను నీకు చెప్పలేదు నాకు అన్నం తినాలని లేదనీ, తినలేననీ? తల నొప్పిగా ఉందని చెప్పాను కదా!"

సతీనాథ్‌కి బావగారు మిఠాయి ముద్ద తినడం మెట్లనిండా పడడం మొదలైన పాత అసహ్యపు సంఘటన అంతా గుర్తుకు వచ్చింది. వెంట వెంటనే మరొక మాట.... "పిచ్చివాడే, పిచ్చివాడే, భర్త!" అని తోచింది.

మెత్తని గొంతుతో అన్నాడు: "బాగుంది, ఊరికే ఒక్కసారి మా అందరితో వచ్చి కూర్చోలేవా? క్షితీశ్‌కి భోజనం మేడ పైకి పంపించమని చెప్పి వచ్చాను. అతనికి అన్నం పెట్టేసి నువ్వు రా!"

ఛబి పూర్వం లాగే నిక్కచ్చి అయిన కంఠంతో అంది: "ఆయన తినదలచుకోలేదు, అన్నయ్యా!"

మళ్లీ ధైర్యం తగ్గిపోయింది.

అయితే అదేం ఆశ్చర్యం కాదు.

బొంగురు గొంతుతో ఒకే ఒక మాట అని దిగి వెళ్లి పోయాడు- "కృతఘ్నులే

ఇలా తయారవుతారు కదా?"

ఇంక అతనితో కూడానే అమల్ లేచి వచ్చాడు. చివరగా భోజనం చేసేవారి వద్దన పూచీ అతను వహించాడు, ఆఖరికి ఒక స్త్రీ మొండి పట్టుదల మూలాన నిష్కారణంగా 12 గంటల నుంచి ఒంటి గంటవరకూ కాలం వృథా అయింది.

ఇదంతా తన వాళ్ల గురించి కాదు; ఇరుగు పొరుగు వాళ్ల గురించి, ఇంత బాధ్యత వహించనక్కర లేకపోయినా, వహించాడు. అది అతని స్వభావం. అయితే మళ్లీ రాత్రి అయ్యాక తన ఇంట్లో వాళ్లు ఏమంటారు?

బహుశా మెట్టుపై నుంచి సతీనాథ్ తోసేస్తాడు.

సతీనాథ్ తీక్షణంగా అతని వైపు చూశాడు. కలవరంగా, వ్యగ్యంగా, తీవ్రంగా అన్నాడు: "ఆఖరికి నువ్వు మిగిలావా?"

క్రిందకి వెళ్లాడు.

ఇంటి ప్రక్క కుర్రవాడు, చాలా కాలం నుంచి తెలిసిన వాడు, ఏమీ ఆశ్చర్యపడలేదు. అయినా పెద్ద ఆశపడలేదు.

అమల్ కూడా అల్లాగే ఆశించలేదు.

అమల్‌కి వినవలసినదేమీ మిగలలేదు.

ఆ సంఘటన గురించే ఆలోచన!

అదే అమల్‌కి నమ్మకం తన పైన. కాగా ఆమెను ఒక సారి చూడాలని కుతూహలం కలిగింది. ఇంత పట్టుదలతో ఉన్నప్పుడు ఛబి ఎలా ఉంటుందో చూడాలని అనిపించింది అమల్‌కి.

ఛబి అప్పుడు వచ్చి తలుపు మూసివేయబోయింది. ఇంక కొంచెం నిద్ర పోవచ్చునని అనుకుంది.

అమల్‌ని చూసేసరికి చెయ్యి ఆగింది. తలుపు సగం మూసి ఉంది.

అమల్ అనుకున్నాడు, ఒక్కసారి గబుక్కున అగ్గిపుల్ల వెలిగించి చూస్తే? ఆమె ముఖం ఎలా ఉందో చూడవచ్చు. అలాగయితే! అది వెలగలేదు.

అన్నాడు, "దీపం వెలగడం లేదు!"

ఛబి ఇదివరలో లాగే ఎండిన గొంతుతో: 'నీకేం కావాలి?" "ఏం పెద్ద పని లేదు. కాని నీ వంట్లో ఎలా ఉందో, అది..." ఛబి సమాధానం చెప్పలేదు, ఏమీ కదలిక ప్రదర్శించలేదు, కౌమారపు మర్యాద రక్షించుకుంటూ ఈ కుతూహలపు మాట విని నవ్వనూ లేదు. ఛబి ఎప్పటి ఛబి లాగే ఆ చీకటి నీడలో అలాగే నిలబడి ఉంది.

అమల్‌కి ఛబి గది లోపల భాగం కనుపించలేదు. సగం తెరిచిన తలుపు పై చేయివేసి నిలిచి ఉంది ఛబి. అయినా గది మధ్యకి దృష్టి ప్రసరించేందుకు వృథా ప్రయత్నం చేసి అమల్ అన్నాడు: క్షితీశ్ బాబూ నిద్రపోతున్నారా?"

అప్పుడు ఏదో కారణ రహితంగా ఛబి కొద్దిగా నవ్వి అంది: "అవును".

"సతీనాథ్‌గారు అయన్ని అదరగొట్టారని విన్నాను, కాని, ఛబీ, నువ్వు ఇంత గొడవ చేయడం న్యాయమేనా? ఇదంతా వింటూంటే సిగ్గు కలుగుతోంది".

ఛబి ఈసారి స్పష్టంగా నవ్వింది.

ఒక్కసారి అమల్‌కి అనిపించింది - ఛబి అస్వాభావికపు ఆకారం కనిపించిందని, నవ్వినంత మేరకు నవ్వుతూనే అంది ఛబి: "నాకు సిగ్గులేక పోవడం చూసి నీకు ఒక్కసారి సిగ్గు ఎందుకు వేస్తోంది, అమల్?"

అమల్ నిజంగా అగ్గిపుల్ల వెలిగిస్తే? ఛబి కేవలం సిగ్గు విడవడమే కాదు, పూర్తిగా నిష్ఠూరపు భావం ఆమె ముఖంలో ఎలా ద్యోతకమవుతుందో గమనించేవాడేమో?

ఆ చీకటి ముసుగులో ఛబిని గుర్తించడం సాధ్యం కాలేదు.

ఛబి అన్నయ్య దగా పడ్డాడు, తెలియకుండా ఒక పిచ్చి యువకునితో ఆమె వివాహం చేశాడు, అయినప్పటికీ ఛబి ఎప్పుడూ గూడా అన్నగారిపై నేరం మోపలేదు. తన బావగారినీ, పిచ్చివాడైన తన భర్తనీ, తననీ ఇక్కడినుంచి గెంటేసి నందుకు అన్నగారిని ఏమీ దూషించలేదు ఛబి.

అమల్ పిరికితనాన్ని ఎప్పుడూ ధిక్కరించలేదు ఛబి. తన చిన్నతనంలో ఇంటి పనులు ఎంత పూచీతో నిర్వర్తించేదో, పెళ్లి అయి పెద్ద అయాక కూడా అంత బాధ్యత తోనే నెరవేరుస్తోంది. పైగా తన పిచ్చి భర్తని జాగ్రత్తతో సంరక్షిస్తోంది.

కాని అన్నింటిలోకి ఆశ్చర్యం ఏమిటంటే ఏదో ఒక వింత కవచం ధరించి తనని తాను దాచుకుంటోంది ఛబి. అమల్‌కి ఏం తెలియదా, అన్నీ తెలుసును!...

క్షితీశ్‌ని చాలాసేపు చూడక పోవడం మూలాన చాలా బెంగ ప్రదర్శించింది ఛబి; అదే ఆ నవ్వులోని అంతరార్థం, మాట్లాడుతూ మాట్లాడుతూ హఠాత్తుగా లేచి అంది. "అదే అది! ఇంతసేపు మన ఇల్లు చూడాలన్న గుర్తు రాలేదంటే, ఏమైనా బైరాగి అయి వెళ్లి పోలేదు కదా!... అంది: "ఎంతయింది? అమ్మో, ఆకాశంలో ఎంత వేళ గడచి పోయిందో! నా ప్రభువు మళ్లీ వంటింటిలో చొరబడి ముంతలో అన్నం తినడం లేదు కదా!" అంది: "అదే చూడు, ముఖం నల్లబరచుకుని అకస్మాత్తుగా వెళ్లిపోయాడు దయామయుడు; నేను సరదాగా అన్నాను. ఇదంతా సహించలేక పోతున్నాను పోదాం బాబా! లేకపోతే 'భోలానాథ్' రుద్రుడై పోయి కూర్చుంటాడు!"

పిచ్చివానికి సహజమైన ప్రవర్తనలో ఏదైనా చమత్కారం కాని విరక్తి కాని ప్రకటితమైనా, అతను ఎప్పుడూ కూడా ఛబిని కోపంగా చూడలేదు. అతనితో స్వరం కలిపి అంది: "చెప్పు బాబా, నీ కన్నీ దొరికాయి కదా ఒక్క మాట చెప్పు!: నాకేం పని తక్కువ లేదు! అల్లుడు గారు మర్యాద చూపకుండా అన్నాడు- "కొట్టు

ధనంజయా!" అంటే మంచి పని అవుతుంది వాడికి!"

నవ్వుతూ నవ్వుతూనే అంది ఛబీ.

అయినప్పటికీ భర్తకి జరిగిన అవమానం గురించి తను చూపించిన ప్రవర్తనలో ఏమైనా మార్పు వచ్చిందా ఇప్పుడు!

అల్లాగయితే సతీనాథ్ భార్య మాట నిజమైనదని స్వీకరించ వచ్చునా? ప్రతీకార జ్వాలని ఏమైనా ఈ విధంగా కప్పి పుచ్చడానికి ప్రయత్నిస్తోందా! తన అన్నగారి కూతురుకి పెళ్లి బాగా జరగడం, చక్కటి వరుడు దొరకడం - ఇదంతా చూస్తే ఆమె గుండె ఏమైనా మండుతోందా?

ఛబీ గురించి ఆమె బంధువులు అలా అనుకోవడం లేదు.

తన మటుకు తనే అలా ఊహించుకుంటోంది.

ఇలా జరిగిన అత్యాచారం, అటుపైన నడచిన వింత వ్యవహారం, మధ్య సతమతమవుతోంది ఆమె.

ఈర్ష్య!

లేకపోతే ఇంత పతిభక్తి ఎప్పుడు వచ్చిపడింది ఛబీకి! "భర్త పిచ్చివాడని ఇంత దుఃఖం వచ్చింది, ఇదేమిటో అర్థం కావడం లేదు. అరే బాబా, ఎంత అద్భుతమైన కఠిన హృదయం!" అని అంటుంది వదినెగారు.

ఛబీ ఆ కఠిన హృదయమే ముక్క ముక్కలై పోయింది. అందు మూలానే ప్రతీకార వాంఛ! అయినా అమల్ ఈ ఆలోచనలన్నీ పైకి అనలేదు. ఊరికే ఒక్కమాట అన్నాడు: "నువ్వు చాలా కఠిన హృదయురాలివి ఛబీ!"

ఛబీ అంది: "ఇన్నాళ్లకి తెలిసిందా నీకా సంగతి?" అయితే నువ్వు కేవలం చూసి పోదామని వచ్చావా? భోజనం చేయమని చెప్పేందుకు రాలేదు కదా?"

అమల్ గాయపడిన తన దృష్టి ప్రసరించి మరొకసారి ఛబీని సరిగ్గా చూద్దామని ప్రయత్నించాడు. తర్వాత అన్నాడు: "లేదు, నిన్ను పిలిచేందుకు వచ్చేటంత మొండి ధైర్యం లేదు నాకు. నేను అనుకున్నదేమిటంటే క్షితీశ్ బాబుని తినడానికి అడ్డుపెట్టకుండా ఉంటే నువ్వేమైనా మీ అన్నయ్య మనస్సుకి శాంతి కల్పిస్తావేమో అని అదొక్కటే పాపం ఆ పెద్ద మనిషిని హద్దులో పెడుతుంది. బాగా ఆశ పెట్టుకుని నాతో అన్నాడు, 'నువ్వు మాకు వడ్డించి, తినిపించవా? ఈ ఉపకారం చేసి పెట్టవా?"

మాట అంతా చెప్పాక కొద్దిగా నవ్వాడు అమల్. అన్నాడు- తప్పకుండా; (వాళ్లేం మాట్లాడలేదు', అన్నాడు, "దుర్మార్గులు!")

ఇంతసేపూ అన్నం తినక పోవడం మూలాన ఛబీ కంఠం ఇంతగా ఎండిపోయిందా? లేక ఈ మధ్య జరిగిన అసభ్యపు సంఘటన వల్ల కలిగిన

పశ్చాత్తాపమా! మామూలుగా ఆమె గొంతుక చాలా మధురంగా ఉండేదే!

ఒకప్పుడు ఉండేది; ఇప్పుడు కాదు. ఇప్పటి ఆ ఎండిపోయిన గొంతుతోనే అంది - "ఆయన నీ వడ్డన కోసం ఏం ఎదురు చూడడం లేదు, తనకే...."

"అగు, ఛబీ! ఆ మాటలన్నీ ఆపుజెయ్యి... నువ్వు తినక పోతే మానెయ్యి. ఆయన్ని కొంచెం లేపి తిననియ్యి; నా మాట అల్లాగయితే నేను నిలబెట్టుకోగలను,'

ఛబీ తన బాల్యపు మర్యాదలన్నీ తుడిచి పెట్టేసింది. అల్లాగే బండగా నిలబడిపోయి అంది- "ఆయన తినరు!"

"ఛబీ! వాస్తవానికి నువ్వు బుద్ధి పూర్వకంగా అసభ్యతను ప్రదర్శిస్తున్నావు. ప్రతీ దానికీ, ఒక హద్దు ఉండాలి. కోపగిథచి ఈ వేళ ఆయన్ని అన్నం తిననీయక పోయినా, రేపు నువ్వే అన్నం పెట్టవా ఆయనకి! అప్పుడు?....

ఛబీ ఈ సారి నవ్వుతూ ఉంది. నిజానికి నవ్వుతూ ఉంది చప్పుడు చేస్తూ. అంది, "రేపు తినడు అమల్. రేపూ లేదు ఎల్లుండీ లేదు. ఎప్పుడూ తినడు!"

ఈ మామూలుగా కోపగించుకున్న మాట విని అంతగా భయపడ్డాడెందుకు అమల్? ఛబీ నవ్వులో ఏమి అస్వాభావికపు భావం గోచరించింది అమల్‌కి?

'ఛబీ! అంటూ ఆర్తనాదం చేశాడు అమల్.

ఛబీ ఈ పిలుపుకి జవాబు ఇవ్వలేదు. ఛబీ కదల లేదు. ఛబీ అనిశ్చల మూర్తిని అలా చాలాసేపు చూస్తూ వెర్రిగా కూర్చొండి పోయాడు అమల్. ఒక్కసారిగా లేచి తలుపు పట్టుకు ఉన్న ఛబీ చేతిని జోరుగా నొక్కి అన్నాడు, "ఛబీ, దీపం వెలిగించు!

ఛబీ మెల్లిగా చెయ్యి విడిపించుకుంది.

అంది, "ఎందుకోసం?"

"నేను చూడాలి".

"చూడడానికి ఏమీ లేదు, అమల్!"

"ఛబీ, ఇంత నిక్కచ్చితనం వదిలెయ్యి. గుమ్మానికి అడ్డులే. నన్ను చూడనీ".

అయినా ఛబీ తప్పుకోలేదు.

ఒక ధృఢ స్వరంతో అంది. "నిజానికి ఏమీ లేదు"

అమల్ ఏమిటి అలా అస్వాభావికంగా ఉండిపోయాడు?

అమల్ అలా ఎందుకు చూశాడు అసలు?

తను ఇలా ఇంతసేపు ఇక్కడ ఉండిపోవడం గురించి క్రింది అంతస్తులో వాళ్లు ఏమనుకుంటున్నారో అన్న సంగతి మరచిపోయాడా? తన చిన్ననాటి చరిత్ర గురించి తనకేమీ ఆలోచన లేదా? ఎవరికీ తెలియక పోలేదా?

చాలాసేపటికి అమల్‌కి గుర్తు వచ్చింది క్రింద అంతస్తులో ఒక ప్రాణికోటి ఉంది అని. అక్కడికి దిగి వెళ్లాలి. అందుకే అన్నాడు. "ఛబి, ఇదేమిటి? "దుర్మార్గుడు నన్ను తిననీయడం లేదు'. అని తన తల మొత్తుకుంటు కూర్చున్నాడే"-

"ఛబి, నువ్వేమైనా రాయివా?"

"అయితే అవ్వచ్చు".

"ఛబి, క్రిందకు వెళ్లి వాళ్లకేం చెప్పను?"

"ఏమీ లేదు, అమల్, నీ మీద ఒట్టు. వధూవరులు శయ్యా మందిరంలో ఉన్నారు. ఈ రాత్రి వారుభయుల ఆనందం మనం పాడు చేయవద్దు".

"ఛబి, ఏం చేయగలం?"

"చేయగలిగిందేదో అయింది అమల్! సరిహద్దు రేఖను మరచిపోయి ఎవరు దాటి వెళ్లగలరు?" ఆ నవ దంపతుల అహ్లాద సమయంలో నేను నా"....

"అయితే రాత్రంతా ఇల్లాగే ఉండిపోతావా?"

"లేదు, నిద్రపోతాను బాగా మొద్దు నిద్రపడుతుందనిపిస్తోంది".

అలా అనీ మొరటుగా, అసభ్యంగా ఛబి అమల్ చూస్తూండగానే తలుపు మూసేసి లోపలికి వెళ్లిపోయింది.

"ఠక్కు'మన్న చప్పుడయింది గడియ చప్పుడు.

అవును, తలుపు మూసేయడం కంటె వేరేమీ చేయలేక పోయింది ఛబి.

ఆమెకి సతీనాథ్ మాట అంతవరకూ గుండెకు, గ్రుచ్చుకుంది- అన్నింటికీ ఎంతవరకూ హద్దు ఉందో అంతా ఉండడం న్యాయమే.

కొన్ని గంటలు ఇలా ఆ అతిశీతలపు అంధకారంలో మిగిలిపోయిన తర్వాత ఛబి మళ్లీ తన సహజ సామర్థ్యాన్ని సంపాదించుకుంటుంది. మరునాటి ఉదయం తన స్వాభావికమైన విధంగా, యథేష్టంగా, కిందకు వెళ్లి, తేలికయైన కంఠంతో వాళ్లందరికీ ఇలా చెపుతుంది: "నిన్న పెళ్లి హడావుడిలో మిమ్మల్ని మరింతగా బాధించదలచుకోలేదు. గత్యంతరం లేక, ఇతి కర్తవ్యతా మూఢురాలనై, నేనేమీ వెళ్లిపోలేదు. రండి వచ్చి చూడండి ఇప్పుడు అసలు ఏమయ్యిందో. అప్పుడు మీరేం చేయాలో మీకే బోధపడుతుంది!" *

---

(కాంచవూతిహిరే, 1967)

* అనువాదకుని సూచన: కథ యొక్క ముగింపు విషాదాంతము. ఎప్పుడు తినడు, అని ఛబి అనడంలో క్షితీశ ఏమయ్యాడో పాఠకులకు అవగతమయే ఉండవచ్చు.

# ఆడదొంగ

సుబోధ్ ఘోష్

సనాతన్ సనాతుని బిడ్డ సుధా. తండ్రిని బట్టి బిడ్డ.

ఒకటి తర్వాత మరొకటి విచిత్ర సంఘటనలు జరిగినప్పుడు, వాటి వల్ల ప్రభావితుడై ఎటువంటి వేదనతో తండ్రి వెక్కివెక్కి ఏడుస్తాడే, అటువంటి బాధతోటే కూతురు కూడా పైట కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ బోరుబోరు మని ఏడుస్తుంది. ఎవరైనా దగ్గర నిలబడి ఆ దృశ్యం చూస్తే వాళ్ల కళ్లల్లో కూడా నీళ్ళు, హృదయం నుంచి దీర్ఘ నిశ్వాసమూ వెలువడతాయి- "ఆహా, ఎంత కష్టమైన సంగతి! ఆ పిల్ల తప్పితే అతనికి ప్రపంచంలో ఇంకెవ్వరూ తన వాళ్లన్నవారు లేరు. అందుచేత ఆమెని పరాయి ఇంటికి పంపించ వలసి వస్తే అతని గుండె పగిలిపోతుంది".

సుధా పెళ్లి అయిన మరునాడు ఆమెను అత్తవారింటికి తీసుకు వెళ్లడానికి పెళ్లికొడుకు, పెళ్లివారూ, మరి ఇద్దరు ముగ్గురు బంధువులూ సిద్ధంగా ఉన్నప్పుడు, అతను వెక్కి వెక్కి ఏడ్చేసరికి, ఆమె కూడా బోరుబోరుమని ఏడవడం ప్రారంభించింది.

కానీ ఒక నెల గడిచిందో లేదో వీళ్లందరు ఇరుగుపొరుగు వాళ్ళు, ఆ వరుడూ, మిగతా వాళ్ళూ చక్కగా తెలుసుకున్నారు- నిక్కచ్చిగా, అక్షరాలా, తండ్రిని బట్టే బిడ్డ, అని. సనాతన్ ఎంత టక్కరివాడో, అంత టక్కరిదీ అతని కూతురు. మానవులను మోసపుచ్చడంలో ఇద్దరికీ సమానమైన సామర్థ్యం, శక్తి ఉన్నాయి. ఒకరికొకరు ఏమీ తక్కువ కాదు. తండ్రి ఎల్లాగో పిల్ల అల్లాగే.

పోలీసువాళ్లు మటుకు అంటారు- 'పిల్ల లాగా తండ్రి' అని. ఇల్లా మూడుసార్లు జరిగింది. ఒకసారి తారకేశ్వర్‌లోనూ మరొక సారి బసిద్ హాట్‌లోను రెండు మోసపు కేసులు జరిగాయి. రెండు నెలల మధ్య రెండు కేసులు. ఇప్పుడు ఇది మూడవ కేసు. మూడు సంఘటనలూ ఈ ఒకే తండ్రి, ఒకే కూతురు వల్ల జరిగాయన్న ముద్ర కనిపిస్తుంది. అలాగ మనుష్యులను ద్రోహపరచడం ఈ ఇద్దరి పద్ధతే అని స్పష్టమయింది.

ఛాట్‌పాడా బజారు దగ్గరి ఒక సందులో ఒక చిన్న ఇంటిలో తాళం బ్రద్దలు గొట్టి తలుపులు తీసి వెతికారు పోలీసులు.కానీ ఆ శూన్య గృహం అన్ని మూలలూ వెతికినా ఒక గడ్డిపరకైనా దొరకలేదు. సనాతన్, సుధా, తమ అద్భుతమైన చాతుర్యాన్ని అతి నైపుణ్యంతో ప్రదర్శించారు వాళ్లెక్కడికి పారిపోయారో, ఎవరికీ తెలియదు. ఏ ఇరుగుపొరుగు వాళ్లు ఒక నెల క్రితం

తండ్రీ, కూతుళ్ల దుఃఖాశ్రువులను తిలకించి తామూ కళ్లమ్మట నీళ్లు కార్చారో, వాళ్లిప్పుడు సిగ్గుపడి ఇలా తమ పశ్చాత్తాపాన్ని ప్రకటించారు.-"నిజానికి జగత్తు ఒక జంతు ప్రదర్శన శాలలాంటిది, ఇక్కడ ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు?"

కొందరు అన్నారు. "పక్షులలోనూ, పశువులలోనూ ఇటువంటి నిందాగర్భిత మైన వ్యవహారం ఉండదు; మానవ జగత్తు లోనే, బాబూ!"

మరొకడు అన్నాడు: "మా ప్రక్కన ఉండి మా కళ్ళ ముందరే ఇటువంటి మోసం చేసేవాళ్లు ఉన్నారంటే మాకు చాలా లజ్జాకరమైన విషయం. ఎక్కడి నుంచో ఒక మొగవాడూ, ఒక ఆడపిల్లా కొన్నాళ్లు ఇక్కడ ఉండి ఈ చుట్టు ప్రక్కల వాళ్లందరినీ దగా చేసి కళ్లల్లో కారం జల్లి పారిపోయారు., బాబూ! ఎవ్వరూ కూడా వాళ్లు ఇటువంటి మోసగాళ్లు అని ఊహించలేకపోయారు!

అవును, ఎవ్వరూ ఊహించలేకపోయారు. ఆ వెక్కి వెక్కి ఏడుపులూ, బారుబారు రోదనలు మధ్య ఒక అతి చమత్కారమైన చోరీ ఎలా జరిగిందో అదంతా ఇరుగుపొరుగు వాళ్లకీ, వరుడికీ, ఇతర బంధువులకీ దృగ్గోచరం కాలేదు. వాళ్ల కంటికి ఎలా పట్టుబడుతుంది? తండ్రీ, కూతురు ప్రదర్శించిన కరుణామయ మైన అశ్రు పూరితమైన ముఖ కవళికలు స్మరించుకుంటూంటే ఇప్పటికి కూడా అది ఆ యిద్దరి మోసగాళ్ల పని కాదు, మరొకరి పని అని తోస్తుంది.

పోలీసులు అన్నారు- "మరొకరి పనికాదు. నిస్సంకోచం గా అది తండ్రీ, కూతురూ కలిసి చేసిన చోరీయే. మరో క్రొత్త చోటికి వెళ్లి, మారుపేర్లు పెట్టుకుని తండ్రీ కూతురూ అక్కడ కొన్నాళ్లు మకాం చేస్తారు. అప్పుడు అక్కడ కూడా కొన్నాళ్లకి ఇలాంటి మోసమే చేసి పారిపోతారు.

ఇరుగుపొరుగు వాళ్లంతా దుఃఖంతోనూ, సిగ్గుతోనూ, ఏదో అపరాధం చేసినట్లుగానూ, ఏ పెద్దమనిషి ముఖం వైపు చూస్తున్నారో ఆయన ఆ పేటలో ఒకే నెల ముందు తల మీద టోపీ పెట్టుకుని ఒక సాయంత్రం వేళ అక్కడకు వచ్చాడు - ఇప్పటి శూన్య గృహంలో వున్న దరిద్రుడైన తండ్రికి అతని కూతురు పెళ్లి విషయంలో సహాయం చేసేందుకు. అక్కడి కుర్రవాళ్లు కొందరు అతణ్ని చూసి నవ్వుకుంటున్నారు.

ఆ పెద్ద మనిషి వయస్సు 45-50 మధ్య ఉంటుంది. 'నైహాటీ'లో ఆయనకి ఒక బట్టల దుకాణం ఉంది. భార్యా పిల్లలూ, లేని వ్యాపారస్థుడు. భార్య మరణించినా, పునర్వివాహం కోసం ఏమీ ప్రయత్నం చేయడం లేదు. అయినా సనాతన్ బాబుతో పరిచయం అయ్యాక, సనాతన్ బాబు దరిద్ర అవస్థ

గమనించాక ఈ వయస్సులో అతనికి సంసార జీవితం మాధుర్యాన్ని రుచి చూడాలన్న గాభరా బాగా పట్టుకుంది. ఈ సందులో ఈ ఇంటికి సనాతన్ బాబు ఆహ్వానంపై ఒక రోజు వచ్చి, కాస్త రొట్టి తిని, కాస్త పాయసం త్రాగాక, అతని మనస్సులో సనాతనబాబు కూతురి పెళ్లి విషయంలో సాయం చేయాలన్న గాఢమైన వాంఛ ఉత్పన్నమయింది. తన కులానికి చెందిన ఒక అందమైన కన్య ఇటువంటి చీకటి సందులో అవివాహితగా పడి ఉండడం చూస్తే 'నైహాటీ'లో బట్టల వ్యాపారం చేస్తూ బాగా సొమ్ము చేసుకుంటున్న ఆ ఆసామీ మనసుకి కష్టంగా తోచింది. పిల్ల తండ్రికి నగదుగా 50 రూపాయిలూ, పెళ్లికి కావలిసిన సరుకులు కొనేందుకు మరికొన్ని రూపాయిలూ పెళ్లి కూతురి కోసం 10 తులాల బంగారం అలంకారాలు ఇచ్చి సనాతన్ అనుమతి తీసుకుని పెళ్లికి ఒక మంచి రోజు కుదుర్చుకుని 'నైహాటీ' లోని గణేశ్ వస్త్రాలయపు యజమాని దయచేశాడు. పాపం! మేలి ముసుగులో దాగి ఉన్న సుందరి సుధ సౌందర్యాన్ని చూసి ముగ్ధుడైనట్టి అమెను తన కూడా ఒక తెల్లవారు ఝామున తీసుకు వెళ్లినట్టి, ఆ పెద్దమనిషే ఈనాడు పోలీసులతో కూడా వచ్చి ఇంటి నుంచి సెలవు తీసుకున్నాడో ఆ సందులోని ఇల్లు ముందే నిలబడ్డాడు.

పెళ్లి అయిన వారం రోజుల తర్వాత స్వయంగా నైహాటీ వెళ్లి సుధాని ఈ యింటికి తిరిగి తీసుకు వాచ్చడు సనాతన్. ఆ తర్వాత వారుభయులూ ఇక్కడ ఎంతకాలం ఉన్నారో సరిగ్గా ఎవ్వరూ చెప్పలేరు. లేఖ వ్రాశాక ఎన్నాళ్లకి సమాధానం రాక పోయేసరికి, స్వయంగా వచ్చి చూస్తే "ముసలి పెళ్లికొడుకు అయిన గణేశ్ వస్త్రాలయాధి పతికి కనిపించినదల్లా ఈ కవాట బంధమై పోయిన శూన్య గృహం. పోలీసు వాళ్లకి రిపోర్టు ఇచ్చాక వాళ్లన్నారు- "అవును, ఇది మూడవసారి, ఇలాగే ఇంతక్రితం రెండు సార్లు తండ్రి తన కూతురి పెళ్లి చేశాడు, ఇలాగే పెళ్లి అయిన కొన్నాళ్లకి ఉభయులూ అదృశ్యులయ్యారు. వాళ్ల అసలు పేర్లు పోలీసులకి తెలియవు.

తారకేశ్వరులో ఆ తండ్రి బ్రాహ్మణుడు; బసిర హాట్‌లో కాయస్థుడు, భాట్‌పాడా వచ్చాడు ఒక 'వైద్య' తెగకు చెందిన వ్యక్తిగా తారకేశ్వర్ పురంలోని కేసులో తండ్రిపేరు ప్రసన్న చక్రవర్తి, కూతురి పేరు సునయన; బసిర్‌హాట్ కేసులో తండ్రి సదానంద్ ఘోష్, కూతురి పేరు మాధవి. ఇప్పుడు భాటాపాడాలో సనాతన్ సేన్, సుధాసేన్ పేర్లతో వచ్చి విచిత్రమైన మోసం చేసి దాన్ని గురించి స్మృతిమాత్రం వాళ్ళు వెనుక వదలి పూర్తిగా మాయమయి పోయారు. అమాయకంగా తమని నమ్మిన ముగ్గురి జీవితంలో ఒక మాయా శయ్యాగారం, శుష్క పుష్పశయ్యా ప్రదర్శించి ఏ మాత్రం జాలీ నాలీ లేకుండా మోసపుచ్చి ఈ

భూమి పై ఉన్న జనబాహుళ్యంలో ఎక్కడ దాక్కుని ఉన్నారో ఒక అద్భుతమైన మగ దొంగ, ఆడదొంగ తండ్రి లాంటిదే కూతురూను. కూతురి వంటివాడే తండ్రీను.

భాట్‌పాడా సందు నుంచి విచారణ చేసి చేసి తిరిగి వెళ్లిపోయారు పోలీసు వాళ్లు. చుట్టు ప్రక్కల వాళ్లు కలవర పడి ఆలోచిస్తూ ఉండిపోయారు. గణేశ్ వస్త్రాలయపు యజమాని ఒక నవ్వుతూ ఉన్నట్టి, శాంతమైనట్టి సుందరమైనట్టి ముఖ కల్పనను చూసి మోసపోయి, ఇప్పుడు దుఃఖం, విస్మయం, భయంతో నిలబడి పోయాడు–"ఊ, ఇటువంటి, విధంగానే మానవుడు తోటి మానవుడిని మోసపుచ్చుతాడు!"

అదే సమయంలో రాణాఘాట్‌లోని ఒక సందులోని శిథిల గృహపు కిటికీ వైపు మరొక మానవడు తన కళ్లు ప్రసరించి తన అదృష్టాన్ని ఒక దుర్భరమైన మాయాజాలంలో బంధించేందుకు ఉద్యుక్తుడవుతున్నాడని భాట్ పాడాలోని ఆ సందులో వాళ్లకు గానీ, పోలీసులకి గానీ, గణేశ్ వస్త్రాలయం యజమానికీ గాని, ఏమీ ఊహించే అవకాశం లేదు. విజయ్‌బాబు అనే పేరుగల ఒక పెద్ద మనిషి కూతురైన కరవీ అనే పేరుగల ఒక యువ కన్యకతో రమేశ్ అనే పేరు గల ఒక యువకుడు వార్తాలాపం జరుపుతున్నాడు.

కిటికీ దగ్గర నిలబడి, ఇంటిలోపల నుంచి ఒక వాత్సల్య పూరక స్వరంతో, మెల్లిగా కరవీ అడిగింది "ఏమిటీ అస్తమానం ఇలా వస్తారు?" రమేశ్ సంతోషంతో పొంగిపోయి అన్నాడు : "ఒక సాముద్రికుడు నా అరచేయి చూసి ఏం చెప్పాడో తెలుసా నీకు అవ్వబోయే భార్య పేరులో మొదటి అక్షరం 'క' అవుతుందని?"

కరవీ నవ్వుతూ అంది: "కానీ, ఇల్లాగ రోజూ నేను కిటికీ దగ్గర నిలబడి ఉంటే నాకు చెడ్డ పేరు వస్తుందని, అంతకంటె ఏమీ ప్రయోజనం లేదని, మీకు తెలియడం లేదా?"

సైకిలు మీద వంగి, రోడ్డు ప్రక్కనుంచి, రమేశ్ అన్నాడు: "నే నిలా వచ్చి నిన్ను చూడకుండా ఉండలేను, కరవీ. ఏ రోజు నైతే నువ్వు మొట్టమొదట నా కేసి చూశావే, ఆ రోజునే నాకు తెలిసింది నువ్వే నా జీవితానికి శాంతి, సుఖం కలిగిస్తావని"

కరవీ కెప్పుడూ ధనవంతుల పైనే ఆలోచన. ఇతగాడు వస్తూంటే బాగానే ఉంది కాని, కొన్నాళ్ల తరువాత ఈ మాట మరచిపోవచ్చు; వస్తే బాగుంటుందో, లేక రాకపోతేనే. అందులోనే ఉంది టక్కరితనం.

రమేశ్ అన్నాడు- "నేను ధనవంతుణ్ని కాను, ధనవంతున్ని కావాలన్న ఆలోచన కూడా లేదు నాకు. నిన్ను చూసి జీవనోపాధి కల్పించుదామని వచ్చాను

అంతకంటె నాకు పెద్ద ఆలోచన లేదు".

కరవీ: "మీరు ఏ మాత్రం ధనవంతులు కారా?"

రమేశ్: "ఏ మాత్రం కాదు".

కరవీ: "మీరేం చేస్తూంటారు?"

రమేశ్: "నేను ఆర్టిస్టుని".

కరవీ: "అంటే?"

రమేశ్: "నువ్వెప్పుడైనా కలకత్తాలో ఉన్నావా?"

కరవీ: "ఉన్నాను, కొన్నాళ్లు"

రమేశ్: "సినిమా లెప్పుడేనా చూశావా?"

కరవీ: "ఒకటి, రెండు చూశాను"!

రమేశ్: "సినిమా హాలు గోడల మీద రంగు రంగుల పెద్ద బొమ్మ లేమైనా చూశావా?"

కరవీ: "చూశాను".

రమేశ్: "ఆ బొమ్మలు నేను గీసినవే"

కరవీ: "అందు మూలాన మీకు డబ్బు వస్తుందా?"

రమేశ్: "తప్పకుండా, అదే నా ఆదాయం. భగవంతుడు దయతలిస్తే ఇకముందు ఇంత తక్కువగా ఉండదు నా ఆదాయం".

కరవీ: "నెలకు ఇంచుమించు 50 రూపాయలు వస్తాయా?"

రమేశ్: (నవ్వుతూ) "నిస్సంశయంగా"!

కరవీ: "నిక్కచ్చిగా ఎంత సంపాదిస్తారో చెప్పరా?"

రమేశ్: "ఎంత సంపాదిస్తేనేం నిన్ను సుఖపెట్టడం లో లోటు జరగదులే".

కరవీ ముఖం సీరియస్‌గా పెట్టి అంది: "అవును, దరిద్రుల పిల్లను సుఖపెట్టడానికి ఏడాదికి రెండు చీరలూ, రోజుకి ఒక పూట రెండు గుప్పిళ్ల అన్నం – అంత కంటె ఏమీ అక్కర లేదు!"

కొంచెం చిరాకుపడి అన్నాడు రమేశ్: "అంటే ఏమిటి; నేనేం ఏడాదికి రెండు పంచలు కట్టుకుని, రోజుకి ఒక పూట రెండు గుప్పిళ్ల అన్నం తిని ఉంటున్నాననుకుంటున్నావా?"

కరవీ నవ్వుతూ అంది: "అలా చెప్పండి. మీ దగ్గర డబ్బు ఉంది"

రమేశ్: "నిస్సందేహంగా నిన్ను చక్కగా అలంకరించేందుకూ, నీకు శ్రమ కలిగించకుండా ఉండేందుకూ కావలసిన డబ్బు ఉంది. అయినా.... అది అలాంటిది కాదు".

దూరాన ఉన్న ఒక మహా ధనికుడైన మార్వాడీ మేడ వైపు చెయ్యి చూపించి

అన్నాడు రమేశ్: "అంత ధనికుడను కాను నేను, నువ్వూ కాదు కరవీ; అందుచేత.

కరవీ: "పెళ్లి ఖర్చు ఎక్కడి నుంచి వస్తుంది".

కొంతసేపు అదే విధంగా ఆలోచిస్తూ ఊరుకున్నాడు రమేశ్.

అటుపైన కొంత నిరాశా భావంతో అన్నాడు: "విజయబాబు దగ్గర ఏ మాత్రం డబ్బు నిలవ లేదా?"

కరవీ రెండు కళ్లూ అశ్రుపూరితాలయ్యాయి. ఎవరాపగలరు?

రమేశ్:"ఏ మాత్రం డబ్బు ఖర్చు పెట్టవలసి ఉంటుంది?

కరవీ: "నాకు తెలుసున్నంత వరకూ పెద్ద మనుషుల పిల్లల పెళ్లికి అమాంబాపతాలూ రెండు వేల రూపాయిలైనా ఖర్చు అవుతుంది".

రమేశ్ ఆశ్చర్యపడి అన్నాడు: "రెండు వేలా!"

కరవీ దృగంచలాలు కొంత సంశయాత్మకమైన విరక్తిని సూచిస్తున్నాయి: "ఏమనుకుంటున్నారు? ఈ మాత్రం రెండు వేల రూపాయిలు చేకూర్చలేరా?"

దుఃఖ భావంతో అన్నాడు రమేశ్: "చేకూర్చగలను, కాని హడావుడిగా సమకూర్చాలంటే చాలా చోట్లకి వెళ్లి ఇక్కడే వంద అక్కడే రెండు వందలు అప్పు చేయవలసి ఉంటుంది; అంతకంటె ఉపాయం వేరే లేదు".

కరవీ: అలాగయితే అప్పు చేయండి. ఎప్పటికో ఒకప్పుడు అప్పు తీర్చే యొచ్చు కానీ ఆలస్యం అయితే...

మాట్లాడుతూ మాట్లాడుతూ హఠాత్తుగా ఆగిపోయింది. మళ్లీ రెండు కళ్లల్లోనూ నీళ్లు ప్రవేశించాయి.

రమేశ్ అన్నాడు: "ఏమయింది?"

కరవీ: "నిజంగా మీరు నన్ను ప్రేమిస్తున్నారా?"

రమేశ్: "అవును, కరవీ?"

కరవీ: "అయితే హాడావుడిగా అన్ని ఏర్పాట్లు చేయండి. లేకపోతే నేను ఆత్మహత్య చేసుకోవలసి వస్తుంది".

గాభరాపడి రమేశ్ అన్నాడు: "ఏమిటి నువ్వు అనేది?"

కరవీ: "అవును, బద్యిబాడిలోని ఒక రెండవ పెళ్లి చేసుకునే ముసలివాడితో నా సంబంధం ఇంచుమించుగా కుదిరి పోయింది. అయన పెళ్లి ఖర్చుల గురించి మా నాన్నకు ఒక వెయ్యి రూపాయిలు పట్టుకొచ్చి ఇద్దామనుకుంటున్నాడు."

రమేశ్ తన సైకిల్ హ్యాండిల్ బార్ గట్టిగా పట్టుకున్నాడు. అతని కళ్లల్లోనూ, ముఖంలోనూ ఒక దృఢ ప్రతిజ్ఞ ప్రస్ఫుటం అవుతోంది. అన్నాడు: "ఎప్పటికీ అలా అవడానికి వీలులేదు.

ఆ ముసలివాడి డబ్బు ముట్టుకోవద్దని మీ నాన్నతో చెప్పు".

సైకిలు పెడలుపై కాలు పెట్టి బయలు దేరుతూ గట్టిగా అరుస్తూ అన్నాడు: "నేను మాట యిస్తున్నాను కరవీ! పెళ్లికి అన్ని ఖర్చులూ నేనే పెట్టుకుంటాను. పదిరోజులలోగా నిన్ను పెళ్లి చేసుకుని మా యింటికి తీసుకు పోతాను!".

సైకిలు ఎక్కి వెళ్లాడు రమేశ్.

రాణాఘాట్‌లోని ఆ పాడుపడిన ఇంటి ప్రాంగణంలోనే ఒక చిన్న ఉత్సవం జరిగింది. అంతకు ముందు చుట్టు ప్రక్కల వాళ్లు క్రొత్తగా వచ్చిన ముసలి పేద అయిన విజయబాబు మంచితనాన్ని అతని కూతురైన కరవీ శాంత స్వభావాన్నీ సౌందర్యాన్నీ, చూసి ముగ్ధులైపోయారు. వాళ్లందరికీ పెళ్లి విందు చేయడానికి మామూలుగా సిద్ధపడిన విజయబాబుని వాళ్లంతా 'ఇదంతా ఎందుకు మీకు వృథాఖర్చు' అని ఆపుచేసారు- "మీలాంటి వారి చే ఇటువంటి ఆడంబరాల కోసం ఖర్చు పెట్టించడం మాకు అన్యాయంగా తోస్తోంది".

కాగా, పెళ్లికూతురి ఆభరణాల కొరకు 1500 రూపాయిలు ఖర్చు పెట్టి, మిగతా ఖర్చు తప్పించుకుంటూ పెళ్లి తతంగం అంతా కానిచ్చేసాడు విజయబాబు. ఇరుగు పొరుగు వాళ్లు అనుకున్నారు, పాపం పెద్దమనిషి తన యావజ్జీవంతో కష్టపడి దాచుకున్న సొమ్మంతా పెళ్లి కూతురి బంగారపు వస్తువులు కొనేందుకు వెచ్చించేసాడని. మొగపెళ్లివారు ఏమీ ఇలా బలవంతం చేయలేదు కాబట్టి ఇంతగా తన సొమ్ము ఖర్చు చేయవలసిన అవసరం లేకపోయినప్పటికీ, ఒకే ఒక సంతానం, ఒకే కూతురు, ఒక్కటే తన బాధ్యత, ఇదంతా గమనించి తనని తాను బికారిగా చేసేసుకున్నాడు పాపం పెద్దమనిషి - అనుకున్నారు, బిడ్డను ఎంత ప్రేమగా చూసుకుంటున్నాడో విజయబాబు!

రమేశ్ ఇచ్చిన డబ్బుతో ఆభరణాలు కొనుక్కుని అలంకరించుకుని రమేశ్‌తో వెళ్లింది 'నూతన' వధువు కరవీ. ఆమెకు వీడ్కోలు చెప్పేటప్పుడు, తండ్రీ - కూతుళ్లూ వాళ్లని చూసి జాలిపడిన వరుడూ, బంధువులూ, స్నేహితులూ, ఇదివరలో తారకేశ్వరులోనూ, బసిర్ హాట్‌లోనూ, భాటపడా లోనూ ఏ విధంగా దుఃఖాన్ని ప్రకటించారో ఇప్పుడు అల్లాగే చేశారు. వెక్కి వెక్కి విజయబాబు, బారుబారుమని కరవీ ఏడ్చారు.

భర్తతో నూతన గృహానికి వెళ్లిపోతున్న కరవీని చూసిన రాణాఘాట్‌లోని ఆ సందులోని చాలా మంది కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఆ రోజు సాయంత్రమే కలకత్తాలోని బాగ్‌బజారులో ఒక సందులో ఒక ఇంటిలోని శయ్యా మందిరం లోపల ప్రవేశించారు రమేశ్, అతని క్రొత్త భార్య.

తరువాత రెండు రోజులు ఆ బాగ్‌బజారు సందులోని ఆ కుగృహపు

పడకటింటిలో ఉత్సవ జ్యోతి వెలిగింది రాత్రంతా. శుభకార్య పిండివంటలూ, పూలశయ్యా. ఉత్సవం సాంప్రదాయిక ఘనత కంటె, నవ్వులాటలూ, వేళా కోళాలు, అట్టహాసాలూ ఎక్కువగా సాగాయి. తన వాళ్లనే వాళ్లెవరైతే ఈ లోకంలో ఉన్నారో వాళ్లంతా వచ్చి రమేశ్ క్రొత్త కాపురపు ఉత్సవానికి తగ్గ ఏర్పాట్లు అన్నీ చేశారు. ఒక పినతల్లి, ఆమె ముగ్గురు కూతుళ్లూ వచ్చారు; వచ్చారు ఒక పినతండ్రి, అతని పదిమంది సంతానమూను. రమేశ్ ఇద్దరు స్నేహితుల తల్లులూ, ఒక స్నేహితుని భార్య కూడా వచ్చారు. వాళ్లంతా నూతనవధువుని చూసి చాలా సంతోషించారు. ఒక రాత్రి, మరొక ప్రొద్దుటా, అనేక విధాలైనా హడావుడీ, కబుర్లూ, నవ్వులూ, సంబరాలూ అయ్యాక అందరు బంధుమిత్రులూ వెళ్లిపోయాక, సాయంకాలపు ఎండ ఆ యింటి కిటికీ పై ప్రసరించి తాండవ మాడుతున్నది. ఆ సమయంలో ఇంటి మధ్య నూతన వధువు ఒక వేడి నిట్టూర్పు విడిచింది. నెత్తిపై ముసుగు కొంచెం క్రిందకు లాగి, తన పెద్ద కాటుక కళ్లని త్రిప్పుతూ, ఇంటి నాలుగు వైపులా చూస్తూ ఉన్న తన కరవీ ముఖం వైపు చూశాడు రమేశ్.

అన్నాడు: "కరవీ, నేను పటంపై నిన్ను చిత్రిస్తాను.

రెండు రోజుల కృషి అయ్యాక, నీ కళ్లతో నువ్వే చూస్తావు నా యీ చేతుల్లో ఎంత కళ ఉందో!"

ఉత్సాహంతో చూసింది కరవీ- "మీరేమంటున్నారో అర్థం కావడం లేదు".

రమేశ్: "నీ రెండు కళ్లల్లోంచి గొప్ప జీవ కళ ఉట్టిపడే లా చేస్తాను ఆ చిత్రంలో"

కరవీ: "చేసి ఉంచండి, నేను తిరిగి వచ్చాక చూస్తాను".

రమేశ్: "నువ్వెక్కడికి వెళతావు"?

కరవీ: "మా నాన్న దగ్గరకు"

రమేశ్: "ఎప్పుడో వెళ్లవచ్చులే. ఇప్పుడప్పుడే వద్దు".

కరవీ: "వెళ్లాలని లేదు కాని మా నాన్న వచ్చి పడితే, వెళ్లక తప్పదు".

రమేశ్: "మీ నాన్న వస్తాడని ఎందుకు అనుకుంటున్నావు"?

కరవీ: "రేపు ప్రొద్దున్నే వస్తాడని అనుకుంటున్నాను"?

కొంతసేపు ఊరికే ఉంది కరవీ- తర్వాత అకస్మాత్తుగా దుర్భరమైన ఆవేదనతో సతమతమౌతు లేచింది. "అయ్యో మా నాన్న మాట జ్ఞాపకం వస్తే ఏమీ తోచడం లేదు. ఇప్పుడు ఏడుస్తూ ఉంటాడనుకుంటున్నాను:

ఓదార్చే కంఠంతో అన్నాడు రమేశ్: "అందులో ఆశ్చర్యం ఏముంది? నువ్వు అతనికి ఒక్కత్తెవే బిడ్డవు. కాని మీ నాన్న బాధ నాకు అర్థం అవడం లేదు, కరవీ.

అయితే చూడు, రానీ మీ నాన్నని, వచ్చాక నేనే ఏదో ఆయనకు నచ్చజెపుతాను".

కరవీ: "ఏమని చెపుతారు?"

రమేశ్: "నెల్లాళ్ళు పోయాక నువ్వు వస్తావు అక్కడికి, ఈ లోగా నీ ప్రయాణం గురించి ఆరాటపడవద్దని".

కరవీ: "మా నాన్న అర్థం చేసుకుని ఒప్పుకోడు. నేననేదేమిటంటే మీరు అడ్డు పెట్టకండి, మా నాన్న మనస్సుకి కష్టం కలిగించకండి".

రమేశ్ విషాదంగా నవ్వి అన్నాడు: "కాని నా మనస్సు దుఃఖం ఆయన గ్రహించ గలడా?"

కరవీ:"మీ మనసులో దేని గురించి దుఃఖం?"

కరవీ: "మీ నాన్న రేపు వచ్చి నిన్ను తీసుకు వెళ్లిపోతే నా మనస్సుకి ఏమీ తోచదు కరవీ"

తన పెద్ద కాటుక కళ్లతో రమేశ్ వైపు కొంచెం తీవ్రంగా చూసింది.

రమేశ్ అన్నాడు: "నువ్వు వెళితే నేను కూడా నీతో వస్తా. మీ ఊళ్లో కొన్నాళ్ళుండి మళ్లీ నిన్ను తీసుకుని వస్తా".

కరవీ: "ఛీ, అత్తవారింట్లో అన్నాళ్ళు మకాం చేయడం గురించి మీకేం సిగ్గులేదూ"?

రమేశ్: "ఏం మీ నాన్న నన్ను ఆహ్వానించడా?"

కరవీ: "ఆహ్వానించడు"

రమేశ్: "ఎందుచేత?"

కరవీ తడబడుతూ అంది: "ఎవరికి తెలుసు?"

రమేశ్: "అయితే నువ్వే మీ నాన్నకి నచ్చజెప్పు".

కరవీ: "ఏమని?"

రమేశ్: "నన్ను కూడా నీతో పాటు తీసుకు వెళ్లమని".

కరవీ: "ఛీ నన్ను పూర్తిగా లజ్జా హీనురాలిగా భావిస్తున్నారా! ఏ కూతురైనా తండ్రిని అలా అడుగుతుందా? ఎంత సిగ్గుచేటు మాట!"

మాట్లాడక ఊరుకున్నాడు రమేశ్. కరవీ అంది: "ఏమిటి మీరలా గంభీరంగా ఉండిపోయారు? ఏమైనా మనస్సులో నా గురించి సంశయిస్తున్నారా?"

రమేశ్: "సంశయం ఎందుకు? ఎవరి గురించి?"

కరవీ: "అంటే మీ పట్ల నాకు ప్రేమ లేదేమోనని"

రమేశ్: "అలాంటి సంశయం కనక వుంటే ముందుగా నేను చావడానికి సిద్ధపడతాను".

కరవీ రెండు కళ్లూ హఠాత్తుగా హడలినట్లు కనుపించాయి; ఆమె మనస్సులో

ఏదో విచిత్రమైన భయం ఉత్పన్నమయిందని తెలుస్తోంది. మెల్లిగా, కొంచెం అయాస పడుతూ అంది- "మీరు చావడం ఎందుకు? అంతకంటె నేను చావడమే మేలు; అప్పుడు మీరీ ఇంట్లో మరో క్రొత్త పెళ్లికూతురుని తీసుకు వచ్చి ఆమెతో నా కథ వేళాకోళం చేస్తూ చెప్పుకోవచ్చు.

రమేశ్: "అలాంటి తప్పు మాట వేళాకోళానికైనా అనకు, కరవీ"

నవ్వుతూ కరవీ అంది: "అదృష్టవంతుల భార్య చనిపోతుంది".

రమేశ్: "అబద్ధపు మాట".

రమేశ్ కూడా నవ్వుతూ ముందుకు వచ్చి ఆమె చెయ్యి పట్టుకుని అన్నాడు: "నీ లాంటి భార్య ఎక్కడా వుండదు.

కరవీ చకితురాలైంది ఇంకా నవ్వుతూనే అన్నాడు రమేశ్: "నీ లాంటి భార్యే కనక చనిపోతే, ఆ అభాగ్యపు భర్తకు జీవితంతో ఇంకేమీ ప్రయోజనం ఉండదు"

చెయ్యి విడిపించుకుని మరొకవైపు చూస్తోంది కరవీ. తర్వాత మంచానికి ఒక మూల ముడుచుకుని కూర్చుంది. రమేశ్ వైపు చూడడానికి ఎంత అయిష్టంగా ఉందో, అతను తన వైపు చూడడం కూడా అంత అయిష్టంగానూ వుంది తనకి.

చీకటి పడుతోంది బెంగతో అంది- "మీరీవేళ అన్నం తినరా? నన్ను తిననీయరా?

రమేశ్: "అంటే?"

కరవీ: "బైట నుంచి తినేందుకోసం ఏమీ సరుకులు తేవడానికి మీరు సిద్ధపడడంలేదు; నన్ను వంట చేయమనడం లేదు".

రమేశ్ కంఠంలో ఆనందం లాస్యమాడింది ఆ మాట వినగానే: "నువ్వు చేస్తావా వంట?"

కరవీ: "అవును ఈ ఒక్కరాత్రి మట్టుకు. మీ ఇంట్లో కొంచెం శ్రమ పడాలి!"

నవ్వుతూంది కరవీ. రమేశ్ కూడా నవ్వుతూ అన్నాడు: "నీ తో ఈ మాట చెప్పాలని ఇంతసేపూ నా మనసు కలవర పడింది".

కరవీ: "ఏ మాట?"

రమేశ్: "ఇన్నాళ్ళూ హొటలు భోజనం చేశాను; కాని నువ్వు ఈ వేళ ఇంట్లో ప్రవేశించాక హొటలు భోజనం తినాలని లేదు".

కరవీ: "నా చేతి వంట తినాలని మీకు ఇంత సరదాగా ఉందా"?

రమేశ్: "చెప్పలేనంతగా"

అన్యమనస్కయై వేరే దిక్కుగా చూస్తూన్న కరవీ హఠాత్తుగా పలికింది: "కాని ఇలాంటి కోరిక లేకపోతేనే మంచిది".

రమేశ్: "చాలా కాలం నుంచి ఉంది ఈ కోరిక".

ఆ పైన ఏమీ ఆలస్యం అవలేదు. బాగ్ బజారు సందులోని కుగృహం నుంచి సాయంత్రపు గాలితో వంట పొగ బైటకు వెలువడింది; వంట పాత్రల చప్పుడూ, ప్లేటుల స్పూనుల గలగలా, మంచి హడావుడిగా ఉంది. క్రొత్త చీర కొంగు నడుముకు బిగించి, చెక్కిళ్లపై చిందర వందరగా జుట్టు అల్లల్లాడు తూండగా పెద్ద గల్లంతుగా వంట చేస్తోంది నూతన గృహిణి.

వంట పూర్తి అయింది. బల్లమీద భోజనం పెట్టి కూర్చుంది కరవీ. తింటూ కూర్చున్నాడు రమేశ్.

కుర్చీ మీద కూర్చుని కరవీ ముఖం కేసి చూస్తున్నాడు రమేశ్. ఏం చెపుదామనుకుంటున్నాడో.ఏ మాట అతని హృదయాంతరాళంలో ఉబలాట పడుతూ కలత పెట్టుతుందో.

కరవీ అంది: "తింటూ తింటూ ఇంత గంభీరంగా ఉన్నారేం?"

రమేశ్ అన్నాడు: "ఒక మాట చెప్పనా?"

కరవీ: "చెప్పండి"

రమేశ్: "ఒక్కడినీ తినాలని లేదు"

కరవీ: "అంటే?"

రమేశ్: "నువ్వూరా, మనం ఇద్దరం కలసి తిందాం ఒకే కంచంలో".

వెంటనే హుషారుగా లేచింది కరవీ, కాని ఏం మాట్లాడలేదు. ఊరికే నిలబడిపోయింది.

రమేశ్ కూడా లేచి నిలబడ్డాడు. నవ్వుతూ కరవీ చెయ్యి గట్టిగా పట్టుకుని కుర్చీ మీద కూర్చుండబెట్టి, అన్నాడు రమేశ్: "ఈ పైన నాకు పని హడావుడి వల్ల స్తిమితం ఉండదు; ఇలా నీతో చెయ్యి కలిపి ఒకే కంచంలో అన్నం కలుపుకు తినే సౌభాగ్యం ఇంక ఎన్నాళ్లో ఏం చెప్పగలం?"

తింటూ కూర్చుంది కరవీ. రమేశ్, కరవీ కలసి ప్లేటుపైన చేతులు చాపి వేడి అన్నం ముద్ద ఒకటి కలుపుకు తిన్నారు. ఈ విధంగా జీవితంలో ఒక నూతన వ్రతం ఆచరించారు - రమేశ్, అతని ప్రియురాలైన, పెళ్లి చేసుకున్న సహధర్మచారిణి.

తింటూ తింటూ ఏదో విధమైన అశ్రుపూర్ణ స్వరంతో ప్రశ్నించింది కరవీ: "మీరు బాగా శ్రమ పడుతున్నారనుకుంటా?"

రమేశ్: "నిజమే. పని విషయంలో ఎవరూ జాలిపడరు. వంట్లో బాగుండక కొన్నాళ్లు పని మానివేయవలసి వచ్చింది.

కరవీ: ఇంత శ్రమ పడతారెందుకు?

రమేశ్: పొట్ట కోసం

కరవీ: ఏమాత్రం సంపాదిస్తారు?

రమేశ్: ఒక నెల 50, మరొక నెల 100, ఇంకొక నెల ఏమీ ఉండదు.

కరవీ: సరే, ఇప్పుడు నేనో క్రొత్త బాధ్యత వచ్చి పడ్డాను. దాంతో మీ మతి పోతుందనకుంటాను పని చేయగాచేయగా!

రమేశ్: మరేం అంత కఠినమైన దేం కాదు. ఇటుపైన నీ మూలాన నా మనస్సు హాయిగా ఉంటుంది కాబట్టి ఎంత శ్రమపనైనా ఓర్పుతో చేయగలనులే.

కరవీ: కాని మీరు చాలా అప్పు చేశారు కదా?

రమేశ్ నవ్వుతూ అన్నాడు: "ఆ ఋణభారం పెద్ద లెక్క లేకుండా పోగొట్టెయగలను. రెండు సంవత్సరాలు కష్టపడ్డానంటే అది తీరిపోతుంది. అందుగురించి ఏం బెంగ పెట్టుకోకు".

కరవీ తల ఉన్నట్లుండి వంగింది. చేతులు పట్టుకుని మాట్లాడకుండా కూర్చుంది. రమేశ్ అడిగాడు: "ఏమయింది? నువ్వు అన్నం తినడం లేదేం?"

కరవీ కదలకుండా ఉన్న చేతులకేసి చూస్తున్నాడు రమేశ్. ఇంతలో ఒక విచిత్రమైన సంఘటను చూసి రమేశ్ అరిచాడు: "ఇదేమిటి కరవీ?"

వంచిన కరవీ తలలో దాగిన రెండు కళ్ల నుంచి టప్పు మని ఒక జల బిందువు వచ్చి పడింది. ఆమె చేతిపై. చేతులు కడుక్కుని నిలబడింది కరవీ. నడుముకు బిగించిన కొంగు విప్పి దాంతో కళ్లు తడుచుకుని అంది- "వినండి".

రమేశ్: "చెప్పు".

కరవీ: "మిమ్మల్ని మీరు రక్షించుకో దలచుకున్నారా?

రమేశ్: "ఇదేం మాట కరవీ!"

కరవీ: "మిమ్మల్ని మీరు రక్షించుకోదలచుకుంటే, వెంటనే పోలీసులను పిలిచి నన్ను అరెస్టు చేయించండి!"

రమేశ్ కళ్లు గాభరాగా కంపించాయి- "దీని అర్థం ఏమిటి, కరవీ?"

కరవీ: "నేను మిమ్మల్ని మోసపుచ్చాను. నేను మీ కులస్థురాలను కాను, నేను కరవీని కాను, నేను ఇంతక్రితం అవివాహితను కాను... నేను ఎటువంటి దాన్నంటే"...

గట్టిగా ఆక్రోశిస్తూ అంది: "నేను ఒక క్రూరుడైన తండ్రికి ఒక క్రూరురాలైన కుమార్తెను. నేను మీ ఇంటికి మీతో కాపురం చేసేందుకు రాలేదు, పారి పోయేందుకు వచ్చాను".

ఏదో నాటకంలో నాయకురాలి లాగ, ఒక వింత పోజు ఇచ్చింది. తమాషాగా వేళాకోళం చేస్తున్నట్లు, అస్వాభావికంగా రమేశ్‌ని భయపెట్టదలచుకుంది. రాజకుమారి వేషం వేసుకుని ఒక మాయావి అయిన రాక్షసి లాంటిది ఎక్కడైనా

ఈ విధంగా ఏ రాజకుమారుడి నైనా నిజంగా భయపడేలాగ తన మాటలతో చేయగలిగిందే, లేదే అటువంటి నాటకపు సంగతి నిజంగా రమేశ్‌కు గుర్తు రావడం లేదు - నాటకాన్ని మించిన ఈ నాటకాన్ని చూడగా చూడగా.

అయినా భయపడ్డాడు రమేశ్. నిశ్శబ్దంగా మృత్యు వార్త విన్నట్లయింది అతనికి. కరవీ ముఖం చూసి అనుకున్నాడు -"ఇది నిజంగా ఒక ఆడదొంగ ముఖమేనా' అని.

కరవీ అంది: "నాకు తెలుసు, మీరు పోలీసుల చేత నన్ను పట్టించరని. మీరు వట్టి మూర్ఖులు, నిర్బలులు".

వంటిమీద వస్తువులు ఒక్కొక్కటే తీసి బల్లమీద పెట్టింది- "వీటిని తీసుకోండి. అఖరికి మీ 1500 రూపాయిలైనా మిగులుతాయి. ఇక నన్ను మాట్లాడకుండా వెళ్లిపోనీయండి".

రమేశ్: "ఎక్కడికి వెళతావు".

జవాబివ్వలేదు కరవీ.

రమేశ్ కఠోర స్వరంతో అరిచాడు: "నీ దుర్మార్గపు తండ్రి దగ్గరికే తిరిగి వెళ్లిపోతావా?"

ఇంకా జవాబు చెప్పలేదు కరవీ.

రమేశ్ అడిగాడు: "నా మాటకు సమాధానం చెప్పవా కరవీ?"

ఆరుస్తూ, ఏడుస్తూ నిలబడింది కరవీ- "మీరు చెప్పండి మీరు నన్ను వెళ్లనియ్యదలచుకోలేదు కదా?"

కొంచెం శాంతించి కాస్సేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు రమేశ్. తర్వాత కళ్లు అశ్రుపూరిత మవగా, కరవీ చేయి పట్టుకుని అన్నాడు: "నీవు వెళ్లడం నా కిష్టం లేదు".

కరవీ: "అయితే వినండి".

రమేశ్: "చెప్పు"

కరవీ: "ఈ వేళ మనిద్దరం ఇక్కడినుంచి వెళ్లిపోవాలి".

రమేశ్: "ఎక్కడికి వెళదాం?"

కరవీ: "మీ రెక్కడికి తీసకు వెళ్లగలరో ఎక్కడ అట్టే పెట్టుకోగలరో అక్కడికి".

ఇంకేం ఆలస్యం చేయలేదు రమేశ్. ఆ రాత్రే కాళీ అయిపోయింది బాగ్ బజారులోని ఆ కుగృహం. దొంగ కూతురైన ఆడదొంగ జీవితంలో అఖరు సారిగా ఈ పృథివిలోని ఒక నివాస స్థానం నుంచి స్వచ్ఛమైన భావంతో తన భర్తతో బయలు దేరింది.

చివరకి ఒక్కడే మోసపోయాడు. రాణా ఘాట్ నుంచి విజయబాబు ఒక్కడూ మరునాటి ఉదయం వచ్చి బాగ్‌బజారు సందులోని కుగ్గృహం ముందు నిలబడి చూసేసరికి అతను నిశ్చేష్టుడైపోయాడు. ఆ ఇంటి సింహద్వారపు తలుపు గొళ్లెం మీద ఒక తాళం వ్రేళ్లాడుతోంది. ఒక గట్టి, కఠినమైన, కరుణారహితమైన తాళం కప్ప. రెండు తలుపుల మధ్య కాళీలోంచి లోపలకు తొంగి చూసేసరికి ఇల్లంతా శూన్యతను ప్రదర్శించింది అతని కంటికి. ఎంత భయానక మైన శూన్యత!

కానీ అతను ఎక్కువ సేపు అలా నోరు మూసుకుని నిశ్చేష్టుడై ఉండిపోలేదు. పోలీసు వాళ్లు వచ్చి అతని చెయ్యి పట్టుకుని అరెస్టు చేసేసరికి విజయబాబు అని క్రొత్త పేరు పెట్టుకున్న ఒక పెద్ద మనిషి తన సహజమైన వెక్కి ఏడుపు ఏడుస్తూ అరిచాడు.

అయ్యో! కూతురివై కూడా ఇలా తండ్రిని దగా చేస్తావా, ఓ ఆడదొంగా!

---

(కథా సంపుటి, 1/1970)

# ఒక ప్రేమ కథ

*నరేంద్ర నాథ్ మిత్రా*

కిటికీ లోంచి ముఖం పెట్టి ప్రభాతబాబు అన్నాడు: "వ్రాసుకుంటున్నారా? సరే వ్రాసుకోండి. ఇప్పుడు మిమ్మల్ని డిస్టర్బ్ చేయను".

నేను కాగితం కలం క్రిందకి పెట్టి గౌరవనీయుడూ, ప్రవీణుడూ అయిన నా స్నేహితుని ఆహ్వానిస్తూ అన్నాను: "రండి, దయచేయండి. • లోపలికి రండి".

ప్రభాతబాబు కొంచెం సంకోచిస్తూ అన్నాడు: "కానీ మీరు వ్రాసుకుంటున్నారు కదా!"

అన్నాను: "పెద్ద వ్రాయవలసిందేమీ లేదు. ఒకటి రెండు ఉత్తరాలకి సమాధానం వ్రాశాను. దయచేయండి"

నా ఆహ్వానాన్ని స్వీకరించి ఆయన ఈసారి లోపలకు వచ్చాడు. సోఫాలో కూర్చుని, చేతిలో గొడుగు బల్ల మీద పడుకోబెట్టాడు- "వెళ్లేటప్పుడు పట్టికెళ్లడం మరిచి పోతానేమో అన్నట్లు. ఏదైనా ప్రియమైన వస్తువుని కంటికి కనుపించకుండా ఉంచడం ఇష్టం ఉండదు కదా!

ఆయన లోపలికి రాగానే నా ఎత్తు కుర్చీ నుంచి దిగి, ఆయన ముందు ఒక పల్లంగా ఉన్న సోఫాలో కూర్చున్నాను.

ఆయన నా వైపు చూసి చిరునవ్వుతో అన్నాడు: "ఉత్తరాలు బాగా వ్రాస్తారనుకుంటాను. ఒకప్పుడు నాకు కూడా ఉత్తరాలు వ్రాసే ఛాదస్తం ఉండేది. రాత్రంతా మేలుకుని స్నేహితులకు లేఖలు వ్రాస్తూ ఉండేవాడిని. అందు మూలాన నన్ను 'ఏ మాన్ ఆఫ్ లెటర్స్' అనవచ్చు".

ఆయన తనకి సమర్పించుకున్న బిరుదును, నేను చిరునవ్వుతో స్వీకరించి అన్నాను: "టీ పుచ్చుకుంటారా?"

టీ మాట వినేసరికి ప్రభాతబాబు సంతోషించి అన్నాడు: "అయితే ఈ మిట్టమధ్యాహ్నం వేళ మీకేమీ 'అశ్రమ పీడ' కలగదు కదా? గృహస్థాశ్రమం కదా! నేనైతే గృహస్థుని కాను అంచేతనే భయపడుతూ వచ్చాను - మీ శ్రీమతి కేమైనా శాంతి భంగం కలిగిస్తానేమో నని".

నేను లోపలకు వెళ్లి రెండు కప్పుల టీ తెమ్మని చెప్పి మళ్లీ యథాస్థానంలో వచ్చి కూర్చున్నాను.

ప్రభాత బాబు పేరే 'ప్రభాత'. ఆయన వయస్సు 74 సంవత్సరాలు ఉంటుంది. శరీరం జీర్ణించింది కాని మనస్సు కాదు. బస్సులూ ట్రాములూ

స్వేచ్ఛగా ఎక్కి తిరగగలడు. చాలా సంఘ ప్రేమ ఉన్న మనిషి. ప్రతీ మీటింగుకి హాజరవుతూ ఉంటాడు. పూర్వపు బంధువులదీ, స్నేహితులదీ యోగక్షేమం తెలుసుకుంటూ ఉంటాడు; క్రొత్త స్నేహాలు చేయడం కోసం ఎప్పుడూ సిద్ధంగా ఉంటాడు. కొడుకు వయస్సు వాళ్లయినా సరే, మనుమడు వయస్సు వాళ్లయినాసరే- అందరూ ఆయనకి సమ వయస్కులే. తనకి మట్టుకు కొడుకూ లేడు, మనుమడూ లేడు. ప్రభాత బాబు 'అకృతదారుడు' (అవివాహితుడు).

ఆయన మాటలు విన్నాక అన్నాను: "మంచి మాట, ప్రభాత బాబూ. మొన్న రాత్రి మీరు రాలేదు. ఒకళ్లిద్దరు నా స్నేహితులను నాతో బాటు అట్టే బెట్టాను. వాళ్లు మీతో మాటాడుదామని వచ్చారు. మేము చాలాసేపు ఎదురు చూశాము మీ కోసం'!

ప్రభాత బాబు కొంచెం నాలుక కరచుకుని సిగ్గుతో అన్నాడు: "మరచిపోయాను కల్యాణబాబూ, పూర్తిగా మరచిపోయాను. మొన్న రాత్రి నేను అలిపూర్‌లో మా స్నేహితుడి ఇంటిలో ఉన్నాను. అక్కడ నేనొక ఆనివర్సరీ సందర్భాన్ని నిర్వర్తించాను".

"మీ స్నేహితుని బర్త్ ఆనివర్సిరీయా అని అడిగాను.

ఆయన తల ఆడిస్తూ అన్నాడు: "కాదు బాబూ అదేం కాదు. అతను జన్మదినం, గిన్మదినం ఏం జరుపుకోడు. ఆయనెప్పుడూ పూజ చేయడం కానీ ఏ అనుష్ఠానాలు నిర్వర్తించడం కానీ నేనెప్పుడూ చూడలేదు. సామాజికమైన వైనా సరే వైయక్తికమైనవైనా సరే. సంధ్యావందనం, జపం, తపం, ఆసనాలు-గీసనాలు, ఏమీ లేదు ఆయనకి. అందుకే మధ్య మధ్య అతనితో అంటూ ఉంటాను. (సైతానుకైనా అనుష్ఠానాలేవో ఉంటాయి), నువ్వేమైనా సైతాను కంటె గొప్పవాడివా? అటు తర్వాత కొంతకాలం చూశాను ఆయన ఒక అనుష్ఠానాన్ని దృఢమైన నిష్ఠతో పరిపాలించడం. ఏ డాదికి ఒక్కసారి మాత్రమే. ఆ అనుష్ఠాన సందర్భంలో ఒకే ఒక వ్యక్తిని ఆహ్వానిస్తాడు".

అన్నాను: "ఆ వ్యక్తి మీరే కదా?"

చిరునవ్వు ముఖంతో నా మాట ఒప్పుకున్నారు ఆయన.

ఇంతలో టీ వచ్చింది. ప్రభాత బాబు టీ మెల్లిగా త్రాగుతూ, జేబులోంచి సిగరెట్టు పాకెట్టు తీసి ఒక సిగరెట్టు అంటించాడు. ఆయన చవక సిగరెట్టు కాలుస్తాడు.

నేను కాల్చనని తెలిసి కూడా, చమత్కారానికి ఒకటి ఇస్తూ అడిగాడు: "ఏం కాల్చవా?"

నేను తల ఆడించడం చూసి అన్నాడు: "బాగుంది, నేనెప్పుడు సిగరెట్టు కాల్చడం మొదలు పెట్టానో తెలియదు. స్తన్యపానం వదలగానే ధూమపానం మొదలు పెట్టానేమో మరి!

నేను అన్నాను "ఏం అనుష్ఠానం గురించి చెపుతున్నారు?"

ప్రభాతబాబు అన్నాడు: "ఆగు బాబూ, ఆగు. కథ వ్రాయకపోయినా, వాటి రీతీ, నీతీ కొద్దిగా తెలుసు నాకు. పెళ్లి చేసుకోకపోయినా పెళ్లివారితో వెయ్యిసార్లు వెళ్లాను. కథ యొక్క సస్పెన్సు పాడు చేసే అంతటి మూర్ఖుడను అనుకున్నారా? కథ యొక్క సారాంశం ముందే చెప్పేస్తే మీరు నా కథను చెవి ఒగ్గి వింటారా?

"కథ అంటే నిక్కచ్చిగా నాకు సంబంధించింది కాదు. అది ఆ నా మిత్రుడికి చెందినది. మీకు చెప్పడంలో ఏమీ ఇబ్బంది లేదు. మన పొట్టలో పెట్టుకుని ఉంచనక్కరలేదు. దాచుకోవలసిన విషయం ఏదైనా ఉంటే అది రహస్యంగా పదిమంది చెవుల్లో ఊదేస్తే దానికి స్వయంగా నివృత్తి కలుగుతుంది. కాని ఈ కథ వ్రాయడంలో మీకు సులువు ఉండదు, కల్యాణ బాబూ! చాలా పూర్వ కాలపు చరిత్రకు చెందిన కథ ఇది. పూర్తిగా పురాతన కాలానిదీ కాదు. పూర్తిగా ఆధునిక పరిస్థితీ కాదు. పాత విలువలు వాటికి చెందుతుంది - ఈ కథ. రోజులైతే ప్రాతవే. అయినా అవి నాలో ఎప్పుడూ క్రొత్తగానే ఉంటాయి. నా దప్పుడు యౌవన దశ. ఎంత కాలం క్రిందట? బహుశా ఒక అర్ధశతాబ్దం పూర్వం. అయినా అప్పుడప్పుడు బాగా జ్ఞాపకం వస్తూంటుంది ఆ నాటి కథ అప్పుడప్పుడు. మళ్లీ ఒక్కొక్కప్పుడు అనిపిస్తూంటుంది. ఆ నాటి రోజులు ఎంత దూరమైన భూతకాలానికి చెందినవో అని. డీవ్ పాస్టు-ఎంత ప్రాత రోజులో అవి, నిజానికి ఇతిహాసాల కంటె ఇంకా ప్రాచీనమైన వేమో అన్నట్లు తోస్తోంటుంది.

"ఆ కాలంలో పడమటి సరిహద్దున ఉన్న ఒక పట్టణానికి కలకత్తానుంచి బదిలీ అయింది నాకు. నేను ఇంటిపట్టుండే వాడిని అంచేత వెళ్లడానికి నా మనస్సు ఒప్పలేదు. కలకత్తా నిండా బంధు మిత్రులు. ఆఫీసు సమయం తప్పిస్తే, ఇటూ అటూ తిరుగుతూంటే రోజు గడిచి పోతుంది, రాత్రిం బవళ్లు. ఆ తిరగడంలోనే ఉన్నాయి సాహిత్యం, సంగీతం, నాటకం. నేను వెళ్లే క్రొత్త చోటు ఉద్యోగం తప్ప మరేం కాలక్షేపం ఉంటుంది? ఆ ఉద్యోగమే ఎలా నిర్వర్తించానో వినండి. సశస్త్ర సైన్యాలకు అయ్యే ఆహార విహారాల లక్షల లక్షల రూపాయల ఖర్చుని ప్రతీ పైసా ఎలా వ్యయమైందో జాబితా వ్రాయడం నా పని. నాకా పని రుచికరమైనది కాదు. కాని చాకిరీ అంటే చాకిరీ చేయక తప్పదు. ఎల్లాగంటే, భర్త మీద అనురాగం లేకపోయినా, పెళ్లి చేసుకున్న అదది ఆయనకి సేవ

చేయడం తప్ప గత్యంతరం లేనట్లు.

ఆ పట్టణంలో నేను ఒక మధ్యతరగతి మెస్ ఆహారం, వసతి గల స్థానంలో మకాం చేశాను. ఎక్కడైతే బంధు రహితంగా ఉంటుందనుకున్నానే చూసేరికి అలా లేదు. మా మెస్‌లో ఒక చిన్న తరహా వినోద గృహంగా ఉండేది పాటలు, మాటలు, నవ్వులు, వేళాకోళాలు, పేకాట, జూదం అన్నీ అక్కడ జరుగుతూండేవి. ఎవరికి ఏయే విషయాలలో అభిరుచి ఉంటుందో వాళ్లకు అక్కడ ఆ ఏర్పాటు చేయబడుతుంది. ఆ వినోద గృహంలోకి నా మిత్రుడు శైలేన్‌సేన్ రావడం మొదలుపెట్టాడు. మా సెక్షన్‌లోనే అయన పనిచేసే వాడు. నా లాంటి వాడు కాదు. మనస్ఫూర్తిగా పనిచేసే వాడు. చాలా బుద్ధిమంతుడు. అయన గుణాల కంటె కూడా రూపం చాలా ఆకర్షణీయమైనది. నాలా నల్లగా ఉండడు. ఎత్తు నా కంటె ఒకటి, ఒకటిన్నర అంగుళాలు తక్కువ. నేను ఇంచుమించు ఆరు అడుగుల మనిషిని అతను అంత పొడుగు కాదు.

అయితనేం, అతని కే విషయంలోనూ లోటు లేదు. చక్కటి రంగు; అందమైన ముక్కు, కళ్లు, తలనిండా నొక్కునొక్కుల జుట్టు. ఆకర్షణీయమైన ఆకారం. శైలేన్ ఏమీ పెద్ద కసరత్తు చేసేవాడు కాదు, క్రీడాకారుడు కాదు. అయినా అతను అడంగి రూపం కలవాడు కాదు, మంచి పురుషత్వంతో కూడుకున్న వాడు. అతని పౌరుషం, గాంభీర్యం, ధైర్యం స్థిర చిత్తం ఎప్పుడూ ప్రకాశిస్తూ ఉంటాయి. మా స్నేహం మొట్టమొదట అసమానుల మధ్య అనిపించేది. అతని వ్యక్తిత్వంలో ఉన్న విశిష్టత నాలో లేదు. అయితే, నాలో ఏయే గుణాలు ఉన్నవే, అయనలో వాటి అభావం అతనికి అనుభూతమవుతూనే ఉండేది. మా మొదటి పరస్పరాకర్షణ ఈ అసమాన ధర్మాల వల్లనే అనవచ్చు.

"శైలేన్ మా 'మెస్'లో వచ్చి మాట్లాడకుండా కూర్చునేవాడు. లైబ్రరీ అరలోంచి ఒక పుస్తకం బైటకు తీసి చదువుతూ ఉండేవాడు అప్పుడప్పుడు, అప్పుడప్పుడు మిగతా వాళ్లు జరుపుకునే కర్మకాండలూ కాలక్షేపాలు చూస్తూ కూర్చునేవాడు. చాలా బిడియపడే స్వభావం కలవాడు. ఇప్పుడైతే అలా కాదు.

"అందరూ వెళ్లిపోయాక వీలుంటే నా దగ్గరకు వచ్చికూర్చునేవాడు. అప్పుడు సమరుచిగల, సమ వయస్కులైన స్నేహితుల మధ్య జరిగే మాటలు మా యిద్దరి మధ్యా జరుగుతూండేవి.

"ఒకరోజు ఎవరూ లేని స్థలం, సమయం చూసి నాతో అన్నాడు: "నీతో ఒక మాట చెప్పాలి".

"సరే చెప్పు".

"అసలు విషయం ప్రస్తావించే ముందు' నిశ్శబ్దంగా ఊరుకున్నాడు.

"ఏమయింది? మాట ఉంటే చెప్పే విధానం ఇదా?"

"శైలేన్ అన్నాడు: 'పోనీ ఏం లేదు!

"నే నన్నాను: "అగిపోయావెందుకు? నువ్వేదైతే చెప్పలేకపోతున్నావే, అది నేనే చెపుతాను. (అటుపైన శైలేన్ గొంతుకను అనుకరిస్తూ ప్రభాత్‌బాబు అన్నాడు: 'ప్రభాత్, భాయి నేను ప్రేమలో పడ్డాను. పడడం అంటే పూర్తిగా మునిగి పోయాననుకో. ఈ అగాథం నుంచి నువ్వు నన్ను పైకి ఎత్తాలి').

"శైలేన్ ఇంకా ఇలా అన్నాడు: "నా కథ మీకెలా తెలిసింది"?

"తెలియడంలో ఏమీ మిగలలేదు. ఎప్పుడైతే మీ యింట్లో నిన్ను చూశానో అప్పుడే నా కన్నీ తెలిసి పోయాయి".

"శైలేన్ మాట్లాడక ఊరుకున్నాడు.

" అ పట్టణంలో నేనా 'మెస్' లో మకాం చేశాను.

శైలేన్ అక్కడ ఉండేవాడు కాదు. అక్కడ అతని తండ్రి ఒక ప్రభుత్వపు 'క్వార్టర్స్'లో ఉండేవాడు. తండ్రీ, తల్లీ, సోదరీ సోదరులూ మొత్తం పెద్ద కుటుంబం వాళ్లది. వాళ్లతో ఉండే వాడు శైలేన్.

"అఫీసుకి సెలవు వచ్చినప్పుడు నన్ను వాళ్లింటికి తీసుకు వెళుతూ ఉండేవాడు శైలన్. వాళ్ల అమ్మ నన్ను కూడా తన బిడ్డ లాగ చూసుకునేది. తన చేతి వంట నాకు కూడా పెడుతూ ఉండేది. శైలేన్ సోదరీ సోదరులు నన్ను చాలా అనురాగంతో చూస్తూ ఉండేవారు. ఏమీ అభ్యంతరం లేకుండా, ఒక ప్రవాసపు బెంగాలీ కుటుంబం ఆ రోజుల్లో నాకు ఇంటి తలుపులు తెరచి స్వాగతం చెపుతూ ఉండేది. కాగా, శైలేన్ ఇల్లు నాకన్నిటిలోకి ఎక్కువ ప్రీతికరంగా ఉండేది.

"శైలేన్ ఇంట్లోనే నేను మాధురిని మొదట చూశాను. అమె సౌందర్యం చూసి అమె శైలేన్ సోదరేమో అనుకున్నాను. ఇద్దరిదీ ఒకటే అకర్షణీయమైన రంగు. స్త్రీ కాబట్టి ఇంకా చక్కటి శ్వేత వర్ణం కలిగినదిగా ఉంది. ముఖ వర్చస్సు అమిత మంజులమైనది. నాకు సాధారణంగా కోల ముఖం అంటే ఇష్టం. కాని వికసిస్తున్న తామరపువ్వు వంటి గుండ్రని ముఖం అదే నేను మొదటిసారి చూడడం. తలంతా ఒక నిండైన ముద్ద లాంటి జుట్టు: మేఘం వంటి నలుపు, సుదీర్ఘమైనది. అంత సిల్కులా తళతళలాడే అందమైన కేశ సంపద నేనింకెక్కడా చూడలేదు. మాధురి శైలేన్ చెల్లెలు కాదు సరి కదా, అమె అతని తల్లిని 'పిన్ని' అని పిలిచినా అమె అతని పిన్ని కూతురు కూడా కాదని కొంతకాలం తరువాత తెలుసుకోగలిగాను. అమె బ్రాహ్మణ కులానికి చెందినది, ఇంటిపేరు "ముఖర్జీ". శైలేన్ ఇల్లూ అమె ఇల్లూ కొన్ని గజాల దూరంలో ఒకే వీధిలో ఉన్నాయి. రెండు కుటుంబాల మధ్య గాఢమైన స్నేహం, నిత్యమూ రాకపోకలూ,

అన్నపానాలు ఇచ్చుకోవడం పుచ్చుకోవడం. ఒక ఇంటి తల్లి ఇంకొక ఇంటి ఆడపిల్లకి మగపిల్లలకి 'గౌరవనీయమైన' పిన్ని అన్నమాట"

శైలేన్ అన్నాడు: "నీ కెలా తెలిసింది"?

"నేను అన్నాను: "నీ దాగుడు మూతల వ్యవహారం అంతా-చూస్తూంటే; నీ టేబులు మీద మాధురి పేరుతో ఉన్న పుస్తకాలు, ఆమె పాటల పుస్తకంలో నీ హస్తాక్షరాలూ అన్నీ చూస్తే- తెలుస్తుంది".

శైలేన్ పట్టుబడిపోయి, నవ్వడం మొదలుపెట్టాడు అన్నాడు: "ఈ కాస్సేపటిలో నువ్వు కనిపెట్టేశావు. నిన్ను సి.ఐ.డి. విభాగంలో నియమిస్తే బాగుంటుంది, ప్రభూ!"

శైలేన్ నన్ను 'ప్రభూ' అని గౌరవంగా పిలిచేవాడు. ఒక్కొక్కప్పుడు 'గురుదేవ్' అని పిలిచేవాడు. నేను నిజానికి అతని ఫ్రెండ్, ఫిలాసఫర్, గైడ్.

పట్టుబడిపోయిన శైలేన్ తన కథంతా నాకు చెప్పాడు. నిజానికి అతను చెప్పడానికే వచ్చాడు. అదే అతని యౌవనపు రోజుల ప్రణయ గాథ, దాచబెట్టి ఉంచిన ప్రేమ కలాపం, ప్రథమ తారుణ్యంలో ఒకే ఒక లిప్సతో సంఘటితమైన కథ- అంతా నాకు విప్పి చేప్పేశాడు శైలేన్. ఆ ప్రేమ అంతా ఒకప్పుడు చాటుగానే వ్యవహరించబడింది. ఇంట్లో వాళ్ళ దగ్గర ఎంతగా దాచాడో తనలో కూడా తాను దాచుకున్నాడు. కాని ఇప్పుడు ఇంక ఆ రోజులు కావు. ఇప్పుడు అతను కోరేది రెండు కుటుంబాల వాళ్ళూ వాళ్ళ ప్రేమను అంగీకరించడం. ఏ మాధురి అయితే ఇదివరలో వాళ్లింటికి కూతురిలా వచ్చేదో, ఇప్పుడు కోడలులా రావాలని అతని వాంఛ. ఏ శైలేన్ అయితే మాధురి ఇంటికి ఒక ఆదర్శ యువకుడిలా వెళుతూండేవాడో ఇప్పుడు అక్కడ మరొక పదవిని పొంది సన్మానింపబడాలి - జామాత దేవుడిగా.

నేను అన్నాను: "అయితే అటంకం ఏమిటి?"

శైలేన్ అన్నాడు: "కులం"

"మీ కులాల మాట మంద! ఒక పనిచేయ్. మాధురి తండ్రి తనంతట తాను కన్యా ప్రదానం చేయకపోతే, నువ్వు 'సుభద్రా హరణం' (లేవదీసుకుపోయి పెళ్ళి చేసుకో!) చేయి నేను మిమ్మల్ని కాపాడుతాను- "సర్వ ధర్మాన పరిత్యజ్య మామేకం శరణం వ్రజ?"

శైలేన్: "లేదు, భాయీ, అల్లాగ జరగదు"

నేను: "ఏం మాధురి భయపడుతోందా?"

శైలేన్: "భయపడుతోంది, జంకుతోంది. తన దుర్మార్గపు తండ్రి అంటే ఆమెకి చాలా ప్రేమ. అతనికి విరుద్ధంగా ప్రవర్తించడానికి సాహసించడం లేదు".

నేను: "అయితే సరే. ఆ ఇంజనీర్ పెద్దమనిషికి నేను అంతా నచ్చచెప్పుతాను. నేను నీ వకీలునై రాజీ చేస్తాను మీ ఇద్దరి మధ్య".

శైలేన్: "అరే బాబా! అల్లా నువ్వు చేస్తే వాళ్ళింటి తలుపు, నా ముఖం మీద కొట్టి మూసేస్తారు. అప్పుడు మా నాన్న ఆ అవమానాన్ని సహించగలడా? ఒక్క కిటికీ అయినా వాళ్లింటి వైపు తెరచి ఉంచడు. సరే, ఇప్పుడు నీకు నా యీ వ్యవహారం అంతా అర్థం అయింది. అయినా ఎవ్వరికీ ఈ సంగతి తెలియ నీయకు. అల్లాగయితే చిరకాలపు స్నేహం మా రెండు ఇళ్ల మధ్యా ఇప్పుడు నశించిపోతుంది".

నేను: "మీ నాన్న, అమ్మా ఏమంటున్నారు?"

శైలేన్: "వాళ్ల కిష్టం లేదు. ఇల్లాంటి ప్రేమ వివాహాలంటే వాళ్లకి భయం. వాళ్ల అభిప్రాయం ఏమిటంటే మేము 'గాంధర్వ వివాహం చేసుకుంటే మేము దూరమై పోయి ఎక్కడో ఉండిపోతామనీ, జననీ జనకులనూ, సోదరీ సోదరులనీ చూడడానికి రామని. నిజానికి తను కూడా భయపడుతున్నాడు శైలేన్. నేను కూడా అతని తరఫున ఏ శౌర్యం ప్రదర్శించానో అది ఆలోచించగా సాధ్యం అనిపించడం లేదు. అతని భయం ఏమిటంటే పొందిన పొత్తు అంతా విచ్ఛిత్తి అయిపోతుందని. మరేం జరగకపోయినా, ఇలా ఉన్నట్లుంటే ఒకరి నింకొకరు చూడగలుగుతున్నారు. ఒకరి మాట ఇంకొకరు వినగలుగుతున్నారు, చాటుమాటుగా ఒకరి నొకరు కొద్దికొద్దిగా నిర్వ్యాజ ప్రేమ కలాపంలో ఆనంద పరచగలుగుతున్నారు; ఇదంతా బైటపెట్టితే పెద్ద వాళ్లు, ఈ మాత్రం సంతోషం ఈ ప్రేమికులకి కలగకుండా చేస్తారని".

నేను నవ్వుతూ అన్నాను: "శైలేన్, అయితే నువ్వు ఆ మాట మీద ఉండు. ఇంకేమీ పెద్ద ఆశ పెట్టుకోకు".

తరువాత రెండు కుటుంబాలలో గుప్తంగా పెళ్లిళ్ల పేరయ్యలు రాకపోకలు మొదలు పెట్టారు. మాధురికి పెళ్లిచూపులు జరుగుతున్నాయి. శైలేన్‌కి ఇష్టం లేకపోయినా పెళ్లి కూతుళ్ల కోసం వెదకుతున్నారు. చాలా మంది కట్న కానుకలతో సాలంకృతకన్యా ప్రదానం చేస్తామన్నా, శైలేన్ ఏ సంబంధానికి అంగీకరించడం లేదు. పర్యవసానం ఏమిటంటే పెళ్లిళ్ల పేరయ్యలు ఊరికే వస్తూ పోతూ ఉన్నారు. ఒక్కడైనా 'ప్రజాపతి' ఏ ఇంటి నుంచి ఉద్భవించలేదు.

కొన్నాళ్ల తర్వాత నాకు సిమ్లాకి బదిలీ అయ్యింది. నేను సెలవు తీసుకునే రోజున మాధురి వాళ్ల తోటలో నుంచి తెచ్చి ఒక ఎర్ర గులాబి గుత్తిని నాకు బహూకరించింది. ఇంకా రెండు అమూల్యమైన పగడాల బిందువులను కూడా చూడగలిగాను.

ఆ అశ్రుభరిత విశాల కృష్ణచక్షువుల వైపు చూస్తూ అన్నాను: "మాధురీ, నువ్వేమిటి ఇలా చేస్తున్నావు?"

మాధురి అంది: "ప్రభాత్ అన్నయ్యా! నాకు నీ కంటె వేరే నిస్వార్థపరుడైన స్నేహితుడు లేడు. నువ్వు నన్ను మరచిపోకు".

నేను నా స్నేహితుని 'ప్రభు'ని, రక్షకుడను. అంతకంటె విశేషం ఏమీ లేదు. నే నెప్పుడూ ఒక అక్సులరీ వెర్బ్ మాత్రమే. ఎప్పుడూ కూడా ప్రధాన క్రియా పదాన్ని అవలేదు, అవగలిగి ఉండలేదు. అయినప్పటికి వాళ్లిద్దరి ప్రేమ తత్వంలో ఏ మాత్రం అల్పత్వాన్ని గ్రహించ లేకపోయాను. అది అలా ఉండగా శైలేన్ తో అన్నాను, 'ఏమవుతుంది' అని నేనైతే కొద్దిగానే జీవితంలో సాధించాను. కానీ, జీవితమంతా నా అక్షయపాత్రను నూకలతో నైనా నింపక పోలేదు.

ప్రభాత బాబు గడియారం వైపు చూశాడు. తర్వాత అన్నాడు: "అరే బాబా! ఇంక సంక్షిప్తంగా చెపుతాను. లేకపోతే మీరు మీ అవిడచే తిట్లు తింటారు; నా కింకెప్పుడూ ఒక కప్పు టీ లభించదు. నాకు సిమ్లాకు బదిలీ అయిన కొన్నాళ్లకు శైలేన్ పాట్నా వెళ్లాడు. ప్రభుత్వం మా కర్మకి నియంత. మా యిద్దరికీ, మధ్యే మధ్య దూరంగా బదిలీ అయేది. ఒక్కొక్కప్పుడు మళ్లీ మా యిద్దరికీ ఒక స్టేషనులో 6 మాసాలూ, 1 సంవత్సరం అల్లా ముఖా ముఖిగా కలుసుకుని మాట్లాడుకునేందుకు వీలయే లాగ ట్రాన్స్ఫరు చేయబడుతూండేది. మా వయస్సుతో పాటు మా ముఖాలు కూడా మారాయి. మా జీవితాలలో కూడా ఒక స్టేషను' నుంచి మరొక 'స్టేషను' కు బదిలీ అయినట్లే ఉండేది. బాహ్యంగా ఎన్ని పరివర్తనలు వచ్చినప్పటికీ, మా ఇద్దరి మైత్రి క్షేత్రంలో మటుకు ఏ విధమైన బదిలీ ఎప్పుడూ కూడా రాలేదు. 6 మసాల మధ్య కాలంలో 'తమరు' నుంచి 'మీరు' కి మారింది మా పరస్పర సంబోధన; "మీరు' నుంచి 'నువ్వు'కి మారేందుకు ఒకటి రెండు సంవత్సరాల కంటె ఎక్కువ అలస్యం పట్టలేదు. దూరంగా ఉన్నా, ఒకళ్ల కబురు మరొకళ్లం లేఖల ద్వారా తెలుసుకుంటూ ఉండేవాళ్లం. అప్పుడప్పుడు కలుసుకుంటూ ఉండేవాళ్లం. మాధురి తల్లి చనిపోయింది. ఇద్దరు సోదరులూ పెద్దవాళ్లయ్యారు. తండ్రి ఇంకా ముసలి వాడయ్యాడు. ఆ మొండి తండ్రి ఇప్పుడు అసహాయుడై పూర్తిగా తన కూతురి పై తన దినచర్య గడిచేందుకు ఆధారపడి ఉన్నాడు. మాధురి ఒక్క సారిగా అతనికి భార్య, జనని, కుమార్తెగా వ్యవహరించవలసి వస్తోంది. శైలేన్ తల్లి తండ్రులిద్దరూ మరణించారు. అతని సోదరీ సోదరులు అతనిపై "త్వమేవ పితా చ మాతా చ త్వమేవ" అన్నట్లు ఆధారపడ్డారు. శైలేన్ వాళ్ల పెళ్లి చేసి అన్ని పూచీలు తీర్చాడు. వాళ్లందరూ అతను ఉద్యోగం చేసే చోట ఒక కుటుంబం

క్రింద చేరేవారు. – అయితే పెళ్ళికాని పెద్దన్నయ్య కుంటుంబానికి వటవృక్షం లాంటి వాడు. నేను అతనికి ఉత్తరాలు వ్రాసేవాడిని. మాధురితో కూడా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేవి.

ఆపైన నేనూ శైలేన్ ఇంచుమించు ఒకే సమయంలో రిటైరు అయ్యాము. అయితే శైలేన్‌కి ఎక్సుటెంషనుతో పాటు ప్రొమోషను కూడా వచ్చింది. నాకేమీ రాలేదు. దానికి బదులుగా నేను భారతదేశంలో అంతా చుట్టూ తిరిగి వచ్చాను; ఎమెట్యూర్ స్టేజి అధివసించి, బుగ్గలకు రంగు పూసి, నెత్తిపై విగ్గు పెట్టుకుని, నా వృద్ధాప్యంలో 'హీరో' గా తయారయ్యాను – మధ్య మధ్య ఒక విధమైన సాహిత్యకారుడుగా మారాను. మరొకప్పుడు ఒక విధమైన రాజకీయ వేత్తగా ఉపన్యాసవేదికను అలంకరించాను. ఇప్పుడు మత ప్రచార సభలకు హాజరవుతున్నానని వింటే మీరు నవ్వుకుంటారు లోలోపల.

ఇప్పుడు నేనూ, శైలేన్ దల్హౌసీకి పెన్షను తెచ్చుకునేందుకు వెళ్ళినప్పుడు మా కలయిక జరుగుతూంటుంది. మేము ఇద్దరం రిటైరు అయ్యాక కలకత్తా వచ్చాము. అతను ఉత్తర భాగంలోనూ, నేను దక్షిణ భాగంలోనూ ఉన్నాము. తరచు ఒకరినొకరు చూసుకోవడం తగ్గింది; ఉత్తర ప్రత్యుత్తరాలు ఆగి పోయాయి. శైలేన్ ఒకసారి వ్రాశాడు: "నీ చేతివ్రాత ఏ మాత్రం చదవడానికి తెలియడం లేదు". నాకు కోపం వచ్చి అప్పటి నుంచి అతనికి ఉత్తరాలు వ్రాయడం మానేసాను. ఇప్పుడు కేవలం ఫోను చేసుకుంటాము. అతను అలిపూర్‌లో ఒక అందమైన రెండస్తుల మేడ కట్టుకున్నాడు. ఇంతకు పూర్వం తమ్ముడి బిడ్డలు ఉండేవారు, ఇప్పుడు వరుసకు మనుమలు, మనుమరాళ్ళు– అతనితో మకాం చేస్తున్నారు. కొంతమంది స్కూలు లోనూ, కొంతమంది కాలేజిలోనూ, చదువుకుంటున్నారు. నాకు ఇల్లూ వాకిలీ ఏమీలేవు. ఏదో మా పిత్రియమైన ఒక పూర్వ కాలపు ఇల్లు ఉంది. అన్నగారితో పాటు నేనూ దానికి భాగస్వామిని. అయితే పేరుకి మటుకే. నా మనస్సులో నేను అనికేతనుడనే అనుకుంటాను. ఇంటిలో కొంచెం సేపే ఉంటాను. ఇది 12 సంవత్సరాల క్రితం మాట. పెన్షను తీసుకుని తిరిగి వస్తూంటే నా వెనక్కాల నుంచి హఠాత్తుగా ఒకడు వచ్చి నా చెయ్యి పట్టుకుని అరిచాడు: "ఓహో పరమార్థవాదిగారా! డబ్బు పై ఎందుకండీ ఇంత మక్కువ?"

చూస్తే అతను శైలేన్. నవ్వుతూ అన్నాను: "ముసలితనంలో కాంత వదులుతుంది కాని, కనకం కాదు. పళ్ళూ పాలూ కొనుక్కోవాలంటే డబ్బుండాలి కదా:"

శైలేన్ నన్ను ఒక టీ దుకాణానికి తీసుకువెళ్ళాడు: "నీతో ఓ మాట చెప్పాలి", అన్నాడు.

ఒకళ్ల కెదురుగా మరొకళ్లం ఒక ఖాళీ టేబులు దగ్గర కూర్చున్నాము. ముసలితనం ఒకడి జుట్టు లాగేసింది, మరొకడి పళ్లు ఊడపీకింది. శైలేన్ తల నున్నని గుండు, నావి రెండు వరసల కట్టుడు పళ్లు. శైలేన్ ఏమీ ఎక్కువగా మాట్లాడక, కాగితం సంచి లో నుంచి ఒక కవరు బైటకు తీసి నాకు చూపించి చదవ మన్నాడు.

బాగా పరిచితమైన చేతివ్రాలు. ఇప్పటికి కూడా సహజమైన ముత్యాల వంటి అక్షరాలు.

అన్నాను: "ఇది ఆమె వ్రాసిన ఉత్తరం".

శైలేన్ ఆక్షేపిస్తూ అన్నాడు: "అయ్యో చదవవా! నా ఉత్తరాలు నువ్వు కొన్నాళ్లనుంచి చదవడం మానేసావు!"

కవరులోంచి ఉత్తరం బైటకు తీసి చదివాను. కాగితం ఠావు పూర్తిగా ఉంది, కాని అందులో రెండే లైనులు: "నీతో ఒక ముఖ్యమైన మాట చెప్పాలి. తప్పకుండా రా. ఇట్లు నీ మాధురి".

నవ్వుతూ అన్నాను: "నేను నా మాట సవరించుకుంటూ ముసలితనంలో కూడ కొంతమందికి కాంత వదలదు. ఎక్కడుంది ఆమె?"

శైలేన్: "బారకపూర్‌లో, సోదరులతో ఉంటోంది".

తండ్రి చనిపోయాక మాధురి వాళ్లు లక్నోలో ఇల్లు విడిచి కలకత్తా వైపు వచ్చేసారు. కాని ఎక్కడో స్పష్టంగా తెలియదు.

శైలేన్: "సోదరులు ఉద్యోగాలు చేస్తున్నారు. మాధురి పంతులమ్మ పనిచేస్తోంది. ఆరోగ్యం చెడిపోయాక ఉద్యోగం విరమించుకుంది. తండ్రి పెద్ద ఆస్తి ఏమీ విడిచి పెట్టలేదు. 30 వేల రూపాయలు డిపాజిట్ చేసి కూతురికి ఇచ్చాడు; కొడుకులికి కొద్దిగా కొద్దిగా పంచి పెట్టాడు".

ఇప్పటి మాట నేను చెప్పడం లేదు. చాలా కాలం నుంచి పత్ర వ్యవహారం ఆగిపోయింది.

శైలేన్:"చాలా కాలం నుంచి ఒంట్లో బాగుండడం లేదు, నడు, ఒక మాటు చూసివద్దాం ముఖ్యమైన మాటేమిటో".

నేను: "నువ్వొక్కడివీ వెళ్లు. నేను కూడా వస్తే ఆ మాట బైట పడదు".

శైలేన్: "కాదు నువ్వు కూడా రా; ఈ వేళే వెళదాం.

మరో రోజున వెళ్దాం అన్నాను నేను. కాని ఆలస్యానికి ఒప్పుకోలేదు శైలేన్. మళ్లీ ఎప్పుడు ఎవరు చెప్పగలరు? ఒకళ్ల కొకళ్లు ఫోను చేసుకున్నాక వెళ్లాను. బారక్‌పూర్. శైలేన్ టాక్సీలో వెళ్దామన్నాడు. "పెన్షను డబ్బులు చాలా మట్టుకు ఖర్చు అయిపోయాయి. నడు, బస్సులో వెళ్దాం" అన్నాను.

వెళ్లేటప్పుడు కాలేజి స్ట్రీటు మార్కెటు నుంచి ఒక డజను అప్పుడే కోసిన పెద్ద రజనీ గంధ పుష్పాలు కొని పట్టికెళ్లాను.

శైలేన్ వేళాకోళం చేస్తూ అన్నాడు: "నిన్ను చూస్తే, నీ నాటకాల హాబీ నీలో బాగా స్థిరపడినట్లే ఉంది? "

స్టేషనుకి దగ్గరే ఇల్లు. రెండంతస్తుల మేడలో ఒక ఫ్లాట్‌లో ఉంటోంది ఆమె. గొళ్లెం కొట్టాక, ఒక ఆవిడ వచ్చి తలుపు తెరిచింది. మమ్మల్ని మేము పరిచయం చేసుకున్నాక, ఆవిడ మమ్మల్ని మాధురి పద్దకు తీసుకు వెళ్లింది.

ఒక చిన్న మంచం మీద మాధురి పడుకుని ఉంది. శుభ్రంగా ఉన్న తెల్లని పరుపు ప్రక్క. ఇల్లు కూడా చాలా శుభ్రంగా ఉంది. కాని ఈ మాధురి ముఖం ఏం ఇలా అయిపోయింది? ప్రక్కకు అంటి పెట్టుకున్నట్లు అయిపోయింది ఆమె శరీరం. లేచి కూర్చునే శక్తి లేదు ఆమెకు.

అయినప్పటికీ మమ్మల్ని చూసేసరికి ఆమెకు లేని శక్తి ఒకటి కలిగింది. ఉత్సాహంతో కూర్చుంది ప్రక్కపై రోగి. నా కేసి చూసి నవ్వుతూ అంది: "నాకు తెలుసు, నువ్వు కూడా వస్తావని".

ఆ పైన ఏం వ్యవహారం నడిపించిందో మాధురి, ఏనండి. తన సోదరుల భార్యలనిద్దరినీ పిలిచి చెప్పింది: "లక్ష్మీదేవి విగ్రహం ముందు కుంకుమ బరిణ ఉంది. దాంట్లో కుంకుమ పొడి పెట్టాను. అది తీసుకు రండి".

చిన్న మరదలు పట్టుకొచ్చింది ఆ కుంకుమ బరిణె. ఆమె చేతులోంచి బరిణె తీసుకుని శైలేన్ చేతులో పెట్టింది మాధురి: "ఈ కుంకుమ నా పాపిటిలో అలంకరించు. నేను అవివాహితగా మరణించటానికి ఇష్టపడను".

నేనింకా ఏం పరిశీలించానంటే; మాధురి కేశ సంపద పూర్వపు మేఘవర్ణాన్ని పోగొట్టుకుందని, వయస్సు అంత పెద్దగా ముదిరి పోక పోయినా, ఆమె జుట్టు, బాగా పలచబడి పోయింది; అక్కడక్కడ నెరిసినట్లుగా కంటికి స్పష్టంగా కనిపిస్తోంది.

శైలేన్ ఆమె కోరినట్లుగా పాపిటి మధ్య సింధూరాన్ని అలంకరించాడు. ఆమె మరదళ్లు శంఖం ఊద దలచుకున్నారు. (వంగ దేశపు ఆచారాన్ని అనుసరించి), కాని చేత్తో సంజ్ఞ చేసి ఆపు జేసింది మాధురి.

నేనన్నాను: "మాధురీ, నీ ముదిరి పోయిన జుట్టులో సింధూరపు రేఖను దాల్చేందుకు ఇన్నాళ్లు ఎదురు చూశావా?"

పాడ్యమి నాటి చంద్రుని వంటి చిరునవ్వు రేఖ మాధురి ముఖం పై తాండవించింది. అంది: "అవును. ప్రభాత్ దా*, ఇప్పుడింక మిగతా పెళ్లి మంత్రాలు చదువు".

* "శైలేన్ దా'

నేనేమైనా బ్రాహ్మణుడినా మంత్రాలు పఠించేందుకు? పోతే నేను నిజంగా మంత్ర ముగ్ధుడినై పోయాను. అందుచేత మెల్లిగా రెండు వాక్యాలు పలికాను- "యదిదం హృదయం తవ! తదిదం హృదయం మమ" (ఈ నా హృదయం నీది; ఆ నీ హృదయం నాది).

వాళ్లిద్దరూ చదవలేదు. కాని చెవి ఒగ్గి విన్నారు.

జీవితంలో ఎంత మంది పెళ్లివారితో ప్రయాణం చేయలేదు! ఎంతో దూరదూరాలు దుర్గమ సీమలు తరలి వెళ్లాను. కాని ఇటువంటి పెళ్లి ప్రయాణం ఎప్పుడూ చేయలేదు. కల్యాణ్ బాబూ! ఇటువంటి పౌరోహిత్యం ఎక్కడా నిర్వర్తించలేదు".

నేను కొన్న రజనీ గంధ పుష్ప గుచ్ఛం సఫలంగా ఉపయోగించింది. ఆ పువ్వులని మాధురి పక్కపై ఒక మూల ఉంచాను. కొన్ని క్షణాలకి ఆమె రోగ శయ్య పూల పాన్పుగా మారింది.

కాని మాధురి అటు తర్వాత ఎక్కువ రోజులు బ్రతకలేదు. ఆమె తమ్ముళ్లు అనేక విధాలుగా ఖర్చు పెట్టి చికిత్స చేయించారు. శైలేన్ కూడా ప్రయత్న దోషం చేయలేదు. కలకత్తా తీసుకువచ్చి ఒక నర్సింగ్‌హోములో ప్రవేశ పెట్టాడు. ఆమె కడుపులో (ulcer) (వ్రణం ) మట్టుకు ఏ మాత్రం తొలగలేదు. ఆమె అపరేషను బల్లపైనే మరణించింది. మరొక దజను రజనీ గంధ పుష్పాలను తీసుకువెళ్లాను ఆమెను చూడడానికి.

శైలేన్ స్వయంగా ఆమె శవాన్ని దహనపరచాడు. 5000 రూపాయలు తన జేబులోంచి తీసి ఆమె శ్రాద్ధ కర్మ కొరకు వెచ్చించాడు. అన్నదానం చేసాడు. భజన గాళ్లచే భజనలు చేయించాడు. అంతకు పూర్వం ఇటువంటి విషయాలలో అతనికి నమ్మకం ఉండేది కాదు. ఇదంతా మాధురి ఇచ్ఛానుసారం చేసాడని గ్రహించుకున్నాను.

ఆ మధుర హృదయపు మరొక తుది కోరిక యొక్క నిదర్శనాన్ని శైలేన్ నాకు చూపించాడు. ఇంతక్రితం తీసిన కాగితపు సంచి నుంచి మరొక పెద్ద కవరు బైటకు తీసాడు. మాధురి కోరిక ఆ కవరు తెరిచి ఆమె మరణానికి పూర్వం చదవకూడదని.

తెరిచాక చూస్తే అది లేఖ కాదు. ఒక అకుపచ్చ రంగు చిన్న కవురులో 30 వేల రూపాయలకు శైలేన్ పేరిట చెక్కు వ్రాయబడి ఉంది.

శైలేన్ అన్నాడు: "నేనీ డబ్బు ఎందుకు తీసుకోవాలి?"

నేనన్నాను: "తీసుకోవయ్యా, పెళ్లి చేసుకున్నందుకు నీకేం కట్నం దొరకలేదు. అలాంటి సొమ్ము ఎవరు వదులుకుంటారు?"

మాధురి సోదరులకు కొంచెం సొమ్ము సమర్పించాడు శైలేన్. మిగతా డబ్బంతా హాస్పిటలుకు దానం చేసాడు- మాధురి పేర ఒక్క 'బెడ్' గల గది నిర్మించేందుకు, అది దరిద్ర స్త్రీ రోగుల చికిత్స కోసం కేటాయించి ఉండాలని.

అప్పటి నుంచి ఆమె మరణ దినాన్ని పాటిస్తున్నాడు శైలేన్. ఆ సందర్భంలో నేనెక్కడినే అతిథిని. అతని ఇంటి గోడపై మాధురి పెద్ద ఫొటో ఒకటి వ్రేళ్లాడుతూంది. అది ఆమె ప్రథమ యవ్వనపు రోజులనాటి ఛాయా చిత్రం.

ఆ తరుణి ఛాయాచిత్రం ముందు మేమిద్దరం ముసలి వాళ్లం కుర్చీలు వేసుకుని కూర్చున్నాము. టీ త్రాగాము, కబుర్లు చెప్పుకున్నాము. ఒక్కొక్కప్పుడు ఏమీ మాట్లాడకుండా ఊరికే కూర్చుని ఉన్నాము.

శైలేన్ మృత్యువు బారి నుంచి ఒక ప్రేమ వస్తువుని రక్షించాడు. నా మట్టుకు నేను వార్ధక్యపు బారి నుంచి ఒక స్నేహాన్ని కాపాడాను"....ప్రభాత బాబు లేచి నిలబడ్డాడు. ఈ వేళ ఎదురుగుండా పెట్టిన గొడుగు మాట మరిచిపోయాడు అయన. నేను అది తీసి అయన చేతికి అందించాను.

అయన మెల్లిగా నవ్వి, "థాంక్సు" అన్నాడు.

---

(శారదీయ 'దేశ' 1379, అక్టోబరు 1972)

# గౌరవనీయులైన పరీక్షాధికారి దివ్యసమ్ముఖమునకు

*నారాయణ్ గంగోపాధ్యాయ్*

సార్,

తమరు నా ఈ లేఖ సాంతం చదవుతారో లేదో నాకు తెలియదు. కారణమేమిటంటే, మీరు చూస్తున్నట్లు ఇందులో మొదటి నుంచి చివరి వరకూ నేనేమీ ప్రశ్నోత్తరాలు వ్రాయడం లేదు- ఈ లేఖ తప్పించి. తమరు కొన్ని పంక్తులు చదివి కనుబొమ్మలు చిట్లించి, నాకు ఒక సున్న ఇచ్చి తరువాత నాన్‌సెన్సు రైటింగ్ వ్రాసినందుకు నా మీద యూనివర్సిటీకి రిపోర్టు పంపిస్తారని - నాకు తెలుసు. తమరు సున్న ఇవ్వండి, రిపోర్టు పంపండి - వాటి గురించి నేను ఆలోచించడం లేదు. బహుశా ఓపిక పట్టి ఈ లేఖ తమరు చదివిపారేస్తారేమోననే ఆశతో, ఈ నివేదనను తమకి సమర్పించుకుంటున్నాను.

ఒకటి రెండు ప్రశ్నలకు బహుశా జవాబు ఇవ్వగలను. కానీ అందువల్ల నాకు పాసు మార్కులు రావడం మాట అట్టేబెట్టి ఒక్క 20 మార్కులేనా రావు. అందుచేత ఆ ప్రయత్నం చేయను. అదీకాక ఈ సాయంత్రం నుంచి నేను 'పాసు-ఫెయిలు" అనే సీమ నుంచి బైటకు పోదలచుకున్నాను. కలకత్తా చుట్టుప్రక్కల వస్తూ పోయే లెక్కలేనన్ని రైల్వే ట్రెయినులలో ఏదో ఒక దాని చక్రం కింద జరుగుతుంది నా మిగతా మార్కుల తుది లెక్క. ఈ లేఖ తమరు చదివే సమయానికి ట్రెయిను కింద పడి చనిపోయిన ఒక అపరిచిత యువకుని స్వల్పమైన, పురాతనమైన విషయం తమ స్మృతి పథం నుంచి పూర్తిగా తొలగిపోతుంది.

తమరు సహజమైన అధ్యాపకత్వపు వివేకాన్ని ప్రయోగించి ఇంతవరకూ చదివాక అనుకుంటారు: "ఛీ, ఛీ,పరీక్ష పాసుకానంత మాత్రాన ఆత్మహత్యా? ఇంతకంటె పిరికితనం మరొకటి ఉంటుందా? దేశం యొక్క యువత ఈ మాత్రపు నైతిక బలాన్ని సంపాదించుకోలేకపోతే, బెంగాలీ ప్రతిభ ఎక్కడ నిలబడుతుంది; జాతి యొక్క భవిష్యత్తు ఏమవుతుంది?"

నన్ను నమ్మండి, సార్. నాకీ విషయాలన్నీ బాగా తెలుసు. ఇంకా నన్ను నమ్మండి - నాకూ బతికి ఉండాలనే ఉంది. నేననుకునేదేమిటంటే: నా హస్తస్పర్శ వల్ల, సాంతాల్ పరిగణాలో ప్రవహించే వరద నీటిని కొండ నుంచి పడుతుండగా దిగువ విశాలమైన కాచ్‌మెంటు ఏరియా లో నిలువుచేసి, దాని ద్వారా హైడ్రో ఎలక్ట్రిసిటీని ఆవిర్భవింప జేసి, స్విచ్ వేసి, ఆ కాంతితో బీహారు పశ్చిమ బెంగాలు

రాష్ట్రాల ఇండస్ట్రియల్ బెల్టు బ్లాస్టు బఫర్‌నేస్ యొక్క అరుణ కాంతులతో దేదీప్యమానంగా వెలిగించి, ఆ జ్యోతితో నేనూ సమ్మిళితమై భారీ ఎత్తున ఉక్కును ఉత్పత్తి చేసి; భావిభారత సౌధానికి పునాదిని నిర్మించగలనని! సార్, ఆత్మహత్య చేసుకోవడం నా కిష్టం లేదు.

నేను నలుదిక్కులా వేగంగా నడుస్తూ పరీక్ష వ్రాసి వచ్చిన విద్యార్థులను చూస్తున్నాను. వాళ్లలో చాలమంది నాలాగే ఇటువంటి కలలే కని కొన్నాళ్ల తర్వాత పేపరులో పరీక్షా ఫలితాలు ప్రకటించబడ్డాక ఆ' స్వప్న సౌధాలు కూలిపోవడం చూస్తారు. అయినా వాళ్లల్లో కొందరు బహుశా తమ జీవన పరిణామంలో భావి భారత వర్షపు ఆశాజ్వాలను, తమ చేతులతో వెలిగిస్తారు. ఆ అదృష్టవంతులు పురోగమింతురు గాక! నాలాగ ఆ అసంఖ్యాకులైన వారిలో ఈ విధంగా కొందరు జీవితంలో ఓడిపోతారా, లేక బతికిపోయి ఏదైనా పాంచవార్షిక సాఫల్యాన్ని ఉల్లేఖించే జాబితాలో వాళ్లు చేరుతారా - ఏమో! నేను తమరినెరుగను; ఏ రోజూనా, ఎక్కడా చూడలేదు; అయినా ఈ మాత్రం తెలుసు - తమరు అధ్యాపకులని. విద్యార్థులకు సన్నిహితంగా తమరు ఉంటూ ఉంటారు. వాళ్ల జీవన తరంగం తమరిని స్పృశిస్తే, వాళ్లని బహుశా తమరు ప్రేమించగలరు. మిగతా ఈ లేఖ తమరు చదవండి, చదవక పోండి, నా కథ తమకి తప్ప వేరెవరికీ విన్నవించుకోను?

సార్, ఎప్పుడైనా కలలు కన్నప్పుడు ఈ మాట మరచిపోతూ ఉంటాను - నేను మేదినీ పురంలోని ఊరూ పేరూలేని ఒక పల్లెటూరి రైతు బిడ్డని. కాని, నా తండ్రి రైతే అయినా, ఢిల్లీని అలంకరించిన ఏ ఒక్క దేశనాయకునికీ తీసిపోడు దేశభక్తి విషయంలో. ఒక అడవి మధ్య 1942 సం॥ సెప్టెంబరు మాసంలో ఒక అర్ధరాత్రి నేను పుట్టాను. కారణం ఏమిటంటే, మా నాన్న జాతీయ పతాకాన్ని ధైర్యంగా పట్టుకుని ప్రదర్శించడం వల్ల ఒక ధాన్యపు పొలంలో అతణ్ని తుపాకీ గుండుతో కాల్చి చంపేసారు మిలిటరీ వాళ్లు; తర్వాత మా ఊరు కూడా తగలబెట్టేశారు.

నా తండ్రి కోరిక, కొడుకు పుట్టినట్లయితే 'స్వాధీన (స్వతంత్ర) కుమార్' అని పేరు పెడదామని. అగ్ని జ్వాలలకు మా గ్రామం ఆహుతి అయిన ప్రళయ రాత్రిలోనే నా తండ్రి నెత్తురునే ఆశీర్వాదంగా స్వీకరించి, నేను స్వేచ్ఛా కాశ తలాన జన్మించాను: ఆ నాటి మిలిటరీ వాళ్ల బలానికి లొంగిన ప్రాంతంలో ఒక్క మానవుడు మట్టుకు పరాధీనుడు కాలేదు - నా తండ్రి.

సరే, ఈ చరిత్ర అంతా అలా అట్టే బెట్టండి, సార్. తమరు ఇంత వరకూ చదివినట్లయితే ఈ పాటికి తమకి ధైర్యం సడలిపోయి ఉంటుంది. మా వంశ చరిత్ర వినడం వల్ల మీకేమైనా తలనొప్పి కూడా కలిగి ఉండవచ్చు. అది తప్పిస్తే నాకు 3 గంటల కంటె ఎక్కువ సమయం లేదు కదా, తర్వాత అన్సరు పేపరు

లాగేసుకుంటారు. అందుచేత ఇక క్లుప్తంగా విషయం ముగించేందుకు ప్రయత్నిస్తా.

రైతుబిడ్డను, వ్యవసాయం చేసుకుని ఎలాగో బతుకగలను, లేకపోతే కరువు కాటకం వచ్చిపడితే తిండి లేకో, తినకూడని వస్తువు తినో, చస్తాను. కాని మీరు నమ్ముతారో నమ్మరో - నా దురదృష్టపు పినతండ్రి నన్ను మా ఊరి ఎలిమెంటరీ స్కూలులో చేర్పాడని, నాకు ఒక స్కాలరు షిప్ కూడా ఉందని.

సార్, ఆ స్కాలరుషిప్పే నా కొంపతీసింది. దాని మూలాన నేను కలలు కనడం మొదలు పెట్టాను. మా అమ్మ నన్ను తన గుండెకు హత్తుకుని తన కన్నీటికాలవలో ముంచేసింది. మా నాన్నను తలుచుకుని అమ్మ ఏడవడం నేను అదే మొదటి సారిగా చూశాను. తర్వాత మా పినతండ్రితో బయలుదేరి ఎనిమిది మైళ్లదూరం లో ఉన్న 'బడగంజి'లో హైస్కూలులో చేరాను.

హాస్టలులో ఉండేందుకు డబ్బు లేదు. ఒక ధాన్యపు గాదె యజమాని గుమాస్తా ఇంటిలో నాకు వసతి దొరికింది. నిజానికి ఆ గుమాస్తాకు మాకూ బంధుత్వం ఉంది; అయినా ఒక పేద రైతుతో చుట్టరికం ఉందని ఆయన ఒప్పుకోడు. బంధుత్వం ఉంది - భూస్వాములతోనూ, రైతులతోనూ; వడ్డీ వ్యాపారస్థులతోనూ, అప్పు తీసుకునే వాళ్లతోనూ. మా పినతండ్రి మాటను బట్టే నాకు అక్కడ ఉండేందుకు అవకాశం దొరికింది. హైస్కూలులో ప్రవేశించాను. జీతం కట్టనక్కరలేకుండా 'ఫ్రీ' పొందాను.

సార్, ఆ గుమాస్తా ఇంట్లో లక్ష్మి బంధింపబడి ఉంది. 6 లారీలు, 3 ఇళ్లు. కాని ఎవళ్లయితే అక్కడ పనిచేస్తారో వాళ్లకి ఎప్పుడూ కూడా సాదరు ఖర్చులకేమీ లభించదు. 500 రూపాయలు "దానం" చేస్తాడు. 25 వేల రూపాయిలు పోగు చేస్తాడు. నాకు తిండైతే పెడతాడు, కాని దాని వెల ఎల్లాగో లాగేసుకుంటాడు నా పని మూలాన.

ఈ అన్సరు పేపరు చూసి నా దస్తూరి అవకరంగా లేదని తమరు గ్రహించుకుంటారు; ఇంకా నాకు లెక్కల్లో పెద్ద బుర్ర-నెల పరీక్షలో నూటికి నూరు మార్కులు సంపాదించాను. పెద్ద గుమాస్తా గారు ఈ అవకాశాన్ని జారవిడుచుకోడు మొట్టమొదటగానే నా చేత ఉత్తరాలు వ్రాయించడం, అ పైన ఎక్కౌంటులు వ్రాయించడం, అటుపైన ఆదాయ వ్యయాల పట్టీ తయారు చేయించడం. ప్రొద్దున్నే రెండు గంటల సేపు నాకు ఇది నిత్య విధి.

నాకు చదువుకునేందుకు తీరిక రాత్రి ఎనిమిది గంటల తర్వాత మాత్రమే.

అప్పుడైనా ఆ చదువు ఏం సుఖంగా సాగుతుందా?

ఆ ధాన్యపు గాదెలో ఓమూల నా మకాం; అక్కడే మా పెద్ద గుమాస్తా గారి చిన్న

గుమాస్తా మకాం కూడాను. అతని వయస్సు నలభై దాటింది. వడిలిపోయిన గుడ్లగూబ లాంటి ముఖం - రెండు మంటలు వర్షింపజేసే పెద్ద పెద్ద కళ్ళు. నేను చదవడం మొదలెట్టే సరికి అతను హుక్కా పట్టుకు కూర్చుంటాడు.

అప్పుడు నా వయస్సు ఎంతనుకున్నారు? 12 కంటె ఎక్కువ కాదు. ఆ చిన్న గుమాస్తా తన మంటలు మండే కళ్లతో నా వైపు తీక్షణంగా చూస్తూ, అసహ్యంగా బుసలు కొట్టే కంఠంతో వాగుతూ ఉంటాడు. అతని గొడవ నాకు ఆ రోజుల్లో అర్థమయేది కాదు; తర్వాత గ్రహించుకున్నాను - ఆ సొద అంతా అశ్లీలం. తను ఎన్ని రకాలుగా ఎంత మంది ఆడపిల్లలని లొంగదీసుకుని చెరిపాడో వాటి వివరణ.

నా మంచి చెడ్డలు ఏమీ అతనికి అర్థమవడం లేదు. నాకు చాలా చిరాకు అనిపిస్తుంది.

- నోరు మూసుకోండి, నన్ను చదువుకోనీయండి.

- అరే, ఆగు బాబూ, ఆగు! రైతు బిడ్డ విద్యాసాగరుడు అవుతాడేం! హహ్హా! అంతకంటె హుక్కా పట్టుకోవడం మంచిది. పొగ త్రాగడం అయినా నేర్చుకో!

ఆ చిన్న గుమాస్తా అలసి పోయి నిద్రపోయేసరికి, లాంతరు ఒక్కసారి భగ్గుమని మండి పూర్తిగా ఆరిపోతుంది. పెద్ద గుమాస్తా గారి ఇంటి దగ్గర నుంచి కిరసనాయిలు తీసుకువచ్చి వెలిగించిన దీపాలకి రాత్రి 9 గంటల తర్వాత వెలిగే అవకాశం లేదు. కిరసనాయిలు రేషను అంతవరకే. నా స్కాలరుషిప్పు డబ్బు అనేక రకాల చిల్లర ఖర్చులకు ఏదోలా సరిపోతుంది. కాని, కిరసనాయిలు కొనేందుకు మిగలదు.

అయినప్పటికీ ఇటువంటి పరిస్థితులలోనే ఒకటి నుంచి ఎనిమిదవ తరగతి వరకూ చదవ గలిగాను. తర్వాత పుస్తకాల సమస్య బయలుదేరింది. స్కూలు ఫైనలు పుస్తకాలు కొనేందుకు 70-80 రూపాయిల వరకూ అవసరం ఉంది. మా పినతండ్రి తిండి కట్టే బెట్టుకున్న ధాన్యం అమ్మి కొంత డబ్బు పంపేవాడు; పెద్ద గుమాస్తాగారు 10 రూపాయిలు సహాయం చేసేవాడు, హెడ్‌మాస్టరుగారు దయదలచి 3 స్కూలు పుస్తకాల కాపీలు ఇచ్చేవారు. అయినా నాకు కావలసిన పుస్తకాలలో సగానికైనా లభించేవి కావు.

పెద్ద గుమాస్తా గారిచ్చిన 10 రూపాయిలకే విలువ జమా ఖర్చుల పట్టీ నా చేత తయారు చేయించడానికే సరిపోదు!

సార్, నెల జీతం స్కాలరుషిప్పు లభించే సరికి అనుకున్నాను, నేను మామూలు విద్యార్థుల ముఠాకు చెందననీ, నాలో విశేషమైన శక్తి ఉందనీ, అందు మూలానే నేను 'స్వతంత్ర (స్వాధీన) కుమార్'ని అయ్యాననీ స్వాతంత్రపు గౌరవం వల్ల తల ఎత్తి నిలబడగలనని. ఏ భారతదేశం కోసం నా తండ్రి తన హృదయపు రక్తాన్ని

ధారపోసాడే, ఆ భారతదేశంలో నేను నాకు తగిన స్థానం కోసం వెతుక్కోవలసి వస్తోంది. సరిగ్గా నా విద్యాభ్యాసంగం జరిపించు కోలేక పోబట్టి పరీక్షలు బాగా వ్రాయలేక పోయాను. ఫలితాలు తెలిసే సరికి మూడవ డివిజను క్లాసులో పాసు అయినట్లు తేలింది.

హెడ్‌మాస్టారు దగ్గర నుంచి అందరూ ఒక్కటే నిందా వాక్యం పలికారు -'ఛీ' అని. పెద్ద గుమాస్తా గారి పిల్లవాడు ఒకడు B.A. మూడుసార్లు ఫెయిలు అయినవాడు, ఇప్పుడు హల్‌దీ నదీ తీరాన తుపాకీ గుండులు పేలుస్తూ వేటాడుతూ తిరిగేవాడంటాడు గదా- 'పాస్ అయ్యాడు అదే గొప్ప! ఎంతమంది బ్రిలియంటు విద్యార్థులు స్కూలు ఫైనలు లో డింకీలు కొట్టలేదు!"

రెండు రోజులు ఇంట్లో తల దాచుకుని ఉండిపోయాను. లేచి తిరగలేదు, తిండి తినలేదు అంతలో అయ్యో! కళ్ళల్లోంచి నీళ్లు చెక్కిళ్ల మీద పడడం మొదలెట్టాయి.

- లేరా బాబూ లేరా! ఇంక కొంచెం శ్రద్ధగా నువ్వు చదువుకుంటే నువ్వే జీవితంలో బాగా వృద్ధి పొందగలవు. నీలాంటి బీదబాలురు ఎంతమంది మొదటిసారిగా పరీక్ష పాస్ అవలేదో ఆలోచించుకో!

సార్, మళ్ళీ మొండిధైర్యం తెచ్చుకున్నాను. ఈసారి కలకత్తాకి తరలి వచ్చాను. ఏం చేయను, ఆ పెద్ద గుమాస్తా దగ్గర నుంచే ఉత్తరం తెచ్చుకుని వాచ్చాను. ఇక్కడ యజమాని మా పెద్ద గుమాస్తా గారికి బంధువు; బడా బజారులో పొగాకు వ్యాపారం ఆయనది. అందులో చోటు దొరికింది నాకు.

అది ఒక పని దుకాణంలో సహాయం చేయడం; అవసరమైతే జరుగు పనిమీద బైటకు వెళ్లవలసి వస్తుంది. కానీ నా కేమనిపించిందంటే - కలకత్తా అంటే కలకత్తాయే; ఎన్ని విధాలుగా జీవనం ఇక్కడ గడుస్తుందో, జీవనోపాధికి ఎన్ని అవకాశాలున్నాయో కదా! పెద్ద పెద్ద కళాశాలలు, విశ్వ ప్రఖ్యాతి గాంచిన మేధావులైన ప్రొఫెసర్లు అధ్యాపనం చేసే ఆ కాలేజీలలో వారి జ్ఞాన సంపత్తి లో ఒక శకలాన్ని స్పృశింపగలిగితే, నా మనస్సులో వేల కొలది ఆశాజ్యోతులు వెలుగొందుతాయి. సమస్త జగత్తు యొక్క విజ్ఞాన వీచికలు వచ్చి కలకత్తా తీరాన సంగమిస్తాయి; వాటితో ఒక్కసారి కలయిక సంభవిస్తే నేను రాత్రి అంతా విహాయస వీధిలో నా తల ఎత్తి ఉంచి ఎండిపోయిన చెట్టు ప్రథమ వర్షపాతం తర్వాత చిగిర్చినట్లు నిలబడిపోనా!

వెళ్లాను కాలేజీకి - కూడా మళ్లీ కొంత తిండి ధాన్యం అమ్మిన డబ్బు తీసుకుని నాకు తెలుసు - ఇటువంటి విద్యాభ్యాసం కోసం ప్రపంచంలో చాలామందికి బహుశా అప్పుడప్పుడు పొట్టనిండా తినేందుకు వీలులేకుండానే, అసలు తిండే లేకుండానే ఉండవలసి వస్తుందని. కాని పరీక్షల్లో బాగా పాసయితే, ఒక

సమర్థుడనైన మానవుడి నవగలిగితే, ఏదైనా....

పెద్ద పెద్ద కాలేజి బిల్డింగులలో రథోత్సవంలో లాగ జన సమ్మర్దం. ఆ జన సందోహంలోకి కాని ఆఫీసులోకి కాని అడుగు పెట్టాలంటే ఈ 'తర్డుడివిజన్' వాడికేమైనా ఆశ ఉందా. అందులో ఇంటర్మీడియట్‌లో లాభం లేదు.

ఒకటి రెండు కాదు, సార్, 6 కాలేజీల నుంచి తిరస్కరించబడ్డాను. మిగతా వాటిలో ఒక 'చవకరకం' కాలేజీలో ప్రవేశం దొరికింది. వైస్-ప్రిన్సిపాల్‌ని ఏమైనా జీతంలో కన్సెషను దొరుకుతుందేమోనని ప్రార్థించు దామని కలుసుకున్నాను.

-'కన్సెషనా' వైసు ప్రిన్సిపాల్ గారి కళ్ళు ఆకాశం పైకి లేచాయి. 'తర్డు డివిజన్ (క్లాసు) వాడికి!

- సార్!

- ఇంటర్ మీడియేట్ వాళ్ళకి అలాంటి కన్సెషన్ ఇవ్వబడదు పైగా నువ్వు 'తర్డు డివిజన్ (క్లాసు) లో పాస్ అయినవాడివి!

- సార్, నేను దరిద్రుల బిడ్డని.

- బెంగాలీ పిల్లలందరూ దరిద్రులే. అలా లెక్క పెడితే కాలేజిలో విద్యార్థులందరికీ 'ఫ్రీ స్కాలరుషిప్పు' ఇవ్వవలసి వస్తుంది!

-సార్, నేను నిక్కచ్చిగా పల్లెటూరి పేద రైతు కుటుంబానికి చెందిన వాడను....

ఆయన గారికి చెప్పలేనంత చిరాకు కలిగింది.

-అయితే కాలేజీలో చదివేందుకు ఎందుకు వచ్చావ్? హాయిగా అరక దున్నుకోలేకపోయావా? నీ లాంటి వాళ్లకు కాదు ఉన్నత విద్య వెళ్ళు వెళ్ళు. నా కాలం వృధా చేయకు!

కన్సెషన్ ఇవ్వబడలేదు. ఇంటికి తిరిగి వెళుతూంటే దారిలో ఆ చిన్న గుమాస్తా మాటలు గుర్తుకి వచ్చాయి. 'రైతు బిడ్డ విద్యాసాగర్ అవుతాడేం' హహ్హా!

సార్, ఇంక మా పల్లెటూరు తిరిగి వెళ్లవలసిన పరిస్థితే అది. అయినా, సూర్య కిరణాలు మండించే చోట, అగ్ని గుండంలో తపింపబడే చోట, బుర్రపై మండి చెమట బిందువులు ప్రవహించే చోట, పూర్వ పరిస్థితి దృష్ట్యా, ఇప్పుడు ఈ పట్టణ వాసంలో నా పై తగిలిన అవమానపు దెబ్బ అంతగా నా వంటి మీద పడలేదు. సార్, అంచేత నాలో ఇంకా నశించలేదు. నాలో ఎంత మొండిపట్టుదల ఉద్భవించిందంటే, దీని అంతు ఏమిటో కనుక్కోకుండా విడిచి పెట్టదలచుకోలేదు.

ఈ పట్టణ వాసపు యజమాని యొక్క పొగాకు కొట్టుకు అనుకుని ఉన్న సావిడిలో ఉన్నాను. పూర్వం పెద్ద గుమాస్తా (సామంతు) గారి ఇంటికి దీనికి చాలా తేడా. అక్కడ ఒక చిన్న షెడ్డులాంటి చోట మకాం ఉన్నప్పటికీ, అక్కడే ఒక విశాలమైన ఆకాశం కనుపించేది, సహజమైన వెలుతుర్రు కనుపించేది, స్నానం

కోసం ఒక పెద్ద చెరువులోని నిర్మలోదకాలుండేవి; గాలి వీస్తూంటే వివిధ ఫలపుష్పాల వృక్షలతల నుంచి సుగంధం అనుభూతమవుతుండేది. కాని ఇక్కడ ఇది ఒక 'బడా బజారు' సందు పగలు కూడా 12 గంటల సేపూ అన్ని దుకాణాలలోనూ దీపాల వెలుగు, మూడు బారల వెడల్పుగా ఉన్న రోడ్డు రెండు ప్రక్కలా ఆకాశాన్ని అంటే ఏడంతస్తుల మేడలు- ఎక్కడా గాలి తగలదు; మనిషీ, మనిషీ రాసుకుంటూ వేల కొలది జనం రాత్రి ఒంటిగంటా, ఒంటి గంటన్నర వరకూ, ఆ ఉడకపోత వాతావరణంలో తిరుగుతుంటారు. వరసలో ఉన్న కొట్ల నుంచి పొగాకు కంపు, బెల్లం వాసన. అన్నింటికంటె దుర్భరం ఆ చెవులు చిల్లులు పడేగోల.

ఇటువంటి ప్రాంతంలో ఒక మూల ఒక నులక మంచం మీద నా మకాం రాత్రంతా ఎలకల బాధ, పగలస్తమానం బొజ్జెంకల చిరాకు. మా యజమాని, కాలేజీ జీతం పోగా, చేతి ఖర్చులకు నెలకు ఒక 5 రూపాయిలిస్తాడు. దానికి ప్రతిఫలంగా ఉదయం, సాయంత్రం అతని పనులు చేస్తూ, బైటకు వెళ్లి చేయ వలసిన కార్యాలు కూడా నిర్వహించాలి. ఎక్కడో ఒక చోట ట్యూషన్ చెప్పి డబ్బు సంపాదించుదామంటే అదీ కుదరలేదు. పుస్తకాలు? చదువుకి కావలసిన అన్ని పుస్తకాలు కొనేందుకు ఎంత డబ్బు కావాలో నా కిప్పటికి కూడా తెలియదు. సార్, తమకి కూడా తెలియదని అనుకుంటాను. తమరు చదువుకునే రోజుల్లో 5 రూపాయిలకు దొరికే పుస్తకం ఈ రోజుల్లో 12 రూపాయలకు తక్కువకు దొరకదు.ఒకటి రెండు పాత ఎడిషన్ పుస్తకాలు రోడ్డు ప్రక్కన ఉన్న సెకండు హేండు పుస్తకాల షాపులో కొన్నాను - కాని వాటిలో ఇప్పటి సిలబస్‌లో సగం పాఠాలైనా లేవు.

ఇంక చదివిన చదువు ఇంటి దగ్గర కట్టుదిట్టం చేసుకోవడం మాటుంటారా? భోజనం చేసేందుకు బజారులో ఉన్న మా యజమాని ఇంటికి వెళ్లాలి. అక్కడ నుంచి తిరిగి వచ్చేసరికి రాత్రి 10 గంటలలోగా ఎప్పుడూ వీలుకాదు. అటు తర్వాత ఒక పచ్చరంగు మురికి పట్టిన బలుబు వెలుగులో చదువుదామని కూర్చునేసరికి, నా కళ్లు చిల్లులు పడేలా చూసినా ఎక్సర్సైజు పుస్తకం లో నోట్సు ఏ మాత్రం బోధపడకుండా కలవరపరుస్తుంటాయి. చదువుతూండగా ఎప్పుడు నిద్ర పడుతుందో తెలియదు కాని, నిద్ర పట్టే సరికి శరీరంపై ఎలకలూ, బొజ్జెంకలూ స్వైరవిహారం చేస్తాయి.

కాలేజీ సంగతి ఏమిటంటారా? అక్కడ ఒక్కటే ఒక సొద, గుంపుగుంపుల జనం. ఒక్క బెంచీ మీద ఏడుగురు, ఎనిమిది మంది ఇరుక్కుని కూర్చోవాలి - 5గురు కూర్చోవడానికి గటాగటీ గా సరిపోయే చోట నోట్సు వ్రాసుకుందామంటే

ఎక్సర్సైజు పుస్తకం పెట్టుకునేందుకు చోటు దొరకదు. లేబొరేటరీలో అవస్థ ఇంకా దారుణంగా ఉంటుంది. 15 మంది విద్యార్థులు ఎక్స్పెరిమెంటులు చేయడానికి వీలైన చోట 50 మంది గుమిగూడి చేయవలసి వస్తుంది.

భావి భారత శాస్త్రజ్ఞులు! ఎవరైతే స్వతంత్ర భారత దేశపు చరిత్రలో ముఖ్య పాత్ర వహించాలో వారి గతి ఇలా ఉంది!

అందుచేత, సార్, ఏ మాత్రం ప్రయత్నం చేయలేదు. ఎక్కడో ఇద్దరు ముగ్గురు మాట నేను చెప్పడం లేదు. నా లాంటి బీద విద్యార్థులు కాలేజీలో చదువుకునేందుకు వస్తే వాళ్లు ఎందుచేత సరిగ్గా చదవలేరో, ఎందుచేత ఫెయిలు అవతారో- ఇదీ నేను చెప్పే సంగతి.

సార్, ఒక్క సంఘటన గురించి మనవి చేస్తాను. ఇప్పటి నా అవస్థలో ఆ మాట తలచుకుంటే నవ్వు వస్తుంది.

ఆ రోజు మా కాలేజీ ఫౌండేషను డే మీటింగుకి అన్నీ సిద్ధపరచబడ్డాయి. జెండా ఎగరేశారు. ఉపన్యాసాలు ప్రారంభమయాయి. అందరిలోకీ బాగా ఉపన్యసించారు వైస్ ప్రిన్సిపాలు గారు. వారు మాట్లాడుతూండగా వారి కళ్లమ్మట నీళ్లు వచ్చాయి.

"నేను ఒక స్టాటిస్టిక్సు తీసి చూశాను. కాలేజీలో సుమారు 10 % విద్యార్థులు మట్టుకు అన్ని పుస్తకాలు కొనుక్కోగలరు. 20 % కొన్ని కొన్ని పుస్తకాలు మట్టుకే కొనుక్కోగలరు. మిగతా 70 % ఒక్క పుస్తకమైనా కొనుక్కోలేరు. ఇటువంటి పరిస్థితిలో మేము విద్య ఎలా నేర్పగలం- ఎవరైనా ఎలా నేర్పగలరు? ఈ దుస్థితికి ఏదైనా పరిష్కారం కనిపెట్టక పోతే, ఇటుపైన దేశం అవస్థ ఎలా ఉంటుందో కదా!"

పరిష్కారం గురించి వైస్ ప్రిన్సిపాలు గారు తప్పకుండా ఆలోచించే ఉన్నారు! 'కాలేజి ఎడ్యుకేషను బీదవారికి కాదు!"

సార్, రెండు గంటలు గడిచి పోయినట్లు ఇప్పుడే బెల్ మ్రోగింది. ఏ విధంగానూ ప్రిపేరు అవడానికి వీలులేని నేను ఏ మాత్రం పరీక్షా ప్రశ్నలకు ఇంతవరకూ సమాధానం వ్రాయలేక పోయాను. తమరు ఇంతవరకూ చదివి ఉన్నట్లయితే తమరి ఔదార్యం పై ఇంకా నేను దాడి చేయదలచుకోలేదు. ఇంక సంక్షేపంగా నా చరిత్ర చెప్పి ముగిస్తాను.

మా అమ్మకి చదవడం వ్రాయడం తెలియదు. వంకర టింకర అక్షరాలతో ఆమె చెప్పిన మాటలు మా పినతండ్రి ఇలా వ్రాసాడు:

"నువ్వు పెద్దవాడివై గొప్పవాడివి కావాలి. అసంఖ్యాకులైన దేశీయులలో నువ్వు నీ యొక్క ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిరూపించుకోవాలి. నీ తండ్రి ఎటువంటి కీర్తి సంపాదించుకున్నాడో అటువంటి దేశభక్తితో కూడిన యశస్సు నువ్వు కూడా పొంది ఆయన పేరు నిలబెట్టాలి. నువ్వు స్వతంత్ర భారతదేశపు పోరాటంలో సిద్ధ

సంకల్పుడవైన కర్మవీరుడవు కావాలి - ఈ మాట ఎప్పుడూ మరచిపోకు".

మరచిపోలేదు - ఒక్క నాడైనా నేను. కాని స్వతంత్ర భారతదేశం మట్టుకు నా వారసత్వం గురించి తనకు గల బాధ్యతను విస్మరించింది. నా విద్యాభ్యాసానికి తగిన మార్గాన్ని నాకు సుగమం చేయలేదు. కాగా, ఆ పొగాకు కొట్టులో నౌకరీ చేస్తూ, క్లాసుల పేరుతో జరిగే ఆ అర్థరహితమైన గందరగోళంలోనూ, ముతక వాసనతో ఉడక పోతతో నిండిన ఆ బడా బజారు లోని ఇంటిలో, ఆ పసుపు పచ్చని విద్యుద్దీపపు కాంతిలో నా కళ్లముందు అంతా మసక మసకగా ఉండగా నా మస్తిష్కం మధ్య నుంచి క్రమ క్రమంగా ఒక్కొక్క రక్త బిందువూ పడుతూ ఉంటుంది. ఇక్కడి నుంచి పారిపోదామనిపిస్తూంటుంది - ఒక్కసారి ఎగిరి ఏదో పురాతన సరస్సు అగాధ శ్యామల జలాలలో మునిగిపోవాలనీ, నా హృదయాన్ని బంతీ, చామంతీ, పూబంతీ మొదలైన సుగంధ పుష్పాల పరిమళంతో నింపు కోవాలనీ, వర్షాకాలపు నీల మేఘాలను చేతులెత్తి, "ఓ వర్షమా, గల గల వర్షించు, మా పంటల నిండా పండించు' అని అర్థించాలనీ....

కాని కలకత్తాలోని సరస్సులలో అటువంటి చల్లని నల్లని నీళ్లు ఎక్కడా కనుపించవు, నేను పుట్టిన ఇంటిలో పొట్టనిండా తినేందుకు చాలిన ధాన్యం లేదు, అగ్ని జ్వాలలతో నిండిన ఈ మానవుల హృదయాలలో ఎక్కడా ఒక వర్షపు చుక్క లేదు.

ఎక్కడకు పోను? ఎక్కడకు పారిపోను?

కాని ఆశ వీడలేదు! నేను రక్షింపబడతాను! నేను గొప్పవాడనవుతాను! నేనే లేక పోతే క్రొత్త బ్లాస్ట్ ఫర్నేసు నుంచి నిప్పురవ్వ బైటకు రాదు; హైడల్ ప్రాజెక్టు నుంచి విద్యుచ్ఛక్తి ఉత్పన్నమవదు; అటామిక్ రిసెర్చి పని సశేషంగా ఉండి పోతుంది; ఆయిల్ రిఫైనరీ నుంచి పెట్రోలియము, పెట్రోలు, కిరసనాయిలు, బ్లూ ఆయిలు, పారాఫిన్ ఇలాంటివి నవనవ రూపాలు దాల్చి రాలేవు! ఈ 'విశ్వామిత్ర సృష్టి! యొక్క మంత్రం నన్ను బలవంతంగా లాక్కుపోతుంది! నేను స్వతంత్ర భారతదేశపు వైజ్ఞానికుడను!

సార్, అంతా కల! ఈ వంగ దేశపు ప్రతీ కళాశాల లోనూ నాలాంటి వేలాది యువకులు ఎన్నెన్నో కలలు కంటున్నారు, ఎన్నెన్నో కలలతో జీవిస్తున్నారు. కాని కళాశాల నుంచి బైటకు వచ్చాక ఈ కలలన్నీ కల్లలే వాళ్లకి.

సార్, నా విద్యా వ్యాసంగం ఏమీ సక్రమంగా నడవడం లేదు. ఎప్పుడు చదవను, ఎక్కడ పుస్తకం సంపాదించను? ఎల్లా గోలాగ పాత పుస్తకమో, నోటు బుక్కో సమకూర్చగల ననుకోండి, ఆ పచ్చని మురికి దీపం ఇచ్చే మసక వెలుతుర్లో నాకేమీ వాటి అర్థం స్పష్టం అవదు- అదంతా నా కళ్ల ముందు ఒక పేదపురుగు లాగ

గిల గిల కొట్టుకుంటున్నట్లు ఉండిపోతుంది. అప్పుడు ఎప్పుడో నా నరాలలో పట్టు సడలి పోగా, చైతన్యం కోల్పోయి పడిపోయి ఉంటాను. పొగాకు, బూజు, బెల్లం, ఎలకలూ, బొద్దెంకలూ, ముతక కంపూ-వీటి దుర్గంధాలతో కూడుకున్న నా వసతిలో ప్రభాత సూర్యుని కిరణాలు పడ్డప్పుడు నేను లేచి కూర్చునేసరికి, నా నెత్తిపై 20 మణుగుల బరువు పడినట్లుంటుంది. ఆపైన ఎనిమిది గంటలు కొట్టుతుందో లేదో కాతాలు వ్రాస్తూ కూర్చోవాలి.

సాంవత్సరిక పరీక్షలకు చెల్లించవలసిన ఫీజు కట్టితే అవి వ్రాయడానికి, అటుపైన ప్రమోషను వీలుంటుంది. ప్రీటెస్టు ఇవ్వలేదు కదా, ఇంక ఏం చదవను! ఇంతలో టెస్టు రానే వచ్చింది.

సార్, ఇప్పటికి నా అపరాధపు కథ అంతా ఒప్పుకోవడం జరిగింది. టెస్టు ఎప్పుడైతే సమీపించిందో, అప్పుడు నా మనస్సులో ప్రతిక్షణం ఒక అవిచ్ఛిన్నమైన అగ్ని జ్వాల మండుతున్నట్లయింది. పుస్తకం -ఒక్క పుస్తకమైనా నా దగ్గర ఉన్నట్లయితే ఫస్ట్‌క్లాసులో కాకపోయినా, సెకండు క్లాసులోనైనా పాసై ఉండేవాడిని, ఇంకా మాథమాటిక్సు గురించి మరో జాబు వ్రాయాలి!

కోపగించకండి సార్, నా మనోభాధను కాస్త గమనించండి. నేనెలా పిచ్చివాణ్ణయానో! అటుపైన...

ఆ తర్వాత కాలేజీలో తోటి విద్యార్థుల పుస్తకాలు దొంగిలించడం మొదలు పెట్టాను.

తమరు నా గురించి ఏమనుకుంటున్నారిప్పుడు? అనుకోండి. నా మట్టుకు నేను ఆఖరికి ఇలా దొంగగా తయారవుతానని ఎప్పుడైనా అనుకున్నానా? నా తండ్రి దేశానికి తన రక్తాన్ని ధారపోసి స్వాతంత్ర సంపాదనకు సహాయ పడ్డాడు. అతని కుమారుడనైన నేను ఇప్పుడు ఇలా దొంగలా మారిపోదమా?

సార్, వీలైతే- దయచేసి ఒకసారి ఆలోచించండి. ఎందుకి కుర్రవాళ్ళు పుస్తకాలు దొంగిలిస్తారో, ఎందుకు పరీక్షల్లో కాపీలు కొడతారో, ఎందుకు పేపరులో కఠినమైన ప్రశ్నలు ఇచ్చినప్పుడు వాళ్ళు పరీక్ష హాలు నుంచి హింసాపూరితమైన మనస్సులతో బైటకు వస్తారో. ఇదంతా అన్యాయం, చెప్పలేనంత అన్యాయం. ఇటువంటి వ్యవహారం ఎక్కడా జరగడం సమర్థనీయమైనది కాదు - ఎవ్వరూ దీనిలో ఔచిత్యం గమనించరు. అయితే ఎందుకిలా జరుగుతోంది? కుర్రవాళ్ళు ఎందుచేత ఇలా వక్రమార్గం పడుతున్నారు? ఒక్క "పాస్ ఫెయిలు, అన్న సమస్య వాళ్ళని ఎంతగా పీడిస్తుందో, ఎప్పుడైనా తమరు విచారించారా?

పుస్తకాలు దొంగిలించి ఎల్లాగో టెస్ట్‌కి సిద్ధపడ్డాను. జీతం కట్టేశాక టెస్ట్ వ్రాయనిస్తారు. కాని తర్వాత పరీక్షకు ఫీజు కట్టాలి. దానికి చాలా డబ్బు

అవసరముంది.

మా పొలం పరిస్థితి బాగులేదు- అని మా పినతండ్రి ఉత్తరం వల్ల తెలిసింది. పొట్టకూటికి సరిపోతుందో సరిపోదో వచ్చే పంట. మా అమ్మగారి వంటి మీద తన మాంగళ్యపు కాలం నాటి వస్తువులన్నీ అమ్మబడ్డాయి; ఇంక ఎద్దు అమ్మి నా కేమైనా డబ్బు పంపించ వలసి వస్తుందేమో.

నేను జవాబు వ్రాశాను - ఎద్దు అమ్మవద్దని, నేనే ఇక్కడ ఎల్లాగో తంటాలు పడతానని.

కాని ఎక్కడ ఎలా తంటాలు పడను, ఎలా ఏర్పాట్లు చేయను? విద్యార్థుల సహాయనిధి నుంచి నాకు 15 రూపాయాలు సహాయం లభించింది ఆ పైన?

మా యజమాని గారు నన్ను పిలిపించి ఇలా అన్నారు. "నీ పరీక్ష ఫీజు గురించి ఏం జేస్తున్నావు? నేను నీకో 50 రూపాయిలివ్వదలచుకున్నాను"

అబ్బ, ఎంత దయ!

సార్, ఇప్పటికి నా కర్థమయింది, దయ అంటే పూర్తిగా దయ కాదని, దాని వెనకాల ఏదో క్రూరమైన ప్రతి ఫలాపేక్షతో కూడుకున్న షరతు ఉంటుందని. ఈ జగత్తులో దయకు ప్రాణాలు తీసేటంత ప్రతిఫలం ముట్టజెప్పాలి.

పరీక్ష ఫీజు కట్టాను. అటుపైన - అటుపైన ఈ రెండు నెలలూ 'దయ' యొక్క ఋణభారాన్ని తీర్చుకున్నాను.

నమ్ముతారా సార్. మాథమాటిక్స్ ఫిజిక్సు, కెమిస్ట్రీ, బెంగాలీ, ఇంగ్లీషు -ఇవన్నీ చదివేందుకు ఎక్కడా అవకాశం దొరకలేదు. 50 రూపాయిలకు బదులుగా రాత్రంతా మేలుకుని, కళ్లు చిల్లుపడేలాగ, నెత్తిమీద 20 మణుగుల బరువు పెట్టుకున్నట్లు, నేను మా దొరగారి జమా ఖర్చుల పద్దు అంతా తయారు చేసాను. ఏం పద్దు? ఇన్‌కమ్‌టాక్సు ఎగ గొట్టేందుకు తయారు చేసే పద్దు. దొంగ ఎక్కౌంటు పుస్తకం. 50 రూపాయిల విలువను ఆయన కప్పగించేందుకు నా ప్రతీ నరం సాగదీసి, నా ప్రతీ రక్త బిందువూ ధారపోసి కాయకష్టం పడ్డాను. ఆ పని అయ్యాక ఇంకెప్పుడు చదువుకోవడం? నేనేం మానవాతీతుడను కాను!

అయినా పరీక్ష వ్రాసేందుకు వచ్చాను. అయినా ఆశ విడివడ లేదు. ఏదో మిరకల్ సంభవించక పోతుందా అని ఆశించాను. ఈ దొంగతనాలు చేసి నా చేతులు గట్టిపడ్డాయి; కాపీ కొట్టేందుకోసం బైట నుంచి కొన్ని కాగితాలు చింపుకు తీసుకు వచ్చాను. కాని మిరకల్ ఏమీ సంభవించలేదు. చొక్కా లోపలి నుంచి ఒక్క కాగితపు ముక్కనైనా బైటకు లాగ లేక పోయాను. ప్రశ్న పత్రాలు నా కళ్లముందు అంతా నాట్యమాడడం మొదలు పెట్టాయి. ఒక్క మా యజమానిగారి దొంగపద్దులే నా బుర్రలో తిరుగుతున్నాయి. ప్రతీ పంక్తిలోనూ, ఒక్కొక్కటే ఆ

జమా ఖర్చుల జాబితా మాత్రమే గోచరిస్తోంది.

ఈ బెంగాలీ పద్దే నా ఆఖరి పద్దు.

సార్, వార్నింగు బెల్లు కొట్టారు. ఇంకా 5 నిమిషాలకి నా జవాబు పత్రం అప్పజెప్పాలి. నా కథ కూడా పూర్తి అయింది. ఈ వేళ సాయంత్రమే ఏదో ఒక ట్రెయిను చక్రాల క్రింద నా మనస్సు యొక్క భారం అంతా మోపేస్తాను.

నేను బ్రతికి ఉండాలనే అనుకున్నాను సార్ - నేను స్వాధీన (స్వతంత్ర) కుమార్ ని, స్వతంత్ర భారతదేశం కోసం జీవించి ఉందామనుకున్నాను. ఎందుకు నేనూ, నా లాంటి వేలకొలది ఇతర విద్యార్థులూ అలా జీవించి ఉండలేక పోతున్నారు అన్న ప్రశ్న తమ ముందు ఉంచుతున్నాను. దాని సమాధానం తమరే సెలవియ్యాలి.

పిరికి వాడిలా ఆత్మహత్య చేసుకుంటున్నానా? నే, నే ఇది నా ఓటమి కాదు; ఇది నా తిరుగుబాటు. 1942 సెప్టెంబరులో ఒక ప్రళయ రాత్రి నా తండ్రి మా పొలం గడ్డపై దేశం కోసం తన హృదయపు రక్తాన్ని కార్చాడు. నా రక్తం కూడా మన దేశంలోని లక్షల లక్షలు విద్యార్థులూ, విద్యార్థినులూ నేర్చుకోవలసిన గుణపాఠం కోసం, చరిత్రకారులు వ్రాయవలసిన చరిత్ర కోసం అర్పిస్తున్నాను. ఆ చరిత్ర ఎప్పుడు వ్రాయబడుతుందో నాకు తెలియదు. మీకు తెలుసునా, సార్, మీరు చెప్పగలరా?

నమస్కారం.

---

("ఎక్జిబిషను", 1968)

# చిన్న కథ

సంతోష్ కుమార్ ఘోష్

అతను నా వీపు మీద నుంచి వంగి చూస్తున్నాడు. అతని ఊపిరి నా చెవులలోకి వీస్తోంది. నా చేతి(వేళ్ళు మొద్దుబారిపోయాయి. అతని మాటలు ఇలా వినబడ్డాయి: "ఏదో మిషపై పాత కాగితాలన్నీ దుమ్ము రేగ గొట్టి వెతికాను. సరసిజ్, ఆ కథ ఎక్కడా నీకు దొరికే లా లేదు".

అతని నేరు నా చెవిలో పెట్టినట్లు మాట్లాడుతున్నాడు. చాలా అస్వాభావికమైన స్వరం; కంఠంలోంచి చీల్చుకుని ఏదో భూతాలు మాట్లాడుతున్నట్లు వస్తుంది. అతని నోటినుంచి శబ్దం.

అన్నాను: "అయినా సరే, ఆ కథ నాకు కావాలి"

"కావాలి!", అతడు వెక్కిరిస్తూ అన్నాడు: "ఎందుకు కావాలి"?

"విషయాలు జతపరచి చూస్తాను. అసలు కథ దొరక్కపోయినా సరే. బిజా పిన్ని అదే కథ చెపుతాను".

"ఆ కథ తెలుసా నీకు?"

"ఆ, అదంతా జ్ఞాపకం లేదు: కాని, ఆ తుఫాను రాత్రి, చల్లచల్లని గాలి, మా యింటి పోర్టికోలో కూర్చుని ఒక ముష్టి పిల్ల సాష్టాంగంలా పడుకుని పిల్లవాడిని కప్పి ఉంచింది. అప్పుడు పిల్లవాడు ఏడ్చాడు, నల్లబడి పోయాడు. తర్వాత అటూ ఇటూ పరికించి ఆ పిల్ల తన చిరుగు బట్టలోంచి మూడు, నాలుగు ముక్కలు చింపి ఆ బాలుడిని బాగా కప్పింది. ఆ దృశ్యం ఇంకా నా మనస్సులో హత్తుకుని ఉంది".

విని, అతను గట్టిగా నవ్వాడు. అతని నల్ల కోటు రాత్రి రంగుతో కలసి పోయింది.

అతని కళ్ళల్లోకి తిన్నగా చూసేందుకు ధైర్యం లేదు. కలవరపడిన గొంతుకతో అడిగాను: "ఏం ఈ కథ వింటే నవ్వేస్తుందా?"

అతనన్నాడు: "అవును, ఆ మాట నీకు కూడా తెలుసు. ఎన్నాళ్ళక్రితం వ్రాశావు ఈ కథ?"

–"ఎన్ని సంవత్సరాలో లెక్క సరిగ్గా చెప్పలేను. ఒక్క పైసా వేరుసెనగ పప్పు కొనుక్కుంటే ఒక గంటసేపు తింటూ కూర్చునేందుకు సరిపోయే రోజులవి, టీ షాపులో 2 పైసల విలువ గల టీ కప్పుతో రెండు గంటల కాలక్షేపం జరిగే రోజులవి; 2 అణాలతో మధ్యాహ్నపు వేళ ధర్మ తాలా నుంచి అలీపూర్ ద్వారా బాలిగంజి వరకూ కలకత్తాలో తిరగడానికి వీలైన రోజులవి. అప్పుడు..."

చెయ్యి ఎత్తి అతను అన్నాడు: "ఆగు; ఇంక చెప్పక్కరలేదు. సర్‌సిజ్, ఆ కథ కోసం నువ్వు ఇంక వెతకవద్దు".

"ఏం దొరకదంటావా?"

"దొరకదంటాను".

అతను కొద్దిగా దగ్గి, అదే వికారపు విధంగా, వంకరగా నవ్వుతూ అన్నాడు: "నిజానికి ఆ కథ నా దగ్గర ఉంది. ఇదుగో చూడు".

అలాగ అని అతను తన నల్ల కోటులో చెయ్యిపెట్టి ఉంచేసరికి, మడతపై మడత తెరవబడి అది అలాగే రాత్రి అకారంతో కలసి పోయింది. ఏదో ఒక సరుకు బైటకు తీసి నా కళ్ల ముందు ఆడిస్తూ చూపించాడు. ఆ అస్పష్టపు వెలుగులో అదేమిటో సరిగ్గా గ్రహించ లేకపోయాను. నాకేమనిపించిందంటే- ఒక చిక్కిపోయిన పిల్లిపిల్ల రెండు మసకగా ఉన్న కళ్ళూ ప్రేత చిహ్నకమైన రెండు గుడ్లూ ఇదంతా అగమ్య గోచరమని. వెనక్కి లాగేసాను, నా చెయ్యి జాపి అది పట్టుకుందామనుకుని కూడా అతడు నవ్వాడు.

"చూడు, నువ్వింక దాని గురించి వాంఛించకు. ఏదైతే ముట్టుకునేందుకు భయపడుతున్నావో, దాన్ని ఎందుకోసం పట్టుకోవడానికి ప్రయత్నిస్తావు?

అతను మళ్లీ తన విచిత్ర వస్తువుని వెనక్కు లాక్కుని తన కోటులో పెట్టేశాడు: "దీన్ని నా దగ్గరే ఉండనియ్యి".

శరీరమంతా భయంతో జలదరిస్తూండగా అన్నాను: "నువ్వెవరు?"

సమాధానం ఇవ్వకుండా వెనక్కి వెళ్లాడు. అతని కోటు అల్లల్లాడుతోంది. అటూ ఇటూ అల్లల్లాడుతూ రాత్రి రంగుతో అది మళ్లీ కలసిపోయింది. పైకి చూసేసరికి, అతను లేడు. అప్పుడు నేను తెలుసుకున్నాను. ఆ సమయం. ఆ సమయమే, ఎప్పుడైతే -

"ఒక్క పైసా వేరు సెనగపప్పు....' మొదలైన రోజులు. ఎప్పుడైతే గాస్‌లైటు స్తంభాలపై ఎడ్వర్టైజ్‌మెంటులో - ఇల్లు ఖాళీ; ఉద్యోగం ఖాళీ; పెళ్లికూతురు, పెళ్లికొడుకుల కోసం ఈ అబ్బాయిలూ, అమ్మాయిలూ కాంక్షిస్తున్నారు' కనుపించేదో ఎప్పుడైతే ఒక మమతామయి తల్లి అయిన ఆ ముష్టి పిల....

ఇప్పుడు ఆ కాలం ఎలా కంటికి కనపడుతుందంటే ఆ ప్రేత సదృశ మార్జాలం పునరుజ్జీవింపబడినట్లు అతగాడు నాకు తన కోటు నుంచి ఆ కథ తీసి యిచ్చినట్లయితే, ఆ సమయంలో అతని కళ్ళూ ఆ వయసు తిరిగి వచ్చినట్లయితే, ఆనాటి మనసూ, వెలుగూ, ఇంకా అప్పటి పరిసాళమూ, ఆ మోహం -అదంతా ఇప్పుడు ఆ లజ్జావిహీన, సుందర స్వరూప, అయిన ఆ బికారిణి నా కళ్లముందు సజీవంగా గోచరింప జేసుకోగలను. ఆ నల్ల కోటులో అంతా జీవించి ఉంది,

అది బైటకు లాగితే మిగిలేది ప్రేతమే.

– అటుపైన ఏమయింది, సరసిజ్?

అటు పైన బిజా పిన్ని చాలా చల్లని గొంతుతో నాతో అంది: 'రా!' టాక్సీకి మీటరు ప్రకారం డబ్బు ఇచ్చి, దిగి వచ్చాను. ఒక క్రొత్తగా కట్టిన మురికి కాలువ; వెడల్పు అంచనా వేసుకుని దాటి వచ్చాను. నా సూటు పై కాస్త మురికి వచ్చి పడింది.

ఈ సందు సరిగ్గా టాక్సీ అంతే వెడల్పుగా ఉంది. అగ్గిపెట్టి లాగ ఒక దీర్ఘ చతురస్రమైన డబ్బా లాగ ఉంది. లోపలికి ప్రవేశించే సరికి నా కంతా జ్ఞాపకం వచ్చింది. లోపల అదే వాసన పూర్వం ఒక నాటిది. అకస్మాత్తుగా ఒక పూర్వ ప్రేయసి ఇంటిలోకి వెళ్లినట్లు అనిపించింది. ముందుకీ వెనక్కీ తచ్చాడుతూ, నరాలు బిగుసుకు పోయినట్లనిపించినా, ఇదంతా సుపరిచితంగానే తోచింది. ఆ శరీరపు మదత, ఆ అవులింత, ఆ కుంతలాల సువాసన. ఏ వ్యవహారమైతే ముందు జరిపి ఇప్పుడు నడిపించ లేకపోతున్నానే, ఇలా స్తిమితం లేకుండా, అదే ముఖాముఖీగా కాకపోయినా కొద్దిగా రహస్యంగా నైనా నడిపించ వచ్చు.

ఏమిటో అడ్డు వస్తోంది – నా వయసా? నా హవాయి షర్టు జేబులోంచి బైటకు కనుపిస్తున్న రూపాయి నోట్లా? నా చెప్పుల జోడు ఇంకా కొంచెం కిర్రు కిర్రుమనడం తగ్గితే బాగుండును.

బిజా పిన్ని ఒక లాంతరు పట్టుకుని వచ్చింది. అన్నాను – అదేం అక్కర లేదు; నేను తిన్నగా వెళ్లగలను – పరిమళం ఎలా ఉన్నాడు పిన్నమ్మా!

మాట్లాడుతూ, మాట్లాడుతూ, ఆ ఇంటిలోకి వెళ్లి నిలబడ్డాను; వంట్లో జ్వరం గాభరా పెడుతూంది; చెమట పడుతోంది, జ్వరం తగిలి. ఒక ద్వారబంధం ఉంది లేకపోతే లోపలికి ఎలా వెళ్లడం? కిటికీ అనేది ఎక్కడా కనిపించడం లేదు. 'పరిమళకి వంట్లో ఎలా ఉంది?'

బిజా పిన్ని గంభీరపు ముఖం చూస్తూంటే తెలుస్తోంది – ఆ ప్రశ్న నిరర్థకమైనదని.

పిన్ని వ్రేలు పెట్టి ఇంటి లోపలికి చూపించింధి. కొద్దిగా కునికిపాట్లు పడుతూ కూర్చున్నాను – నా పొట్ట తిన్న తిండితో నొక్కుకు పోయిందో లేదో గుండె మీద బత్తాములు విడదీశానో లేదో అని ఆలోచించుకున్నాను, ఇంకా నా క్రొత్త జోళ్లు పాదాలకు సరిగ్గా పనికొస్తాయో లేదో చూడాలంటే ఇంటి లోపల మరెవ్వరి జోడుతో నైనా, లేకపోతే ఇలాంటివే మరొక పాత జతతోనైనా పోల్చి చూసేందుకు వెతుకతున్నాను.

-టీ తీసుకురానా?

మళ్లీ తెలివి వచ్చింది. చూసేసరికి బిజా పిన్ని అడుగుతోంది. అన్నాను, 'తీసుకురా'. ఇంటి మూలలో ఒక కప్పు అంచు పైన చీమ నాకుతోంది. రెండు బొద్దెంకలు లోపలి నుంచి నాలుక జాపి కక్కుతున్నాయి. ఆ కప్పు పట్టుకుని బిజా పిన్ని నడుస్తూ ఉండడం చూశాను.

("సరసిజ్, అటుపైన, ఏమీ దాచవద్దు")

-లేదు, దాచడంలేదు. చూడు, నువ్వెవరో తెలియదు. బహుశా నా ఆత్మవే, లేక వివేకానివే, నా సంగతంతా చెప్పేద్దామనే నిన్ను పిలిచాను. నీతో నా రహస్యం అంతా విప్పి చెపుతాను. నేను టీ త్రాగలేకపోయాను. ఏమయిందో తెలుసా కప్పు చేత్తో అందిస్తూన్నప్పుడు, హఠాత్తుగా జారి బల్లమీద పడిపోయింది. నా మెరుస్తున్న బట్టల మీద ఇంకా మరకలు పడ్డాయి. సిగ్గుపడి, బిజా పిన్ని అంది – 'త్వరగా గుడ్డ పట్టుకొచ్చి వత్తేస్తాను'. నేనన్నాను. 'ఇన్'...

నవ్వుతున్నావా? నువ్వేమంటావో తెలుసు. కావాలనే కప్పు పడగొట్టావు. లేకపోతే నన్ను ప్రేరేపించావు. ఇంతకు కొంచెం ముందుగా కప్పులో బొద్దెంక చూశాను. అదీకాక, పురుగుల పుట్ట మధ్య కుళ్లు కంపు కొట్టే ఇదే ఇల్లు – అక్కడ కూర్చుండగా నా నోటిలోంచి ఏమీ జారిపడడం లేదు.

ఇదంతా జరిగాక నా మనస్సులో పశ్చాత్తాపం లేక పోలేదు. వ్యవహారం ఏమీ తృప్తికరంగా లేదు. అసహ్యంగా చవకబారు మనుష్యుల విధంగా తయారయింది. బిజా పిన్ని కంటికి ఇదంతా పట్టుబడిందో లేదో చెప్పలేను. ఏం చేయను, మన మందరం నైజ గుణానికి బానిసలం. ఇదంతా వికారం వచ్చేలా ఉందంటే ఆ తప్పు నాదా? నేనేమీ త్రేణవుని త్రొక్కిపెట్టగలనా, తుమ్మును ఆపగలనా?

(నీకు బాగా జ్ఞాపకం ఉందో లేదో, సుమారు 10-12 సంవత్సరాల క్రితం ఇంతకంటె క్రింద మెట్టుమీద ఉండేవాడివి కదా? ఇటువంటి సందు, ఇదే విధమైన ఇంట్లో నువ్వు స్వేచ్ఛగానే ఊపిరి పీల్చుకోగలిగేవాడివి?)

ఉన్నాను కాని ఇప్పుడు కాదు. చూడు, నేనొక అలవాటు నుంచి మరొక అలవాటుకి ఉత్తీర్ణుడనయ్యాను ఒక జన్మ నుంచి మరొక జన్మ లాగ. ఒకప్పుడు ఆ అంధ కూపంలో దాంతో పాటు కలిసి ఉండేవాడిని, ఆ మాటన్నరైతే, కాని పూర్తిగా ఆ పట్టు విడిచి బైట పడ్డాను ఈ విధంగా. వాస్తవిక పరిస్థితిని నిష్కపటం గా స్వీకరించాలి. 10 ఏళ్ల వయస్సులో కుట్టించుకున్న చొక్కా 20వ ఏట సరిపోక పోతే తప్పు ఎవరిది? ఎవడిదైనా శరీరం తన స్వాధీనంలో ఉండదు: అంతా కాలం యొక్క వశంలో ఉంటుంది.

ప్రక్క గదిలోంచి ఏదో కరకరమంటూ చప్పుడు వినిపించింది. ఆ ప్రక్కకు

చెవి ఒగ్గి బిజా పిన్ని వైపు కళ్ళు ప్రసరించాను.

-పరిమళం గుండెలో కఫం గడ్డకట్టుకుపోయినప్పుడు, శ్వాస పీల్చుకోవడం కష్టమయినప్పుడు అటువంటి శబ్దమే వస్తుంది. అయినప్పటికీ, ఇప్పుడు నిద్రపోతున్నాడు.

పురుగుల పుట్ట మద్య ఈ స్థలం గురించి చెప్పలేము. ఎంతకాలం నుంచో పోగుపడిన నాచు పట్టిన, ఈ ఇల్లు రోడ్డుకు 9 అంగుళాలు పల్లంగా ఉంది: అంతా ఒక ఎండిపోయిన కుండీ లాగ ఉంది.

(సరసిజ్, ఇంక చెప్పకు. దీని తర్వాత నువ్వేమి చెపుతావో నాకు తెలుసు. దూలంలో చెద, చిరిగిన పరుపు, తలుపు మూలలో మసి అదంతేనా? అందులో తప్పేం లేదు - కాని, వర్ణనలో పట్టు ఉండదు. ఏ జీవితాన్నుంచైతే నువ్విప్పుడు దూరంగా ఉండదలచుకున్నావో, దాన్ని చిత్రించకు ఇంక.)

లాంతరు వత్తి మిణుకుమిణుకు మంటూ దీపం ఆరిపోయేలా ఉంది. అటువైపు చూస్తూ అన్నాను, 'పరిమళంకు ఎన్నాళ్లనుంచి అనారోగ్యంగా ఉంటోంది పిన్నమ్మా?

"ఈ వేళటికి 22 రోజులయింది"

"డాక్టరు గారేమంటున్నారు?"

"సరిగ్గా డాక్టరుకు చూపించే శక్తి ఏది? దురదృష్టవంతురాలు అమ్మాయి చేతిలో ఏమీ సొమ్ము లేదు. మెడ ఖాళీ, చేతులు ఖాళీ - అటు చూడడానికి లేదు, సరసిజ్ పెళ్లి సమయంలో నేనిచ్చిన 23 కాసుల బంగారం అదంతా ఎప్పుడో అమ్ముడయిపోయింది".

"మీరు ఎప్పుడు వచ్చారు, పిన్నమ్మా?"

"ఎనిమిది రోజులయింది. కడుపున పుట్టిన బిడ్డ కదా కబురు అందగానే వెంటనే బయలుదేరాను. సరసిజ్, నీకే తెలుసు కూతురంటే నా కెంత మక్కువో".

"తెలుసు, పిన్నమ్మా"

"చేతులలో ఉన్నదంతా పోగు చేసుకుని వచ్చాను. అక్కడి నా పరిస్థితి కూడా నీకు తెలుసు. టూకూ ఇప్పుడు పబ్లిక్ పరీక్షకు వెళ్లాలి- వాడికి పరీక్ష ఫీజు ఇంకా కట్టలేదు".

"అర్థమయింది, పిన్నమ్మా".

చీర కొంగుతో కళ్ళు తుడుచుకుని, బిజా పిన్ని నాకు ఆ చీర కొంగులో ఉన్న చిరుగు చూపెట్టింది.

"సరసిజ్, నా ఆడకూతుళ్ల గౌనులన్నీ చిరిగిపోయాయి. రెండు నెలలు ఇంటి అద్దె బకాయి పెట్టాను రెండు 26లు, 52 రూపాయిలు ఈ పూట అన్నం,

ఆ పూట రొట్టి, వాటి కోసం నెల రేషను ఏ మాత్రం సరిపోవడం లేదు. అయినా, కబురు వచ్చేసరికి అన్నీ కూడబెట్టుకుని వచ్చేశాను. అన్నింటికంటె పరిమళ్ బ్రతకడమే ముఖ్యం. మిగతా విషయాలు తర్వాత ఆలోచించవచ్చు".

తన కొంగు ముడివిప్పి బిజా పిన్ని ఒక నోటు బైటకు తీసింది. బాగా నలిగిపోయింది, పాతది. ఒక అడుగు వేసి ముందుకు వచ్చింది. దృష్టి స్థిరంగా ఉంచి వెనక్కి తగ్గి, విషయం అంతా గ్రహించాను. బిజా పిన్ని ఆ రూపాయిల నోటు నా చేతిలోకి తోసిపెట్టింది. ఇచ్చేసింది. ఆ చెయ్యి వణకుతోంది. ఆమె కంఠం కూడాను.

"నా చేతిలో ఇంకేమీ లేదు, సరసిజ్. పరిమళ్‌కు ఇంజెక్షను ఇప్పించేందుకు ఈ డబ్బు సరిపోతుందేమో చూడు. నేను తిరిగి వెళ్లేందుకు ప్రయాణపు ఖర్చులు ఎల్లాగో కష్టపడి దాచి అట్టేబెట్టుకున్నాను లే".

ఆ డబ్బు నేను పుచ్చుకోలేదు, పుచ్చుకోలేకపోయాను, తిరగి వచ్చేశాను. కానీ అది పెద్ద విషయం కాదు – ఆ కథ సంగతే నాకు బాగా గుర్తుకు వస్తుంది... (అనుబంధం) బికారి పిల్ల తన చీర విప్పి అడ్డాల్లో బిడ్డకి బాగా కప్పింది...

(పిల్ల, అంటే, ఉషతో నీకు ఆవేళ కలియిక జరగలేదా, సరసిజ్?) "జరిగింది. లాంతరు పట్టుకుని ఉష తనంతట తానే వెనక్కాలే వచ్చింది. సందు చివరి వరకూ".

అక్కడకు వెళ్లి నేను తిరిగి నిలబడ్డాను. లాంతరు వెలుగు ఇంకా మసకగానే ఉండి, శరీరాన్ని ముక్కలు ముక్కలుగా వేరు చేసినట్లు కనుపింపజేస్తోంది. "ఏమిటి నీ ముఖం ఇలా తయారయింది ఉషా? ఉష నవ్వింది. ముఖం త్రిప్పివేసింది. – "జబ్బు పడ్డాను." అన్నిటికంటె ఈ అనారోగ్యం! రోజూ రాత్రి ఏదేవిధంగా రాత్రి అంతా లేచి ఉండాలి.

నెత్తిపై ముసుగులేదు, ఆమె జుట్టు ఎగురుతోంది. లాంతరు వత్తి వణకుతూంటే, ఆమె శరీరం, ముఖం, జబ్బలు, చెక్కిళ్ళు, కళ్ళూ ఆ దీపపు నీడలో అస్పష్టంగా అల్లల్లాడుతున్నాయి. మళ్లీ నవ్వింది ఉష. "ఏమిటి చూశావు, దెయ్యం!" "ఏమిటి ఇన్ని సంవత్సరాలకి నేను దెయ్యాన్ని అయిపోయానా?"

చెప్పడానికి న్యాయం కాదు; "నువ్వు అల్లాగే అయ్యావు", అని నేను మాట్లాడక ఊరుకున్నాను.

ఉష అకస్మాత్తుగా తల ఎత్తి నవ్వింది – కానీ నీ ముఖం మారిపోయింది.

"నువ్వింకా లావుగా తయారయ్యావు" ఉష ఈ మాట తిరిగి అందో లేదో తెల్సుకోకుండానే నేను రుమాలుతో ముఖం తుడుచుకున్నాను. అప్పుడు నా సూటు చెమట పట్టి వంటికి అంటుకుపోయింది.

ఉష అంటుంటే వినిపించింది ఈ సందులో నాకు టాక్సీ దొరుకుతుందనుకోను. రాత్రంతా ఎదురు చూసినా లాభం లేదు.

ఏమీ చేసేది లేక నేను ఆ సంకేతాన్ని గ్రహించుకుని వెంటనే నా త్రోవమ్మట నేను వెళ్లాను. మళ్లీ ఎప్పుడు కలయికో - రేపు కలవడమో, లేక ఇలా సంజ్ఞ ద్వారానే అస్పష్టంగా తెలియజేస్తుందో ఏమో....

అతనన్నాడు, "అన్నం మూత పెట్టి వుంది. సరసిజ్, కాస్త ఎంగిలి పడవా?

అన్నాను, "వద్దు. ఈ వరండాలో కూర్చుని ఇల్లా సిగరెట్టు కాల్చుకోనీ...."

అతను నవ్వాడు. చాలా అవకరమైన విధానంగా నా వెనక్కాలే వచ్చి పట్టుకున్నాడు నన్ను. తన చీకటిని పోలిన చెయ్యి నా మెడమీద వేశాడు- వీకి విసికెయ్యవు కదా!

అతని ముఖం కనబడడం లేదు, కాని అతను ఉన్నాడు. నన్ను పట్టుకున్నాడు; మాట వినిపిస్తోంది. "నిన్ను చంపితే నాకేం లాభం? కొంత సేపు మసిలాగ, మరికొంతసేపు పొగలాగ, అంత ఎగురుతోంది. "అదీ కాక, ఈ రెండు గంటలూ ఎన్ని సిగరెట్టులు కాల్చావే చూశావా? అంతకంటె అన్నం మీద మూత తీసి, కాస్త నీ పొట్టపై దయ చూపించు".

- నేను చెప్పలేదా, నాకు ఆకలి లేదని?

- ఎందుకు లేదూ?

- ఎందుకు లేదో నీకే తెలుసు. నా మనస్సు పాడయింది. ఈ వేళ ఉషని చూసి వచ్చాను. ఆ ఇంటిలోకి వెళ్లి చూసే సరికి ఏడుస్తోంది. నీకు తెలుసా, ఉష భర్త పరిమళ్ బ్రతుకుతాడన్న ఆశ లేదు. ఉష చేతిలో డబ్బుల్లేవు చేతికి ఒక గాజు కూడా లేదు. అతనన్నాడు - "తెలుసును. సరసిజ్, అందుమూలానా నీ మనస్సు పాడయింది?"

అతని మాట పద్ధతి ఏదో వంకరటింకరగా ఉంది.

అన్నాను -"నాకు చెప్పడానికి కష్టంగా ఉంది. ఉషకూ నాకూ ఉన్న సంబంధం నీకు తెలియక ఇలా మాట్లాడుతున్నావు. కాని ఏమవుతుందో? ఒక్క తప్పుకు నష్టపరిహారంగా ఎంత చెల్లించాలో అది ఈవేళ చెల్లించాను".

హహ్హా అంటూ నవ్వాడు అతడు. ఆ నవ్వు కోట్ల కొలది పగిలిన గాజు పెంకుల మాదిరిగా నన్ను గుచ్చుకుంది. నవ్వు ఆపి అన్నాడు - గుండెమీద చెయ్యివేసి చెప్పు. సరసిజ్ నిజంగా నీ మనస్సు పాడయిందా? నిన్ను కాదని పరిమళ్‌ని పెళ్లాడింది ఉష; ఆమె సుఖపడకుండా ఈనాడు ఒక చీకటి కొంపలో కుళ్లినట్లు పడి ఉంది - ఈ విషయం నీకు కొంచెం ఆశ కలిగించేలా సుఖకరంగా లేదా?

ఏమీ జవాబు చెప్పలేదు నేను. చెప్పి లాభం లేదు. అతను పైవాడు, నమ్మకం

లేని వాడు; ఉషను అతను అర్థం చేసుకోలేదు. బిజా పిన్ని కథ అతనికి చెపితే అతను ఏమైనా అర్థం చేసుకుంటాడా?

కూతురిపై బిజా పిన్ని కి గల మక్కువా, తన చీర కొంగు నుంచి బైటకు తీసి ఇచ్చిన 10 రూపాయిల నోటు - ఈ కథ అంతా విని అతను "హహ్హా" అంటూ నవ్వుకున్నాడు.

(సరసిజ్, మరునాడు తెల్లవారు ఝామునే మళ్లీ నువ్వు అక్కడకు వెళ్లావు కదా?)

- వెళ్లాను ఆవేళ టాక్సీ సందు లోపలికి తీసుకొని వెళ్లలేదు. చేతిలో మందులు, జేబులో పళ్లు పెట్టుకుని పంచకట్టుకుని బాగా సర్దుకుని, ఉషా వాళ్ల ఇంటి గుమ్మం ముందు వెళ్లి నిలబడ్డాను. కుంపటిలో బొగ్గులు వేసి మంట పెడుతున్నారు.

ఇవాళ కూడా తలుపు తెరుచుకుని నిలబడి ఉంది బిజా పిన్ని.

"పరిమళ్, ఎలా ఉన్నాడు, పిన్నమ్మా!

"మామూలుగానే. లోపలికి రా".

పగటి వెలుగు లోపలికి చొరబడడానికి వీలున్నంత మట్టుకు అది ఆయింటి దారిద్ర్యాన్ని స్పష్టంగా ప్రకటిస్తోంది. పాత తువ్వాలు, చిరిగిన లుంగీ, గోడమీద మరకలు, మురికి పరుపు, ఈగలు ఇవన్నీ అలాగే ఉన్నాయి - వాటిని ఏమీ వర్ణించదలచుకోలేదు. క్రితం రోజు చూసిన సందు గుర్తు ఉంచుకుని ఈ ఇల్లు ఎలాగో చేరుకున్నాను. లాల్చీ పంచా కట్టుకున్నాను. అందుమూలాన ఈవేళ ఏమీ చిరాకు కలగలేదు.

మందులు బిజా పిన్ని చేతిలో పెట్టాను. పళ్లు బుట్టలో పెట్టాను. బిజా పిన్ని ముఖం వికసించింది - తన ఆనందాన్ని దాచేందుకు ఆమె ప్రయత్నించ లేదు.

ప్రక్క గదిలోంచి గరగర చప్పుడు వినిపిస్తోంది. నా చెవి ఏ వైపు మొగ్గానో ఆ దిక్కు కేసి చూసి బిజా పిన్ని అంది - "నిన్న రాత్రి అంతా అలాగే ఉన్నాడు". తల్లీ కూతురూ కలిసి రాత్రంతా మేలుకుని ఆ రోగికి పరిచర్య చేశారు. "పిల్లను తప్పించి నేను మేలుకున్నప్పుడు దేవుణ్ణి ప్రార్థించాను. - ఈ రాత్రి ఎలాగో గడవనియ్యి! మా అమ్మాయి తల మొత్తుకుని తన రక్తాన్ని ధారపోసిన ఈ ఇంట్లో, ఈ రోగి మూలుగూ ఇటు వంటి భీకర పరిస్థితిని నీ కెలా వర్ణించి చెప్పాలో తెలియడం లేదు, బాబూ!"

బిజా పిన్ని కాసేపు ఊరుకుంది.

మధ్య మధ్యన అమ్మాయి వచ్చేది ఈ గదిలోకి. దాని ముఖం కేసి చూడబుద్ధి

వేయలేదు. రెండు కళ్లూ ఎలా దుఃఖంతో మండుతున్నయో, నిన్న చూశాను. చెక్కిళ్లపై రక్తపు కాంతి నశించి పోయింది. పరిమళ్ గుండె మీద చేయి వేసి చూసేదానిని, బెడ్‌పాన్ పెట్టి అతని అవసరాలు తీర్చేదానిని; కాగా రోగి దగ్గర అమ్మాయిని ఎక్కువసేపు ఉండనిచ్చే దానిని కాదు. అతని శరీర పరిస్థితి చూశాను. - ఏదో కొంచెం సేపు విశ్రాంతి కలిగినట్లు ఉన్నా, అదే పెద్ద లెక్కలోకి రాదు. నుదుటి వ్రాత ఎవరూ తప్పించలేరు. అయినా, కంటి ముందు కనుపించినంత సేపు, అతణ్ని కనిపెడుతూనే ఉన్నాను. సరసిజ్, లక్ష జరగనీ, నేను ఆఖరికి తల్లినే కదా!

నా వంటి పై ముల్లు గుచ్చుకున్నట్లయింది. పిన్ని కళ్ల చుట్టూ నిద్ర లేమి వల్ల నల్లటి డాగులు పడ్డాయి. సంస్కారం లేక తల జుట్టు అంతా కాంతి హీనమయి పోయింది. నేను అడిగాను, "పిన్నమ్మా, మీ వంట్లో కూడా బాగున్నట్లు లేదే! ఇలాగ రాత్రంతా మేలకుంటే మీ ఆరోగ్యం కూడా చెడిపోతుందమ్మా!"

బిజూ పిన్ని చిరునవ్వు నవ్వింది. నవ్వూ, ఏడుపూ కలిసి ఆమె ముఖంపై ఒక చిత్రమైన ముద్ర వేసాయి. "నా మాట వదిలెయ్యి. నా ఆయుర్దాయపు లెక్క దాటాను. మృత్యుదేవత పిలుపు ఈ రోజుకానీ, రేపు కానీ రావచ్చు. ఆఖరికి ఈవేళే నేను చనిపోవచ్చు. అయినప్పటికీ, ఈ మాట గుర్తుంచుకో, ఇంక నాకేమీ భయంలేదు, ఈ దౌర్భాగ్యురాలిని నన్ను నువ్వు సర్వనాశనం నుంచి రక్షించావు".

(సరసిజ్, సరే ఆమె మాట విన్నాక ఆమెను నువ్వు ఒక క్రొత్త వెలుగులో చూశావు గదా?)

- చూశాను. ఆ క్షణంలో ఆమె ఇంక దరిద్రురాలు అనిపించ లేదు. ఐశ్వర్యం మారడం వల్ల, కరువు పడుగూ - పేకా పేనుకున్న పరిస్థితుల్లోనూ అన్నీ పోగొట్టుకుంది. - అయినా, ఆమె రక్షించుకున్న దేమైతే ఉందో దాని విలువ ఏమీ అంత తక్కువైనది కాదు. ఇది ఒక విధమైన జీవన విధానం- ఇందులో, రెండు తేలిక పేక ముక్కలు ఒక దాని పై మరొకటి అనుకున్నట్లు. ఒక జీవితంపై మరొక జీవితం బరువు మోపుకుని ఉంటుంది. రోగి గురించి డబ్బు ఖర్చు పెట్టి నర్సుని నియమించేందుకు వీళ్లకు శక్తి లేదనుకో, కాని ఒక వేళ శక్తి ఉన్నా నియమించి ఉండే వాళ్లు కాదు. ఈ జీవనం విలువ నేనొకప్పుడు గ్రహించాను; ఇప్పుడు మళ్లీ గ్రహిస్తున్నాను.

బరువైన గొంతుతో అడిగాను: "పిన్నమ్మా, ఉష ఎక్కడ ఉంది ఇప్పుడు?"

బిజూ పిన్ని అంది: "నిద్రపోతోంది. రాత్రంతా ఇటూ అటూ విశ్రాంతి లేకుండా ఇంట్లో తిరగడం మూలాన, ఒక్క నిమిషం క్రింద దాని కళ్ళు నిద్ర ముంచు

కొచ్చి కాస్త మూసుకున్నాయి. ఆమెను ఇప్పుడు లేపవద్దు. పడుక్కోనీ.

బైట సందు మొదట్లో ఒక కుక్క చాలా సేపటి నుంచి ఎలుగెత్తి మొరుగుతోంది. వ్రేలు పెట్టి ఆ వైపు సంజ్ఞ చేస్తూ బిజూ పిన్ని రహస్యంగా అంది - "ఆ మొరుగు విను. రోజూ అలా అరుస్తుంది. తెల్లవారుఝామున, మధ్యాహ్నం, సాయంత్రం, అర్థరాత్రి'. అప్పుడు ఒక్కసారిగా బైటికి వెళ్లి చూశాను. ఈ మొరుగు చాలా అపశకున సూచకమైనది. బాబోయ్ ఇంక పరిమళ్ బ్రతుకుతాడనుకోవడానికి వీలులేదు!"

ఏమయింది, అదే విషయం ఒక్కటే నన్ను నిష్ప్రయోజకునిగా నిస్సహాయునిగా తయారు చేసింది. ఎలాగో శ్రమ పడి లేచి గొంతు ఎత్తి అన్నాను - 'రక్షిస్తాను పిన్నమ్మా. నేను రక్షిస్తాను'.

నా మాట సరిగ్గా అర్థం చేసుకోలేక, బిజూ పిన్ని నా వైపు తదేక దృష్టితో చూస్తోంది. అన్నాను 'రక్షిస్తాను పిన్నమ్మా. నాకు సాధ్యమైనంత మట్టుకు అంతా చేస్తాను. పిన్నమ్మా -ఒకసారి తల జుట్టు మెడ పైనుంచి పైకి గెంటుతూ అన్నాను- "పిన్నమ్మా, ఏమీ బెంగ పెట్టుకోకు. నా చేతిలో ఏమీ ఎక్కువ లేదనుకో, నేనిప్పుడు లక్నోలో ఉంటున్నాను తెలుసు కదూ! ఇన్నాళ్లూ హొటలుకి చాలా ఖర్చు అయిపోయింది. అయినా, నా దగ్గర ఉన్నంత మట్టుకు అతనికి మందు, పళ్లు, వైద్యం మొదలైన వాటికి ఖర్చు పెట్టదలచుకున్నాను".

జేబులో చెయ్యి పెట్టబోయాను. బిజూ పిన్ని నా చెయ్యి పక్కకు నెట్టివేసింది. ఆమె నిక్కచ్చిగా చకితురాలైపోయింది. ఆమె కళ్లు అశ్రుపూరితమయ్యాయి. చెయ్యి ఎత్తి అంది: 'ఆగు బాబూ వద్దు - నాకు ఇవ్వవద్దు. అమ్మాయిని పిలుస్తాను. నీ చేత్తో ఏమి ఇవ్వదలచుకున్నావో అది ఆమెకే ఇయ్యి. అప్పుడు అమ్మాయికి తెలుస్తుంది- తను ఏకాకిని కాదు, తన పక్షాన్ని ఉండే స్నేహితులు తనకు ఉన్నారని'.

బిజూ పిన్ని హడావుడిగా లోపలికి వెళ్లింది; త్రోవలో అకస్మాత్తుగా నిలబడిపోయింది. ఆమె ముఖంలో ఎన్నో ముడతలు పడ్డాయి. ఒక్కసారి తిరిగి నా కళ్లలోకి చూసింది. ఆ చూపుతో కూడుకున్న ఆమె విగ్రహాన్ని నేను స్పష్టంగా చూడగలిగాను. పిన్నమ్మ ఏమి చెప్పదలచుకుందో ఆ మాట పెదవి చిగురుకి వచ్చి అక్కడే ఎండిపోయింది.

బిజూ పిన్ని తిరిగి నా దగ్గరకు వచ్చింది, ఎంత దగ్గరకు రాగలిగిందో అంతవరకూ. "సరసిజ్! (పిన్నమ్మ గొంతు చాలా తక్కువ స్వరంతో వినగలిగాను) సరసిజ్! ఎంత?"

మొట్టమొదట ఆమె మాట అర్థం కాలేదు. అటుపైన మరొకసారి అదే

గొంతుకతో ఎప్పుడైతే ఆమె 'ఎంత?' అని అడిగిందో అప్పుడు అంతటితో అంతా అవగతమయింది.

అప్పుడే ఆ కుక్క కూడా మొరిగింది. నెమ్మదిగా లాల్చీ జేబులోంచి ఒక రూపాయిల నోటు బైటకు తీశాను. ఒక వందరూపాయిలు అనడం మొదలుపెట్టాను, 'పిన్నమ్మా, ప్రస్తుతానికి....' మాట పూర్తి అవనిచ్చింది కాదు.

"ఒ-క-వంద!" ఒక్క క్షణంలో బిజా పిన్నిలో ఎంతో మార్పు. ఆమె కంఠ స్వరం కూడా గుర్తించలేనట్లుగా మారింది.

"ఒ-క- వంద రూపాయిలు!" బిజా పిన్ని మళ్లీ రహస్యంగా అంది -"అంతా దానికియ్యి, బాబూ! ఆపైన చిల్లర మార్చి తీసుకొచ్చి నాకు-నాకు-నాకు కూడా కొంచెం ఇవ్వవా?"

అగ్ని ముఖం ముందు పెట్టిన కాగితం తరిగినట్లు బిజా పిన్ని ఒక్కొక్కటీ తన పట్టుదల వదిలి లోభానికి దిగజారుతోంది.

'వందరూపాయిల నోటు'- ఈ ఒక్కమాట శబ్దం నదీప్రవాహం మధ్య నుంచి స్టీమరు చీల్చుకుని నడుస్తున్నట్లు ఆమె నోటి నుంచి వెలువడుతోంది. ఒక ప్రక్క ఉష, ఆమె దరిద్రపు చిన్న ఇల్లు, చావుకి సిద్ధమైన భర్త, సమీపంలో ఉన్న వైధవ్యం; మరొక ప్రక్క బిజా పిన్ని స్వంత కుటుంబం బాకీ ఉన్న ఇంటి అద్దె, ఆడపిల్లల చిరిగిపోయిన గౌనులు చాలీ చాలని రేషను బియ్యం - ఈ సంసారం మమత ఆమెను తన అంధకార బంధురంలో బంధించింది. ఈ రెండు వైపుల నుంచీ దాడి ఆమె మనస్సును రెండు ముక్కలు చేసింది.

('అనుబంధం' కథ, ఆ బికారి పిల్ల కథ దొరికితే దాన్ని నువ్వేం జేస్తావు?)

-"చింపి పారేస్తాను".

అతను అన్నాడు, "హూం!" చాలా సేపు మాట్లాడక ఊరుకున్నాను. అతని ముఖంలో రహస్యంతో కూడుకున్న చిరునవ్వు కలిసిపోయింది. ఆఖరికి మెల్లిగా అన్నాడు -"సరసిజ్, నువ్వు ఒక బిజా పిన్నినే చూస్తున్నావు. ఇంటి వైపు కాస్త చూడవా? దీనికంతకీ తాళం అసలు ఆ యింటిలోనే ఉంది! ఒక్క మంచం వేసేసరికి చోటు అంతా నిండిపోయే ఆ కుగృహంలో ఎన్ని విధాల మనస్సులు పట్టగలవు?

"ఈ -లెక్క నువ్వు నిక్కచ్చిగా చెప్పలేకపోతే, నువ్వీ కథ వ్రాయలేవులే!"

---

('ఛాయాహారిణ్', 1961)

# చెట్టు

జ్యోతిరింద్రనంది

ఒక చెట్టు. చాలా పూర్వకాలపు చెట్టు. ఆ చెట్టు అందమైనదా కాదా అన్న ప్రశ్న ఏమీ ఉత్పన్నమవదు.

చెట్టు మనస్సులో చెట్టే ప్రతిష్ఠింపబడి ఉంది. దీనికి ఏదైనా ప్రయోజనం ఉందా లేదా అన్న విషయం గురించి ఎవ్వరూ బుర్ర పాడు చేసుకోనక్కర లేదు.

మానవుడు తన తల పైన ఆకాశాన్నీ, మేఘాన్నీ, ఎలా చూస్తాడో తన కాళ్ల క్రింద ధూళి, పచ్చగడ్డీ ఎలా చూస్తాడో; అలాగే తన కళ్ల ముందు ఒక చెట్టు నిలబడి ఉండడం చూస్తాడు. సాయంత్రం, మధ్యాహ్నం, ఉదయం చూస్తాడు. కేవలం కంటితో చూస్తే మనస్సుతోనూ, అనుభూతితోనూ, చూసినట్లు బోధపడదు.

ఏ విధంగా ఒక చెట్టును అర్థం చేసుకోవడం సాధ్యమో ఎవ్వరూ ఎప్పుడూ ఆలోచించరు.

రోజు మీద రోజు గడచిపోయినా, ఋతువు పోయి మరొక ఋతువు వచ్చినా సంవత్సరాలు వస్తూ పోయినా, చెట్టు మట్టుకు ఎక్కడ ఉంటుందో అక్కడే నిలబడి ఉంటుంది.

వర్షాకాలంలో ఆకులు పెద్దవై పుష్టిని పొంది శరత్కాలంలో ఆకులు పొడవుగా, బరువైనవై ఆకుపచ్చ రంగు కంటె ఆకుపచ్చనివై, ఇంచుమించు నల్లటి రంగుతో విరాజిల్లి, హేమంత ఋతువు వచ్చేసరికి మధ్య మధ్య అకస్మాత్తుగా ఆ ఆకుపచ్చ - నలుపు కలిసిన ముదరు రంగు అంతా పేలవంగా మారిపోతుంది. ఆ తర్వాత చలికాలంలో (శిశిర ఋతువులో) వెల వెల బోయిన పసుపు రంగుగా పరిణమించి వెల వెల బారిన ముఖం దాల్చి ఆకులు గబగబా రాలిపోతాయి - రక్త విహీనమైన తమ ప్రసూతిలో. అప్పుడు చెట్టు విరక్తి పొందుతుంది.

అప్పుడే చెట్టు చెట్టులా ఉండిపోతుంది.

అప్పుడు చెట్టు ముఖం పూర్తిగా కట్టెలా మోడు బారిన ముఖంలా అయిపోతుంది.

చిన్న కట్టె, పెద్ద కట్టె, మొండి కట్టె, ఎండిన కట్టె, సన్నగా నాజూకుగా ఉన్న మనిషి వ్రేలు లాగా, ముక్కలు ముక్కలై పోయిన లెక్కలేనన్ని కట్టెలు - ఒక వికృతమైన కట్టెల అస్థిపంజరంలా తయారైపోతుంది చెట్టు.

అల్లాగని చెప్పి అప్పుడు మానవుడు దాని మీద కోపగిస్తాడా? కోపగించడు. కారణం ఏమిటంటే, మేఘావృతమైన ఆకాశం క్రింద నిబిడారణ్య తుల్యంగా ఉన్న దాని ముఖాన్ని మానవుడు ఏ దృష్టితో చూస్తాడో, అదే విధంగా చలికాలంలో నిర్మలాకాశం క్రింద ఎండిపోయిన, మోడుబోయిన కట్టెల బరువు నెత్తి మీద

పెట్టుకున్న చెట్టును చూస్తాడు. పైకి పైకి చూసి ఆ మాటే అంటున్నాను మనసిచ్చి చూడకపోతే అర్థం కాదని. అలా చూడగలిగితే ఫాల్గుణ మాసంలో ఆకుపచ్చా ఎరుపూ కలిసిన రంగుతో ఉన్న, క్రొత్తగా పుట్టిన, ఆకుల గుంపునీ చూసి మానవుడు సంతోషంతో గెంతుతాడు, అల్లాగే వైశాఖ మాసంలో లెక్కలేనన్ని గుత్తెలు తలపై దాల్చి చెట్టు ఆశ్చర్యకరమైన గులాబీ కాంతులతో జ్యోతిర్మయా కాశంలా ప్రజ్వరిల్లుతున్నప్పుడు మానవుడు ఆనందంతో గొంతెత్తి అరుస్తాడు. అయినా ఎవ్వరూ అలా చేయరు, ఇంతవరకూ అలా ఎవరూ చేయలేదు.

రెండు మూడు ఇళ్ల మధ్య ఏదైనా ఒక సాగు చేయని ఖాళీ స్థలంలో ఒక చెట్టు కొమ్మలతోనూ, పుల్లలతో నూ అటూ ఇటూ వ్యాపించి ఉంటే, అప్పుడు ఈ విషయం అర్థమవుతుంది, అక్కడి వాళ్లకి. ఈ ప్రక్క ఇంటివాళ్లూ, ఆ ప్రక్క ఇంటివాళ్లూ తెలుసుకుంటారు, చుట్టు ప్రక్కల రెండు మూడు ఇళ్ల వాళ్లు కొందరు ఏదైనా కాస్త తీరుబడి దొరికితే చెట్టు దగ్గరకు వచ్చి కాలక్షేపం చేసుకుంటారు - ఉదయం వేళ కొంత మంది పెద్ద మనుషులు చేత్తో దినపత్రిక పుచ్చుకుని, రాజకీయాల గురించీ, ఆర్థిక, సాంఘిక విషయాల గురించీ చర్చిస్తూంటారు; మధ్యాహ్నం పూట ఈ ఇంటిలోని వాళ్లూ, ఆ ఇంటిలోని వాళ్లూ, ముసలివాళ్ళూ, ఈ ఇంటి యజమానురాలూ, ఆ ఇంటి అమ్మాయీ, చెట్టు క్రింద సన్నని తివాసీ మాదిరిగా ఉన్న పచ్చగడ్డిపై కాళ్లు జాపుకుని కూర్చుని వంటల గురించీ, కుట్టుపని గురించీ, పిల్లలు కలగక పోవడం గురించీ ఏదో పిచ్చా పాటీ చెప్పుకుంటూ కాలం గడుపుతారు; ఇక సాయంకాలం అయినప్పుడు వచ్చి పడతారు అక్కడికి ఆటలాడుకునే కుర్రాళ్లు. వాళ్లు ఆ చెట్టు చుట్టూ తిరుగుతూ, కేకలూ, బొబ్బలూ పెడుతూ పరుగులెట్టడం లేకపోతే చెట్టు ఎక్కి, కొమ్మలు విరవడం, ఆకులు కోయడం, లేదా ఒక్కొక్కప్పుడు చెట్టు కొమ్మకు ఉయ్యాలా కట్టి ఊగడం - ఇలాంటి పనులు చేస్తారు.

చలికాలం మధ్యాహ్నపు వేళ చెట్టునీడను తల ఆనించి మిగతా శరీరం ఎండలో చాపి కొందరు కథల పుస్తకాలు చదువుకుంటారు. ఇక వేసవి కాలపు రాత్రిళ్లు ఈ చెట్టు క్రిందనే చల్లని చాప పరిచి, హరికేను లాంతరు వెలిగించి, ఇరుగుపొరుగు వాళ్లు నలుగురైదుగురు కూర్చుని పేకాడుతారు - ఇలాంటి దృశ్యాలన్నీ కంటికి కనుపిస్తాయి.

ఎప్పుడు మానవుడు ఉండడో, అప్పుడు చెట్టు క్రింద తృప్తిగా గడ్డిమేసే మేకలూ, గోవులూ కనుపిస్తాయి.

ఇంకా అనేక రకాల పక్షుల కలకల ధ్వనులు, రెక్కల చప్పుడు; ముక్కూ ముక్కూ చేసుకునే రాపిడి ఈ శబ్దాలు వినిపిస్తాయి చెట్టు పై నుంచి.

మధ్య మధ్య గాలి వీచినప్పుడు ఆకులల్లల్లాడడం, కొమ్మలు ఊగడం చూస్తాం. ఇంకొకప్పుడు అటువంటి సమయం కూడా వస్తుంది - ఎప్పుడైతే పక్షులు ఉండవూ చెట్టుపైన, గాలీ వీచదు. అప్పుడు చెట్టు పూర్తిగా నిస్తబ్ధంగా ఉండిపోతుంది.

సాగు చేయని నేలపై గాఢమైన ఛాయను వ్యాపింపచేస్తూ అనంత కాలానికి సాక్షిగా నిస్సంగత్వాన్ని అవలంబించిన చెట్టు యుగయుగాలుగా అలా నిలబడి ఉంటుంది. ఇంకా చెప్పాలంటే ఒక దార్శనికుడిలాంటిది వృక్షం. నిశ్శబ్దంగా, అచంచలంగా నిలబడి ప్రపంచాన్ని వీక్షిస్తూంటుంది. లోకం ఔన్నత్యాన్ని, పతనాన్ని కనిపెడుతూ ఉంటుంది. పాపం జయించి, పుణ్యం ఓడిపోవడం గమనించి చాలా ఆశ్చర్యం విషాదం పొందుతూంటుంది.

ఒకప్పుడు చింతాకుల చిత్తుడైన మానవుని అవస్థ లాంటిది అనుభవిస్తున్నట్లు వుంటుంది. చింతాక్రాంతుడైన మానవుడిలా నిశ్శబ్దంగా ఉంటుంది. నిజానికి చెట్టు గురించి అప్పుడప్పుడు ఒక మానవుని మోస్తరుగా ఆలోచించాలి. అప్పుడు దాని ప్రక్కన మిగతా మానవుల, పశువుల, పక్షుల వాయువు చాపల్యాని గురించిన కల్పన చేయడం కష్టంగా ఉంటుంది.

బహుశా ఇల్లా చెట్టు గురించి ఎవరైనా గమనిస్తే వాళ్లకి దాని విషయం గోచరమవుతుంది. పోతే, ఇన్నాళ్లూ అలా ఎవరూ తెలుసుకోలేదు. అవగతం చేసుకోలేదు. చెట్టుకి ఇటువంటి అంతర్దృష్టి ఉంటుందని ఎవరికి తెలుసు? నిజానికి ఒక చెట్టు గ్రహించుకో గలిగింది తూర్పు వైపున ఉన్న ఇంటిలోని ఒక ఆకుపచ్చ రంగు కిటికీ లోంచి తన వైపు ఒక వ్యక్తి గంభీరంగా తదేక ధ్యానంతో చూస్తోందని. అంటే ఇంతకు పూర్వం అలా కాదు. మరొక 10 మంది జనం లాగే ఆమె కూఢా మామూలు నేత్రాలతో చెట్టు ఆకులు రాలడం, క్రొత్త ఆకులు మళ్లీ పుట్టుకు రావడం చూసేది. ఇప్పుడు మట్టుకు ఆమె కళ్లు మామూలు గా చూడడం లేదు. ఆమె కళ్లు కాటుక కంటె ఎక్కువ నల్ల బడ్డాయి. ఇప్పుడు ఇంక ఆమె జుట్టు వ్రేళ్లాడేసుకుని, గౌను తొడుక్కుని అల్లల్లాడే పిల్లకాదు. ఇంటి ముందర కాళీ స్థలంలో ఒక చెట్టు ఉంది, ఎలాంటిదంటే వాసం క్ర్ర కంటె పొడుగ్గా పెరిగిపోయినట్టిది, అని తెలుసుకుంది. ఇప్పడు ఆమె తన ప్రశాంతమైన గంభీరమైన శిరస్సు పై గట్టిగా ముడివేయబడిన కొప్పులాగే, తన మనస్సును సంయమ పరిచి, అన్నీ పరిశీలించి గ్రహించుకుని తీక్షణంగా ఎప్పుడూ ఆ చెట్టుకేసే చూస్తుంది. చెట్టు హృదయం ఆవిడకు అర్థమయింది. అల్లా చూడగా చూడగా ఒక రోజున ఆమె దృష్టి భీతితోనూ, సంతాపంతోనూ కూడుకున్నదయింది. ఆమె నల్లని కంటి రెప్పలు ఇంక కంగారుపడి అల్లల్లాడడం లేదు; రెండు నల్లని

వజ్రాలలాగ స్థిరంగానూ, కఠినంగానూ ఉన్నాయి. చెట్టు అర్థం చేసుకున్న దేమిటంటే ఒక భయంకర భావన ఆమెలో కలిగిందని; ఆమె నల్లని రెప్పలతో కూడుకున్న రెండు కళ్ల మధ్య కేవలం భయమే కాదు, ఒక విధమైన ద్వేషం కూడా దానితో కలిసి ఉందని. చెట్టు భయంతో చూసింది - పగటి వెలుగులోనే కాదు, రాత్రి నిబిడాంధకారం లో కూడా ఆ రెండు కళ్ళూ మేలుకుని కిటికీలోంచి చూస్తున్నాయని. ఆ నిరాకారమైన ఛాయా మాత్రంగా ఉన్న రాత్రి గాఢ తమస్సులో కూడా ఆ తీక్షణ దృష్టి నుంచి తనని తాను తప్పించుకోలేకపోయింది చెట్టు. బీభత్సంతో పాటు పుంఖానుపుంఖంగా విద్వేషాన్ని కూడా ప్రసరింప జేస్తోంది ఆ వ్యక్తి ఈ చెట్టు వైపు.

తర్వాత, కథంతా బట్టబయలయింది. ఆ ఆకుపచ్చ రంగు కిటికీ లోని వ్యక్తి తనంత తానే అంతా తెలుసుకుంది.

ఈ చెట్టే దుష్టుడు. ఈ చెట్టే సైతాను. దీన్ని ఇక్కడ నుంచి తొలగిం చేయండి.

ఆ ఖాళీ స్థలంలోని ఇరుగు పొరుగు వాళ్లు లేచి కూర్చున్నారు.

మనిషి మాదిరిగా ఒక చెట్టు సైతాను లా తయారవడం గురించి వాళ్లు ఇదే మొదటిసారిగా వినడం, చూడడం.

ఏ చెట్టు క్రింద నయితే ముసలివాళ్లు కూర్చుని రాజకీయాల గురించి చర్చిస్తారో, స్త్రీలు సంతానం కలగడం లేక పోవడం గురించి మాట్లాడుకుంటారో పిల్లలు ఆటలాడుకుంటారో - ఆ చెట్టు తనలో ఇటువంటి దుష్టబుద్ధి దాచుకుందంటే....

కొట్టి పారెయ్యాలి, కాల్చి పారేయ్యాలి, అన్నిటికంటె మొదటిలోంచి పీకి పారేస్తే బాగుంటుంది. తెల్లపూల దండ పెట్టుకున్న తన గట్టి, ముద్ద జుట్టు కొప్పును ఆడిస్తూ కిటికీలోని వ్యక్తి అంది: అలా చేయకపోతే ఈ చెట్టు ఏం విపత్తు కలగజేస్తుందో చెప్పలేం.

అందరూ విన్నారు, అందరూ అర్థం చేసుకున్నారు. చిన్న పిల్లలు దీని క్రింద ఆడుకుంటారు. ఈ చెట్టు ఒక పెద్ద కొమ్మ విరిగి ఎప్పుడో హఠాత్తుగా వాళ్ల నెత్తిపై పడవచ్చు! ఈ చెట్టు పై పిడుగు పడవచ్చు; అప్పుడు దాని క్రింద ఎవరైనా నిలబడ్డా, కూర్చున్నా, - వాళ్ల చావు తప్పదన్నమాటే. అంటే ఈ చెట్టే పిడుగుని పిలుచుకు వస్తుందన్న మాట. సైతాను చేయలేని కీడు ఏముంది? ఈ మాటలు విన్న మనుష్యుల కళ్లు పెద్దవయ్యాయి ఆశ్చర్యంతో.

అయినా ఆ ఆకుపచ్చ రంగు కిటికీలో కూర్చున్న వ్యక్తి మటుకు మాట్లాడక ఊరుకోలేదు. చెట్టు గురించి ఇంత కాలం ఎవరైతే ఉదాసీనంగా ఉన్నారో వారిప్పుడు దాన్ని గురించి ఎంతో భయంకరమైన మాటలు విన్నారు.

కేవలం పిడుగు ఒక్కటే ఏమిటి, అర్థరాత్రి సమయంలో ఏదైనా ఒక మనిషిని తన దగ్గరకు పిలుచుకో గలదు సైతాను లాంటి చెట్టు.

హూ., తెల్లారేసరికి అందరూ చూడగలరు - ఆ వ్యక్తే ఈ చెట్టు కొమ్మకు వేళ్లాడుతూ ఉం(టాడు)టుంది అని.

ఆత్మహత్య చేసుకునే వాళ్లు వ్రేళ్లాడేందుకు అనువుగా ఒక కొమ్మ చమత్కారంగా వంగడం గురించిన మాట క్రొత్తగా అందరి మనస్సులో నాటుకుంది.

ఈ చెట్టుని త్రవ్వి పారెయ్యాలి, నరికి పారెయ్యాలి; వీలైతే వ్రేళ్ల దగ్గర నుంచి సమూలంగా పీకి పారెయ్యాలి.

బహుశా ఆ చెట్టుకి తెలియదు - ఖాళీ స్థలానికి పడమటి దిక్కున మరొక ఇంటిలో ఎర్రరఁగు కిటికీలో కూర్చుని ఒకతను దాన్ని గంభీర దృష్టితో పరిశీలిస్తున్నాడని. ఆఖరికి అటువైపు చూసేసరికి చెట్టు ఒక్కసారి ఉలిక్కిపడింది. తర్వాత సంతసించింది. ఎర్ర రంగు కిటికీలోని మనిషి రెండు కళ్లూ చాలా అందంగా ఉన్నాయి. ఆ కళ్లల్లో భయం, బెదురూ, వెగటూ, విద్వేషం ఇల్లాంటివి ఏ మాత్రం కనుపించవు. ఉన్న వల్లా స్నేహం, ప్రేమా, మమతా, సానుభూతీనూ. అది చూసి చెట్టు చాలా ఆశ్చర్య పడింది. ఆ వ్యక్తి దృష్టి కొన్నాళ్ల క్రితం అశాంతంగానూ చంచలంగానూ ఉండేది. హాఫ్ పాంటు వేసుకుని వేళాపాళా లేకుండా చెట్టు దగ్గరకు వచ్చి, చెట్టు పైకి బెడ్డలు వేసి, ఆకుల వెనక్కాల ఉన్న పక్షుల గూళ్లు పడగొట్టి చెట్టు కొమ్మకు ఉయ్యాలా కట్టి ఊగి - ఇలాంటి అల్లరి చేసేవాడు. ఇప్పుడతను పూర్తిగా మారిపోయి చక్కగా మంచి నడవడికల వాడయ్యాడు. లాల్చి చేతులు రెండూ మోచేయివరకూ మడిచి, అరచేతులు రెండూ బుగ్గలపై పెట్టి కిటికీ ప్రక్కన ఉన్న టేబులుపై మోచేతులు ఆనించి తదేకధ్యానంతో చెట్టు వైపు చూస్తూ ఉంటాడు. మధ్య మధ్య బల్లపైని వేస్‌లోని గులాబీ పువ్వు వాసన చూస్తూ, చెట్టు కేసి ఎంతగా తదేక దృష్టితో చూస్తే అంతగా ఆత్మసంతృప్తి ఆనందానుభూతి పొందుతున్నాడు. ఆ చెట్టు వైపు ప్రసరించిన దృష్టికి గులాబీ పరిమళం దోహదం చేయగా ఒక ఆశ్చర్యకరమైన అనుభవం అతనికి కలిగేది. అతని ప్రక్కన వున్న 'గులాబీ అంత సుందరమైన వ్యక్తి అతను' అని అనుకుంది చెట్టు.

చెట్టు నిశ్చింతగానూ, ధైర్యంగానూ ఉంది. ఎర్ర రంగు కిటికీ లోని వ్యక్తి వల్ల అందరూ మరొక విధమైన మాట విన్నారు.

ఈ చెట్టు దైవ ప్రసాదంలా మన మధ్య నిలిచి ఉంది. దీన్ని మనం బాగా సంరక్షించాలి. ఈ చెట్టు క్రింద ఉదయం, సాయంత్రం మనుష్యులంతా కలిసి కూర్చుంటున్నారు. ఒక మనిషికి మరొక మనిషికి మధ్య అన్యోన్యతను

కలిగించింది ఈ చెట్టు. అనగా అది మనలో సంఘీభావాన్ని కలగజేసిందన్న మాట. చెట్టు ఉందంటే కుర్రవాళ్లు దాని క్రింద చక్కగా ఆడుకుంటారు. తల్లిలాగ పిల్లలకి ప్రేమా, ఆనందం పంచిపెడుతూంది ఈ మైదానంలోని దివ్య వృక్షం.

అది నిజంగా సుందరమైనది.

దాని నీడ సుందరమైనది, దాని కొమ్మలు సుందర మైనవి. అంతేకాదు, దాన్ని ఆశ్రయం చేసుకుని అమాయకమైన అందమైన పక్షులు ఎల్లవేళలా కలకల రవాలు చేస్తూ ఉంటాయి. ప్రజాపతే ఇలా అవతరించి వచ్చాడు.

ఇరుగుపొరుగు వాళ్లు మళ్లీ వేరేవిధంగా ఆలోచించడం మొదలు పెట్టారు.

పడమటివైపు ఎర్రరంగు కిటికీలోని మనిషి అప్పటి నుంచీ ఊరికే కూర్చోలేదు.

ఇటుకలూ, ఇనుమూ, సిమెంటుతో తయారైన ఇళ్లల్లో కూర్చుని మనం నిర్వీర్యమై పోయాం. మన ముందు ఒక చక్కని ఆకుపచ్చ రంగు గల చెట్టు ఉందంటే మన మనస్సు ప్రకృతి సౌందర్యం పై లగ్నమయి ఉంటుంది. మనం ఇప్పుడు ఇక్కడ పూర్తిగా కృత్రిమ జీవులమై యాంత్రికంగా మన జీవితాలు గడపకుండా ఉన్నామంటే అది అంతా ఈ చెట్టు కల్యాణప్రదమైన ప్రభావం వల్లనే. ఈ చెట్టు ఎప్పుడూ ఇక్కడ నిలబడి ఉండాలి. ఈ చెట్టు మన అలసిపోయిన, క్రుంగిపోయిన జీవితాలలో ఒక ఉత్తేజకరమైన కవిత్వానికి ప్రతీక.

అయితే ఆ ఎర్రరంగు కిటికీ లోని ఆసామీ కవియా? అలా తర్కించుకుంది చెట్టు. రాత్రి కిటికీ ప్రక్కని టేబులు దగ్గర కూర్చుని కాగితం కలం తీసుకుని, చెట్టుకేసి చూస్తూ ఏమిటో వ్రాస్తూ ఉంటాడు?

చెడు మాట విని మానవుడు ఎలా కలవరపడతాడో, మంచి మాట విని అలా నిశ్చింతగానూ, సంతోషంగానూ ఉంటాడు.

ఒకామె చెట్టు గురించి చెడుగా మాట్లాడినప్పుడు విన్నవాళ్లు ఎలాగ వికల మనస్కులయ్యారో, అలాగే మరొకడు దాని ఉపకార బుద్ధి గురించి వర్ణించినప్పుడు సంతసించారు.

కాగా వాళ్లు చెట్టు గురించి ఇంక బుర్ర పాడుచేసుకోలేదు.

చెట్టు మనస్సులో స్వస్వరూపమే ప్రకాశిస్తోంది.

అయినప్పటికీ తూర్పు వైపు కిటికీలోని ఆమె ఇంకా ఊరుకోలేదు. ఇంకెవ్వరూ తనకి సాయపడక పోతే, తను ఒక్కర్తె గొడ్డలి పుచ్చుకుని చెట్టుని నరికేస్తానని, ఆవిడ పళ్లు కొరుకుతూ చేస్తున్న ప్రతిజ్ఞ వినిపించింది వృక్షానికి. ఈ చెట్టుని సహించలేకపోతోంది ఆమె. సైతానుని కంటికి దూరం ఎలా చేయాలో అలాగే ఈ చెట్టుని కూడా అనుకుంది ఆమె.

చెట్టు ఈ మాటలు విని బాధ పడింది, అయినా తన లోలోపల నవ్వుకుంటోంది.

దానికి ఆ కిటికీలో ఆమెని పిలిచి ఇలా చెప్పాలని ఉంది - "నీ కొప్పులో ఉండబట్టి పువ్వులకు ప్రత్యేక శోభ కలిగింది; నీ కళ్లల్లో కాటుకా నీ నుదుటిపై కుంకుమ బొట్టూ, ఎంతో ఆకర్షణీయం గా ఉన్నాయి. నీ చేతివ్రేళ్లు సంపెంగ మొగ్గలా నాజూకుగా వున్నాయి. అటువంటి నీ మెత్తని, చక్కని చేతులతో గొడ్డలి ఎలా పట్టుకోగలవు?

ఈ మాటలు పడమటి కిటికీలో మనిషి చెవిలో పడ్డాయి. అతని చక్కని చేతివ్రేళ్లు గట్టిపడ్డాయి. చెట్టుకి తెలుసు - అవసరమైతే ఆ చేతి వ్రేళ్లు ఉక్కు అంత గట్టివి అవగలవని. ఇప్పుడంటే అతను దీపం ప్రక్కన కూర్చుని కవిత్వం వ్రాస్తున్నాడు, గులాబీ పూవుల పరిమళం ఆఘ్రాణిస్తున్నాడు. కాని ఒకప్పుడు అతని చేతులే బెడ్డలు వుచ్చుకుని పక్షుల గూళ్లను పడగొట్టేవి; చెట్టుకొమ్మలు విరిచేవి; చెట్టు ఆకులు పీకేసేవి; రౌద్ర రూపం ధరించి చెట్టుకి పగ్గాలు కట్టి దానవ శిశువు మాదిరిగా అతణ్ని ఉయ్యాలా కట్టించి ఊగింపజేసేవి. కాగా చెట్టు అనుకుంది, ఇతని వజ్రం లాంటి కఠినమైన పిడికిలి పట్టు, ఈ చెట్టుని ఏమైనా సరే రక్షించాలి అని సిద్ధంగా ఉందని. 'ఎవ్వరైనా సరే చెట్టుకి అపాయం కలిగించేందుకు వస్తే వాళ్లను వదిలి పెట్టను. ప్రాణం ఉండగా కవిత్వాన్ని ఉత్తేజపరిచే ఈ చెట్టుని తొలగిపోనివ్వను. ఎవ్వరైనా చెట్టు మీద పడగొట్టడానికి చెయ్యి వేస్తే, నా శరీరంలోని ఆఖరి రక్త బిందువు ధారపోసి దాన్ని రక్షిస్తాను. చెట్టు శరీరం పై ఒక్క కరుకు గీతనైనా పడనీయను!.

చెట్టుకి మళ్లీ ఏదో క్రొత్త భయం పుట్టింది! దాన్ని మధ్యని నిలబెట్టి తూర్పు వైపున ఆవిడ, పడమటి వైపున ఆయన, ఏదైనా సంఘర్షణ లేవదీయరు కదా!

ఆవేళ మధ్యాహ్నం అయింది. ఇద్దరు పిల్లలను వెంటబెట్టుకుని ఒక మేక చెట్టు క్రింద గడ్డిమేస్తోంది. సాయంత్రం అయేసరికి పిల్లకాయలు వచ్చి అల్లరిచేస్తున్నారు. తర్వాత పక్షుల బృందం వచ్చి పెద్ద కలకలారావాలు చేశాయి. అటు పిమ్మట అంతా నిశ్శబ్దంగా ఉంది. రాత్రి అయింది. నిర్మలమైన నల్లని ఆకాశంలో అసంఖ్యాకమైన తారలు మెరుస్తున్నాయి. గాలి వీస్తోంది. చెట్టు ఆకులు టవ్‌టవ్‌మని చప్పుడు చేస్తున్నాయి. రోజూ ఇలాగే జరుగుతోంది. ఆ ఖాళీ స్థలానికి నాలుగు వైపులా ఉన్న ఇళ్లల్లోంచి నానా రకాల శబ్దాలు వినిపిస్తున్నాయి, దీపాలు వెలుగుతున్నాయి. క్రమంగా రాత్రి పెరిగిన కొలదీ ఒక్కొక్క ఇల్లూ నిశ్శబ్దంగా వుంది. దీపాలు ఆర్పేస్తారు. అటుపైన నాలుగు వైపులా అంధకారం వ్యాపించింది. అంధకారమూ, గాఢమైన నిస్తబ్ధతా. నెత్తిపైన కోటికోటి నక్షత్రాలు పెట్టుకుని మాట్లాడక ఉంది చెట్టు. ఒక్కసారి గాలి పడిపోయింది. చెట్టుపై ఒక్క ఆకైనా కదలడం లేదు.

అదీ సమయం.

ఆ గాడాంధకారంలో పగటి వెలుగులో లాగా చెట్టు కనుపించదు. తూర్పు దిక్కు ఆమె వచ్చి నిలబడినట్లు చూసింది చెట్టు. కొంగు గట్టిగా నడుముకు కట్టింది. కొప్పులోంచి పూల దండ విడిపడి పోయింది. యుద్ధం చేసేందుకు వచ్చినట్లు స్పష్టమయింది. ఇంక ఇప్పుడు పూలమాల లేదు. చేతిలో గొడ్డలి. చెట్టు పైకి ఎత్తి నరకబోతోంది.

ఇంతలో మరొక వైపు నుంచి ఇంకొకరు వస్తున్నట్లు కాలి చప్పుడయింది. చెట్టు ఆ వైపు చూసింది. ఇక అది నిశ్చింతగా ఉంది. పడమటి వైపు కిటికీ లోంచి చూసే అతను వచ్చాడు. అతని చేతిలో ఇప్పుడు కలం లేదు. ఒక కర్ర ఉంది. ఒంటిమీద లాల్చీ లేదు. చేతులు లేని బనీను. దవడలు బిగబెట్టి తీక్షణంగా చూస్తున్నాడు. పిడుగులా హూంకరించాడు.

చెట్టు చెవి ఒగ్గి నిలిచి ఉంది.

దుఃఖపూరితమైన నిస్తబ్దత. అనిర్వచనీయమైన ఘట్టం.

చెట్టు పై నుంచి ఒక పక్షిపిల్ల కిచకిచ శబ్దం చేసింది. ఒక ప్రక్క నుంచి ఏదో అజ్ఞాతమైన పుష్ప పరిమళం అనుభూతమవుతోంది. ఆకాశంలో ఒక ప్రక్క నుంచి మరో ప్రక్కకు ఒక నక్షత్రం రాలింది. ఓ మూలనుంచి గాలి వీచినట్లయింది. లేత కొమ్మలు ఊగడం మొదలు పెట్టాయి.

లోపల లోపల చెట్టు ఆశతో ఉంది. ఏ మాత్రం భయపడలేదు.

చీర కట్టుకున్న ఆవిడ పెదవి పై చిరునవ్వు వికసించింది.

పశ్చిమ గవాక్షంలోని ఆయన బిగబెట్టిన దవడలు వదులు చేయబడ్డాయి. ఇంక ఉరుము చప్పుడు వినిపించడం లేదు అతని నోటి నుంచి.

ఒకరి కేసి మరొకరు చూసుకుంటున్నారు. ఇద్దరూ ఎంత దగ్గరగా నిలబడ్డారంటే గాడాంధకారం లో కూడా ఒకరి ముఖం మరొకరికి స్పష్టంగా కనుపిస్తోంది. ఇంచుమించు ఒకరి ఊపిరి పీల్చుకోవడం మరొకరికి వినిపించేలా నిలుచున్నారు.

"చేతిలో గొడ్డలి ఎందుకు?"

"చెట్టు నరికేందుకు".

"దాని వల్ల ఉపయోగం ఏమిటి?"

"ఈ చెట్టు సైతాను".

"ఈ చెట్టు దేవత".

"సైతానుని దేవునిగా పరిగణించే వాడు మూర్ఖుడు".

"దేవుణ్ని సైతానుగా చూసే వాళ్లు పాపులు. అటువంటి వాళ్ల మనస్సులో

పాపబుద్ధి, హృదయంలో హింసా భావం ఉంటాయి. అందువల్ల వాళ్లు తెలుపును నలుపు గానూ, వెలుగును చీకటిగానూ చూస్తారు".

అంటే ప్రపంచంలో చీకటి లేదంటారా? నలుపు అనేది లేదంటారా?"

"లేదు".

"అదెలా సంభవం?" ఆమె చేతిలోంచి గొడ్డలి క్రింద పడిపోయింది. ఆలోచించడం మొదలు పెట్టింది ఆమె.

చెట్టు సంతసించింది. 'చూడగా ఆమె గొడ్డలీ, అతను క్రరా రెండూ అవతలికి పారేశారు. ఇదెప్పుడు జరుగుతుంది? అని ఆలోచించి తూర్పు కిటికిలోని ఆవిడ ముఖం ఎత్తి చెట్టు ఆకులు అల్లల్లాడడం వాటి సొగసూ అంతా తేరిపార చూసింది. తర్వాత గొణుకుకుంటూ ఇలా అంది: "అంతా వెలుగు, అంతా అందం- ఏ మాత్రం నలుపూ, ఎక్కడా చీకటీ లేవు- ఇది ఎప్పుడు ఎలా జరుగుతుంది?"

"నీ లోపలే వెలుగు మేలు కోవాలి"

"ఈ వెలుగు ఏమిటి?"

"ప్రేమ"

ఆ స్త్రీ కనురెప్పలు కంపించాయి. దీర్ఘ నిశ్వాసం విడిచింది; గొంతుకలో కరుణ ప్రతిధ్వనిస్తోంది.

"నాలో ఈ ప్రేమ మేలుకోదా?"

"అభ్యాసం చేయాలి, చర్చించాలి". ఆ పురుషుడు

చక్కగా నవ్వుతూ అన్నాడు: "ప్రేమించడం నేర్చుకోవాలి".

"అయితే నువ్వు నాకు నేర్పు".

చెట్టు కళ్లు మూసుకుంది. దానికి నిద్ర వస్తోంది. చెట్లు కూడా నిద్రపోతాయి. ఎన్నో రాత్రులు బెంగమూలాన ఈ చెట్టు నిద్ర పోలేదు. అయినా ప్రయత్నించి క్రిందకు చూడలేదు. మానవుడు చెట్టు గురించి ఎటువంటి ఉదాసీన భావంతో ఉంటాడో, అలాగే అప్పుడప్పుడు చెట్టు కూడా మానవుని గురించి ఉదాసీనత వహిస్తుంది - మాటలలో చెప్పలేకపోయినా.

---

('అమృత్', మే 1970)

# ప్రాణపిపాస

సమరేశ్ బసూ

ఒక కల్లోల మయమైన వాతావరణంతో కూడుకున్న కృష్ణపక్షపు కాళరాత్రి నాటి కథ చెపుతున్నాను.

కల్లోల మయమైన వాతావరణం అంటే - హఠాత్తుగా మేఘాలు కమ్మి, ఉరుములు మ్రోగి, మెరుపులు మెరిసి కుంభపాతంలో ఒకటి రెండు దుక్కుల వర్షం పడినట్లు కాదు. అదే వరసగా ఒక జబ్బు పడిన వాడి గొంతుకులోంచి వచ్చే ఏడుపు లాగ, ఎడతెగని ధారాపాతం, దానికి సాయం తూర్పు వైపు నుంచి అతి వేగమైన తుఫాను గాలి. నగరంలోని మెయిను రోడ్డు తప్పిస్తే మిగతా అన్ని సందుల్లోని గొందుల్లోని రోడ్లూ పూర్తిగా అడుసుమయం అయిపోయాయి. అంతా కుళ్లు కంపూ, మైల పోగులూ. ఇంటి మీద ఇల్లు కట్టినట్లు ఆ లెక్కలేని నివాసాలలో జనసమ్మర్దం, గొడవా, తొడ తొక్కుడూ.

రైల్వే లైను ప్రక్కన వున్న మైదానపు మార్గం ద్వారా నడుస్తున్నాను. అయినా ఆ తడిలో శరీరపు వేడి ఏమీ పనిచేయలేదు. మైదానం పై నుంచి గాలి వీస్తూ తిన్నగా శరీరాన్ని వణికింపజేస్తోంది. తప్పని సరిగా పళ్లు చలికి వణకడం మూలాన కొట్టుకుంటున్నాయి. మార్గాంతరం లేక ఎడమవైపు తిరిగి నగర మధ్యానికి వచ్చి పడ్డాను. ఆఖరికి కాస్త వాయువేగం తక్కువనిపించింది.

జూట్ మిల్లు నగరంలో ఒక విధమైన నిస్తబ్ధత వచ్చి పడింది. ఎప్పుడూ జరిగే పనులూ, హడావుడీ అంతా ఈ ఎడతెగకుండా కురుస్తున్న వర్షానికి తడిసి ముద్ద అయిపోయిన గోను సంచిలా తయారయింది. వీథి కుక్కలు మామూలుగా మిగతా రోజుల్లో మంచి తాపంతో కూడుకుని 'భౌభౌ' మని మొరుగుతాయి. ఈవేళ చెట్లన్నిటి నుంచీ ఊరికే నీటి చుక్కలు పడడం వల్ల కలిగే గరగర చప్పుదే ఒంటిమీద తోస్తోంది. గృహస్థులు ఎక్కడా బైటకు కనిపించడమే లేదు. ఎక్కడా కిటికీ లోంచి కాని ద్వార బంధంలోంచి కానీ ఏమీ వెలుగు కనిపించడం లేదు. వీథి దీపాలు మటుకు ఏదో ఏకాక్షి మృగం లాగ ఒక్క కన్నుతో చూస్తున్నట్లు వెలుగుతున్నాయి కాని, అవి ఈ వర్షావృతమైన అంధకారంలో ఏమీ పెద్ద కాంతిని ఇవ్వడం లేదు.

త్రోవ నిక్కచ్చిగా సుఖకరంగా లేదు కాని, ఉత్తర దిక్కుగా వెళ్లినట్లయితే త్రోవ తెలుసుకోగలిగాను. రోడ్డుకి ఒక ప్రక్కగా నడుస్తున్నాను. పల్లపు రోడ్డు మూలాన నీళ్లు నిలవయి పోయాయి. ఏదైనా వరండా పైకి వెళ్లి రాత్రి అక్కడ గడుపుదామంటే ఎక్కడా అస్కారం కనుపించడంలేదు. కారణం ఏమిటంటే ఎక్కడా కూడా సరియైన వరండా అనేది దృగ్గోచరం కాకపోవడమే కాకుండా, ఈ

నగరపు పరిస్థితి చూస్తూ ఉంటే అసలు ఇంటి లోపల ఎక్కడా పొడి స్థలం లేదనిపిస్తోంది. అదీ కాక, ఇటువంటి పరిస్థితి నాకేమి కొత్త కాదు. కనుపించిన వరండాలో జనం కబుర్లు చెప్పుకుంటూ కిక్కిరిసి ఉన్నారు. వాళ్లకి పోలీసు వాళ్లు వచ్చి ఏమైనా తిడతారేమో అన్న భయం ఉండనే ఉంది.

నైహాటి రైల్వే కాలనీలో ఒక స్నేహితుని ఇంటికి వెళ్లవలసి ఉంది. ఆఖరికి కొన్నాళ్లకి ఆహారం, ఒంటిమీదకు పొడిబట్టా, ఇటువంటి విపరీతమైన శీతరాత్రి నుంచి తప్పించుకునేందుకు ఆశ్రయమూ లభిస్తాయి. కాని ఇప్పటి పరిస్థితి చూస్తే తాత్కాలికపు ఆశ్రయం వదిలి బైటకు వెళ్లడమే మంచిది కాదనిపిస్తోంది. అయినా వేరే ప్రత్యేకపు ఉపాయం లేదు. - ఏమంటే నేను ఉండే ఇంట్లో కొన్నాళ్ల క్రితం ఒక హతభాగ్యుడైన మిత్రుడు మరణించాడు; అందు మూలాన కాస్త స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకునేందుకు బైటకు పడిపోవాలని పించింది. స్నేహితుడు చావడం ఒక విధంగా మంచిదే అయింది. ఆ మాట తప్పిస్తే ఇంక వేరే విధంగా ఏం జరగవలసి ఉందో, నా కేమీ అర్థం చేసుకునే శక్తి లేదు. రక్షించేందుకు ఏమైనా అవసరం ఇంక లేకపోయినప్పటికీ, నా హృదయంలో...

పోనీయండి. అదేమీ పెద్ద విషయం కాదు. కాగా, అతను నాకు ఒక వస్తువు అందించాడు. అది చిన్న వస్తువే అయినా, నా మీద ఒక పర్వతం పెట్టినంత బరువు అనిపిస్తోంది... చాలా బరువైపోయింది.

అరే బాబోయ్, ఈ చలిగాలి నా వెన్నెముక లోకి పాతుకుపోయినట్లు తగులుతోంది. వాన నీరు కూడా అంతటా వ్యాపించింది. ఇంతట్లో మేఘ గర్జన కూడా వినిపించింది. ఈసారి పళ్లే కాదు, మొత్తానికి నా ఎముకలు కూడా చలికి వణికిపోతున్నాయి. మోడైపోయిన చెట్టు కొమ్మలా ఒక్కసారి తడిసి ముద్ద అయిపోయాను. ఒక నాలుగు రోడ్ల మూలకు వచ్చి పడ్డాను - జూటు మిల్లు వాళ్ల సరుకు ఎగుమతి చేసే రైల్ సైడింగ్స్ ప్రక్కగా. అక్కడ స్థలం కాస్త ఖాళీ గా ఉంది. ఒక రేకు షెడ్డు కనిపించేసరికి అందులో దూరుదామా అని ఆలోచిస్తూ ఉండగా హఠాత్తుగా ఒక కేక వినిపించింది. అదే - అదే ప్రక్కనుంచి.

కాదు, కాదు. భూతాల్లో నమ్మకం లేని వాడినైనా, ఒక్కసారిగా భయపడి ఉలిక్కిపడ్డాను. నన్నే పిలవలేదు కదా! నీటి ప్రవాహం చీల్చుకుని ఆ గొంతుక యజమానిని వెతకడం మొదలుపెట్టాను. కుడివైపు నుంచి ఒక మిటమిట వెలుగు అలికిడి కంటి ముందు పడింది; అటుపైన ఒక సగం తెరిచిన వీధితలుపు మధ్య ఒక వ్యక్తి. అవును, ఒక స్త్రీ మూర్తి. ఆ పిలుపు నన్ను కాదేమో! ముందుకు వెళ్లాను. మళ్లీ: "ఏమండోయ్, రారా?"

నిలబడిపోయాను. అడిగాను, 'నన్నా?' జవాబు వచ్చింది, 'నువ్వు తప్పితే

ఎవరున్నారు త్రోవలో?'

మాట రీతి గమనించి చకితుడనాయ్యను ఓ! ఇంతకాలం తడిసి త్రోవ ఖరాబుగా ఉంది. నిక్కచ్చిగా వేశ్య వాటిక కాదు; చుట్టు ప్రక్కల ఇళ్లంతా కార్మికులవిలా ఉన్నాయి.

నాలో నేను నవ్వు కున్నాను: బలే కాతాదారుణ్ని పిలిచిందే పిల్ల! అలా అనుకోలేదా ఆమె కూడా? కాని ఈ మాట నిజం, ఇప్పుడు ఎక్కడైనా వెళ్లి నిలబడాలంటే ఆమె గుమ్మంలోకే వెళ్లాలి. అయినా, నేను వెళ్లక పోవడం చూసి, ఆ అమ్మాయి ఇలా అంది, 'ఏం బాబూ? ఒక కన్ను కనుపించదా!"

మనసులోనే నవ్వుకుంటూ అనుకున్నాను, వెళితే వెళతాను. నా వ్యవహారం చూస్తే నన్ను ఎలాగైనా వెళ్లిపొమ్మంటుంది. ఇంకా కాస్త ఈ వర్షం తీవ్రత తగ్గేంతవరకూ ఏదైనా నెత్తిమీద కాస్త ఆశ్రయం దొరికితే, దాన్ని వినియోగించు కోవడంలో తప్పేమిటి? ఇక్కడి నుంచి నేను వెళ్లవలసిన నైహాటి గ్రామం చాలా దూరం. రేకు షెడ్డు దగ్గరగా చేరడానికి వీలుగా లేదు. సరే, బ్రతికుంటే బలుసాకైనా తినవచ్చు - ఈ లోకోక్తిలో నమ్మకం ఉన్న వాళ్లకి ఇటువంటి పరిస్థితి ఎదుర్కోవలసి ఉండదేమో?

వచ్చి కూర్చున్నాను ఆ అమ్మాయి గుమ్మం దగ్గర. ఏదో గతానుగతికంగా సంకోచం సూచించ కుండానే అడిగాను, 'ఎందుకు పిలిచావు'.

'ఎంత బైతు మనిషివయ్యా బాబూ!' - నవ్వుతో పాటు చిరాకు కూడా చూపిస్తూ అంది ఆమె, "లోపలికి రావా?"

నేను లోపలికి వెళ్లగానే ఆమె తలుపు మూసేసింది. బైట వర్షపు చప్పుడు కొద్దిగా లోపలికి వినిపిస్తోంది. లోపలికి గాలి వీస్తుందన్న భయం లేదు. కాని చూస్తే, ఈ ఇంటిలో పై కప్పు చిల్లులలోంచి నీరు కారి అంతా తడిగానే ఉంది. మంచం మీద పరుపు మటుకు తడవలేదు. ఇంట్లో ఏవే రెండు మూడు మామూలు వస్తువులు పళ్లెరం, గ్లాసు, చెంబు వంటివి మాత్రం ఉన్నాయి.

'ఇలాగ ఎక్కడనుంచి వచ్చి చచ్చిపోదలచుకున్నావు ఈ వర్షంలో?" నన్ను ఎంతో కాలం నుంచి తెలిసి ఉన్నట్లు ఇలా చనువుగా మాట్లాడింది ఆమె.

అన్నాను - 'చాలా దూరం నుంచి వచ్చాను కాని..'

'తెలిసిందిలే' -నేరు నొక్కుకుంటూ నవ్వింది ఆమె: 'నువ్వు ఇల్లంతా మురికి చేసేస్తున్నావు. ఈ బట్టలన్నీ పీకి పారెయ్యి త్వరగా.

ఈ చలిలో హఠాత్తుగా ఒక చిక్కు పరిస్థితిలో చిక్కుకున్నట్లనిపించింది నాకు అన్నాను - 'కానీ, ఈ వైపు....

ఆమె అంది. "నా దగ్గిరేమైనా పాత గుడ్డ పీలికైనా లేదు కదా! ఆ తడిసిపోయిన

చొక్కా విప్పి పారెయ్యవా?'

విప్పి పారేస్తే మంచిదే కాని ... గొంతుక పెద్ద చేసి అరిచాను, 'వృథాగా పిలిచావు, నా జేబు ఖాళీ'.

ఈసారి అమ్మాయి చకితురాలయింది. ఏమనుకుందో ఆమె. నోరు తెరచుకుని నా ముఖం కేసి చూస్తూ అలా ఉండిపోయింది కొన్ని క్షణాలు. ఏమీ నమ్మలేక పోయింది. అడిగింది, 'ఏమీ లేదా?'

ఆమె ఆశలన్నీ కూలిపోయినట్లు, ఆమె ముఖ కవళిక గోచరిస్తోంది.

అన్నాను, 'అందుచేతనే కదా దురదృష్టంగా త్రోవమ్మట ఇటూ అటూ తిరిగాను?'

అసహాయురాలిలా ఊరుకుంది అమ్మాయి. ఈ సంగతి నేను ముందరే గ్రహించుకున్నాను. అయినప్పటికీ ఆ పిల్ల ఈ వ్యాపారం చేస్తూ ఉంది ఇక్కడ, అంతేకాని, ముష్టెత్తుకుంటూ కూర్చోవడం లేదు కదా! నేను తలుపు తెరుచుకుని వెళ్లబోయాను.

వెనక నించి అడిగింది, ఎక్కడికి వెళతావు ఇప్పుడు

అన్నాను. అదే రేకు షెడ్డులోకి. తలుపు తెరిచేశాను. ఉన్! గాలి నన్ను నోరు తెరిచి మింగబోతోంది కాలు బైట పెట్టాను.

మళ్లీ అకస్మాత్తుగా వెనకి నించి పిలిచింది అమ్మాయి. "ఏమయ్యోయ్, విను. ఈ రాత్రి ఉండి వెళ్లమని అన్నాను'. కొంచెం ఊపిరి విడిచి అంది . 'నాకు తల నొప్పిగా ఉంది'.

అన్నాను, 'ఏం, నీ తల బాగానే ఉంటుందిలే, నేను షెడ్డులోకి పోతా!

'వెళ్లు నీ ఇష్టం' నిరాశతో కూర్చుండి పోయింది ఆమె మంచం మీద. ఈ వేళ ఇంక ఆశ లేదు.

నేననుకున్నా 'పోయిందేముంది? ఈ దుర్భర వాతావరణంలో ఆశ్రయం'.

అయినా ఒక ఆడపిల్లతో రాత్రి గడపడమంటే మనసు చాలా గాభరా పడుతోంది. ఏమంటే, ఇటువంటి అనుభవం నా జీవితంలో మొదటిసారి ఇది నిజానికి మీ లాంటి మరో పదిమంది కంటె నాకు స్త్రీ సంపర్కం విషయమై ఉత్సుకతా, కుతూహలం ఉన్నాయనుకోండి. అంటే ఇటువంటి పరిస్థితిలోనా? ఛీఛీ! ఆమెను ఈ విధంగా ఉపయోగించుకోలేను... అయితే ఆమె ప్రక్కలో పడుకోకుండానే రాత్రి ఇక్కడ గడపాలి. లోపలికి ప్రవేశించి మళ్లీ తలుపు మూసేశాను.

చాలా పొడుగైన పిల్ల. నిగనిగలాడే శరీర ఛాయ. కళ్లు రెండూ లోతుగా ఉన్నాయి. చారడేసి ఆ కళ్లు ఎడతెగకుండా లేత పచ్చగడ్డి మేస్తున్న ఆవు కళ్లల్లా

ఉన్నాయి. వాటికి కాటుక పెట్టడం మూలాన ముఖవర్చస్సు మరింత తళతళలాడుతోంది. బుగ్గలు రెండింటిలోనూ చిన్న గుంటలు. తుట్ట పెదవుల పైన ముక్కు ఆకాశం పైకి చూస్తున్నట్లు పొడుగ్గా ఉంది. వెతికి వెతికి నాకు ఒక పాత గౌను ఇవ్వగలిగింది. అంది, 'ఇది తప్పించి నా దగ్గర పొడిబట్ట ఇంకేమీ లేదు'.

గౌను! నాకు నవ్వొచ్చింది. "పోనీ ఎవ్వరూ చూసేందుకు రారు కదా! అయినా..

నా గుండెలో ఒక్కసారి తళుక్కుమన్నట్లయింది. కంగారుగా నా జేబు నొక్కి చూశాను. చనిపోయేటప్పుడు నా స్నేహితుడు ఏ చిన్న వస్తువైతే నా మీద కొండంత బరువులా మోపాడో అదే చూడగలిగాను. వస్తువంటే వస్తువు కాదు, ఒక రక్తపు ముద్ద, అవును, రక్తపు ముద్దే. నా మనసులో ఒక భయంకరమైన సందేహం బయలు దేరింది. తీక్షణ దృష్టితో అమ్మాయి కేసీ చూశాను. ఆమె వెనక్కి తిరిగి లాల్చీ లోపల జేబు వెతుకుతోంది. నేను అన్నాను, 'కానీ నా దగ్గర ఒక్క పైసా కూడా లేదు, నిజమే!

'ఎన్ని మాట్లు వినిపిస్తావు బాబూ, అదే మాట?'అని వైరాగ్య భావంతో అంది ఆమె.

"అవునమ్మా!" - అన్నాను, 'చెప్పి ఉంచడం మంచిది కదా! అంటే నా కేమీ కోరిక లేదు. ఊరికే ఒక యాత్రికుడి లాగ రాత్రి గడపాలి!

తన ఆవు కళ్లల్లాంటి కళ్ళు ఎత్తి నా కేసి చూసింది. ఆ పిల్ల. అంది, "ఎవరు నీ బుర్ర కిటువంటి బుద్ధి నేర్పారు!"

అది సరే. నేను గౌను తీసుకున్నాను. కాని ఖాళీగా ఉన్న శరీరం వణకడం మొదలు పెట్టింది. బైట వర్షం, గాలి శబ్దం తలుపులోంచి ఆందోళన పరుస్తూ వినిపిస్తూనే ఉంది.

అమ్మాయి నా వైపు చూస్తూ, ముఖాన్ని గుడ్డతో వత్తి, కొద్దిగా చిరునవ్వు నవ్వి, ఒక పాత చీర విసిరింది, నా చేతుల్లోకి. 'తీసుకో, వళ్ళు కప్పుకుని పడుక్కో'

నా లాల్చీ, పంచా త్రాడుపై వ్రేళ్లాడేస్తానంది: 'కొద్దిగా వీటిని ఆరనీయి!

శరీరానికి విశ్రాంతి ఇవ్వడం అనేదుందే, అది ప్రాణం తీస్తుంది. ముఖ్యంగా ఇటువంటి క్లిష్ట పరిస్థితిలో. బహుశా నేను ఒక బజారు రకం ఆడపిల్ల ఇంటికి వచ్చానన్నమాట కూడా మరచిపోయాను. అన్నాను, 'నా పొట్ట రెండు రోజుల్నించి ఖాళీగా ఉంది. అందుచేత ఈ వర్షపు ధాటికి తట్టుకోలేకపోయాను?

ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు. మోకాళ్ల మధ్య తల పెట్టి కూర్చుంది, అన్నాను, 'సరే ఇంక పడుకోవాలి!'

ఆమె తల ఆడించింది. స్పష్టంగా కనిపిస్తున్న ఆమె గుండె ప్రక్క ఎముకలు ఊపిరి పీల్చడంలో పైకి తేలాయి. అంది - 'తింటావా? అన్నం- పచ్చడీ

ఉన్నాయి.

'అన్నం పచ్చడీ? నిజమే, ఇదంతా ఒక్కసారిగా అనుకున్న దానికంటె అనాలోచితంగా ఎక్కువగా సిద్ధమవుతుంది. ఎవడి పొట్టయితే కేవలం అన్నం వాసన వల్ల సగం నిండేలా ఉందో, వాడి ముందర అన్నం సిద్ధమయింది! నోరూరడం మొదలయింది, ఇంక పొట్ట వేరేగా నింపుకుంటే ప్రాణం నిలుస్తుంది. అన్నం మాట వినేసరికి పొట్టలో కదలిక బయలుదేరింది. కాని....

ఆమె వెంటనే ఒక ఎనామెల్ పళ్లెంలో అన్నం పెట్టడం ప్రారంభించింది. చూడగా నా మనస్సులో సంశయం పెరిగింది. హడావుడిగా త్రాడు పై నుంచి నా లాల్చీ లాగుకున్నాను. వ్యవహారం అంతా చూస్తూంటే ఏమీ బాగుండలేదు. బెంగగా అన్నాను, "ఆహారానికి సొమ్ము ఇచ్చేందుకు నా దగ్గర ఏమీ లేదు".

ఆవు కళ్లల్లాంటి కళ్లు ఈసారి చాలా విరక్తిని ప్రదర్శించాయి. అంది, "ఆ రేకు షెడ్డే నీకు స్వస్థానం! ఎన్ని సార్లంటావూ ఈ మాట?

సుఖం కంటె సంతృప్తి మెరుగు. దురదృష్టంగా చనిపోయే సమయంలో ఇటువంటి సంగతి వచ్చి పడింది; ఈ బరువు నెత్తి మీద పెట్టుకుని వెళ్లడమా! పుచ్చుకున్నా విషమే, విడిచి పెట్టినా విషమే! బైటపడితే ఈ మనస్సు బరువు మాట ఉండదు కదా!

ఆమె మళ్లీ అంది, 'నువ్వు ఎప్పుడూ ఎవరితోనూ కలిసి మెలిసి జీవితం గడపలేదా?'

వినండి ఈ మాట! ఇలా అడిగినది కార్ఖానా ప్రక్కన శరీరం అమ్ముకుంటున్న ఆడపిల్ల! అన్నాను, 'గడిపాను. అయితే నీ వంటి మనిషితో మటుకు కాదు!'

ఆమె మౌనంగా చూస్తూ ఉండిపోయింది నా కేసి, కొంత సేపు. తరువాత అంది, "ఎక్కడ ఉన్నా సరే, భోజనం చెయ్యి, లేకపోతే చాలా బాధపడతావు". ఆలోచించాక తింటే ఏం విపత్తు కలుగుతుంది? అందులోనూ డబ్బు ఖర్చులేని భోజనం. ఇంకేమిటి చూడవలసింది? లాల్చీ చేతులు పైకి ముడిచి గుటకలు వేస్తూ అన్నం తిన్నాను. తరువాత ఒక చెంబుడు నీళ్లు త్రాగాను. ఇటువంటి వరి అన్నం తినేసరికి నాకు వ్యవహారం అంతా ఒక పోకిరీ విలాసకారుడి పనిలా తోచింది; అందుమూలాన నా మనసుకి అన్ని వైపులా ఒక సందేహం చుట్టుముట్టుకుంది.

తర్వాత నిద్రపోవడం. అది ఒక చిక్కు సమస్య. నేను పడుకుని అడిగాను, 'నువ్వెక్కడ పడుకుంటావు'? ఆమె జవాబు చెప్పకుండా నా కేసి చూస్తూ మేలిముసుగు సడలించింది. కొంతసేపు పోయాక అంది: "నేను కూర్చుంటాను".

ప్రక్కగా ఉన్న నేలపై కూర్చుని మళ్లీ అంది, "నువ్వు నిద్రపో, నేను రోజూ నిద్రపోతూనే ఉన్నాను ఒక్క రాత్రికి ఫరవాలేదు. ఏదో కాలక్షేపం అయిపోతుంది!"

మాట్లాడుతూ మాట్లాడుతూ నా గుప్పిట్లో ఉన్న లాల్చీని చూసి వ్రేళ్లాడేసే త్రాడు కేసి చూసింది. ఆ తర్వాత నా వైపు. నేనూ చూశాను. అంది, 'లాల్చీ తడిగా ఉంది కదా!'

"అయితే నీకేమి?" అన్నాను

ఆమె మాట్లాడకుండా వెళ్లిపోయింది. నా శరీరం విశ్రాంతి పొందేసరికి నరనరాలలో ఉన్న స్వాభావిక మైన సత్తా ఉత్సాహాన్ని ఉష్ణతనూ పొందింది. ఇంతవరకూ బైట పడుతున్న వర్షపు గొడవ నన్నెంతగా బాధించిందో ఇప్పుడు అది నాకు జోల పాట పాడుతున్నట్లుగా అనిపించింది. కంటి రెప్పలు బరువెక్కాయి. ఆమె వైపు చూశాను. అలాగే కూర్చుని ఉంది. ఆమె కంటి చూపు ఏ ఒక్క వస్తువు పైనా కేంద్రీకరించబడలేదు. ఆమె కంటిలో ఏదో ఒక అలసటా, ఒక అణచిపెట్టిన ఆవేదనా గోచరమవుతున్నాయి. ఎవరు చెప్పగలరు? వాటిలో ఏ విధమైన అభావం గుప్తపరచ బడి ఉందో! వీలైతే నిద్ర పోవచ్చు - కాదు, ఈ దురదృష్టపు మిత్రుని వ్యవహారం కిలకం రేపు కనుక్కోవచ్చులే. చనిపోయే ముందు అతను నాకిది ఇవ్వవలసిన పనేం వచ్చింది? ఒక రక్తపు ముద్ద. ఒక రక్తపు ముద్దే కదా! చెమట కంపు కొడుతున్న ఒక చిరుగు గుడ్డల మూట. ఒక దారుణమైన అకలి వాసనతో కూడుకున్నది. చనిపోతూ చనిపోతూ, రక్తం కక్కుకుంటూ, ఈ మూట తీసి ఇచ్చాడు. "ఇది నీ దగ్గర ఉంచు" అన్నాడు.

ఎటువంటి విధంగా ఆ మాట అన్నాడో అది ఈనాటికీ నా గుండెలో నాటుకుని ఉంది - పోనీ ఆ మాట-

ఆ అమ్మాయి అల్లాగే కూర్చుండిపోవడం చూసి హఠాత్తుగా ఇలా అరిచాను - 'నువ్వు కూడా కొంచెం ఎడంగా ఇక్కడే పడుకోకూడదా కాసేపు?'

ఆమె కాసేపు నా ముఖం కేసి చూస్తూ ఉండిపోయింది. అంది, 'చాలా వింత మనిషివిరా బాబు!'

తర్వాత నిద్రపోయాం.

నా శరీరం అప్పుడు తగిన విశ్రాంతి పొంది తేలికగా ఉంది. అయితే దూరంగా పడుకుని ఉన్న ఆ అమ్మాయి శరీరపు వేడి నాకు అనుభూతమవుతోనే ఉంది. ఎంత అద్భుతమైన రాత్రి! ఎంత విచిత్రమైన సన్నివేశం! ఎవరైనా చూస్తే ఏమంటారు? ఛీ, ఛీ! కానీ ఇంత విశ్రాంతి, నా అలసిన శరీరానికి ఇంత సౌఖ్యం. మరెక్కడా నాకు కలుగుతుంది అనిపించలేదు. కళ్లల్లో నిద్ర ముంచుకు వస్తోంది- కాని...

కాదు, అల్లా జరగదు. ఆ స్నేహితుడి మాటే చెపుతున్నాను. చనిపోయే ముందు ఒక మూట ఇస్తూ అన్నాడు ఆ హతభాగ్యుడు. "నా రక్తం"

నేను అన్నాను, "ఎవరి రక్తం?"

కళ్లల్లో నీళ్లూ, దవడపై రక్తం తుడుచుకుంటూ అన్నాడు: " నా గుండె తాలూకు రక్తం రోజూ అన్నం తినకపోవడం మూలాన..."

మాట్లాడుతూ మాట్లాడుతూండగా రక్త శూన్యమైన అతని వ్రేళ్లు వణకుతూండడం మూలాన ఆ మూట చేతి లోంచి జారిపోతుంది.

నేను కోపాన్ని తట్టుకోలేక పోయాను. "ఎవరి కోసం రా?"

అన్నాడు, "ఇల్లు కట్టే నిమిత్తం"

వాడల్లా మాట్లాడుతుంటే నేను తిట్టబోయిన తిట్లు నా గొంతుకలో అడ్డు పడిపోయాయి...

సరే ఆ మాట పోనీయ్యండి...

ఇంతలో ఆ అమ్మాయి ఒక దుఃఖకరమైన శబ్దం చేసింది.

అడిగాను, "ఏమయింది"?

ఆమె తేరిపార చూసింది. రెండు కళ్లూ ఏడుపును సూచిస్తూ ఎర్రబడ్డాయి. అంది, 'ఏమి లేదు'.

ఆమె వేడి నిట్టూర్పు నా శరీరానికి ఎంతో హాయిని కలిగించింది. తడి లాల్చిలోంచి కూడా అది నా శరీరానికి ఒక విధమైన ఉష్ణతను కలగజేసింది. ఒక్క మాటుగా అనిపించింది వ్యవహారం ఏమంత చెడ్డగా లేదని. పెదవులూ, ముక్కు ఏదో కొద్దిగా మురికిగా ఉన్నాయి. మూసుకుపోయిన కళ్లరెప్పలూ, గుండెపై చాపుకున్న రెండు చేతులూ, ఆమె గుండై ఒక విచిత్రమైన రూపకల్పన చేశాయి. ఆమె అడిగింది. 'నిద్ర రావడం లేదా ఏమిటి?"

'నేను నిద్రపోను' - అన్నాను. లోలోపల అనుకున్నాను, 'అల్లాగయితే నీకేం పెద్ద సుఖం కలగదు రా బాబూ... మాటలు మాట్లాడుతూంటే మనసులో సందేహాలు పెరిగిపోతున్నాయి. అంతకంటె మాట్లాడకుండా ఉండలేనా?'

బైట వర్షం ప్రళయ తాండవం ఇంకా విజృంభిస్తూనే ఉంది. పై కప్పు నుంచి కారుతున్న వర్షపు చుక్కల చప్పుడూ, చుంచుల కీచుకీచుల చప్పుడూ కలుస్తున్నాయి.

ఆమె మళ్లీ మూలుగు మొదలెట్టింది.

ఏమయింది?

కొంచెం సేపు ఊరుకున్నాక అంది, 'రోగం'.

'రోగం'? ఎవరికి రోగం?"

ఆమె మాట్లాడలేదు.

'చెప్పవా బాబూ?!

అయినా నిరుత్తరగానే ఉండిపోయింది.

నేను అకస్మాత్తుగా విసుక్కుంటూ గట్టిగా అడిగాను - 'రోగం ఎవరికి చెప్పు! క్షయ కాని, కలరా - గిలరా కాని ఏదైనా ఉంటే వెంటనే పోగొట్టుకోవాలి. రోగితో ప్రేమకలాపం జరిపించకూడదు బాబూ!'

ఆమె హఠాత్తుగా ముఖం తిడుతున్నట్లు పెట్టి అరిచింది: "ఎవరితోనయ్యా నీ ప్రేమ కలాపం?"

ఓహో, అల్లాగయితే ఇప్పుడు ప్రేమ కలాపం ఏమీ జరగబోదన్న మాట. అన్నాను, 'అయినా, రోగం ఏమిటో చెప్పవా?"

"ఈ వృత్తిలో ఉండేదే", అంది ఆమె.

'ఈ వృత్తిలోదా'? కొంప మునిగింది! భయ కంపితుణ్ణయిపోయాను. భీతితోనూ, అసహ్యభావంతోనూ అడిగాను - 'ఇటుపైన రాత్రంతా....?

'నిజమే. ఇది నా వ్యాపారమే'- అంది ఆమె.

ఛా, ఎంత దారుణం అన్నాను, 'చికిత్స చేయించుకోవేం?'

'డబ్బెక్కడి నుంచి వస్తుంది?'

'ఏం, నువ్వు రోజూ సంపాదించేది చాలదా?"

'ఆ డబ్బు నా యజమానికి వెళ్ళిపోతుంది'

యజమాని? ఇదేం చాకిరీ రా బాబూ?

లేకపోతే ఏమిటి? ఒక యజమాని క్రింద కూలిపని, ఇంట్లో సామగ్రి లాంటి వస్తువు. నాకు చాలా జుగుప్స కలిగింది. మాట విని ఉక్కిరిబిక్కిరి అయిపోయాను. ఇదే మంత సరదాగా జరగేలా లేదు. ఏమిటి ఈ చాకిరి? అన్నాను, 'ఈ వెధవ యజమాని ఎల్లాంటి వాడు, చికిత్స చేయించలేని వాడు?"

అది ఎక్కడి మాట? యాంత్రిక జీవం గడిపే వాళ్లకి రాత్రీ, పగలూ యంత్రంలా పనిచేయవలసిందే కాని, వాళ్లకి ఆ యంత్రపు యజమానులు చికిత్స చేయిస్తారా?

అవును. ఆమె వేదనా పూరితమైన నైరాశ్యపు కంటి చూపు ఇప్పుడు నన్ను పూర్తిగా కలవర పరచింది. యుద్ధ రంగంలో అయితే మానవుడు తన ప్రాణాన్ని త్యాగం చేస్తాడు: కాని ఇదేం జీవన సంగ్రామం! అన్నాను, 'అయితే..! ఆమె అంది, 'అయితే ఇంకేముంది? ఎవరైతే యజమాని కళ్లల్లో దుమ్ముకొట్టి రోజూ గడపగలుగుతారో, వాళ్లు చికిత్స చేయించుకోగలరు'.

సరే, బతికిపోయాం! -నవ్వుతూ, నవ్వుతూ వికృత రూపం దాల్చింది నా ముఖం.

'అంతా రక్షించుకుంటూ పోవాలి' అంది ఆమె బాధతో పెదవులు నొక్కుకుంటూ.

నిజమే. చుట్టుప్రక్కల పులి తిరుగుతూందని తెలుసు కున్నాక ఆలోచించక మానవుడు తన వాకిలీ ఊరూ విడిచిపోతాడు. వరదా, తుఫాను, ఆకలి ఏమైనా

సరే! మరి ఆ దౌర్భాగ్యుడు ఇల్లు కట్టుకుందా మనుకున్నాడు. అవును, వాడిచ్చిన పొట్లంలోని ప్రతి పైసా ఒక రక్త బిందువు. ఒక రక్తపు ముద్ద అదే ఆ పొట్లం.

ఆమె అంది - 'నిద్రపోవా?'

కళ్లల్లో నిద్రలేదు. ఆమె నిట్టూర్పు విడిచింది. ఆవేదనతో కూడుకున్న వేడి నిట్టూర్పు. తీయని బాధ. మండుతున్న నిప్పులా మనస్సు తయారయింది.

గట్టిగా చొక్కాలేంచి పొట్లం పూర్తిగా లాగి పట్టుకున్నాను. బైట వర్షపు జోరు ఇంకా అలాగే ఉంది. రాత్రి చాలా మటుకు గడిచి పోయింది. నా లాల్చీ, పంచా తీసుకున్నాను.

ఆమె లేచింది. నవ్వుతూ అడిగింది: 'వెళుతున్నావా?' జేబులో చెయ్యి పెట్టి గట్టిగా పొట్లం లాగి పట్టుకుని అన్నాను, 'అవును'.

నా దౌర్భాగ్యపు స్నేహితుడు చెక్కిళ్లపై నుంచి తన రక్తపు కన్నీళ్లు తుడచుకుంటూ చనిపోతూ చనిపోతూ అన్నాడు, "ఇది నువ్వు అట్టే పెట్టుకో". ఎందుకు? ఎందుకు?

బాధతో బరువైన గొంతుతో అంది అమ్మాయి: "మళ్లీ ఇంకోసారి రా".

ఏమి ఆమె కళ్లు! ముఖం అంతా మచ్చలూ, మరకలూ. ఆకర్షణీయ మైనది కాదు. తుట్ట పెదవులు కాని ఇటువంటి ముఖాన్ని నే నింకెక్కడా చూడలేదు.

దారుణమైన వేగంతో ఆమె వైపు తిరిగి ఆ పొట్లం ఆమె చేతిలో పడేశాను. నా శరీరంపై ఆమె నిట్టూర్పు గాలి తగిలింది. ఒక్క సెకను కళ్లు క్రిందకు దించి నాలోని అశాంతతనూ, క్రోధాన్నీ వెనుక నుంచి అణిచి పెట్టి ఉంచాను - పళ్ల మధ్య. గాలిలో సమసిపోయింది ఆ మాట. అన్నాను, 'వెనక్కి పిలవకు'.

బరువు దించుకున్న నేను ఉత్తర దిక్కుగా ముందుకు సాగిపోయాను. వాన ప్రస్థాన్ని స్వీకరించేందుకు కాదు. స్నేహితుడి ఇంటి నుంచి తూర్పు గాలిని తప్పించుకుంటూ పశ్చిమ గంగ రేవు వైపు వెళదామనుకున్నాను. వెళ్ల లేక పోయాను.

---

('తృష్ణ', 1957)

# స్నేహితుని తరఫున ఉపోద్ఘాతం

*బిమల్ కర్*

నా మిత్రుడు స్వర్గీయ బసుధా ముఖోపాధ్యాయ్ ఒక పేరు లేని అజ్ఞాత రచయిత. ఇంచుమించు 20-22 సంవత్సరాల క్రితం అతని పుస్తకం ఒకటి ముగ్గురు స్నేహితులం కలసి ప్రకటించాము. బసుధా అప్పుడు మా మధ్య బ్రతికి ఉన్నాడు. ఆ పుస్తకం యథావిధిగా 'గోయాబాగాన్' లోని ఒక పుస్తక ప్రకటనాలయంలో చాలా కాలం పాటు నిలవ ఉండి శిథిలమయ్యింది. ఫుట్‌పాత్ మీది దుకాణంలో 4,5 కాపీలు బేడకో (12 పైసలు), పావలా కో (25 పైసలు) అమ్మగలిగాం. ఆ పుస్తకం ఎవరైనా కొంటారని గాని చదువుతారని గాని నాకు ఆశ లేకపోయింది.

బసుధా అదే పుస్తకం ఇంతకాలం తర్వాత మళ్లీ సంస్కరించబడి ప్రచురించబడింది. దాన్ని ప్రకటించిన ఆయన, భువన్ - నాకూ, బసుధాకీ మిత్రుడు. మొదట ప్రకటించినప్పుడు కూడా ఆయన ఉన్నాడు.

'నరకం లో పర్యటన' - ఇదే పేరుతో మొదటి సారి ప్రకటించబడింది. ఈసారి కూడా అదే పేరు ఉంచబడింది. పాత పుస్తకంలో 3 కథలుండేవి; ఈసారి మరో 2 కథలు చేర్చబడ్డాయి. బసుధా హాస్పిటలు లో మరణించబట్టి అక్కడికి వెళ్లి అతనివి ఇంకా ఏమైనా ఆఖరి రచనలు (అసలు అతడు ఏమైనా వ్రాసి ఉన్నట్లయితే), ఉంటే ప్రోగు చేయడానికి అవకాశం లేకపోయింది. నేను నాకు తెలిసిన ప్రకాశకుల చేత పుస్తకాన్ని ప్రకటింపచేశాను.

పాఠక మహాశయుల నుంచి నా తరఫున మొట్టమొదటే క్షమాపణం కోరడం మంచిది. నేనేమీ రచయితను కాను; ఉపోద్ఘాతం వ్రాయడం నాకు చేతనయిన పని కాదు. నా శైలి కూడా అందుకు ఉపయోగపడేది కాదు. కాని భువన్ ఈ భారం నా నెత్తిపై మోపాడు. అతని అభిప్రాయం ఏమిటంటే, యౌవనంలో నేనూ బసుధా కలిసి వ్రాయడం చదవడం చేసినవాళ్లం అందుమూలాన నేనీ పని చేస్తే బాగుంటుందని. ఇంకా అతని ఉద్దేశం ఏమిటంటే, బసుధా సంగతి అతని కంటె నాకు బాగా తెలుసునని. విషయం ఏమంత సరిగ్గాలేదు. కలం పట్టుకోకపోయినా, భువన్ నా కంటే ఏమంత తక్కువ అనురాగం కలవాడు కాదు బసుధాపై; అయినా బసుధా పుస్తక పరిచయం నా చేత చేయిస్తున్నాడు అతను.

ఎప్పుడో 20-22 ఏళ్ల క్రితం నాటి, బసుధా వంటి అప్రఖ్యాత, అజ్ఞాత రచయిత ప్రచారం లేని, మరిచిపోబడిన ఒక పుస్తకాన్ని మళ్లీ ఎందుకు ప్రచురణ చేస్తున్నారో ఆ విషయంపై సంజాయిషీ చెప్పవలసిన అవసరం ఉంది. నిజానికి

మా స్నేహాన్ని మించి; చనిపోయిన స్నేహితుని పై ఈ విధంగా అనురాగం ప్రదర్శించడం వల్ల మాకు వైయక్తికంగా కలిగే తృప్తిని మించి వేరేగా ఈ ప్రచురణకు కారణం లేదు. అయినా మరో కారణం ఒకటి ఉంది. 4,5, నెలల క్రితం భువన్ కాశీ వెళ్లాడు. కాశీలో రామ్‌పూర్ నుంచి వచ్చిన ఒక పెద్ద మనిషితో అతనికి సంభాషించే సందర్భం వచ్చింది. ఆ పెద్ద మనిషి ఒక వృద్ధుడు. ఒక రోజున ఆయన ఇంట్లో కూర్చుని భువన్ మాట్లాడుతూండగా, ఒక కుర్రవాడు వచ్చి ఒక ఫ్రేము కట్టిన ఫొటో 'పట్టుకు వచ్చాడు. అంతకు కొన్ని రోజుల క్రితం ఇంట్లో బూజులు దులిపేటప్పుడు గోడమీద నుంచి పటం పడగా దాని గ్లాసు పగలింది; అది ఇప్పుడు మళ్లీ ఫ్రేము చేయించి పట్టుకొచ్చాడు కుర్రవాడు. సహజంగా ఆ పటం పై భువన్ దృష్టి పడింది. ఆ రంగు మాసిపోయిన ఫొటోలో బసుధాను గుర్తు చేసుకోగలిగాడు భువన్. ముగ్గురున్న ఆ ఫొటోలో ఒకడు బసుధా; మరొకడు ఆ వృద్ధుడూ; మూడవది ఆ వృద్ధుని కూతురు. "ఇందులో ఒకరిని నేను గుర్తు చేసుకోగలుగుతున్నాను, ఇతడు నా స్నేహితుడు బసుధా", అని అన్నాడు భువన్. ఇంకా బసుధా గురించి చెపుతూ "అతనొక రచయితగా ఉండేవాడు" అన్నాడు. వృద్ధుడన్నాడు: "మా అమ్మాయి అనేది అతను వ్రాస్తాడేమో అని. కాని నే నెప్పుడూ అతని రచనలు చూడలేదు. నేను హరిద్వార్ వెళ్లినప్పుడు అతను ఒక క్షయరోగికి పరిచర్య చేయడం చూశాను. ఈ ఫొటో హరిద్వార్‌లో తీయించినది. ఈ యువకుడు అప్పుడు సన్యాసిగా ఉండేవాడు...నీకు అతని ఇప్పటి వాకబు తెలుసునా?" ...భువన్ వినుకున్నాడే గాని, అతని మృత్యువు సంగతి చెప్పకుండా అన్నాడు: "లేదు, నాకేం తెలియదు".

కాశీ నుంచి తిరిగి వచ్చాక భువన్‌కి బసుధా పుస్తకాన్ని మళ్లీ ప్రచురించాలన్న గట్టి కోరిక కలిగింది. నేను చాలాసార్లు అడిగాను - 'ఎందుకు'? "అచ్చు వేయిస్తాను. అచ్చు వేయించడం నా ధర్మం. బసుధాతో నేను చాలాసార్లు చెప్పాను. నా దగ్గర డబ్బు ఉంటే అతని పుస్తకం ముమ్మందు అచ్చు వేయిస్తానని. నా ఆర్థిక పరిస్థితి ఇప్పుడు బాగుంది. అతని పుస్తక ప్రచురణ గురించి డబ్బు ఖర్చు పెట్టేందుకు సిద్ధంగా ఉన్నాను".

భువన్‌కి ఇప్పుడు 46-47 సంవత్సరాల వయస్సు, అతని కింకా ఆవేశం, ఉత్సాహం ఉన్నాయి. అతని మాట కాదనలేక పోయాను. నా కొకటే ఊరట, నేను బసుధా కోసం ఈ మాత్రం ఉపోద్ఘాతం వ్రాయగలుగుతున్నానని అయినా పాఠక మహాశయులను నాలోని అసమర్థతను మన్నించ వలసినదిగా మరొకసారి ప్రార్థిస్తున్నాను.

బసుధా పశ్చిమ బెంగాలులో జన్మించాడు. మొదటి ప్రపంచ యుద్ధం

ముగిసిన సంవత్సరం 1918లో అతను పుట్టాడు, మార్గ శిర మాసంలో అని తెలియవస్తోంది. అతని తండ్రి పోస్టు మాస్టరు. తండ్రికి తరుచుగా బదిలీలు అయేవి కాబట్టి. బసుధా ఒక వెయ్యి నదీ జలాలు త్రాగిన వాడయ్యాడు. బెంగాలు బీహారు రాష్ట్రాలలో. అతని తల్లి చాలా సచ్చరిత; నమ్రతతో కూడుకున్నది; ధర్మ పరాయణ. అతని కొక సోదరి ఉండేది. బసుధా కాలేజీలో చదువుకునే రోజుల్లో ఆమె అత్తవారింట్లో మరణించింది. బసుధా మిగతా బంధుగణం గురించి నాకు తెలియదు.

బసుధా కలకత్తా చదువుకునేందుకు వచ్చినప్పుడు అతనికి నాకీ పరిచయ మయింది. అతనేం పెద్ద తెలివైన విద్యార్థి కాదు; అతని ముఖ వర్చస్సు గొప్పది కాదు; అతని కంఠం కూడా బొంగురుగా ఉండేది. అతనితో స్నేహం చేసుకోవడం సులభంగా ఉండేది కాదు. చదువు చదవక పోయినా, అంతకి పదిరెట్లు మనస్సులో కథలు అల్లేవాడు. అతను వాటి గురించి ఏదైనా మాట్లాడేటప్పుడు గాని, బోధపరిచేటప్పుడు గాని అతని బొంగురు గొంతుక చాలా అద్భుతంగానూ, చక్కగా వినపడేది. అతని కళ్ల గురించి చెప్పాలంటే, అవి చాలా ఆవేశ పూరితంగా కనిపించేవి. అతని ముఖం తీరు పొడుగ్గా ఉండేది; వాడి అయిన చుబుకం. ముక్కు చాలా పొడుగ్గా, పలచగా ఉండేది. కళ్లు రెండూ చాలా చిన్నవైనా బాగా మెరుస్తూ ఉండేవి. దట్టమైన కనుబొమ్మలు. అతని రంగు చామనచాయ. నెత్తిమీద ఉంగరాల జుట్టు. అతని తీరు ఏమీ అంత ఆకర్షణీయ మైనది కాదు; మామూలు బెంగాలీ యువకుల కంటె ప్రత్యేకంగా అతనిలో విశేషమైన సౌందర్యం ఏమీ కనిపించేది కాదు. అయినప్పటికీ, అతని స్వభావానికీ, ఆకృతికీ నాతో పోలిక లేకపోయినా, అతనితో గాఢమైన స్నేహం చేసిన నాకు అతనిలో ఏం ఆకర్షణ కనిపించిందో చెప్పలేను.

కాలేజీలో బి.ఏ. చదివేటప్పుడు మొదలుపెట్టాడు బసుధా రచనా వ్యాసంగం. అంతకుముందు ఏమైనా వ్రాసే వాడేమో నాకు ఆ సంగతి తెలియదు. అతని మొదటి కథ మా స్నేహితుని పత్రికలో ప్రచురించబడింది. ఆ పత్రికా, ఆ కథా కూడా కనుపించడం లేదు. అవి కలకత్తాలో బాంబులు పడ్డ రోజులు. అన్ని వైపులా గందరగోళం, ప్రజలందరూ భయంతో నగరం నుంచి పారిపోవడం, అదీనూ. ఆ కాలంలో అందరూ ఎటువంటి కథలు వ్రాసేవారో, బసుధా కూడా అటువంటిదే ఒక కథ వ్రాశాడు. పూర్తిగా మామూలు రకం రచన. నేనప్పుడు నిజంగా అతణ్ని పొగిడాను, కాని ఆ కథ ఎంత పేలవమైనదంటే ఈనాడు దానికి సంబంధించిన ఒక్క మాటైనా నాకు జ్ఞాపకం లేదు.

నాకు తెలుసున్నంత వరకూ బసుధా తన ముఖ్యమైన రచనలు 1943 సం॥

నుంచి ప్రారంభించాడు. అప్పుడు మేమందరం ఉద్యోగం చేసేవాళ్లం. బసుధా సివల్ సప్లై డిపార్టుమెంటులోనూ, నేనూ, భువనూ వేరే చోటా. బౌబజారులోని ఒక మెస్‌లో మకాం ఉండేవాడు బసుధా. అతనికున్న స్నేహితులూ, చుట్టాలూ మేమిద్దరమే. మధ్యాహ్నం నుంచి సాయంత్రం వరకూ మా లాడ్జికి వచ్చి కూర్చుని తను ఏదైనా కథ వ్రాస్తే అది మాకు చదివి వినిపించేవాడు. అతని మనస్సు చాలా చంచలంగా ఉండేది; ఏ ఒక్క విషయం పూర్తిగా తేల్చి వ్రాసేవాడు కాదు. ఈవేళ ఒకటి వ్రాయదలచుకునేవాడు, రేపు అది వ్రాసేవాడు కాదు. అనేక కథలు ప్రారంభించి, సాధారణంగా మధ్యలో ఆపుజేసేవాడు. నెల తర్వాత నెల. ఏదో వ్రాస్తాననే వాడు, కాని ఒక్క అక్షరమైనా కాగితం మీద పెట్టేవాడు కాదు.

ఈ పుస్తకంలోని మొదటి కథ, 'వినోదిని దుఃఖం', ఆనాటి ఒక మాస పత్రికలో ప్రచురించబడింది. ఈ ప్రథమ ప్రయత్నంలో బసుధా స్వీయ ముద్ర బాగా భద్రపరచబడింది. వినోదినికి తన 13వ ఏట పెళ్లి అయింది; భర్తకు అప్పుడు 18 సంవత్సరాల వయస్సు. ఎర్రటి అంచు బరువు చీర ఒంటిమీద నిలబడకపోవడం వల్ల వినోదిని దాన్ని ఒక పొట్లంలా సగం ముడిచి తన వీపు మీదకి ముడివేసి కట్టుకుంది. దాని మొగుడు గంగాపద్ పెళ్లికూతురు కోసం స్టీమరు రేవులోని సంత నుంచి ఒక మట్టితో చేసిన ఆట బొమ్మ, గాజు గాజులు, నుదుటి మీద ధరించే గాజు వస్తువు, సింధూర తిలకం, పచ్చి జామి పండు, నేరేడు పండు, ఇవన్నీ కొని మూట కట్టి దాచి, రాత్రి మంచం క్రింద మూసి అట్టే పెడితే వాట్లని తీసి వినోదిని ఆడుకుంటూ కూర్చుంటుందా! లేక పచ్చి జామి పండు కొరుక్కు తింటూ ఉంటుందా! స్టీమరు రేవులో పనిచేయడం మూలాన సంపాదించిన డబ్బుతో గంగాపద్ వినోదిని కోసం గౌరాంగ్ ప్రభువు గాజు విగ్రహం ఒకటి కొన్నాడు. వినోదిని అప్పటి నుంచీ గౌరాంగుని (శ్రీకృష్ణచైతన్యుని) భక్తురాలు అయింది. ఇలా క్రమంగా వినోదిని యువతి అయింది, పిల్లల తల్లి అయింది. గృహిణి అయింది. యౌవనం గడిచిపోయింది, ముసలిది అయింది, అటుపైన భర్త గంగాపద్ మరణించాడు. భర్త చనిపోయాక వినోదిని ఈ ప్రపంచంలో ఎక్కడా కూడా తనకు స్థానం లేదన్నట్లు అయిపోయింది. 45 సంవత్సరాలకు పైగా ఆమె, ఆమె భర్త ఎలా సహజీవనం గడిపారంటే, అదొక ప్రత్యేక జీవన విధానం (ఆంగ్ల భాసలో పాటర్న్ అన్నట్లు) గా రూపొందింది. భర్త మృత్యువుతో పాటు ఆ విధానం అంతా నశించి పోయింది ఒక్కసారిగా. ఎల్లాగంటే ఒ నది ప్రవహిస్తూ ప్రవహిస్తూ హఠాత్తుగా ఆగిపోయినట్లు, ఆమె జీవితం శూన్యం, అర్థరహితం, ఆధారహీనం అనిపించింది. వినోదిని మనస్సు యొక్క వర్ణన ఇలా ఉంటుంది: ఏ రేఖలు, ఏ రంగులతో సృష్టికర్త ఆమె కొరకు ఈ ప్రపంచంలో ఒక అతి స్వల్ప చిత్రం

చిత్రించాడే, అందులోని రేఖలు సగం తుడుచుకుపోయాయి, అందులోని రంగు చాలా మటుకు సమసిపోయింది. ఇప్పుడు వినోదిని ఒక చిత్తరువు కాదు; ఇక పైన ఆమె చిత్తరువుగా రూపొందే అవకాశం కూడా లేదు.

తన ఈ శూన్య జీవనాన్ని పరిపూర్ణం చేసుకునేందుకు తన పిల్లల గురించి ఆలోచించింది కాని, ఆ భావనకు తగ్గ సరియైన సమాధానం ఆమెకు లభించలేదు. తన చైతన్య ప్రభువుని మటుకు ఆమె మరవలేదు. ఆ గాజు విగ్రహపు గౌరాంగ ప్రభువు వినోదిని గౌరవాన్ని సంపూర్ణంగా పొందాడు; 45 ఏళ్లు ప్రతి నిత్యమూ ఆ కృష్ణ చైతన్యుని సేవ చేస్తూనే వచ్చింది ఆమె. కాని గంగాపద్ లేకపోయేసరికి, గౌరాంగ ప్రభువు కూడా కేవలం ఒక గాజుగానే మారిపోయాడు ఆమె దృష్టిలో. ఆఖరికి వినోదిని ఒక రోజున అకస్మాత్తుగా ఇలా అనుభూతిని పొందింది. విగ్రహం విసర్జించి, దానికి అలంకారం చేయడం మాని, దానిని కరిగిపోనిస్తే ఇక మిగిలినది ఏమీ ఉండదు కదా అని. మానవ జీవితంలో ఈ విసర్జన అన్నది ఎప్పటికీ తప్పదు; గంగాపద్ ఏదో విసర్జన వాద్యం వాయించే ఒక నదీ తీరానికి తీసుకు వచ్చాడు వినోదినిని. భర్త చనిపోయాడు, వినోదిని గురించి నదీ జలం ఏమని అపేక్షిస్తుందంటే ఒకే నదీ జలంలో ఉభయ మూర్తులూ మునిగిపోయి ఒకే ఆకారం చెందాలని; ఇలా భావించి ఇక ఈనాడు భగవంతుడికి నమస్కరించింది ఆమె.

'వినోదిని దుఃఖం' అన్న ఈ కథను బసుధా తన తల్లిని మనస్సులో పెట్టుకుని వ్రాశాడు. అతని తల్లి పూర్తిగా వినోదినికి వేరు కాదు. ధర్మభీతి పొంది తన శక్తిలోనే తాను ఓర్పు పొందింది కాని, తన భర్త గతించాక బసుధాని కాని మతాన్ని కాని ఆశ్రయించుకుని కూర్చోలేదు. బసుధా అంటూ ఉండేవాడు: "మా అమ్మకు పరజన్మలో నమ్మకం లేదు. ఆమె ఒక్క మృత్యువునే నమ్మింది. నేనా సంగతి ఏమీ అర్థంచేసుకోలేకపోయాను.

తల్లి చనిపోయిన చాలా కాలం తర్వాత బసుధా మరొక కథ వ్రాశాడు. కథ పేరు 'దుఃఖమోచనం'. ఈ పుస్తకంలో అది రెండవ కథ. అది ఆ రోజుల్లో ఏదో ఊరూ పేరూ లేని పత్రికలో ప్రకటించబడింది. 'వినోదిని దుఃఖం' గ్రాంథిక భాషలో వ్రాయబడింది. మొట్టమొదటలో బసుధా అలాగే వ్రాసేవాడు. 'దుఃఖ మోచనం' మటుకు వ్యావహారికంలో వ్రాశాడు. 'వినోదిని దుఃఖం' అన్న కథలో వినోదిని తుది ఓదార్పు మృత్యువులో పొందింది. మృత్యువుని వినోదిని తన దుఃఖ విమోచనం పరిణామంగా పరిగణించింది. కథ నిక్కచ్చిగా అర్థమయింది అని చెప్పలేను గాని, ఈ మాత్రం చెప్పడంలో ఔచిత్యం ఉంది- వినోదిని, మృత్యువులో ఒక విధంగా తనదీ, భర్తదీ ఆత్మల పునస్సమాగమం ఆశించింది. 'దుఃఖ విమోచనం' కథలో ఈ విషయాన్ని ఒక పరీక్షకు నిలబెట్టే ప్రయత్నం చేశాడు బసుధా.

ఇంత క్రితమే చెప్పాను, బసుధా తన రెండవ కథ తన తల్లి చనిపోయిన చాలాకాలం తర్వాత వ్రాశాడని. అతని తల్లి చనిపోయే ముందు అతనికొక అమ్మాయితో పరిచయం అయింది. ఆమె పేరు ప్రస్తుతం దాచి ఉంచుతాను; అయితే సులువు కోసం ఆమెను 'నిరు'లేక 'నిరుపమ' అని పేర్కొంటాను. తన తల్లి జబ్బు పడిందన్న వార్త అందగానే బసుధా తన స్వగ్రామం వెళ్లాడు. ఆమె చనిపోయేవరకూ ఆ ఊళ్లోనే ఉండిపోయాడు. నేనూ, భువన్ శ్రాద్ధకర్మ ('దినం', జరిగే రోజున బసుధా ఊరు వెళ్లాము. ఆ సందర్భంలో బసుధా మా కొక వింత విషయం చెప్పాడు. ఏమంటే - నదీ తీరాన ఉన్న శ్మశానం లో తన తల్లి చితిని అతను అంటించి అక్కడ ఉన్న నేరేడు చెట్టు క్రింద కూర్చున్నంత సేపూ అతనికి 'నిరు' మాటే జ్ఞాపకం వచ్చిందని. అటుపైన కొన్నాళ్లకు - శోకం, అశౌచం అన్నీ గడిచాక - అతను తన తల్లి మాట తక్కువగానూ, 'నిరు' విషయం ఎక్కువగానూ ఆలోచించేవాడు. ఎందువల్ల?

బసుధా వ్యవహారం అంతా "ఎందువల్ల?" అనే ఒక చిక్కు సమస్యగా తేలింది. తల్లి గురించి అతను ఏ విధంగా దుఃఖించవలసి ఉందో, ఎటువంటి బాధను అతను అనుభవించదగి ఉందో - ఆ దుఃఖం గానీ, ఆ బాధగానీ అతను పొందలేకపోయాడు. పైగా అతను ఎప్పుడూ నిరుపమ మాటే ఆలోచిస్తూండేవాడు. ఈ క్లేశం గురించి అతను చాలా రోజులు ఆత్మ పరీక్ష చేసుకున్నాడు. తను ఏమైనా అపరాధం కానీ, అన్యాయం కానీ చేస్తున్నాడా? నేనా విషయంలో అతన్ని ఊరడించ లేక పోయాను.-అతను నిష్కారణంగా తనని తాను బాధించుకుంటున్నాడని.

కొన్నాళ్లు ఇలాగే తర్కించుకోవడంలో కాలం గడిపాడు బసుధా. 'నిరు' ని కూడా అతను ఈ విషయంలో వేధించే వాడు; తర్వాత తన మనస్సుకు అనుగుణంగా ఒక సమాధానం వెతుకుతూ 'దుఃఖమోచనం' అన్న కథ వ్రాశాడు.

'వినేదిని దుఃఖం' కథలో, వినేదిని మృత్యువులో తన దుఃఖానికి నివృత్తిని అనుభవించింది. 'దుఃఖమోచనం' లో 'సుఖేందు అన్న అతడు మృత్యువును అప్రియమైనదనీ, జడ తుల్యమైనదనీ అనుభవించాడు. జీవితం ప్రతి ఫలం సృష్టి చేయడం; కాని, మృత్యువు ఏ ప్రతిఫలం కాని సృష్టిని చేయలేదు. తేలికగా తేల్చి చెప్పవలసిందేమిటంటే - వినేదిని మృత్యువుని స్వీకరించి శాంతిని పొందింది. సుఖేందు జీవించి జీవితం వల్ల శాంతిని పొందాలని ఆశించాడు.

సుఖేందు 'దుఃఖ మోచనం' కథలో నాయకుడు అతని వయస్సు కొంచెం ఎక్కువ చేసి చెప్పబడింది. కథలో ప్రధానమైన అంశం ప్రేమ అన్నట్లు తేలు తుంది. అయినా, నేను అనుకున్నదేమంటే - మరణించడం, జీవించడం లేక, మృత్యువూ, జీవితమూ, ఈ రెండింటి ద్వంద్వ సంఘర్షణ అని. కథ మొదటి నుంచీ

నేను గమనించింది, సుఖేందు ఒక ఎంత ద్వంద్వ యుద్ధంలో అత్యంత దుఃఖితుడై పట్టుబడి ఉన్నాడని. అతను రేణు అన్న అమ్మాయిని ప్రేమించాడు; అయినప్పటికీ తన తల్లి గురించి ఉండిపోయిన ఒక గాఢ స్మృతి రేణుతో సహజమైన సంపర్కాన్ని స్థాపించుకునేందుకు అతనికి అవకాశం ఇవ్వలేదు. అతని మనస్సులో ఎప్పుడూ ఏదో ఒక అన్యాయం చేసినట్లు భీతి, తన యుక్తా యుక్తి వివేచన గురించి క్లేశం, అలా ఉండిపోయేవి. సుఖేందుకి తన తల్లి శాపం ఏదో తనపై పడినట్లనిపించేది. అలా ఎందుకనిపించేదో అతనికి బోధ పడలేదు; ఇంత మాత్రం అతనికి బోధపడింది, తన తల్లి గురించి తను తగిన రీతిని తన బాధ్యత నిర్వర్తించలేదని.

సుఖేందులోని ఈ ద్వంద్వ యుద్ధానికి పరిష్కారం జరిగే ఆశ లేదని నేను అనుకునేసరికి ఆ ద్వంద్వ సంఘర్షణకి ఒక సంఘటన అవసానం కలిగించింది. కథ యొక్క తుది అలౌకిక సంఘటన గురించి నేను ప్రస్తావిస్తున్నాను. శీతకాలం ప్రారంభం అయింది అప్పుడు. ఒక సాయంత్రపు వేళ సుఖేందూ, రేణూ, రేణు వాళ్ల ఇంటిలో డాబా పైన కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. కలకత్తా సందులలో ఉండే పొగ, పొగమంచు, గాసులైట్ల కాంతి, చిరు వెన్నెలా - అన్నీ కలిసి మసకమసకగా ఉంది. మాట్లాడుతూ, మాట్లాడుతూ రేణు హఠాత్తుగా లేచి నిలబడింది. సుఖేందు కూర్చుని ఉన్నాడు. అకస్మాత్తుగా అతనికి ఎవరో వచ్చి తన ప్రక్కన కూర్చున్నట్లని పించింది. చిరువెన్నెలా, పొగా, పొగమంచూ వాటి మధ్య నిశ్శబ్దంగా వచ్చి కూర్చున్న ఆ వ్యక్తిని అతను మొదట గుర్తించలేదు, ఆ మూర్తి ఒక తెల్లని నీడలా తోచింది అతనికి. కొంచెం పరిశీలించగా సుఖేందు ఆ వ్యక్తిని గుర్తించాడు - తన తల్లి. మొట్టమొదట నిర్ఘాంత పోయి, తర్వాత అర్థం చేసుకుని, 'అమ్మా ఎందుకు వచ్చావు?' అని అడిగాడు. చనిపోయిన తల్లి గురించి అతనికి జాలి, మమకారం కలిగింది; ఆమె కొరకు దుఃఖించాడు. ఒక విపరీతమైన నిస్సహాయతా, విషాదానుభూతీ, అతణ్ని కబళించడం మొదలెట్టాయి. తల్లితో ఏదో చెపుదామనుకున్నాడు సుఖేందు - ఇంతలో ఏమిటీ ఈ పరిమళం? ఎవరిదీ సువాసన? అన్యాక్రాంత మనస్కుడై ముఖం క్రిందకు వంచి ఉండగా అతని చొక్కా జేబులోంచి ఏదో పూల వాసన వెలువడింది. అతను అనుకున్నాడు. రేణు తన తల కొప్పులో నుంచి ఒక గులాబీ పువ్వు తీసి తన జేబులో పెట్టిందేమో నని. ఆ పూల పరిమళం ఎంత ఉత్సాహ పూరితంగా, ఎంత హృదయంగమంగా, ఆ స్వాద యోగ్యంగా ఉందో! రేణు శరీరాన్ని మనస్సు ఎంతగా ప్రేమించిందో! అంతా ఆ ఒక్క సెకనులో ఒక పెద్ద సముద్రపు కెరటంలా వచ్చి అతణ్ని ముంచి వేసింది. అదే పరిస్థితిలో అలా ఉండి ఏదో విధంగా తల్లితో

అన్నాడు సుఖేందు: "నువ్వు మళ్లీ రావా?"

బసుధా తన స్వంత విషయంలో ఏ విధమైన బెంగ పెట్టుకున్నాడో, సుఖేందులో కూడా అదే క్లేశాన్ని ప్రవేశపెట్టాడు. చనిపోయినప్పుడు తల్లి గురించి అతనికి ఏమంత పెద్ద దుఃఖం కాని ఆవేదన కాని కలగలేదు - పైగా అప్పుడు 'నిరు' గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు తన్మయుడై. ఇప్పుడదే క్లేశాన్ని పురస్కరించుకుని అతనిలో ఏదైతే దుఃఖం పుట్టుకొస్తోందో అది ఇన్నాళ్లకి విమోచన పొందింది. నిరు జీవించి ఉంటేనే ఆమె ఆకర్షణ ఎక్కువ; నిరు జీవించి ఉంటేనే ఆమె ప్రయోజకత్వం బాగా రాణిస్తుంది. జీవితమే ప్రేమ.

'దుఃఖ మోచనం' నిక్కచ్చిగా ప్రేమ కథ కాదు; ఈ కథలో ప్రేమ అనుషంగికం మటుకే. బసుధా దీని ద్వారా చెప్పదలచుకున్న దేమిటంటే మానవుడు మాత్రమే జీవితంపై ఆసక్తి గలవాడు; ఇటువంటి ఆసక్తి మరి ఏ ప్రాణి కోటిలోనూ గోచరం కాదని.

వైయక్తికంగా నాకేమనిపిస్తుందంటే, ఈ కథ ద్వారా బసుధాకు ఆత్మ సంతృప్తి కలిగిందని. సుఖేందు ఊరికే నిమిత్త మాత్రుడే.

ఇదే పుస్తకంలోని మూడవ కథ "నరకంలో పర్యటన". నేనిది వరకే చెప్పాను. మళ్లీ జ్ఞాపకం చేస్తున్నాను, ఈ కథ పేరుతోనే మొదటి సారి అతని పుస్తకాన్ని మేము ప్రచురించాము. ఈసారి కూడా ఆ పేరు ఉంచుతున్నాం.

"దుఃఖ మోచనం" వ్రాసిన ఇంచుమించు ఒక సంవత్సరం తర్వాత బసుధా ఈ కథ వ్రాశాడు. ఇది ప్రేమకథ అనవచ్చు. 'నరకంలో పర్యటన' కథలో చాలా విచిత్రంగా ప్రేమ గాథ నిరూపించబడింది.

'నరకంలో పర్యటన' -ఒక యువకుని ప్రేమ పిపాస, ప్రేమా, అటుపైన దాని వ్యర్థత గురించీ ఆ కథలో చిత్రించబడింది. నాయకుని పేరు 'పరిమళ్' అని పెట్టినా, నిజానికి బసుధాయే అందులో నాయకుడు. నాయిక పేరు మట్టుకు నిరుపమే. కలకత్తాలోని సదానంద్ చౌధురీ వీధిలో నిరుపమ నివసిస్తున్న మేడ క్రింది భాగంలో పరిమళ్ స్నేహితుడొకడు నివసిస్తున్నాడు. అతని దగ్గరకు తరుచు వెళ్లడం మూలాన నిరుపమతో పరిచయం అయింది. పరిచయం గాఢం అయేందుకు కొంతకాలం పట్టిందనుకోండి, కానీ ఈ మాట బాగా గ్రహించుకోవాలి మొట్టమొదటే పరిమళ్ నిరుపమచే ఆకర్షించబడ్డాడు. ఎవరైతే ప్రేమను దైవశక్తిగా పరిగణిస్తారో, ఎవరైతే ప్రేమయే మానవ హృదయాన్ని ఉత్తేజ పరుస్తుందని విశ్వసిస్తారో, అటువంటి వాళ్ల శిష్యుడే పరిమళ్. ఔదాసీనం, బిడియం, ఆలోచనా పరత్వం ఇవి ఏ వృక్షపు సంతానమో వాటికి చెందిన పరిమళ్ యొక్క ప్రేమకు మామూలు రకం యువతి అయిన నిరుపమ పూర్తిగా అర్హురాలు

కాకపోవడానికి తగిన కారణం ఉంది. అది నిరుపమ స్వాభావికంగా ఒక సాధారణ వ్యక్తి అవడం.

కథలో మొదటి అంశం పరిమళ్‌కి నిరుపమకీ మధ్య ప్రేమ దృఢమవడం. రెండవ అంశం వాళ్ల ప్రేమకి సంబంధించిన సంపర్కం. ఈ ప్రేమ విషయంలో పరిమళ్ వైపున గల గాంభీర్యానికి, అంతరంగికతకూ ఏమీ లోటు లేదు. పరిమళ్ అనుకున్నాడు: ఈ ప్రేమ తన అస్తిత్వాన్ని సార్థకం చేస్తుందనీ, తన జీవితాన్ని ధన్యం చేస్తుందనీ. నిరుపమకు అంత పెద్ద ఆలోచన లేమీ లేవు.; అలా ఆలోచించేందుకు కారణం కూడా ఆమెకు కనిపించడం లేదు. ఉన్నా ఆమెకు అలా భావించడం చేతకాదు. ఆమె ఉద్దేశంలో ప్రేమ అంటే ఏ యువతి కైనా రోమ హర్షణం కలిగించే విషయం, మాత్రమే.

అటువంటి ఈ ప్రేమ ఒక రోజున భగ్నమయింది. ఎందుకు భగ్నమయిందో చెప్పలేము. నిరుపమ మేడ క్రింద వాటాలో ఉన్న, పరిమళ్ స్నేహితుడైన మన్మథ నైచ్యం వల్లా చాతుర్యం వల్లా పరిమళ్ నిరుపమల ప్రేమ సౌధం కూలింది - అని ఒక మాటు అనిపిస్తుంది. పరిమళ్‌దే తప్పు అని మరొక మాటు అనిపిస్తుంది. నిరుపమ పైనే నేరం మోపవచ్చు -. అని ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది. మన్మథ్‌ని దోషిగా చెప్పవలసి వస్తే, అతను పరిమళ్‌కి ప్రతి ద్వంద్విగా నిరుపమ ప్రేమను పొందడానికి ప్రయత్నించాడు; అంతకు మించి అతను కపటంగా తన స్పర్ధను తిన్నగా ప్రదర్శించలేదు; దాచాడు తన ప్రేమను, మామూలు మానవ స్వభావమైన ధూర్త లక్షణం తో. అతను నిరుపమని లాగే, నిరుపమ తల్లిని కూడా వశపరచుకున్నాడు. నిరుపమ తల్లికి, లోకపు రీతి తెలుసును, తన కూతురి సుఖ శాంతుల గురించి తెలుసును - ప్రేమించడం అలాంటి విషయం ఆమెకు తెలియదు. ఆమె పరిమళ్‌ని తన అల్లునిగా యోగ్యుడయినట్లు గ్రహించలేదు. నిరుపమ ఎల్లాగో పొరపాటు పడింది. మన్మథ చాతుర్యం, శక్తి సామర్థ్యాలు, ఆమెకు చాల ఆకర్షణీయంగా కనుపించాయి. అదీకాక ఆవిడకు తన కూతురు పరిమళ్‌ను వివాహమాడడం ప్రబలమైన బాధ కలిగించింది. నిరుపమ బాల్యం నుంచి ఆమె అనారోగ్యం వల్ల తల్లికి చాలా బెంగా; ఇబ్బందీ కలుగుతూండేవి. పరిమళ్ గురించి ఆవిడ చాలా చిరాకు పడుతూండేది. అతడిని చాలా రోజులు ఒక ప్రేమికుడిగా భావించడానికి ప్రయత్నించింది., కాని ఆవిడకు సాధ్యపడలేదు. ఆ ప్రేమ ఎప్పుడైతే సంసార జీవితంలో కి త్రోవ తీసిందో అప్పుడు నిరుపమకి ఏ విదమైన శాంతిగాని సుఖం గాని పరిమళ్ ద్వారా కలుగుతుందన్న ఆశ ఆమెకు లేకపోయింది.

పరిమళ్ లోట్లు గురించి ఎప్పుడైనా ఆలోచిస్తే, అతగాడు అనేక విధాలుగా

మనః క్లేశం లేకుండా ఉండగలిగేందుకు ప్రయత్నించి, హఠాత్తుగా ఒక్కసారి ఆ మార్గంలో ఆగిపోయాడనిపిస్తుంది. ఎందుకల్లా ఆగిపోయాడో చెప్పవలసి ఉంది. ఒకటేమిటంటే పరిమళ్ ప్రేమ కలాపంలో ఏది సాధించదలచుకున్నాడో, అది ప్రేమ విషాదానికి, ప్రేమ అపరిపూర్ణతకూ మాత్రమే దారి తీసిందని చెప్పవచ్చు. ఒక వైపేమో అతను ప్రేమ వ్యవహారం తాత్కాలిక సంతృప్తి గురించి యోచిస్తూ ఉండేవాడు; కాని దాని చిరకాల స్థాయి నిలబెట్టుకోగల శక్తిని సంపాదించుకో లేకపోయాడు మరొక వైపున. ఈ కారణం' వల్ల ప్రేమలో ఏ విషాదమూ, అసంపూర్ణతా అతను అనుభవించాడో ఆ పరిణామం మామూలుగా లోకంలో భౌతికమైన సౌఖ్యాల అనిత్యత్వానికి సంబంధించినదే... పరిమళ్ ఆశించినట్టి నాశనం, మార్పులేని ప్రేమ సాధారణంగా ఈ సాంసారిక జగత్తులో దొరకదు.

ఇక నిరుపమ తప్పు ఇది - ఆమె ఒక మామూలు అమ్మాయి. ప్రేమ, కుటుంబ సౌఖ్యం ఇలాంటి విషయాలలో ఆమె దృష్టి చాలా సంకుచితమైనది. పరిమళ్‌ని స్వీకరించడం లో ఆమె ఒక డైలమాలో పడింది. ఈ సందిగ్ధావస్థకు ముఖ్య కారణం మన్మథ వలనా; మిగతా కారణం నిరుపమ చవకబారు జీవిత దృక్పథం వలనా.

"నరకంలో పర్యటన" అన్న కథ నిజంగా బసుధా ఆత్మకథ. నిరు ప్రేమ చివరిదాకా అతనికి శాంతిని కలిగించలేదు. ఏమంటే అతను నిజంగా నిరుని ప్రేమించే పెళ్లిచేసుకున్నాడు. నాలాంటి లౌకిక జ్ఞానం గల వ్యక్తుల లాగ సాంసారిక ప్రేమలోని నిష్ఫలతను అతను ఊహించలేకపోయాడు. అతను అనేవాడు, నా ప్రేమ భావం చాలా స్వల్పమైనది; ఒక వ్యక్తి పైననే ఆధారపడి ఉంది. ఆమె వదిలి పెట్టేసిందా, దుఃఖంలో మునిగి కొట్టుకోవలసిందే, అశాంతితో, పిరికితనంతో. ఎందుకిలా జరిగింది? ఎందుకు?

"ఎందుకు" అనే పేరు గల భూతం కొన్నాళ్లు అతని భుజాల మీద నుంచి దిగలేదు. నేను చెప్పినటువంటి చిన్న తరహా ప్రేమను అతను తిరస్కరించాడని చెప్పనక్కరలేదు. అతను చివరి దాకా అటువంటి ప్రేమను ఖండిస్తూనే వచ్చాడు. అతను చూసినదేమంటే, ఈ మన సంసార జీవితంలో ఉన్నట్టి క్లేశం, నీచత్వం, ధూర్తత్వం, దురాశా మొదలైనవి మన ఆత్మీయమైన దీనతను క్రమంగా మరింత దీనతరం చేస్తాయి అని. అతని భావం - మన ఈ ఆత్మీయ దారిద్ర్యం వల్లనే మనం నరకవాసులు మవుతున్నామని. ఈ నరక లోకం నుంచి ఉద్ధరించబడి తప్పించుకునే ఉద్దేశంతో అతను 'నరకం' లో పర్యటన' అన్న కథ వ్రాశాడు. వ్యక్తిగతమైన ప్రేమా, ప్రాప్తి నుంచి పయనించి అతను ఎక్కడికో పోదామనుకున్నాడు.

బసుధా కలకత్తా విడిచిన ఏడాదే నేను పెళ్లి చేసుకున్నాను. మా ఆవిడ బసుధా కథలను మెచ్చుకుందో లేదో చెప్పలేను గానీ, వాట్లను చదవడం చదివింది. బసుధాని నా పెళ్లి అయేవరకూ కలకత్తాలో ఉండమన్నాను కాని అతను అలా ఉండలేదు. అంతకు కొన్ని నెలల పూర్వమే అతని పుస్తకం నేను ప్రచురించాను.

అటుపైన బసుధాతో నాకు ప్రత్యక్షమైన సంబంధం ఏమీ కలగలేదు. ఒకటిన్నర సంవత్సరాల తర్వాత అతని దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. భువన్‌కి కూడా నాలాగే ఎప్పుడో ఒకటి రెండు ఉత్తరాలే వచ్చేవి బసుధా దగ్గర నుంచి. బసుధా ఉత్తరం చదివేసరికి అతడొక దేశద్రిమ్మరి అయిపోయాడని తెలిసింది. అదీకాక అతనికి దైవభక్తి కూడా ఎక్కువయిందని గ్రహించుకున్నాను. మరొక సారి ఆఖరిగా తెలుసుకున్నదేమిటంటే, అతను దైవభక్తి వదిలి ప్రజాసేవకుడై పోయాడని.

బసుధా తుది రెండు కథల గురించీ నా కేమీ చెప్పవలసింది లేదు నేను నరకవాసి జీవిని. నరకం నుంచి యాత్ర ప్రారంభించి బసుధా ఏయే మార్గాల గుండా పయనించేందుకు ప్రయత్నించాడో వాటిలో అతన్ని వెతకడానికి నేను సిద్ధపడలేదు. బహుశా అతని నాలుగవ కథ 'ఈశ్వర్', మళ్లీ, ఐదవ కథ 'ఆశ్రయం', అతని అంతిమ జీవితపు కొన్ని సంవత్సరాల చరిత్రను అవగాహన చేసుకునేందుకు తోడ్పడతాయి. ఈ రెండు రచనలు కాశీ నుంచీ తిరిగి వచ్చేటప్పుడు భువన్ ఆ ముసలి పెద్దమనిషి కూతురు దగ్గర నుంచి సేకరించాడు. ఈ రెండింటి వ్రాతప్రతులనూ పరిశీలిస్తే అవి అసంపూర్ణమని తేలుతుంది. చదివాక పాఠకులు స్వయంగా ఆ విషయం నిశ్చయించుకోగలరు.

'ఈశ్వర్' అన్న కథ సహజమైన శైలిలో వ్రాయబడలేదు. నేను దీనినొక సాంకేతిక రచన అంటాను. చదువుతూ ఉన్నప్పుడు ఒక వింతతో కూడిన విషయం అవగతమవుతుంది. చివరకు ఒక అభావం ద్యోతకమవుతుంది అనడంలో సందేహం లేదు. అసలు కథ మొదట్లోనే ఒక అస్వాభావికత స్పష్టంగా కనిపిస్తుంది. ఒక బాటసారి వాతావరణం బాగా లేని సమయంలో చీకట్లో ఒక దేవాలయం లో తలదాచుకున్నాడు. ఆ చీకటిలోనే అతనికి ఒక సన్యాసి కంట పడ్డాడు. వాళ్లు మాట్లాడుకుంటూండగా ఒకసారి సన్యాసి తన సంచిలోంచిఒక దీపం తీసి దాన్ని వెలిగించి ఆ చీకటీ, చెడు వాతావరణ సమయంలోనే ముందుకు నడిచి పోదామని అన్నాడు. అప్పుడు బాటసారి అడుగుతాడు. అయితే ఇంతసేపూ మీరు అలా దీపం వెలిగించకుండా ఎందుకు ఈ చీకట్లోనే కూర్చుండిపోయారు?' 'సన్యాసి'. 'నా దగ్గర మూడు దీపాలున్నాయి. అందులో ఒకటి అసలైనది, రెండు నకలైనవి. అసలు దేదో, నకలు లేవో ఈ చీకట్లో కనిపెట్టలేక పోయాను'.

అప్పుడు బాటసారికి అనిపించింది 'హా, నా చేతిలో దీపం ఉంటే ఎంత బాగుండును! సన్యాసి అతని ఆకాంక్షను కనిపెట్టి అన్నాడు. "నీకు శక్తి ఉంటే అసలు దీపమేమిటో కనుక్కో". బాటసారి దీపాలను తన చేతికిమ్మన్నాడు. సన్యాసి ఇచ్చాడు. చీకటిలో మూడూ ఒకలాగే కనుపించాయి, అందుచేత వాటిలో తేడా కనిపెట్టలేకపోయాడు బాటసారి. సన్యాసి అడిగాడు: 'కనుక్కోలేక పోయావా?' బాటసారి 'అవును' అప్పుడు సన్నాసి వాటిని తిరిగి తీసుకుని అన్నాడు. "వీటిలో ఒకటి తప్పక వెలుగుతోంది. ఎవరికి వెలిగించడం చేతనవుతుందో వాళ్ల చేతిలో వెలుగుతుంది. అప్పుడు దాని స్వభావాన్ని అనుసరించి దాన్ని వెలిగించి ఉంచుకోవచ్చు? "

కథ అంతటితో పూర్తి అయింది. కాని వ్రాత ప్రతి చూస్తే ఏం తెలుస్తుందంటే, బసుధా ఇంకా ఏదో వ్రాద్దామని చాలాసార్లు ప్రయత్నించి విఫలుడయ్యాడని. బహుశ, అతను ప్రహేళికకు ఏదో అర్థం కనుక్కోవడానికి చేసిన యత్నంలో సఫలుడవ్వలేదు.

ఆఖరి కథ పేరు 'ఆశ్రయా!' కాశీపట్టణం గురించి వ్రాసినది. కథకు మొదలు ఉంది కాని ముగింపు లేదు. ఉత్తమ పురుషలో కథ వ్రాయడం మొదలుపెట్టాడు. శీతకాలపు తుది రోజుల్లో కాశీ చుట్టు ప్రక్కల ప్రతి సంవత్సరం ప్లేగు వ్యాధి వ్యాప్తమవుతుంది. అతను ఉన్నప్పుడు ఆ వ్యాధి చాలా తీవ్రంగా వ్యాపించడంతో, జనం ఇటూ అటూ చెల్లాచెదరయిపోయారు. సర్కారు ఉద్యోగస్థులు కూడా తమ తమ పల్లెలకు వెళ్లిపోయారు. గంగానదీ తీరుపు ఘాట్‌ల లో నిరంతరం ప్రేత దహన జ్వాలలు వెలుగుతున్నాయి. కథలోని నాయకుడు ఒక రోజున బాగా తెల్లవారుఝామున లేచి గంగా స్నానం చేసి ఇంటికి వెళుతుండగా, అతనికి పొరుగూరి నుంచి ఎవరో తనని పిలిచినట్లనిపించింది: ఆ పల్లెటూరి స్నేహితుడు తన బాణీలో ఏదో జానపద గీతం వినిపించినట్లు...

బసుధా ఆ జానపద గీతం విన్నాడు: "నేను చాలా దుఃఖితుణ్ని, బహు చపలుణ్ని, చెట్టుకి ఎలా వ్రేళ్లు ఉన్నాయో నాకు అలా లేవు. నేను ఒకే చోట ఉండలేను".

బసుధా తన ఇంటికి తిరిగి వెళ్లలేదు, ఆ పొరుగూరి వైపు - ఎక్కడైతే ప్లేగు ఉందో - ఆ దిక్కుగానే వెళ్లిపోయాడు.

కథ అంతవరకూ వ్రాయబడింది. ఇంక అటుపైన అతనింకేమీ వ్రాయలేదు. భువన్ అన్నాడు, కథ వ్రాసిన మరునాడు బసుధా వెళ్లిపోయాడు; కాని ఎక్కడికో ఆ కాశీ వృద్ధుడికి కాని అతని కూతురుకి కాని తెలియదు.

ఛోటా నాగపూర్‌లోని ఒక మారుమూలలో మిషను హాస్పిటలులో బసుధా

మరణించాడు. ఆ వార్త నాకు చాలా రోజుల తర్వాత తెలిసింది. అతను ఆసుపత్రిలో ఏమీ వ్రాసినట్లు తెలియరాలేదు. అతని రచనా వ్యాసంగం ప్రయోజనం అప్పటికే సమసిపోయింది.

బసుధా కథల గురించి నేను స్నేహితుని రీత్యా విమర్శించాను. బహుశా నేను అన్యాయం చేశానేమో అతనికి; కాని నా స్వభావాన్ని అనుసరించే నేను వ్రాశాను. చదువరులు నన్ను మన్నించగలరు.

ఈ పుస్తక ప్రారంభంలో ఒక అంకితం ఉంది. మొదటిసారే అది ఉల్లేఖించబడింది. దాన్ని గురించి వేరే చెప్పనక్కర లేదు – ఆ అంకితం ఎవరికో కాదు 'నిరుపమా రాయ్' కే చేయబడింది, ఆమె ఎవరో స్త్రీ కాదు, ఆమె బసుధా జీవిత కథానాయిక అయిన నిరుపమే.

---

('మేము ముగ్గురు ప్రేమికులమూ, మరియూ భావన్', జూలై 1968)

# భారతవర్షం

రమాపద్ చౌధురీ

మిలిటరీ సాంకేతిక నామంతో బి.ఎఫ్. 332 అని ఒక చోటు ఉంది. అదేమీ స్టేషను కాదు, ప్లాట్‌ఫారం కాదు, టిక్కెట్టు కాదు. ఊరికే ఒక రోజున క్రొత్త ముళ్ల తీగ రైల్వే లైను సరిహద్దు చుట్టూ చుట్టబడి ఉండడం కనిపించింది. అంతే, అంతమాత్రమే. రోజస్తమానం అప్‌దైనా సరే డవున్ దైనా సరే ఒక్క ట్రెయినేనా అక్కడ అగదు. ఒకటి ఆగుతుంది, అయితే అదొక స్పెషల్ ట్రెయిను. అకాస్మత్తుగా ఒక రోజు తెల్లవారు ఝూమున వచ్చి ఆగుతుంది. అది ఎప్పుడు ఎక్కడ ఆగుతుంది, ఆ సంగతి ముందుగా బీహారీ వంటవాడు, భగవతీలాల్‌తో పాటు మాకు ఒక అయిదు మందికి మటుకు తెలుసును.

స్టేషను లేదు, ట్రెయిను ఆగదు, అయినా రైల్వే సిబ్బంది ప్రతివాడి నోటిలోనూ ఒక క్రొత్త పేరు అల్లల్లాడుతూంది. పోతే, దాన్ని మేము "అండాహాల్ట్" అంటూంటాం.

'అండా' అంటే 'గ్రుడ్డు'. అండాహాల్ట్ దగ్గర దగ్గర గా ఉన్న రెండు పొట్టిగా, దట్టంగా ఉన్న కొండల క్రింద 'మాహాతా' కులాల గ్రామం ఉంది. ఆ ఊళ్లో కోళ్ల ఫారంలు వ్యాపించి ఉన్నాయి. అక్కడికి దూరంగా ఉన్న భోర్‌కుండా లోని శనివారం సంతలో వాళ్లు కోళ్లనూ, కోడిగ్రుడ్లనూ అమ్ముతూ ఉంటారు. ఎప్పుడైనా వాళ్లు చంకల్లో కోడి పుంజులు పెట్టుకుని కోడి పందాల ఆట ఆడుతూ ఉంటారు. అయితే దాని మూలాన కాదు బి.ఎఫ్. 332 అన్న పేరు 'అండాహాల్ట్'గా వ్యవహరించబడడం.

అసలు మాహాతా గ్రామస్థుల కోడిగ్రుడ్లపై మాకేమీ ప్రత్యేకమైన మోజు లేదు. మా కంట్రాక్టరుతో రైల్వే వాళ్లకు వ్యవహారం జరుగుతూ వుంటుంది; ఒక ట్రాలీకి ఎర్రజెండా తగిల్చి రైలు పట్టాలపై నుంచి గుంపులు గుంపులుగా కోడిగ్రుడ్లు తీసుకు వచ్చి అప్పచెపుతూ ఉంటాడు. బీహారీ వంటవాడు భగవతీలాల్, వాటిని రాత్రి ఉడకబెట్టి ఉంచుతాడు.

అందుమూలాన కూడా కాదు దానికి 'అండాహాల్ట్' అని పేరు రావడం. ఈ గ్రుడ్లు పూర్తి ఉడకటం అయాక వాటి గుల్లలు బైట పారెయ్యడం వల్ల అవి ప్రోగుపడ్డ చోట కాలక్రమాన ఒక గుల్లల కొండ లేచింది. ఇదీ అసలు కారణం.

మిలిటరీ భాషలో ఉన్న బి.ఎఫ్. 332లో ఉన్న మొదటి రెండు అక్షరాలూ మాకు ఏదో సాంకేతిక మైనవి కావు. బ్రేకుఫాస్టు, పదానికి ఎబ్రీవియేషను అని మేము అనుకుంటాం.

రామగఢ్ ఆ రోజుల్లో పి.ఓ.డబ్ల్యు. (యుద్ధకాలపు ఖైదీలు) యొక్క మకాం (కాంపు) ఇటలీ దేశపు ఖైదీలను అక్కడ బయనెట్సుతోనూ, వైర్‌ఫన్సు తోనూ చుట్టబెట్టి ఉంచారు. దాని మధ్య ఒక ట్రెయిను సామాను ఎగుమతి చేసుకుని బయలుదేరుతుంది. ఎందుకో ఎక్కడికో మాకెవరికీ తెలియదు.

మాకు వచ్చే వార్త అల్లా ఒక ట్రెయిను తెల్లవారు ఝామున వస్తుందని.

కంట్రాక్టరు వ్రాసిన ఉత్తరం చదివి క్రితం రోజున వచ్చిన కోడిగ్రుడ్లు పరీక్షించి, వంటమనిషి భగవతీ లాల్ అన్నాడు - '330 బ్రేక్‌ఫాస్టులు'.

భగవతీలాల్ లెక్కపెట్టి 660 గ్రుడ్లూ, పైగా ఒక పాతిక రద్దుపోయేందుకు ఈవతలకు తీస్తాడు. చెడ్డవి బయటకు పారేస్తాడు. అటుపైన వాటిని నీటిలో ఉడకబెట్టి, అవి బాగా ఇటికిలా గట్టిపడ్డాక, సెర్వరులూ (కూలీలూ) అతనూ కలిసి గుల్లలు విడదీస్తారు.

వైర్‌ఫెన్సింగు కి బైట పారవేయబడిన ఆ గుల్లలు రోజూ ఒక స్తూపంలా తయారవుతాయి.

తెల్లవారుఝామున ట్రెయిను వచ్చి ఆగుతుంది. కూడా కంపార్టుమెంటులోంచి దిగి ట్రెయిను రెండు ప్రక్కలా మిలిటరీ గార్డు వచ్చి నిలబడుతుంది. బయనెట్‌లు పైకి ఎత్తి రైఫిల్సు తీసుకుని, వాళ్లు యుద్ధ ఖైదీలను కాపలా కాస్తారు. చారల బట్టలు కట్టుకున్న విదేశీ ఖైదీలు అప్పుడు ఒక్కొక్కప్పుడూ ఒక్కొక్క పింగాణీ కప్పు, ఎనామెలు ప్లేటు పుచ్చుకుని గదుల్లోంచి బైటకు వస్తారు. రెండు పెద్ద పెద్ద డ్రమ్ములు బోర్లించి వాటి రెండింటిని బల్ల క్రింద తయారు చేసి నిలబెడతారు సర్వర్లు (కూలీలు) మొత్తం ముగ్గురు. ఆ పైన ఒక్కొక్క ఖైదీకి వరుసగా బ్రేక్‌ఫాస్టు పడ్డిస్తారు. ఒకడు మగ్గులో కాఫీపోస్తాడు. ఒకడు బ్రెడ్డూ, మరొకడు కోడిగ్రుడ్డూ పళ్లెంలో వేస్తారు. అంతే, అంతటితో వాళ్లు వెళ్లి ట్రెయిను ఎక్కుతారు. బుజాలు పైకి పెట్టిన కాఖీ బుష్‌షర్టు తొడుక్కున్న గార్డు అప్పుడు విసిల్ ఊది, జెండా ఊపగా, ట్రయిన్సు వెళ్లిపోతుంది.

మాహోతా జనం ఎవ్వరూ దగ్గరకు రారు. దూరంగా పొలంలో యజమానుల తరఫున విత్తనాలు నాటుతున్న వాళ్లల్లా, తిన్నగా నిలబడి, అదంతా వెర్రికళ్లు పెట్టి తేరిపార చూస్తారు.

ట్రెయిను వెళ్లిపోయాక భగవతీలాల్ అజమాయిషీలో అన్ని సరుకులూ గుడారంలో పెట్టి కూరలు కొనేందు కోసం కొన్ని కొన్ని రోజులు మేము మాహోతా వాళ్ల గ్రామం వైపు వెళతాము. పర్వతపు అంచులలో రాళ్లు ప్రోగుచేస్తూ, ఆవాల విత్తనాలు నాటుతూ, వంకాయలూ, బీరకాయాలూ పండిస్తూ ఉంటారు వాళ్లు.

'అందాహాల్ట్‌లో ఒక రోజున రాత్రికి రాత్రి హాల్ట్ స్టేషను [illegible]

పట్టుకొచ్చి పోసి లైను ప్రక్కన ఉన్న వైర్ ఫెన్సింగ్ మధ్య ప్రాంతాన్ని ఎత్తు చేసి ప్లాట్‌ఫారంగా తయారు చేశారు. అప్పుడింక ఖైదీల కాంపు మూసేసారు. మధ్య మధ్య ఒక మిలిటరీ స్పెషలు ట్రెయిను వచ్చి ఆగుతూంది. అమెరికను సైనికుల స్పెషల్ మిలిటరీ పోలీసు వాళ్ళు ట్రెయిను దిగి వేళాకోళాలు చేస్తూ అటూ ఇటూ పచారు చేస్తారు; సైనికులందరికీ గిన్నెలలో కాఫీ, ప్లేటులలో రొట్టి, కోడిగ్రుడ్లూ యధావిధిగా పంచిపెట్టబడతాయి. దాని తర్వాత ఎవరి పెట్టిలో వాళ్ళు ఎక్కుతారు; గార్డు ఈల ఊదుతాడు. జెండా ఆడిస్తాడు; నేను వెళ్ళి సప్లై లు అందించే చోట మేజర్‌కి ఒ.కె. చెప్పి వస్తాను.

ట్రెయిను వెళుతుంది; ఎక్కడికో, ఏ వైపుకో ఎవరికీ మాకు తెలియదు.

ఒకరోజున ఇలాగ అమెరికను సైనికుల ట్రెయిను వచ్చి నిలబడింది. సర్వర్లూ ముగ్గురూ రొట్టీ, కాఫీ అందించారు. భగవతీ లాల్ ఏమైనా కోడిగ్రుడ్లులు చెడిపోయినవి ఉన్నాయా, కాఫీ ఏమైనా ఒలుకుతుందా మొదలైన వాటి గురించి పర్యవేక్షణ చేస్తున్నాడు.

సరిగ్గా అదే సమయంలో అకస్మాత్తుగా వైర్‌ఫెన్సింగు అవతల సరిహద్దు పైన నా దృష్టి పడింది.

ముళ్ళ కంచెకి కొంచెం దూరంలో ఒక చిరుగు నిక్కరు కట్టుకున్న 'మాహాతా' కుర్రవాడు కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తున్నాడు. మరొక రోజున నడుంకు రంగు బెల్టు కట్టుకుని గేదెపై ఎక్కి సవారు చేస్తూన్న కుర్రవాణ్ని చూశాను. ఆ కుర్రవాడు నిశ్శబ్దంగా ట్రెయిను కేసి చూశాడు. - ఏమిటిరా ఈ తెల్ల అమెరికను సైనికులని చూశాడు.

ఒక సోల్జరు వాణ్ని చూసి హఠాత్తుగా 'ఏయ్, ఏయ్ అని అరుస్తూ పిలిచాడు. ఆ చిరుగు నిక్కరు కట్టుకున్న మాహాతా వాళ్ల కుర్రవాడు వెంటనే వాళ్ల ఊరువైపు పరిగెత్తుకుంటూ పారిపోయాడు. వాణ్ని చూసి కొందరు అమెరికన్లు 'హ, హ్హో', అంటూ నవ్వుకున్నారు.

కొన్నాళ్ళు ఆ కుర్రవాడు ఇంక అక్కడికి రాడనుకున్నాను.

మాహాతా వాళ్ళు ఎవరూ కూడా రావడం లేదు. పొలంలో పనిచేసుకుంటూ దూరాన్నుంచే నిశ్శబ్దంగా నిలబడి అప్పుడప్పుడు చూస్తూ ఉండేవారు.

కాని ఆ తర్వాత మళ్లీ ఒకసారి ట్రెయిను రావడం, ట్రెయిను ఆగడం చూసి ఆ ఇనుప బెల్టు, పెట్టుకున్న కుర్రవాడు ఫెన్సింగు బైటకి వచ్చి నిలబడ్డాడు. వాడి కంటె పెద్ద వాడు మరొక కుర్రవాడు కూడా ఉన్నాడు. మెడలో ఎర్రటి త్రాడు వ్రేళ్లాడేసిన తగరపు రక్షరేకు: భూర్‌కు సంతకు ఒక రోజున వెళ్లాను; అక్కడ కుప్పలు కుప్పలుగా అమ్మకానికి ఉన్నాయి. మట్టిఉండలు, కుంకుమ,

తాపీదులు (కంచు, రాగి, తగరంతో చేయబడినవి) ఒక వాసానికి రంగు రంగుల త్రాళ్లతో వ్రేళ్లాడేసి ఉన్నాయి - ఇంకా పూసల దండలూనూ, మోకాళ్లనిండా బూడిదతో, బుజం పై లెక్క లేనన్ని పూసల దండలు పెట్టుకుని, దూరాన్నుంచి మాహాతా వాళ్ల ఊరు వైపు నడిచి వెళుతున్న ఒక పీథి అమ్మకపు వాణ్ని చూశాను.

ఇక్కడ ఆ బాలకులిద్దరూ మౌనంగా అమెరికను సైనికుల వైపు తేరిపార చూస్తున్నారు. మొట్టమొదట నుంచీ చూసిన కుర్రవాడి కళ్లలో కొంచెం భయం కనుపిస్తోంది; మోకాళ్లు పరిగెత్తేందుకు సిద్ధంగా వంచబడి ఉన్నాయి; వాడి కళ్లలో ఏదో నింద నిండి ఉన్నా కూడా అవి ఒక హడలి పోయిన లేడి కళ్లలా తోస్తున్నాయి.

నేను చేతిలో ఫారం పుచ్చుకుని అటూ ఇటూ తచ్చాడుతున్నాను. అవకాశం పొందడాన్ని బట్టి నవ్వుతూ మేజర్‌ని ముఖస్తుతి చేశాను. ఒక సైనికుడు తన కంపార్టు మెంటు తలుపుకి ముందుగా నిలబడి కప్పులోంచి కాఫీ త్రాగుతూ కుర్రవాళ్లనిద్దరినీ చూసి తన ప్రక్కనున్న జి.అయి. తో వాళ్లని ఉద్దేశించి ఫూల్ అన్నాడు.

ఇన్నాళ్లూ నాకు మనస్సుకి తట్టలేదు మామూలుగా వాడిది వ్యవసాయపు పనిచేయడం; ఉండీ దెబ్బ, లేకపోతే కర్రవిల్లూ, బాణం పుచ్చుకుని పిట్టలను కొట్టడం; నాట్యపు పాటలు పాడడం వినడం; గంజి త్రాగడం విల్లు నారి లాగ అప్పుడప్పుడు వంగుతూ సాగుతూపొగరు బోతులా ఎదిరిస్తున్నట్లు నిలబడడం. చిరిగిన లాగు కట్టుకున్న వాడి శరీరం సన్నగా, నల్లగా, గరుగుగా ఉంటుంది. కాని అమెరికను సిపాయి అన్న 'ఎ ఫూల్' మాట నా గుండెకు ముల్లులా గ్రుచ్చుకుంది. ఆ కుర్రవాళ్లిద్దరి మీద నాకు చాలా కోపం వచ్చింది.

ఆ సైనికులలో ఒకడు గొంతుక సవరించి పాట పాడాడు. ఒకళ్లిద్దరు 'హహ్హ' అంటూ నవ్వారు; మరొకడు కాఫీ త్వరగా త్రాగేసి నర్వరుకేసి కన్ను కొట్టి కప్పులో మళ్లీ కాఫీ నింపమన్నాడు. గార్డు కొంతసేపు పోయాక ముందుకు వచ్చి చూశాడు. గార్డు పంజాబీ వాడు. కాని ఏదో ముక్కుతో మాట్లాడుతున్నట్లు మేజర్ తో కబుర్లు చెపుతున్నాడు. తర్వాత ఈల ఊదాడు, జెండా ఆడించాడు, అందరూ హడావుడిగా ట్రెయిను ఎక్కారు - చొక్కాలకు ఎర్రటి గుడ్డ గుర్తు ఉన్న మిలిటరీ పోలీసు వాళ్లతో సహా.

ట్రెయిను వెళ్లిపోయింది. మళ్లీ అంతా నిర్మానుష్యం. విశాలమైన ఇసుక ఎడారి మధ్య డొంక ముళ్ల చెట్టు లాగ ఆ ఒక్క వైర్ ఫెన్సింగ్ మాత్రం కనుపిస్తుంది.

మళ్లీ కొన్నాళ్లకు ట్రెయిను వచ్చింది. ఈసారి యుద్ధ ఖైదీల బండి, ఇటాలియన్ ఖైదీలు రామగడ్ నుంచి మళ్లీ ఎక్కడికో పంపబడ్డారు. ఎక్కడికో నాకు తెలియదు; తెలిసి కోవాలని లేదు. వాళ్ల చారల బట్టలలో దైన్యం ఉంది. వాళ్ల

ముఖాలలో చిరునవ్వు లేదు. ప్రతిక్షణం వాళ్ల చుట్టూ రైఫుల్స్ పైకి ఎత్తి పెట్టి ఉన్న సైనికుల కాపలా, మాకు కూడా ఏదో భయం వేసేది. భూర్ కుండాలో మాట విని వచ్చాను. ఒకడు పంచా, లాల్చీకట్టుకుని పారిపోవడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడని బెంగాలిని కాబట్టి నా కింకా భయం వేసింది.

ట్రెయిను వెళ్లి పోయాక నేను గమనించాను - ముళ్ల కంచె అవతల సరిగ్గా అ ఇద్దరి కుర్రవాళ్లు, బిగువు బట్టలు ధరించిన ఒక 15 సంవత్సరాల పిల్లా, ఇద్దరు పెద్ద మగవాళ్లు, పొలం పని విడిచి అక్కడకు వచ్చి నిలబడ్డారు. ట్రెయిను వెళ్లిపోయాక వాళ్లందరూ వాళ్లల్లో వాళ్లు మాట్లాడుకుని, నవ్వుకుని, ఏదో జలపాతం చప్పుడయినట్లు కిలకిలలాడుతూ 'మాహాతా' వాళ్ల ఊరు వైపు వెళ్లిపోయారు.

ఒకడు, ఇద్దరు, ఐదుగురు - అవేళ మాహాతా గ్రామజనం ట్రెయిను కనిపించేసరికి పొలంలోంచి పరుగెత్తుకు రావడం చూశాను. ట్రెయిను కిటికీలోంచి ఖాకీ రంగు బట్టల వాళ్ల ని చూసేసరికి వాళ్లకి విషయం తెలుస్తుంది. రోజుకి రెండు పాసెంజరు బళ్లు 'మెయిలు' బండిలా 'హాన్' మంటూ ఒకటి రెండు గూడ్సు బళ్లు ఠన్ఠన్ అంటూ, నడుస్తాయి. అప్పుడు అవి ఏమైనా ఆగినా కూడా, మాహాతా జనం హడావుడిగా వచ్చి వాటిని చూడరు.

ఒక రోజున వెళ్లి మాహాతా వాళ్ల పెద్దను అడిగాను - వాళ్ల తాలూకు ఎవరినైనా పంపి మా క్యాంపులో కూరలూ, చేపలూ, రొయ్యలూ, మొదలైనవి అమ్మించమని.

ఆ పెద్ద నవ్వి అన్నాడు- "పొలం పని విడచి రాలేము".

తర్వాత నేను నిర్ఘాంతపోయి చూశాను - నల్ల, నల్లగా చిరుగులాగులు కట్టుకున్న గ్రామపు జనాన్ని: పొట్టి చీరలు కట్టుకున్న ఆడపిల్లల్ని. ఇంచుమించు దిగంబరంగా ఉన్న ఆ మాహాతా పెద్ద, కాళ్లకు ఒక పూర్వకాలపు త్రాళ్ల జోడు (అవి పల్లెటూరు తయారి) కట్టుకుని వచ్చి, ముళ్లకంచెకు అవతలగా వాళ్లవరుసలో నిలబడ్డాడు.

అదే క్షణంలో ట్రెయిను వచ్చేసింది. వెంటనే దిగారు అమెరికన్ సైనికులు - వరుసగా నిలబడ్డారు తమ తమ కప్పులూ, ప్లేట్లతో.

అప్పుడు బి.ఎన్.ఎఫ్. 332 స్టేషనులో 218 బ్రేక్‌ఫాస్టులు సిద్ధపరిచి ఉంచబడ్డాయి.

ఆ కాలంలో కొంచెం చలి ప్రారంభమయింది. దూరపు కొండలు పొగమంచు (మఫ్లర్) కప్పుకున్నాయి. చెట్లల్లోని ఆకుపచ్చదనాన్ని శిశిర ఋతువు తుడిచి పెట్టేసింది.

ఒక సైనికుడు యాంకీ గొంతుతో తన ముగ్ధతను వెల్లడిచేశాడు. మరొక సైనికుడు తన కంపార్టుమెంటు ఎదురుగా నిలబడి ముళ్ల కంచెకు అవతల ఉన్న

శూన్య ప్రదేశాన్ని తదేక దృష్టితో పరిశీలించాడు. అకస్మాత్తుగా అతను తన కాఫీ కప్పు ట్రెయినులోని గూడులో పెట్టి లాగు జేబులో చెయ్యి పెట్టాడు. పర్సులోంచి ఒక మెరిసే అర్ధరూపాయి బైటకు తీసి ఆ మాహాతా వాళ్ల వైపు విసిరాడు.

వాళ్లు నిర్ఘాంతపోయి సైనికుల దిక్కుగా చూశారు; ముళ్ల కంచె లోపల మట్టి పైన పడి ఉన్న ఆ మెరిసే అర్ధరూపాయి దిక్కుగా చూశారు; ఒకళ్ల కళ్లల్లోకి మరొకరు తమలో తమరు చూసుకున్నారు; తరువాత నిశ్శబ్దంగా ఉండిపోయేరు.

ట్రెయిను వెళ్లిపోయాక వాళ్లు నిశ్శబ్దంగా వెళ్లిపోవడం చూసి నేను అన్నాను, "దొరగారు బహుమానం ఇచ్చారు, బహుమానం, ఎందుకు తీసుకోరూ?"

అందరూ ఒకళ్ల ముఖం మరొకరు చూసుకున్నారు. కానీ ఎవ్వరూ ముందుకు వచ్చి దాన్ని తీసుకోలేదు.

నేను అర్ధరూపాయి తీసి వాళ్ల పెద్ద చేతిలో పెట్టాను. అతను వెర్రి మొహం పెట్టి నాకేసి చూస్తూ అలా ఉండిపోయాడు; తర్వాత అందరూ మాట్లాడకుండా వెళ్లిపోయారు. ఎవరి నోటమ్మటా ఒక్క మాట బైటకి రాలేదు....

నాకీ కంట్రాక్టర్ల వ్యవహారం ఏమీ నచ్చలేదు. ఇక్కడెక్కడా జనసంచారం ఉండదు; ఒక్క పాసెంజరు ట్రెయినైనా ఆగదు; క్యాంపులో భగవతీలాల్, ముగ్గురు సర్వర్లు. నిర్మానుష్యం, నిర్మానుష్యం. ఇక్కడ మట్టి గరుకు, మధ్యాహ్నపు ఆకాశం తీవ్రమైనది; నా మనస్సు చింతాకులమైనది.

మాహాతా గ్రామవాసులైనా దగ్గరకు రావడం మానేశారు. అప్పుడప్పుడు నేనే వెళ్లి అక్కడ కూరలూ, లేక చిన్న చేపలూ కొనుక్కుని వస్తూ ఉంటాను. వాళ్లు అమ్మేందుకు రావడం లేదు మా దగ్గరకు. 3 క్రోసులు దూరంలో ఉన్న భూర్‌కుండా లోని సంతకు వెళుతున్నారు.

కొన్నాళ్లు ఏ ట్రెయిను రాక గురించి కబురు రాలేదు. నిశ్శబ్దం నిశ్శబ్దం.

అనుకోకుండా ఒక రోజున ఆ లోహపు బెల్టు పెట్టుకున్న కుర్రవాడు వచ్చి అడిగాడు: "టెరియిను రాదాండి, బాబుగోరూ?"

నవ్వుతూ అన్నాను: "వస్తుంది, వస్తుంది".

బాలుడిలో ఏం దోషం ఉంది? పొట్టివీ, దట్టమైనవీ పర్వతాలు, గరుకునేల; ఒక పల్లెటూరి జనసమూహంలో నివాసం; 2 క్రోసుల దూరంలో ఉన్న సంతకు వాడిపోయిన చెట్లూ, దుబ్బుల మధ్య నుంచీ వెళ్లాలి. తెల్లవారు ఝామున ఒక పాసెంజరు ట్రెయిను స్పీడు తగ్గించకుండా తుస్సుమంటూ వెళుతుంది. సాయంత్రం డవున్ ట్రెయిను ఆగదు; అయినా ఏదో సమయాన ట్రెయిను కిటికీలోంచి అస్పష్టంగా కనుపించే ముఖాల్ని చూడగలనే మోనని క్యాంపులోంచి బైటకు వచ్చాను. మనుష్యులను చూడక, క్రొత్త ముఖాలు చూడక, నా బెంగ

ఎక్కువైపోతుంది.

ఆ అమెరికను సైనికుల స్పెషలు ట్రెయిను వస్తుందన్న వార్త విని ఎంత గాభరా పడతానో మళ్ళీ అంత తృప్తి కూడా కలుగుతుంది.

కొన్నాళ్ల తర్వాత ముందు కబురు వచ్చింది; దాని మరుసటి రోజున మిలిటరీ స్పెషలు వచ్చింది. టక టకమంటూ దిగారు; వరుసగా నిలబడి, కాఫీ, గ్రుడ్లులూ, రొట్టీ స్వీకరించారు.

హఠాత్తుగా చూసేసరికి ముళ్ల కంచెకు అవతల వైపున మాహాతా గ్రామపు జనం గుంపుగా వచ్చి పడ్డారు. 20 మంది ఉండవచ్చు, 30 మంది ఉండవచ్చు; మోకాళ్లంత ఎత్తు ఉన్న చిన్న పిల్లలతో కలిపి ఎంతమందో వాళ్ళు చెప్పలేను. పొట్టి చీరలు కట్టుకున్న ఆడపిల్లలు కూడా వెర్రి చూపులు చూస్తూ ఆ గుంపుతో కూడి చూస్తున్నారు. వాళ్లందరినీ చూసేసరికి నాకేదో భయం అనిపించింది. భగవతీ లాల్ కాని ముగ్గురు సెర్వర్లు కానీ మాహాతా గ్రామం వైపు వెళతారంటే నాకు చాలా భయం.

ప్లాట్‌ఫారం అని నిక్కచ్చిగా లేదు, ఊరికే ఎక్కడానికీ, దిగడానికీ వీలుగా పట్టాల ప్రక్కన కొంచెం ఎత్తుగా మట్టి పోశారు. అమెరికను-సైనికులు కాఫీత్రాగుతూ అటూ ఇటూ తిరుగుతున్నారు. ఒకళ్లిద్దరు స్థిరదృష్టితో ఆ మాహాతా గ్రామపు నల్లటి వ్యక్తులను చూస్తున్నారు.

ఉండిఉండి ఒకడు తన జేబులోంచి మనీపర్సు తీసి, అందులోంచి రెండు రూపాయిల కాగితం లాగి భగవతీలాల్‌ని అడిగాడు: "దీనికి చిల్లర ఉందా?" నోటు మార్చి అమెరికను సైనికులు చిల్లరేమీ అట్టే బెట్టుకోరు. చాలా సార్లు వాళ్ళు, దుకాణదారులనీ, వీధిలో అమ్ముకునే వాళ్లనీ, టాక్సీడ్రైవర్లనీ "ఫర్వాలేదు, ఫర్వాలేదు" అని చిల్లర అట్టేబెట్టుకోమని చెప్పడం చూశాను రాంచీ వెళ్లినప్పుడు.

అణాలూ, బేడలూ, పావలాలూ కలిపి భగవతీలాల్ చిల్లర ఇచ్చాడు: ఇంతట్లో ఆ ముళ్ల కంచె అవతల ఆ బెల్టు పెట్టుకున్న కుర్రవాడు చెయ్యి చాచడం చూశాను.

అంతలో భగవతీలాల్ దగ్గర తీసుకున్న చిల్లర ఆ అమెరికను సైనికుడు మాహాతా గ్రామస్థుల గుంపులోకి విసిరేసాడు....

నా సప్లై ఫారంని 'ఓ.కె.' చేసి, గార్డు ఈల ఊదాడు.

ట్రెయిను కదలడం మొదలు పెట్టిందనేసరికి, నేను మాహాతా జనం వైపు చూశాను.

వాళ్లు అలా చూస్తూనే నిలబడిపోయారు. అటుపైన నే నింత క్రితం చూసిన, గేదెపైన ఎక్కిన, బెల్టు కట్టుకున్న వాడూ వాడి స్నేహితుడు మెళ్ళో తాయీజు

కట్టుకున్నవాడూ ఆ చిల్లర డబ్బులను ప్రోగు జేయడానికి ప్రయత్నించారు.

ఈలోగా ఆ త్రాళ్ల జోడు తొడుక్కున్న మాహోతా పెద్ద, వాళ్లని తిడుతూ అన్నాడు: "ఖబడ్దార్!" అతని గట్టి అరుపు విని నేను కూడా హడలిపోయాను.

కాని ఆ కుర్రవాళ్లిద్దరూ అతని మాటలు వినలేదు. వాళ్లు దొరికినంత మట్టుకు అణాలూ బేడలూ ప్రోగు చేసి తీసుకున్నారు. త్రొక్క వలిసిన జొన్న పొత్తి మాదిరిగా ఉంది వాళ్ల నవ్వు ముఖం. ఆడవాళ్లూ, మగవాళ్లూ అందరు కూడా నవ్వారు.

ఆ త్రాళ్ల జోడు తొడుక్కున్న పెద్దవాడు మటుకు కోపంతో వాళ్లందరినీ తమ భాషలో అనర్గళంగా ఏదో దూషిస్తున్నాడు. ఆడవాళ్లూ, మగవాళ్లూ నవ్వారు.

మాహోతా పెద్దమటుకు కోపంతో గిజగిజ లాడుతూ తను ఒక్కడూ స్వగ్రామం వైపు బయలుదేరాడు. ఆడవాళ్లూ, మగవాళ్లూ కూడా తర్వాత, గలగల లాడుతూ మాట్లాడుకుంటూ కిలకిలమని నవ్వుకుంటూ వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్లాక మళ్లీ "అండాహోల్ట్" నిర్మానుష్యం, నిశ్శబ్దం అయిపోయింది. నా మనస్సు ఒక్కొక్కప్పుడు మరీ చిరాకు పడుతోంది. దూరాన కొండలూ, 'మాహోతా' పళ్లతోట, కూరల తోట దాటాక ఒక చిన్న జలధార, దాని తర్వాత మాహోతా వాళ్ల ఆకుపచ్చని పొలాలు. కళ్లు చల్లబడి హాయి అనిపిస్తుంది. వాట్ల మధ్య నల్లనల్లగా చిరుగులాగులు కట్టుకున్న మనుష్యులు.

ఇలాగ మధ్యమధ్య అమెరికను సోల్జరులు ట్రెయిను రావడం, ఆగడం, వాళ్లు గ్రుడ్లు, రొట్టి, కాఫీ సేవించి వెళ్లిపోవడం. మహోతా గ్రామపు జనం గుంపులుగా రావడం, ముళ్ల కంచెకు అవతల నిలబడి తేరిపార చూడడం...

- "దొరగారూ, బహుమతి! దొరగారూ! బహుమతి!"

ఒక్కసారి అనేకమంది పల్లెజనం అరిచారు.

మేజరు దగ్గరకు సప్లైఫార్మ్ ని "ఓ.కె." చేయించేందుకు వెళ్లి నేను చకితుణ్ణయి తిరిగి వాళ్లకేసి చూశాను.

చూసేసరికి ఆ ఇద్దరు కుర్రాళ్లే కాదు, కొంతమంది యువకులు కూడా చేయిచాపారు. పొట్టి చీరకట్టుకున్న ఒక హుషారైన ఆడపిల్ల కూడా ఉంది.

తర్వాత ఒక రోజున కూరలు కొనేందుకు నేను వెళ్లినప్పుడు ఆ పిల్ల అడిగింది: "టెరియిను ఎప్పుడొస్తుంది?"

ఒక్కొక్క రోజున వీళ్లందరూ నిష్కారణంగా వచ్చి, చాలాసేపు ఎదరుచూసి, చూసి వెళ్లి పోయేవారు...

బుజానికి 3 చారలు గల చొక్కా తొడుక్కున్న అమెరికను ఒకడు వాళ్లను చూడగానే జేబులోంచి గుప్పిళ్ల తోటి అణాలూ, బేడలూ తీసి వాళ్లవైపు విసిరేవాడు.

ట్రెయిను వెళ్లేవరకూ ఆగకుండానే, వాళ్లు ఆ డబ్బుల మీద పడిపోయేవారు. పోగు చేసుకునేందుకు. హడావుడిలో వైర్‌ఫెంన్ లోని ఖాళీలోంచి కాళ్లూ, చేతులూ దూర్చి డబ్బులు లాగడంలో కొంతమంది బట్టలు చిక్కుకు చిరిగిపోయేవి.

ట్రెయిను వెళ్లాక వాళ్లని సావధానంగా పరీక్షించి చూశాను. ఇంచుమించు మాహాతా గ్రామంలోని సగం మంది వచ్చి పడ్డారనిపించింది. అందరికీ ఏదో కొంత డబ్బు దొరికే సరికి వాళ్ల ముఖంలో ఆనంద రేఖలు వెలిగేవి. కాని ఎంత కళ్లు చిల్లులు చేసుకుని చూసినా, ఆ త్రాళ్ల జోడు కట్టుకున్న పెద్ద కనిపించే వాడు కాదు. అతను రావడం లేదు. ఆ రోజున అతని అడ్డు పెట్టడం, దూషించడం నిర్లక్ష్యం చేసి కుర్రవాళ్లిద్దరూ డబ్బులు ఏరుకున్నారు. అందుచేత అతను కుపితుడై రావడం మానుకున్నాడు.

అతను ఒక్కడూ చేనులో నిలబడి మట్టి త్రవ్వడం తలుచుకుని నేను మనశ్శాంతిపొందాను.

వంటవాడు భగవతీలాల్, ముగ్గురు సర్వర్లూ, నేనూ మేము ఐదుగురం ఎలాగోలాగ క్యాంపులో రోజు వెళ్లబుచ్చే వాళ్లం. మధ్య మధ్య ఒక్కొక్క రోజున సైనికుల ట్రెయిను వచ్చేది, ఆగేది, వెళ్లేది. మాహాతా గ్రామపు గుంపు ముళ్లకంచె బైట నిలబడి, "సాబ్, బక్షీష్! బక్షీష్!". (దొర గారూ, బహుమతి! బహుమతి!) అని చేతులు జూపి అరిచేవారు.

అకస్మాత్తుగా ఒక రోజున మాహాతా వాళ్ల పెద్దను చూడడం తటస్థించింది. ఒక రోజున పొలం పని అపు చేసి, చేతుల్లోని దుమ్ము దులుపుకుంటూ కంగారుగా వచ్చి వాళ్లందరిని కోపపడి దూషించాడు. అతని మాట ఎవరూ పట్టించుకోక పోవడం వల్ల నిస్సహాయుడై వాళ్ల పనిని అడ్డగిస్తున్నట్లు కంటి చూపును ప్రకటిస్తూ వాళ్లని చూస్తున్నాడు.

కానీ వెనుకకు తిరిగి అతని మాట ఎవరూ వినడం లేదు. సైనికులు నవ్వుకుంటూ పాంటు జేబులోంచి గుప్పిట్లతో చిల్లర తీసి వాళ్ల వైపు విసురుతున్నారు. మహాతా గ్రామపు గుంపు ఆ డబ్బు ఏరుకోవడంలో ఒకరి నొకరు త్రోసుకుంటూ పోవడంలో వాళ్లల్లో వాళ్లకు దెబ్బలాటలు బయలుదేరాయి. అది చూసి సైనికులు 'హ,హ్హా' అంటూ నవ్వుతున్నారు.

ఆఖరికి మిగతా రోజులలో చూశాను. త్రాళ్ల జోడు కట్టుకున్న వృద్ధుడు రావడం మానేసాడని. అతను మిగతా తన జనంపై కోపగించడం, అతనింక రాకపోవడం – ఇదంతా నాకు ఒక విధంగా గర్వకారణమైంది. కారణమేమంటే, ఒక్కొక్కప్పుడు ఈ పల్లెటూరి జనం యొక్క వ్యవహారం చూస్తే, నాకూ, భగవతీ లాల్‌కీ చాలా చిరాకు కలిగేది. లోలోపల మేము సిగ్గుపడే వాళ్లం. వాళ్ల నల్లదనం, దరిద్ర వేషం

చూసి సైనికులు వాళ్లను ముష్టి వాళ్లలా పరిగణిస్తున్నారు. ఆ సంగతి మాకు చాలా ఏవగింపు కలిగించింది.

ఒక రోజున ముళ్లకంచె అవతల వైపు నుంచి ఆ జనం 'బక్షీష్, బక్షీష్' అని అరవడం విని - ఓ ప్రక్కన గార్డు జానకీనాథతో మాట్లాడుతూండగా- మా ప్రక్కన ఉన్న ఒక ఆఫీసరు వాళ్ల కేకల వల్ల విసుగు పుట్టినవాడై వాళ్లని ఉద్దేశించి అన్నాడు: "బ్లడీ బెగ్గర్స్" నేనూ, భగవతీలాల్ ఒకరి ముఖంలోకి మరొకరు చూసుకున్నాం. అవమానంతో మా ముఖాలు నల్లబడ్డాయి. తల ఎత్తుకోలేక పోయాం. భరించలేని కోపం మూలాన లోలోపల దుర్భర జ్వాల ప్రజ్వరిల్లింది.

"బ్లడీ బెగ్గర్స్! బ్లడీ బెగ్గర్స్"

నా కోపం అంతా మాహోతా పల్లెజనం పై పడింది. ట్రెయిన్ వెళ్లగానే, భగవతీ లాల్‌ని కూడా తీసుకు వెళ్లి వాళ్లకి బుద్ధి చెపుదామని వెళ్లేసరికి, వాళ్లందరూ డబ్బులు ప్రోగు చేసుకుని బట్టల్లో మూటకట్టుకుని నవ్వుకుంటూ పారిపోయారు.

అయినా వాళ్ల గురించి నాకు కలిగిన అవమానాన్ని నా అహంకారంలో దాచి ఉంచుకున్నాను. కొండలా పైకి లేస్తున్న ఆ అహంకారం ఆ మహోతా పెద్ద ముఖాన్ని నా కళ్ల ఎదుట నిలబెడుతోంది ఒక ప్రక్క నుంచి.

కాగా ఆవేళ నా హృదయాంతరాళంలో నిండైన ఆ మంట చల్లారిపోయింది.

భూర్‌కుండా కంట్రాక్టర్ల నుంచి క్యాంపు మూసేయమని తీసుకు వచ్చాను, వాళ్లను కలుసుకునేందుకు వెళ్లినప్పుడు.

ఇద్దరు సర్వర్లు అప్పుడు టేబులుగా వాడబడే రెండు డ్రమ్ములను 'అండాహాల్ట్' పెంసింగు అవతల (గుడారం త్రాళ్లను ఆధారాలను మరొకడు పీకేసాడు!) డ్రమ్ముల మీద ఒక్కతాపు గట్టిగా తన్ని భగవతీ లాల్ అన్నాడు: "ఆట అయిపోయింది".

ఇంతట్లో ఏదో గందరగోళంగా గొడవ వినపడగా వెనక్కి తిరిగి చూసేసరికి మాహోతా గ్రామవాసులు పరిగెట్టుకుంటూ వస్తున్నారు.

నేను నిశ్చేష్టుడనై వాళ్ల వైపు చూశాను. ఎందుకో ఏమో భగవతీ లాల్ నవ్వడం మొదలెట్టాడు.

వెంటనే వాళ్లందరూ ముళ్ల కంచెకి అవతల గుంపుగా నిలబడ్డారు.

అదే సమయంలో ఒక ఈల వినబడింది, ట్రెయిను వస్తున్న శబ్దం కూడా అయింది.

వెనక్కి తిరిగి చూస్తే ట్రెయిను వంపు తిరిగి 'అండాహాల్ట్' వైపే వస్తోంది; కిటికీలలో ఖాకీ దుస్తులు కనువిస్తున్నాయి.

మేము గాభరాపడిపోయాం; మేము నిశ్చేష్టులమై పోయాం. అయితే

ఘూర్‌కుండా వాళ్ల ఆఫీసు నుంచి పొరపాటు వార్త అందిందా? లేదే, నేనే వెళ్లి ఆ కబురు తీసుకు వచ్చాను కదా!

ట్రెయిను ఎప్పుడైతే ముందుకు వచ్చిందో అప్పుడే ఒక విచిత్రమైన 'ధమ్మ్, ధమ్మ్' అని ఏదో పడ్డట్లు చప్పుడు వినపడింది. చప్పుడు కాదు, పాట. ట్రెయిను కొంచెం దగ్గరగా వచ్చేసరికి, ట్రెయినులో సైనికులందరూ గొంతుకలిపి నిండు గొంతుతో పాటలు పాడుతున్నట్లు స్పష్టమయింది.

విభ్రాంతుడనై నేను ఒకసారి ట్రెయిను వైపు చూశాను. అలాగే ఒకసారి ముళ్లకంప వైపున ఆ గుంపు వైపు చూశాను. అదే సమయంలో నా కంటికి ఆ మాహాతా గ్రామపు పెద్ద కనుపించాడు.

మిగతా గుంపుతో కూడి ఆ వృద్ధుడు కూడా చేయి జాపి 'బక్షీష్, బక్షీష్'' అని అరుస్తున్నాడు.

వాళ్లందరూ, పిచ్చెత్తినట్లు, ముష్టి వాళ్లలా అరుస్తున్నారు. స్త్రీ పురుషులూ, ఆ ముసలి వాడూనూ.

అయితే మిగతా రోజుల్లో లాగ అమెరికను సైనికులు ఈసారి 'అండాహాల్ట్'లో ఆగలేదు. పాసెంజరు ట్రెయినులలాగే ఈ స్పెషలు ట్రెయిను కూడా 'అండాహాల్ట్'ను నిర్లక్ష్యం చేసి తుస్సుమంటూ వెళ్లిపోయింది.

ట్రెయిను ఇంకెప్పుడూ ఇక్కడ ఆగదని మాకు తెలిసింది.

ట్రెయిను వెళ్లిపోయింది. కాని మాహాతా గ్రామస్థులందరూ మటుకు ముష్టివాళ్లలా తయారై కూర్చున్నారు.

పొల్లాల్లో వ్యవసాయం చేసుకునే మనుష్యులందరూ ముష్టి వాళ్లైపోయారు.

---

("భారతవర్షం తదితర కథలూ", 1969)

# పేకమేడ వలె

సయ్యద్ ముస్తాఫా సిరాజ్

## I

## (దీపక్ మిత్రా)

ఎంత దూరం పరుగెత్తి చూసినా, రెండు వైపులా ఒక్క తలుపైనా తెరిచి ఉండడం కనిపించలేదు. ఆఖరికి ఒక్క కిటికీ అయినా తెరిచి లేదు. ఒక్క మనిషైనా కనుపించడం లేదు. బీభత్సకరమైన అంధకారం రోడ్డంతా తడిసి ఉంది. నగరంలో హఠాత్తుగా బ్లాక్ అవుట్ అయినట్లు ఇంత నిస్తబ్ధత చాలా అస్వాభావికంగా ఉంది. రాత్రి 10 గంటలే అయినా, ఇలా వెనుతిరిగి చూస్తే, జరిగిన విపత్తు దృష్ట్యా, నగరం అంతా ఈ విధంగా భయపడి, నిశ్శబ్దంగా ఉందంటే అదేం పెద్ద ఆశ్చర్యకరమైన విషయం కాదు. అటుపైన జనుల రక్తం చల్లబడిపోవడం; తలకాయలోని మెదడు మొరదు కట్టి పోవడం; రామ్‌బాబూ, శామ్‌బాబూ, యదుబాబూ సంచిలో చేయిపెట్టి క్షూరలు బేరం ఆడుతున్నారు – జోళ్ల క్రింద నూతన రక్తం. ఇక, రక్తానికి ఏమీ మాటలు రావు...

వెనాల దూరం నుంచి – చాలా దూరాన్నుంచి అడుగుల చప్పుడు విని ఇంకా గట్టిగా పరుగెత్తి ఆగాను. నాకు తెలుసు, నేను ఇప్పుడు బుర్ర బ్రద్దలయేలా అరిచినా, ఏ తలుపూ తెరవబడదు, ఏ కిటికీ తెరవరూ, ఏ ముఖమూ ఇంట్లోంచి బైటకు పెట్టి జరిగే విషయాన్ని చూడదూ అని. అందరూ భయకారణం ఉన్నప్పుడు తాబేలు తనలోకి తన అవయవాలు ముడుచుకున్నట్లు, తమ తమ గూళ్ళల్లో తమను దాచుకుని ప్రాణం కాపాడు కోవడం గురించే ఆలోచిస్తున్నారు: 'తాబేలు' ఏ విధమైన కంఠస్వరాన్ని బైటకు వినబడనీయడం లేదు.

నగరం ఈ భాగం నాకు పూర్తిగా అజ్ఞాతమైనది. పరిగెత్తి, పరిగెత్తి కావలసినంత తమాషా అయిన విషయాన్ని గ్రహించాను. గొప్ప చేసి చెప్తూ ఉంటారు. 'ఇప్పుడు ఈ పృథివిలోని నీటిలో గాని, నేలపై గాని అంతరిక్షంలో గాని, మానవుడు వెళ్లని చోటు లేదు. అయితే ఎంత ఆశ్చర్యం! ఇప్పుడు ఈ విశాల పృథివిలోని మాట ఇది – ఈ నగరంలోనే చాలా చోట్లు ఉన్నాయి. నేను ఇంతవరకూ అడుగుపెట్టనివి – లేక ఇన్నాళ్లూ నా చేత కనుగొనబడనివి. మానవుని గురించి గొప్ప చెప్పుకోవలసింది ఏముంది? నేను 27 సంవత్సరాల వయస్సు గల పొగరు బోతు యువకుణ్ని – దీపక్ మిత్రా నా పేరు. నేనింతవరకూ ఎన్ని స్థలాలు చూసినా, ఎక్కడకు వెళ్లినా – అల్లాగే నేను కనుగొనని స్థలాలు ఉన్నా– ఇల్లాగే భరించలేని వ్యాకుల జీవనం, ఆపదల తో కూడుకున్న పరిస్థితులూ ఎదుర్కోవలసి వస్తోంది.

ఏ ముహూర్తాన నేను బుద్బుదంలా అదృశ్యం అయిపోతానో ఎవరికోసం ఒక ఉక్కు ముక్కలా ఇష్టం వచ్చినట్లు సాగిపోతానో ఏమో, నా ఈ 27 సంవత్సరాల జీవితం వృథా! నేలపైన నింగిపైన వీచే స్వేచ్ఛా వాయువులలో కూడా నేను కాలిపోవలసిందేనా ఏ నీటిలోనే పడి మునిగి పోవలిసిందేనా, పక్షీ, కుక్కా, కాకులు, అలాంటి వాటికి ఆహారం అయిపోవలసిందేనా, అయ్యో,. ఒక సుందర మధుర ఫలపు తొక్కలాగ అయిపోయాయి నా శరీరం, నా యౌవనం, నా మనస్సు!..

అందుమూలానే నేను పరారి నయిపోయాను. నా శరీరం అంతా వ్యాపించి ఉన్న యౌవనం, నా యువక చిత్తం, తమతమ సహజస్వరంతో హెచ్చరిస్తున్నాయి. "పరిగెత్తి నిన్ను నువ్వు కాపాడుకో! పరిగెత్తి నిన్ను నువ్వు కాపాడుకో!"

కావలసినంత వ్యవహారం చూశాను: వాళ్లు ఇంకా నా పై ఆశ వదలుకోలేదు. నా అంతం చూస్తే కాని వాళ్లకి తృప్తి లేదు. వాళ్లు నాతో సమానంగా, నన్ను వెంటాడుతున్నారు. ఇలాగ నేడు ఈ విపత్కరమైన రాత్రిలో నగరం కూడా వింతగా మారిపోయింది - చరిత్రకు పూర్వ కాలపు నిబిడారణ్యం ఇప్పుడు నాగరికతతో అలంకరించబడిన ఉద్యాన వనం అయిపోయింది. అన్ని స్కై స్క్రేపర్సూ తమ ఉదరాలు తెరిచి ఒక విశాల వృక్షంలా నిలబడి ఉన్నాయి. అలాగే రామబాబులూ, శ్యామబాబులూ, యదుబాబులూ అందరూ ప్రాకుతూ, ప్రాకుతూ ఈ చీకటిలోనే స్వర్గం (గార్డెన్ అఫ్ ఈడెన్) లోనిది ప్రథమ వృక్షం (ట్రీ అఫ్ నాలెడ్జి) వ్రేళ్లని వెతుక్కుంటున్నారు - ఏ వృక్షపు ఫలాన్ని తిని మానవ జాతి మొదటివాడైన ఆదాం తన వంశీయులకు అనేకమైన ఇబ్బందులు కలగజేసాడో, అదే. వాళ్ల చేతుల్లో నేడు అదే మూటలో చిన్నచిన్నవి 3 గొడ్డళ్లు ఉన్నాయి. -వాటి ఒక్కొక్కటి ధర ప్రకటించిన ప్రకారం 5 పైసలు మాత్రం!

ఈసారి నా ముందు ఒక మూడు రోడ్ల కలియక తటస్థ పడింది. క్రిందగా వెళ్లడమూ, ఎడం ప్రక్కగా నా అని కొంతసేపు తటపటాయిస్తూ ఉండగా, ఒక విచిత్రమైన గుండు వచ్చి ప్రేలింది. ఆశ్చర్యం ఏమిటంటే, ఆ గుండు ప్రేలిన కారణంగా వెలువడిన అగ్ని కణాలను చూసి అవి వచ్చిన దిక్కుని కనిపెట్టాలని నా మెడ అటూ ఇటూ త్రిప్పాను! ఇలా ఆపద కాలం లో కూడా నా దురవగాహమైన చంటితనం తన పని తను సరిగ్గా చేసుకోవలిసిందే!

మరుసటి క్షణం ఒక్క గెంతు వేసి ఎడమ వైపు పయనించాను., ఆ పైన పైనుంచి ఒక వెలగు కంటికి కనపడింది. ఒక కిటికీ తెరిచి, ఒక అసాధ్యుడు నోరు కట్టేసుకుని, గెరిల్లాలాగ ముక్కును కిటికీ ఊచపై రాస్తున్నాడు. ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. గేటుపైన ముద్దముద్దగా ఒక లత వ్యాపించి ఉంది. ఏదో పూవుల పరిమళం నా కిష్టం లేనిది నా బుర్ర కెక్కింది. నా గుండె అంత ఎత్తుగా ఉన్న ఆ గేటు తలుపు

దాటి నేను లోపలికి వెళ్లేసరికి ఏదో క్షేమం కలిగినట్లు అనిపించింది. ఆ తర్వాత ఏమనిపించిందంటే, ఈ ఇంట్లో మామూలుగా ఒక కుక్క ఉంటుందని. "కుక్క ఉన్నది జాగ్రత్త!" అని బైట వ్రాయబడి ఉంది. అయినా లోపలికి చొరబడే సరికి ఏమీ క్రోధ పూరితమైన మొరుగు వినబడక పోయేసరికి, ఈ ఇంట్లో ఏం కుక్క లేదని స్పష్టమయింది. లేకపోతే అది బహుశా లోపల కట్టబడి ఉండవచ్చు.

కొన్ని నిముషాల పాటు ఊపిరి హాయిగా పీల్చుకున్నాను. బైట ఏమీ శబ్దం లేదు ఇంక. బహుశా వాళ్లు మిగతా సందుల్లో కంగారుగా పరుగెడుతూ నా కోసం వెదుకుతూ ఉన్నారేమో. తాత్కాలికంగా నేను కొంతసేపు నిశ్చింతగా ఉన్నాను. పైన తెరిచి ఉన్న కిటికీ లోంచి వస్తున్న అస్పష్టపు వెలుగులో లోపలికి చూడబోయాను. నడిచేందుకు వీలైన ఒక త్రోవ - రెండు ప్రక్కలా మొక్కలూ, చెట్లూ - పూలతోట. చీకటి, దానికి తగ్గట్లు ఈ విపత్తునూ సూచించే ఈ స్థలంలో అకాలమైన విపరీతపు సాహసం; దుస్సాహసం! కోపం, చిరాకులతో నా బుర్ర పాడయిపోయింది. ఇదేం సరిగ్గా లేదు. ఇదంతా సరిగ్గా లేదు! నాకేం కోరిక పుట్టిందంటే, నగరంలోని పూల చెట్లన్నింటికీ లెంపకాయ తగిలించి నోరు మూసుకోండ్రా! అని చెప్పాలని. పక్షులను బెదిరించి - "జాగ్రత్త! దగ్గరకు రాకండి!' అనాలని; ప్రేయసీ ప్రియులను హడలగొట్టాలని, భార్యభర్తలను ప్రక్కలో పడుకోవద్దని; అల్లాగే, కార్మిక జనాన్ని 'చావండ్రా' అనాలని; ఇంజనీర్లను 'చేతులెత్తండి! లేకపోతే కాల్చేస్తాను!' అనాలని, వైజ్ఞానికులను అందరినీ ఇక మీమీ పనులు మానెయ్యమందామనీ....

అదే సమయంలో దూరాన్నుంచి 'బుమ్,బుమ్' అంటూ ధ్వని వినపడింది. ఇల్లంతా గజగజలాడింది. ఏదో బండి వస్తున్నట్లు గరగర చప్పుడు అయింది. ఒక అత్యద్భుతమైన కాంతి తళుక్కుమంది. మళ్లీ అంతా అంధకారంలో మునిగి పోయింది బైట. నిజంగా పోలీసులే! పోలీసులు వచ్చి పడ్డారు!

ఒక్కసారి ఎగిరి ప్రక్కకు తప్పుకున్నాను. ముందు వెడల్పయిన మెట్లు. చుట్టూ ఉన్న కాంపౌండు గోడలో ఉన్న పెద్ద తలుపు తెరిచి ఉంది. దాన్ని బట్టి చూస్తే ఇది ఒక ఫ్లాట్‌లతో కూడుకున్న ఇల్లని తేలింది - వారసులు లేని ఆస్తిలాగ మెట్ల ముందుగా తలుపు, రామ్‌బాబూ అనుకుంటాడు; శ్యామ్‌బాబు ఇస్తాడు; యదుబాబూ గేటు కాపరి వాళ్లూ త్రాగేసి మత్తులో ఉండవచ్చు. అతడన్నాడు అరుగు మెట్లకి ఒక ప్రక్కన ఒక రహస్యపు గది మాదిరిగా ఉన్న చోట - మంచం మీద నిక్కచ్చిగా నేను ఇదివరలో చూసినవాడే స్తబ్ధుడై ఉన్నాడు. కొన్ని మెట్లు నిశ్శబ్దంగా ఎక్కి చూశాను: రెండస్తుల మధ్య మెట్ల మీద ఒక బల్బు వెలుగుతోంది. బట్ట నిండా మసి. మొట్టమొదట గేటులో పూలచెట్టులూ అలాంటివి చూసి ఈ

ఇల్లు అందంగాను పరిశుభ్రంగానూ ఉంటుందనుకున్నాను, కాని క్రమక్రమంగా ఒక్కొక్కటీ చూస్తే ఇది పాతబడిపోయి, ఏ మరమ్మత్తూ లేకుండా ఉన్నట్లుంది. పైకి ఎక్కి చూస్తే నిర్లక్ష్యంగా విసర్జించబడిన చోట నేను ప్రవేశించానని స్పష్టమయింది. రెండస్తులవి నాలుగు తలుపులూ తాళం వేయబడి ఉన్నాయి. ఈ గుంపు వాళ్లందరూ ఎక్కడకు వెళ్లినట్లు? మూడవ అంతస్తుకి మూడు వైపులా తలుపులు. పైన దీపం నిండా కూడా మసి. ఇక్కడ కూడా రెండు తులపులు తాళం వేయబడి ఉన్నాయి. ఒక దానికి మటుకు తాళం లేదు. దీన్ని బట్టి ఈ గదిలోని కిటికీలోంచే నేను ఆ గోరిల్లాను చూసినట్లు గ్రహించుకున్నాను. ఒక్కడా లేక కుటుంబంతో ఉన్నాడా అతను? ఆశ్చర్యమేమిటంటే ఒక్క ఫ్లాట్ పై కూడా నేమ్ ప్లేటు లేదు. ఆఖరికి కాలింగ్ బెల్ అయినా లేదు. గోడల మీద ఎరువూ నలుపూ అక్షరాలతో వ్రాయబడే విషయాలు - అవన్నీ నాకూ అందరికీ కూడా విశేషాలతో సహా కంఠస్థమే. ఈసారి భయంతో వణుకుతూ ఉన్నాను. బహుశా ఈ స్థలం నాకు సురక్షితమైనది కాదు. బహుశా అనుకోకుండా నా అంతట నేనే 'వాళ్ల' వలలో చిక్కుకున్నానేమో.

ముందుకు పోవలసి వుంది. వేరే ఉపాయం లేదు. జేబులో చెయ్యి పెట్టి .38 కాలిబర్ రివాల్వరు పట్టుకున్నాను. ఒక్కటే గుండు మిగిలింది; అదే చాలు. భావికాలంలో అనేక గంటలూ, రోజులూ, మాసాలూ, సంవత్సరాలూ నన్ను కాపాడుకోవాలి. ఇదే నాకు ముఖ్యావసరం. అయ్యో, నా 27 సంవత్సరాలు వ్యర్థమైపోయాయి కదా! అతను ఒక మంత్రింపబడిన పిల్లి పిల్లలా నా లోకి నెమ్మదిగా చూస్తున్నాడు.

బాగా నొక్కి డోర్ హాండిల్ త్రిప్పాను. తర్వాత మెల్లిమెల్లిగా తలుపు తెరిచాను.

## 2

### (హిరణ్మయ్ దత్తరాయ్)

...ఏమిటీ వ్యవహారం? మళ్లీ లైట్లు పోయాయే? వర్షాకాలం అంతా ఇల్లాగే ఉంటుంది. క్రొవ్వొత్తులు కొనికొని దరిద్రుణ్ణయి వెళ్లాను కార్పొరేషనుకి...

అదే సమయంలో మా కోడలు పరిగెట్టుకు వచ్చింది.

..."విన్నారా? ఈ వేళ రాత్రి మళ్లీ మొదలయ్యింది".

అదిరిపడి అన్నాను - "ఏమేమి మొదలయ్యింది, కోడలా?"

రాణూకి నేనంటే ఇష్టం పోయిందా?

అసలే నా చెవులు రెండూ రాను రానూ తమ శక్తిని కోల్పోయాయి - కళ్లలాగే. ఆమెకు బాగా తెలుసు. తెలిసినా విసుక్కుంటోంది నాకు తెలుసు, రాణూకి మెల్లిమెల్లిగా నేనంటే ఇష్టం పోతోందని. నేను హఠాత్తుగా అదిరిపడి లేచాను, అల్లల్లాడుతూ "కిటికీ తెరు; రాత్రిపూట క్రింద త్రోవ కనిపెడుతూ ఉండు;

ఎవరైనా అకస్మాత్తుగా పిలిస్తే తలుపు దగ్గరకు వెళ్ళు" - ఇవన్నీ అమెకు విసుగు పుట్టిస్తున్నాయి. ఇలాంటివి చాలా అనుభవించాను. ముఖ్యంగా ఇంట్లో సౌమేన్ ఫొటో ఉంచడం అమెకు ఇష్టం లేదు. సౌమేన్‌ది ఉన్నదల్లా పెద్ద సైజుది ఈ ఒక్క ఫొటోయే: అతను ఒంటరిగా ఉన్నది. మిగతావన్నీ చాలా పూర్వకాలపువి; కోడలుతో తీయించుకున్నవి కొన్ని. అవన్నీ ఫామిలీ అల్బములో ఉన్నాయి. అల్బమ్ ఒక్కొక్కప్పుడు తను ఇంట్లో ఉంచినా, రాణూకి ఇచ్చినా, అవన్నీ సౌమేన్ ప్రోగు చేసినవే. కాని వాట్లల్లో ప్రస్తుత కాలపు సౌమేన్ ఫొటో లేదు. ఇప్పుడు అతని నుదుటిపై మడతలు పడ్డాయి. దవడలు గుంటలు పడిపోయాయి. క్రమంగా లావణ్యం తగ్గిపోయింది. కళ్ళు రెండూ రోజురోజూ విచిత్రంగా వెలుగుతున్నాయి. ఇలా అతని క్రొత్త ఫొటోలో అతని నిజస్వరూపం పూర్తిగా పరిగ్రహించబడింది. సౌమేన్, మా కొక్కడే సంతానం. బాగా గారాబంగా పెరిగిన సౌమేన్! దేవుడితో అన్నాను "అతని సమస్త దుఃఖం, తపనం నా కప్పజెప్పు!" లోకంలోని అనేక వైర శక్తులతో ఎదుర్కొనే జ్ఞానం ఈ వృద్ధమానవుడికి ఉంది. అనేక దుర్భర సంఘటనలు నేను చూశాను. అనేక భయంకర తాపాలతో అనేక విధమైన మంటలతో రగులుకున్న విధ్వంసక జ్వాలతో, అనేక దురదృష్టపు బదబాగ్నులతో, అనేక దైత్య శక్తులతో నాకు పోరాటం జరపవలసి వచ్చింది. ఎంత దుఃఖమయమవలేదు నా జీవితం! నేను అన్నీ సహించో జయించో ఈనాటికీ ఇలా నిలబడి ఉన్నాను. ఇలా ఎన్ని విధాలైన ఒడుదుడుకులైనా, అది వ్యాధులైనా భరించడంలో నాకు కష్టం లేదు. కాని, సౌమేన్! వాడు జీవన యాత్రలో ఇంకా యువకుడు, వాడి జీవితం ఇంకా నూతనమైనది, వాడి మనస్సు శిరీష కోమలమైనది; లౌకిక జీవనంపై వాడికింకా చాలా అపేక్ష ఉంది. జీవితం దుర్భర మాయా శక్తుల గురించి ఏవేవో ఇంకా కలలు కంటున్నాడు వాడు. నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. 'వాడి కష్టాలన్నీ నా నెత్తిపై మోపి, సుఖాలన్నీ వాడికి కలగజెయ్యి' అని అయినప్పటికీ....

ఫొటో మాట చెపుతున్నాను. ఈ ఫొటో హఠాత్తుగా ఎందుకు తీయించవలసి వచ్చిందో ఆ సమయంలో అదేం విశేషంగా ఊహించలేదు కాని, ఆ సందర్భం తర్వాత అర్థం అయింది. అదేమిటంటే వాడు వెళ్ళిపోయే ముందర కొంత ఊరట పొందే నిమిత్తం అని ఒక క్రొత్త జ్ఞాపకం వాడి పిల్లవాడికి భార్యకి. ఇది తనకు నచ్చబట్టే దీన్ని ఒక్కటీ ఇచ్చి వెళ్లాడు. ఏమని చెప్పి వెళ్లాడంటే - 'ఇదే తీసుకుని అట్టే బెట్టుకోండి" అని.

అవును, నేను 72 ఏండ్ల ముసలివాణ్ని - నేను కేవలం ప్రాత జ్ఞాపకాలను ఆధారం చేసుకుని జీవితం గడుపుకోగలను. కాని కోడలు రాణూ మాటేంటి? అమె

అల్లా కాలక్షేపం చేసుకోలేదు. ఆమె రక్త మాంసాలూ, మనస్సూ అన్నీ ఇంకా సరియైన సంతృప్తిని పొందలేదు. ఆమెకు సౌమేన్ ప్రత్యక్షమైన రక్త మాంసాల సాంగత్యం కావాలి; పరోక్షంగా అతని ప్రయోజనం ఆమెకు లేదు. ఆమె బాధేమిటో నాకు తెలుసు. ఆమె తీరని కోపంతో సతమతమవుతోందని కూడా తెలుసు. ఆమె భర్తను నిందిస్తోంది. తన లోపలనే అతణ్ని తిడుతోంది. ఆమె దృష్టిలో అతనొక కాపురుషుడు. అయితే, నిజంగా రాణూది తప్పు అనడానికి వీలులేదు. నిజానికి, సౌమేన్ ఇలా ఎందుకు చేశాడు? అతని భార్య అతనికి నిజంగా ఇష్టం అన్నమాట నేను మొదట తెలుసుకోలేక పోయాను. తర్వాత తెలుసుకున్నాక చాలా సంతసించాను. కోడలికి సాదరంగా ఆశ్రయం ఇచ్చాను....మరి, ఇప్పుడు కూడా రాణూ ఎవరి గురించి కోపగిస్తోందో....

అదే నాకు అసంగతమనిపిస్తోంది. ఈ రోజుల్లో స్త్రీలకి భౌతిక సుఖాలపై మక్కువ ఎక్కువని నాకు తెలియక పోలేదు. అదే మీరనే సెక్సు యువతీ యువకులు, తెలిసో తెలియకో, దాన్నే వేటాడుతున్నారు. ఆధునికత అంటే కుబుసం విడిచిన పాములా బైట బాహాటంగా తిరగడమా? లేక క్రమక్రమంగా సభ్యతను అలవర్చుకుని నూతన నియమావళిని సృష్టించుకుని, యౌవనపు తీవ్రతనుంచి ముక్తులయి, మానవ సాధ్యమైన ఆత్మానుసంధనాన్ని సాధించడమా? ....ఏది అవనీయండి, కోడలు రాణూలో ఇటువంటి అత్యాధునిక ప్రవృత్తి ప్రవేశించలేదని ఆశిస్తాను. ఈ ఒక్క సంగతి తప్పిస్తే, ఆమె వంశ సంప్రదాయం చదువూ, జీవన విధానం, వ్యక్తిత్వం - వీటి విషయంలో ఆమె ముందు నాకు తగినంత విశ్వాసం ఉంది. ఈశ్వర చంద్ర విద్యాసాగర్ దూషించిన పూర్వకాలపు ఛాదస్తుణ్ని కాను నేను. ఒక వేళ సౌమేన్ చనిపోయినట్లయితే నేను వెంటనే రాణూ తండ్రి దగ్గరకు వెళ్లి, ఆమె పునర్వివాహం గురించి ఏర్పాటు చేయిస్తాను. నిక్కచ్చిగా రాణూ ఇష్టం పై వదిలేస్తాను ఆ విషయం.

ఆ ఏమిటి! ఏమనుకున్నాను! నా గుండె అతి వేగంగా కొట్టుకోవడం మొదలు పెట్టింది. రెండు కాళ్లూ దారుణంగా లాక్కుపోతున్నట్లనిపించింది. శరీరమంతా కంపిస్తోంది. సౌమేన్, నా ఏకైక పుత్రుడు సౌమేన్! నేను ఇలా అనుకోకుండా అతని మృత్యువు గురించి చర్చించడం ఏమిటి? లేదు, లేదూ అతనెక్కడున్నా సరే, సురక్షితంగా నే ఉండాలి. అతను ఏ విధంగా సంతోషం పొందుతున్నప్పటికీ నాకేం ఫరవాలేదు అతను బ్రతికుంటే చాలు. ఇప్పటివరకూ పేపర్లలో ఎన్ని ప్రకటనలు వేయించానో, ఫొటోలు ప్రచురింపజేసానో, ప్రతీ పోలీసు స్టేషనులోనూ రిపోర్టు ఇచ్చానో, అజ్ఞాత శవాల ఫొటోలు చూసి ప్రత్యక్షంగా వెళ్లి వాటిని చూశానో ఎన్ని సార్లు ఎంతమంది శవాలను సౌమేన్ అనుకుని పొరపాటున చూశానో! కొన్నాళ్లక్రితం

తొమ్మిది శవాల్లో ఒక దాన్ని సౌమేన్ దనుకుని చూస్తూంటే అప్పుడే మరొకడు వచ్చి అది తన 'మృగాంక్' అన్నాడు. చాలా గొడవ పడి, వాదించి, తర్కించి, ఆ హాలు విడిచి వచ్చాను - "అవును, ఇతను 'మృగాంక్', సౌమేన్ కాదు" అని.

ఒకటనిపించింది, వాడు పోలీసుల భయం వల్లో మరే కారణం వల్లో ఎక్కడో దాక్కుని ఉన్నాడని. అతి త్వరలోనే వచ్చి కనుపిస్తాడు తల్లితండ్రులకు. వాడు తప్పక వస్తాడు. కారణం ఏమిటంటే వాడి తరఫున ఒక పూర్తి వివరణ ఇవ్వడం అత్యవసరం అలా వివరణ వ్రాయడం వీలుగా ఉంటుందో లేదో - అది కష్టంలో ఉన్న వాళ్లకే తెలియాలి కదా? అందుకోసం వచ్చి ముఖాముఖీగా వివరణ ఇవ్వాలి. బహుశా చాటుగా వచ్చి త్రిప్పితే, డోర్‌హాండిల్ అప్పడిలా కరెంటు పోతే, చీకటి రాత్రిలో, నిర్మానుష్యంగా ఉన్న మార్గాన, గాలీ, వానా జోరుగా ఉన్నప్పుడు తడి బట్టలతో నెమ్మదిగా వస్తాడు రెండవ అంతస్తులోకి. అతనికి ఈ ఫ్లాట్‌లో తలుపులన్నీ తాళం వేయబడి ఉన్నాయని, అందరూ ఈ ఇరుగు పొరుగు విడిచి పారిపోయారనీ, ఎంత ఆశ్చర్యకరమైన నిర్జన ప్రదేశం ఇదనీ....

అవును, అందుకోసమే గేటు కాపరితో చెప్పి అట్టే పెట్టాను; పగలూ, రాత్రి తలుపు తెరిచి ఉంచమని. మనిషి పిరికి వాడైనా, మెత్తని గుండె గలవాడు. ధైర్యవంతుడు కాబట్టి ఇంటి తలుపు తెరిచి ఉంచి బలవంతం చేయాలి. గేటు తలుపులు రెండూ మూసి ఉంచమని ఆజ్ఞ ఇవ్వడం కేవలం భీరుత్వం. అందుచేత ఒక కిటికీ తెరిచి నేను రోడ్డువైపు రాత్రంతా చూస్తూ కూర్చున్నాను. నాకు నిద్ర రావడం లేదు. ఒక వేళ నిద్రపోయినప్పుడు అతను వస్తే - నాకు ముందుగా నిలబడి సిగ్గు తెచ్చుకుంటాడు (చిన్నప్పుడు నన్ను సౌమేన్ ఎన్ని సార్లు నిష్కారణంగా భయపెట్టేవాడు!) రాణూ తలుపు తెరుస్తుంది, అలాగయితే రాణూ గదిలోకి వెళ్లిపోతాడు...

రాణూ ఎక్కడికి వెళ్లింది? జరిగినదంతా చెప్పలేదా? అయితే ఏమయింది! ఈ ప్రాంతంలోని ఎలెక్ట్రిసిటీ సప్లైకి ఎవరో అవరోధం కలిగించినట్లయింది. మళ్లీ మళ్లీ ఏదో బాంబు పేలినట్లు చప్పుడయింది. ఎవరెవరినీ చంపేశారో ఏం తెలుస్తుంది? నేనేమీ వాకబు చేయలేదు. అలా వాకబు చేయకపోవడమే నాకు కీడు కలిగించి ఉండవచ్చు. నా కుమారుని వార్త సరిగ్గా తెలుసుకోపోవడం మూలానే నాకిప్పుడీ క్లేశం కలిగింది.

నేను మళ్లీ కిటికీ దగ్గరకు పోవాలి. రాణూ వచ్చి నా చోటు నుంచి మారింది. అరే! మళ్లీ వెలుగువస్తోంది! ఈ లోపు సౌమేన్ త్రోవలో వచ్చి ఉంటే నేను వాణ్ని తప్పకుండా చూసి ఉండను. అల్లాగైతే ఇప్పుడతను ఆ మెట్లు మెల్లిమెల్లిగా ఎక్కి, నెమ్మదిగా డోర్ హాండిల్ త్రిప్పి, తలుపు త్రోసి బహుశా పిలుస్తాడు... రాణూని

పేరెట్టి పిలుస్తాడు. పిలవనీ, నేను అన్నీ అర్థం చేసుకోగలను....

## 3

## (రాణూ దత్తరాయ్)

ఒక్క రాత్రి అయినా వాళ్లనుంచి విడుదల కలగదు. మళ్లీ మొదలయ్యింది గొడవ. బహుశా ఈ రాత్రంతా ఇలాగే ఉంటుంది. అస్తమానం నిద్రాభంగం అవుతోంది. కోపగిస్తూ కోపగిస్తూ నీరసపడిపోతా; నీరసపడి నీరసపడి చిక్కిపోతా. ఏడవవలసి వస్తుంది. కానీ ఈ వేళటి ఏడుపుకి నన్ను చూసి నేనే సిగ్గుపడవలసి వచ్చిన మూలాన. ఇదంతా ఆత్మ ద్రోహానికి. నష్టానికి త్రోవ తీస్తోంది. తన అసహాయతను ఎప్పుడైతే మానవుడు గ్రహించవలసి వస్తుందో అప్పుడు శాంతించి ఊరుకోవాలి. నా సంగతి శాంతించ వలసిన దానికి చెందినదే. అయినా అలా ఉండలేకపోతున్నాను. వాళ్లనెవ్వరినీ నేను స్పష్టంగా అర్థం చేసుకోలేక పోతున్నాను. ఒక్కటి మటుకు నాకు బాగా తెలుసు - వాళ్లల్లో భయంకరమైన ద్వేషజ్వాల మండుతోందని, అది ఆఖరికి భగ్గుమని ఎవరిమీదో ఒకరి మీద పడుతుందని. దాన్ని మ్రింగడానికి వీలులేదు. మా ఆయన్ని భరించుకుంటూ వచ్చాను. మరి ఇప్పుడు నా కెంత ఊరట గా ఉందో అంత కోపం కూడాను. ఊరట ఎందుకంటే నాలాంటి అనేకమంది ఆడపిల్లలు తమ భర్తకో, తండ్రికో సంతానానికో బానిసలై పోతారు. కోపం నేనేమీ చేయలేక పోయాను. కొన్ని నెలల క్రితం మా ఆయన పనిచేసే పెద్ద ఫ్యాక్టరీ మూసివేయబడింది. ఆయన ఉద్యోగం పోయింది. ఇంటి అద్దె బాకీ పడ్డ కుటుంబంలో కరువు వచ్చింది. భోగాలకు అలవాటు పడ్డ నాకు మామగారి ఆస్తి మీద ఆధారపడడం కుదరలేదు. ఆయన పెన్షను డబ్బులు మాకేం సరిపోతాయి? మేము ఇక్కట్లు అనుభవించాం. లోపల గాభరా. బైటకు పోయి ఏదైనా సంపాదించుదామా అనిపించింది. కాని మామగారు సనాతన పరుడు, కుత్సితమైన మనస్సు గలవాడు. పైగా అదో రకపు పిరికివాడు కూడా. మా ఆయన కోసం అటూ ఇటూ వెళ్లి వెదుకుదామని ప్రయత్నించాను గాని - మామగారు నన్ను ఒక్కర్తెనూ ఎక్కడికీ వెళ్లనీయడు. ఒక్కొక్కప్పుడు ఇది ఏకాంత పు ఖైదీ అనిపిస్తుంది. అనుకోకుండా ఒక పంజరంలో చిక్కు పడ్డాను. ఇక ఈ స్వార్థ పరపు ముసలివాడు తన శూన్యమైన సందూకు పెట్టిలో నన్ను సమాధి చేసి ఉంచాడు!

లేదు, ఏమీ చేయలేకపోతున్నాను. అసహ్యం వేస్తోంది. ఈసారి నేనే పారిపోవాలి. ఇక ఇక్కడ ఉండగలనూ? రాత్రింబవళ్లు ఈ శూన్య గృహంలో ఈ సంకుచిత వాతావరణంలో వ్యర్థ ప్రతీక్ష చేస్తూ ఎన్నాళ్లు బ్రతకడం? ఓహో? పైగా ఈ ఇల్లు వదిలి అద్దెకున్న వాళ్లందరూ ఒక్కొక్కరే వెళ్లి పోయారు. ఇంచుమించు

ఇరుగుపొరుగు అంతా ఖాళీ అనిపిస్తోంది! ఆఖరికి ఎవరో అసమర్థులైన ముసలి వాళ్లు అసహాయులైన చిన్న పిల్లలు మిగిలారు. మధ్యమధ్య ఏదో బాంబు పడిన చప్పుడూ, అస్పష్టంగా ఏవో గర్జనలూ, ఆర్తనాదాలూ తప్పిస్తే ఇక్కడ ఒక వికటమైన స్తబ్ధత స్థిరపడింది. అప్పుడప్పుడు ఎవరో ఏదో మాటలు మాట్లాడుకుంటూ వెళతారు. త్రోవమ్మట తర్వాత మరింకెవ్వరూ జనం ఉండరు. ఇటువంటి నిర్జీవపు 'గంధర్వ నగరం'లో నా 22 సంవత్సరాల యౌవనపు జీవితం నశించిపోతుంది. నేనింక ఉండలేనిక్కడ -' పారిపోతాను.

అయితే ఎక్కడకి వెళ్లడం? మా అమ్మకీ, నాన్నకీ నా మీద లోపల లోపల కోపంగా ఉంది. వాళ్లు నాకోసం ఎంచిన పెళ్లి కొడుకుని నేను తిరస్కరించాను వాళ్ల కోరికకు విరుద్ధంగా నేను మరొకణ్ని చాటుగా వివాహంమాడాను. మా వివాహం రెజిస్టరు అయిపోయాక మాత్రమే రెండు వైపుల కుటుంబాలకు తెలిసింది. మా పుట్టింట్లో కొన్నాళ్లపాటు భూకంపం అగ్న్యుత్పాతం జరిగినట్లయింది. మా అత్తవారింట్లో అంత గొడవ జరగలేదు. ఏమైనా జరిగితే మా అత్తగారు బ్రతికి ఉన్నప్పుడే. కారణం ఏమిటంటే ఇటువంటి విషయాలలో ఆడవారే ఆడవాళ్ల శత్రువులు. మా అమ్మే నాకు పెద్ద శత్రువని నాకు తెలుసు. ఆమె పుట్టింటికి నన్ను తీసుకు వెళ్లడం మాట ఎత్తడం లేదు. శత్రువులు వేళాకోళం చేస్తారు. మరింకెక్కడికి వెళ్లడం? ఇలా ఆలోచిస్తూ ఆలోచిస్తూ నే రాత్రీ, పగలూ గడిపేస్తున్నాను. అయినా నేను తప్పక పారిపోవాలి. అయ్యో, నేను రోజురోజుకీ లోలోపల కుళ్లి పోతున్నాను. ఇంకా కొన్నాళ్లు ఇక్కడ ఇలా ఉంటే నేను చచ్చిపోతాను. లేదు, లేదు నాకు బ్రతికి ఉండాలని ఉంది.

వెళ్లేముందు మా ఆయన ఏం మాటా చెప్పలేదు. అకస్మాత్తుగా ఒక సాయంత్రం టీ త్రాగి బైటకు వెళ్లాడు. రోజస్తమానం ఏదోలా గమ్మున ఉన్నాడాయన ఇంట్లో. ఆ రోజుల్లో చాలా నాజూకు పరిస్థితిలో ఉన్నాడని ఆయన్ని నేనేమీ ఎందుకలా ఉన్నారని అడగలేదు. ఏదో విధమైన చిరాకూ, విసుగుతో కూడుకున్న వాడైపోయాడు. ఉద్యోగం పోవడం బట్టి అలా ఉన్నాడనుకునేదాన్ని. బాగా తక్కువ మాట్లాడేవాడు. మాట్లాడకుండా ఇంట్లోంచి బైటకు వెళ్లిపోతూ ఉండేవాడు. సరియైన వేళకు ఇంటికి వచ్చే వాడు కాదు తిరిగి.... మామగారు చాలా బెంగపెట్టుకున్నారు. తిరిగి వచ్చారు అతని వివరాలు ఇచ్చి. నాకేం చెప్పరు. ఆయనకేం అవసరం లేదు. నాకైతే రాత్రిపూట భర్త స్పర్శ అవసరమనిపించేది. నా రక్తమాంసాలకు స్వాభావికంగా కొంచెం చాంచల్యం ఉంది.... ఆయన మెల్లిగా వచ్చి ప్రక్కగా (ఒకరాత్రి) వెచ్చగా పడుకొని "కొంచెం జరిగి పడుకో రాణూ!" అన్నాడు.

నా ఎడుపు చూసి కూడా ఆయనకి నా మీద ఇంకా కోపం ఎందుకు? లేనిపోని

అనుమానమా? లేకపోతే నా మీదేమైనా నమ్మకం లేదా? ఎవళ్ళైనా ఆయన చెవిలో ఏదైనా ఊదారా? కాని దేవుడికి తెలుసు నేను శారీరకంగా ఏ పాపం చేసి ఎరుగను. నేను నిశ్శబ్దంగా ఏడుస్తూన్నాను.

ఆశ్చర్యం, ఆయన సరిగ్గా నా మనస్సు గ్రహించుకున్నట్లనిపించింది. హఠాత్తుగా తన చేతుల్లో నా ముఖం తీసుకుని ముద్దు పెటి- "లేదు, రాణూ, లేదు, నీమీద నాకేం కోపం లేదు. నా కోపం అంతా నామీదే. నన్ను నేనింక భరించలేకపోతున్నాను. నువ్వు నమ్ము - నా కడుపులో మంట, నాది దుర్భర దుఃఖం రాణూ!"

ప్రేమ స్వరూపిణీ, త్యాగశీలినీ అయిన ప్రతి స్త్రీ మోస్తరుగా నేను అన్నాను: "మీ దుఃఖాన్ని అంతా నాకు అప్పజెప్పండి".

'పిచ్చిదానా'! అని ఆయన మాట్లాడకుండా ఉన్నాడు. నన్ను పట్టుకున్న ఆయన రెండు చేతులూ వదులైపోయాయి. తర్వాత ఆయన నడుం వాల్చి పడుక్కున్నాడు.

ఆయన చూస్తూనే ఉన్నాడని తెలుసు. ఏదో అనుకుంటున్నాడు.

'ఏమయిందో! చెప్పవా, బాబూ' అన్నాను. : "నీ కాళ్లమీద పడతాను నాకు చెప్పు".

అయన ఏం జవాబివ్వలేదు. ఎప్పుడైనా అనేవాడు: "ఏమీ లేదు".

ఆయనకి వచ్చిన బాధలన్నీ రూపాయి పైసలకి సంబంధించినవని అనుకున్నాను. పనీ పాటూ లేని వాళ్ల సంగతి ఇంతే. అనేదాన్ని: "బెంగ పెట్టుకోకు. ఏదో ఒకటి జీవనోపాధి దొరుకుతుంది...."

ఇంటి నుంచి ఆయన పారిపోయిన ముందు రాత్రి - గాఢనిద్రలో అనేక సార్లు ఒక మాట పలవరించాడు. అప్పుడు నేను మేలుకుని ఉన్నాను. ఆయన మాట విని చకితురాలినయ్యాను. ఒకసారి చటుక్కున గుండె ఆగిపోయినట్లని పించింది. ఏమాన్నడు ఆయన?...

"దేశద్రోహి.... నేను ట్రెయిటరుని....ట్రెయిటర్....అయ్యో, నేను ట్రెయిటర్ని".

ఆ మాట నాకు పూర్తిగా అర్థం కాలేదు. ఆయన నల్లని ముసుగు అప్పుడు కొంచెం సడలింది. లేక అదంతా నా ఊహ ఏమో, నేను తప్పుగా విన్నానేమో. అప్పుడు నా రక్తం ఎంత చల్లబడిందంటే, గుండెలో మంచు ప్రవేశించినట్లయింది. నిశ్చేష్ట నయిపోయాను.

ఆ పలవరింపు మాట ఇంతవరకూ నేను మామగారికి చెప్పలేదు. చెప్పాలని అనిపించలేదు. నాకు తెలుసు ఏమయిందో నా జీవితం. ఏవో శంఖపు గాజులూ,

నుదుటిపై తిలకం పెట్టుకుని పరాయి ఇంటిలో కోడలు వేషం వేసుకున్న దాని అసత్య జీవితం నాది - దాన్ని మార్చే ఉపాయం లేదు.

అయినా రక్తంలో ఇమిడిపోయిన ఎదురు చూపు ముళ్ళు మళ్ళీ మళ్ళీ నన్ను గ్రుచ్చుతున్నాయి. మేడమెట్ల చుట్టూ ఉన్న ఖాళీ స్థలంలో వాయువు సుడిగుండంలా వీస్తోంది. ఏదో చప్పుడయింది, డోర్‌బెల్ త్రిప్పినట్లు. కంగారుగా లేచి కూర్చున్నాను. తలుపు వైపు వెళ్ళాలి. తలుపు తెరవబడిందో లేదో చెప్పలేను. తర్వాత కొంతసేపటికి తెరుచుకుంది. ఒక మనిషి నీడ ఏదో పసుపురంగు రేఖలా వణుకుతూ వణుకుతూ కనిపించింది. పూర్తిగా శూన్యంలోని వణుకులోనుంచి ఒక వెలుగులా వెలిగి మాయమయింది ఆ నీడ. ఇంతలో వెనుక నుంచి పరిగెట్టుకుంటూ వచ్చారు మామగారు. బలంగా ఊపిరి పీల్చుకుంటూ అస్పష్టమైన గొంతుతో అన్నారు.: వచ్చాడా? సమూ (సామేన్) వచ్చాడా? సమూయేనా? ఎవరు? కోడలా ఓ కోడలా! రాణూ, ఓ రాణూ, మాట్లాడవేం?"

నేనేం మాట్లాడను? గాలి అలా వీచింది అని ఊరుకున్నాను. వెనక్కి తిరిగి చూస్తే అదే చిత్తరువు కంటపడింది గదిలో. కోపంలో చిత్తక్షోభలో దుఃఖంలో దాన్నే బ్రద్దలు గొట్టాలనిపిస్తోంది. ఎవరు కనుపించడం లేదో వారి నిశ్చలమైన ప్రతిబింబాన్ని చూసి అనాలనిపిస్తోంది. :"ట్రెయిటర్, విశ్వాసఘాతకుడా!"

## 4

## (దీపక్ మిత్రా)

ఎవరి తలుపు తెరిచానో నాకు తెలియదు వాళ్ళని. కానీ వాళ్ళ శరీరం ప్రక్కగా, గదిలో ఎత్తు పీట మీద ఉన్న పెద్ద పటం ఎవరిదో తెలుసు. దాన్ని బాగా పోల్చగలను. వెంటనే నా మస్తిష్కంలో అగ్ని జ్వాల రేకెత్తింది. చెవుల్లోంచి వేడి గాసు బైటకు వస్తోంది. కళ్ళు రెండు కోపంతో పెద్దవయ్యాయి. సామేన్! ఇది సామేన్ గది! ఆఖరికి నేను ఇలా ఇక్కడికే వచ్చి పడ్డాను!

ఈ స్త్రీ మెరుస్తున్న కళ్ళ ముందర నా ఆశ్చర్యం గోచరించిందో లేదో చెప్పలేను. కాని నన్ను ఆమె చూసి ఉలిక్కి పడింది. వణుకుతున్న గొంతుతో అంది - 'ఒక్క అడుగు వెనక్కి వేసి చెప్పండి - ఏం ఏం కావాలి?'

సంబాళించుకున్నాను నన్ను నేను. చల్లని గొంతుతో అన్నాను. "ఈ వేళ రాత్రి మటుకు ఇక్కడే ఉంటాను. ఏం గొడవ పెట్టకండి. అందువల్ల మీకేం లాభం లేదు. మీకు నేనేం అపకారం చేయను. ఈ ఒక్క రాత్రి మటుకు..."

ఆశ్చర్యంతో వెనక్కి తగ్గింది ఆమె. నేను వెంటనే తలుపు గడియ వేసేశాను. ముందుకి ఒక్క గెంతువేసి కూర్చున్నాను. ఒక గ్లాసు మంచినీళ్ళు ఇమ్మని అడిగాను. ఫ్రెష్ వాటర్!: "ఇంత రాత్రివేళ ఇక అన్నం తినడానికి ఇష్టపడను.

ఒక చాప ఉంటే ఇవ్వండి. ఇక్కడే పడుకుంటాను".

ఆమె ఏమీ మాట్లాడలేదు. సౌమేన్ భార్యా ఈమె? అయితే ఇంకా ఈమె పుణ్యస్త్రీ వేషంలో ఉంది ఎందుకు? అయితే ఈమెకు ఇంకా కబురు అందలేదా?

జేబులో చెయ్యి పెట్టాను - అయితే అవిడ గొడవ పెట్టేస్తుందేమోనని బైటికి తీసేశాను చెయ్యి. గది లోపల పరికించి చూశాను. రెండు ప్రక్కలా రెండు గదులు. తలుపుకి మురికి పట్టిన కర్టెను ఉంది. గదిలో ఏమంత ఫర్నిచర్ లేదు. ఒకటే షెల్ఫు, కొన్ని పుస్తకాలు. ఒక టేబులు, రెండు కుర్చీలు. గోడమీద కేలెండరు. ఆ పీట మీద సౌమేన్ ఫొటో. ఫొటో కేసి చూస్తే భయం వేస్తోంది. ఇప్పుడు సౌమేన్ ఇలా అన్నట్లనిపించింది. - "నీ ముఖంలో ఏమీ హంతకుని లక్షణాలు లేవు. నువ్వంటే భయపడను, దీపూ..."

త్వరగానే మంచి నీళ్ళు తెచ్చి ఇచ్చింది. ఆమె ముఖం వైపు చూడకుండానే గడగడ త్రాగేశాను మంచినీళ్ళు. నేను గ్లాసు క్రింద పెట్టబోయేసరికి ఆమె చేయి జాపి దానిని తీసుకుని వెళ్ళి పోబోతుంది. నేను పిలిచి అన్నాను: "వినండి!"

ఆమె నిశ్శబ్దంగా వెనక్కి తిరిగి నిలబడింది.

"ఇంట్లో ఇంకెవరున్నారూ?"

"నేనూ, 'బాబా'! (మామ) గారు".

"ఆ పటం ఎవరిది - అతనెక్కడున్నాడు?"

"తెలియదు"

"మీరెవరు?"

"ఇంటి కోడలును"

"అయితే ఆ ఫొటో మీ శ్రీవారిదా?"

"ఊ"

కొంతసేపు మాట్లాడకుండా ఉన్నాను.

సౌమేన్ భార్య అంది: ఇంకేమైనా తెలుసుకోదలచుకున్నారా?"

"అవును 'బాబా' అంటే మీ మామగారేనా".

"ఊ"

"మీ అయన లేరా?"

'తెలియదు...మీకు పరుపు తెచ్చి ఇస్తాను".

వెళ్ళింది సౌమేన్ భార్య. అదే సమయంలో కర్టెను తొలగించి హఠాత్తుగా ఆ ముసలి గొరిల్లా లోపలికి వచ్చి పడ్డాడు. ..."ఎవరు, ఎవరు వచ్చారు? సమూ? ఎవరు - ఎవరు నువ్వు, ఎవరు మీరు? మాట్లాడరేం? కోడలూ, ఎవరీయన?

ఆమె వచ్చి అంది : "ఊ ఊరుకోండి బాబా! ఈయన మీ అబ్బాయి

స్నేహితుడు; అయన కబురు తీసుకొచ్చారు".

నేను ఆశ్చర్య చకితుణ్ణయాను. గుండె దారుణంగా కొట్టుకూంటుంది. ఏమిటి ఈమె కన్నీ తెలిసినట్లు మాట్లాడుతూంది. లేకపోతే అమాయకపు మామగారిని మభ్యపెట్టుతోందా? ఆమె కేసి చూశాను. ఎంత నిష్కళంకమైన చూపు! ఎంత కాంతి మంతమైన కళ్లు! ఇంకా ఆ పెదవుల మూలలో దాగీ దాగని దరహాస రేఖ ఎందుకు? నా రివాల్వరు జేబులో త్రుప్పు పట్టి ఉంది. గుండు తడిసి పోయి, ట్రిగ్గరు పట్టేసి ఉంది. గొంతుక నొక్కుకు పోయిన ముసలాయన అడిగాడు ఎలాగో: "సమూ ఎలా ఉన్నాడు బాబూ? ఎక్కడున్నాడు? ఏం జేస్తున్నాడు? ఒక్కడే పిల్లవాడు - వాడి కిక్కడ భయపడవలసిన దేముంది?...నేను పోలీసు సూపరింటెండెంటు దగ్గరకు వెళతాను. నేను రిటైర్డ్ గవర్నమెంటు ఆఫీసరుని...

నేను అడ్డు పెట్టి అన్నాను:"అతనికి పోలీసు అంటే భయం లేదు. మీ కొడుకు ట్రయిటర్ - విశ్వాస ఘాతకుడు..."

"ఖబర్దార్!" అని ముసలి గోరిల్లా అరిచాడు.

నేను నవ్వాను.. "మీ కోడలిని అడగండి".

నేను నిర్ఘాంతపోయేలా సౌమేన్ భార్య అంది: "అవును, బాబా, ఈయన నిజం చెపుతున్నారు".

"అసంభవం! ఇతను అబద్ధం ఆడుతున్నాడు", అని మళ్ళీ గొడవ చేయడం మొదలుపెట్టాడు ముసలాయన - "అసత్యవాది, దుర్మార్గుడు, మాయామయుడు అందరూ అంతే. నేనెవరినీ నమ్మను. అందరూ ట్రైటర్లే. అందరూ విశ్వాస ఘాతకులే".

సౌమేన్ భార్య ముందుకి వచ్చి అంది: "ఏంటండీ, ఊరుకోండి బాబా!"

ముసలాయన వ్రేలు పెట్టి తలుపు చూపిస్తూ అన్నాడు. "వెంటనే బైటకు పొండి మీరు. ఎందుకు ఇలాంటి అబద్ధాలు చెపుతారు? పొమ్మనలేదా మిమ్మల్ని? పొండి! మా సమూ విశ్వాస ఘాతకుడా?"

ఈసారి జేబులోంచి రివాల్వరు బైటకు తీశాను. "పెద్ద గొడవ పెట్టకండి. వెళ్లండి, మీ గదిలోకి వెళ్లండి. నేను ఈ రాత్రంతా ఇక్కడే ఉంటాను. మీరు అల్లరిపెడితే, ప్రాణాలు పోగొట్టుకుంటారని జ్ఞాపకం చేస్తున్నాను". "చూడండి మామగారిని ఆయన గదిలోకి తీసుకుపొండి.. నా బుర్ర సరిగ్గా లేదు. యూ ఓల్డ్ ఫూల్! "నోరుముయ్! గట్టిగా అరవకు".

ముసలాయిన కొంతసేపు నా రివాల్వర్ కేసి చూసి రెండు చేతుల్లోనూ ముఖం దాచుకున్నాడు. ఏడవడం మొదలుపెట్టాడు. కూర్చుండిపోయాడు. అస్పష్ట స్వరంతో అన్నాడు: "చంపెయ్యి - నేను చస్తేనే మంచిది. సమూకి ఏమయ్యిందో

ఇప్పుడు బాగా తెలుసుకున్నాను. నేను బ్రతికి ఏమీ లాభం లేదు!.

సోమేన్ భార్య మామగారిని ఓదార్చింది. ఈసారి వికటంగా నవ్వింది ఆమె. "ఏమయింది? చంపలేవా? గుండు లేదా నీ తుపాకీలో? లేకపోతే ఆటవస్తువా అది? అసలు సంగతి తెలుసుకున్నాను. మీరు కుబుసం విడిచి బైటకు రాలేరు. దమ్ము లేక అలసిపోయారు. అంతేనా?"

నాకు నిజంగా కోపం రాలేదు. అన్నాను: 'సోమేన్ వంటి పిల్లవాడికి జన్మ ఇచ్చిన వారిపై నాకు నిజానికి చాలా ద్వేషం ఉంది. కాని ఈవేళ నేను అలసిపోయాను. నాకు కొంచెం ఆశ్రయం ఇచ్చి పడుకునేందుకు అవకాశం ఇస్తే తర్వాత సంగతి తర్వాత ఆలోచిస్తాను".

ముసలివాణ్ని ప్రక్కగదిలోకి తీసుకు వెళ్లి, తన గదిలోకి తిరిగి వచ్చింది ఆమె. నాకు పరుపు తీసుకు వచ్చింది. ప్రక్క వేసి అంది: "పడుకోండి. నాకూ ఈ వేళ చాలా నిద్ర వస్తోంది. మళ్లీ...."

ప్రక్కమీద పడుకుని అన్నాను: "ఆగారేం? మళ్లీ?"

"మీకు ధన్యవాదాలు".. అని వెంటనే వెళ్లిపోయింది సోమేన్ భార్య.

నాకు నిద్రపట్టలేదు. రాదు. ఆ ఫోటో! సోమేన్! సోమేన్! కాలువ ప్రక్కన అతని శ్వాసనాళాన్ని నేను తెగ్గొట్టాను. శవాన్ని కాల్చి పారేశాను. ఇప్పుడు ఆ గదిలో ఏమయిందో ఒక అస్పష్టపు శబ్దం వల్ల ఊహించగలను. చేయగా మిగిలిన పని ఇప్పుడు చాటుగా పూర్తి అయింది. సోమేన్ భార్య మంగళ సూత్రాన్ని తెంపేసింది. నుదుట బొట్టు చెరిపేసింది. పెట్టిలోంచి సోమేన్ పంచె బైటకు తీసింది. దానిపై పడి వెక్కి వెక్కి ఏడ్చింది. ఆమె రోదన శబ్దం హెచ్చింది. మండుటెండ లో ఆవిరిలాగ, పొగమంచులాగ, మర్మచ్ఛేదమూ, సర్వవ్యాప్తమూ అయిన ఆమె విలాపం మెల్లిమెల్లిగా తలుపులను బ్రద్దలు కొట్టి పై పైకి వచ్చి వినపిస్తోంది.

కొంతసేపు నేను చెవి మూసుకుని ఉండిపోయాను. చింతాకుల జగత్తునుంచి పారిపోయే ఉపాయం లేదు- అని అనిపించింది. ఇక అదే మహాకాళ సర్పం - దుంఖ సర్ప అడుగడుగునా ప్రాకి ఆఖరికి ఊపిరాడక ఆగిపోయింది. కొంచెంగాలి పీల్చుకోవాలి, కాస్త గాలి!

ఆ తర్వాత తెల్లవారే ముందు కాస్త కునుకు పట్టింది. కల వచ్చింది. అందులో వేల కొలదీ సోమేన్ ఫోటోలు నాలుగు వైపులా వ్యాపించి ఉన్నాయి. పృథివి అంతా వ్యాపించి పోయాయి.

చిందరవందరగా అల్లరిచిల్లరిగా కూలిపోయిన పేకమేడలా ఉన్న సోమేన్ ఛాయాచిత్రాల మధ్య ఎంత వెదికినా నా కొక మార్గం కనుపిస్తుందన్న ఆశ లేదు....

* ('దేశ్', 1378 శ్రావణ మాసం 15-బెంగాలీ సంవత్సరం)

# ఒక సాయం సంధ్య రెండు ముఖాలు

**మతినందీ**

హౌరా స్టేషను విశాలమైన రేకు షెడ్డు క్రింద నిలబడి ఇద్దరు అక్కచెల్లెళ్లు మాటిమాటికి నాలుగువైపులా చూస్తున్నారు. వచ్చిపోయే ప్రతివ్యక్తినీ పరిశీలించి తిలకిస్తున్నారు. అల్లా చూస్తున్న వాళ్లిద్దరినీ ఎవరూ శ్రద్ధగా పరికించలేదు - ఎవరి మటుకు వాళ్లు తమ గొడవ, తమ హడావుడిలో ఉన్నారు. వాళ్లూ అలాగే ఉన్నారు.

విశాలమైన స్టేషను ప్లాట్‌ఫారంపై నిలబడి, ఆ రణగొణ ధ్వని మధ్య వాళ్లు అలా నిశ్శబ్దంగా నిలబడి ఉన్నారు. స్టేషనులో జనం అందరూ కలిసి ఏదో అలా కబుర్లు చెప్పుకుంటూ ఉన్నారు. ఇద్దరు అక్క చెల్లెళ్లూ ఒకళ్ల ముఖంలోకి ఒకళ్లు చూసుకున్నారు. అకస్మాత్తుగా మాటలు ఆగిపోయాయి. చెల్లాయి వ్రేలుతో చూపిస్తూ అంది: "అదిగో!" వాళ్లిద్దరూ లౌడ్‌స్పీకరు కేసి చూశారు.

చెల్లాయి గొంతు సవరించుకుని అంది: "ఇప్పుడేం చేద్దాం?"

అక్కయ్య మరో దిక్కుగా చూస్తున్నట్లు చూస్తూ ఉండిపోయింది. గోడకు ఆనుకుని అన్నయ్య తలకట్టుకి మధ్య వ్రేలు నడిపిస్తున్నాడు. ఈసారి 'పూ' అని చేతిలోంచి ఆ పీకిన జుట్టు అవతల పారేస్తున్నారు.

పెద్దక్క అంది: "నడు, అదే వైపు".

వాళ్లు నిశ్శబ్దంగా గుంపు మధ్య లోంచి నడుచుకుంటూ ఉత్తర దిక్కుగా సాగారు. బుకింగ్ ఆఫీసు ముందు ఉన్న క్యూలోని మనుషులను దాటి; నేలమీద, బల్లల మీద ఇక్కడా అక్కడా చిందరవందరగా కూర్చునీ, పడుక్కునీ ఉన్న జనాన్ని దాటీ, నోరు తెరిచి తచ్చాడుతున్న మానవులను దాటీ: ఇద్దరు అక్క చెల్లెళ్లు మూడవ తరగతి వెయిటింగు రూంలో ప్రవేశించారు. ఒక బెంచి మూలలో ఇరుక్కుని ఇద్దరూ కూర్చున్నారు. కిటికీ లోంచి రోడ్డు కనిపిస్తుంది. బస్సులు వరుసలో నిలబడి ఉన్నాయి. ఇళ్ల మధ్య నుంచి పేలవమైన వెలుగు. అసహ్యమైన కంపు. నీటి కుళాయి. టిక్కెట్ల కోసం ఆడవాళ్ల క్యూ. ఇంకా ట్రెయిను కోసం ఎదురుచూస్తున్న దూర యాత్రికులు.

"అక్కా, మంచి నీళ్లు కావాలి".

"వెళ్లి త్రాగిరా"

చెల్లెలు వైపు చూస్తూనే ఉంది. వంగుని కుళాయి గొట్టం లోంచి నీళ్లు త్రాగుతోంది. అక్క కొంచెం అశాంతంగా ఉన్నట్లుంది. చెల్లెలి కుర్తా ప్రక్కలమ్మట

కొంచెం చిరిగింది. చేతిలో కూజా పుచ్చుకున్న ఆ మనిషి ఏమిటి ఆమె కేసి తదేక దృష్టితో చూస్తున్నాడు?

"తూఫాన్ ఎక్స్‌ప్రెస్ ఈ రోజు లేటు"

ముఖం త్రిప్పింది అక్క. తన ప్రక్క ఆవిడ ఏదో అంటోంది. "ఎంతసేపు ఇలా ఎదురుచూస్తూ వుండాలోమరి".

"ఎవరైనా వస్తున్నారా?"

ఆమె నవ్వింది. నవ్వుతూ నవ్వుతూ గది చుట్టూ చూస్తూ అంది:

"నిన్న వస్తానని ఉత్తరం వ్రాసాడు. వచ్చి అంతా చూసి తిరిగి వెళ్లిపోయాను, రాలేదు".

అక్క నిలబడింది. ఆమెకు చెల్లెలు కనిపించడం లేదు.

"ఎక్కడకు వెళుతున్నారు? ఎవరికోసం రాలేదా మీరు?"

"లేదు, నేను వెళ్లడం కోసమే వచ్చాను".

అక్క కబుర్లు పెంచలేదు. స్టేషను విశాలమైన షెడ్డు క్రింద మనుష్యుల గొడవలోకి వచ్చి నిలబడింది. వచ్చి చెల్లెలు కోసం వెతుకుతోంది. అడుగు మెల్లిగా మెల్లిగా వేసుకుంటూ స్టేషనుకు ఉన్న అనేకమైన ఔట్ గేటులలో ఒక దాని దగ్గర చేరుకుంది. అక్కడ నుంచి హౌరా బ్రిడ్జి కనుపిస్తుంది. అది దాటితే కలకత్తా నగరం వస్తుంది. వాళ్ల ఇల్లు కలకత్తాలో ఒక సందులో ఉంది. ఆ ఇంటిలోని గ్రౌండుఫ్లోర్ లో ఒక వాటాలో ఆమె, తన తల్లి, అన్నా, తమ్ముడూ, చెల్లెలుతో కలిసి ఉంటోంది. వాళ్ల వాటాలో శీతకాలం ఎక్కువ చలిగా వేసవికాలం ఎక్కువ వేడిగా ఉంటుంది. దక్షిణ సమీరం అంతా వాళ్ల పై కప్పు పై నుంచే దాటిపోతుంది: గాలి, మేఘం, ఎండ, సాయంత్రపు సొగసూ వాళ్లకు తెలియవు. స్నానం చేసాక సాయంత్రం డాబా పై విహరించేందుకు అవకాశం లేదు. ముక్కుకి ఏదో ఒక మందు చెట్టు వాసన తగులుతుంది. వాళ్ల తండ్రిని స్మశానానికి తీసుకు వెళ్లే టప్పుడు అన్నగారు ఒక సీసా తెచ్చాడు; దాని మోస్తరుగా వాసన వస్తోంది ఇప్పుడు ఖాళీ సీసా చెల్లి అట్టే బెట్టుకుంది. ఎక్కడికి వెళ్లిపోయింది చెల్లాయి?

. . . . . . . . . . . . . .

"ఢిల్లీ చూడండి, ఆగ్రా చూడండి" అంటూ చేతితో హాండిల్ త్రిప్పి కుతుబ్ మినార్, తాజ్‌మహల్ మొదలైన వాటి బొమ్మ ఒక్కొక్కటి త్రిప్పుతూ, ఒకతను సరాసరి కంఠంతో అరుస్తూ అదోలా ముఖం పెట్టి నవ్వుతున్నాడు. స్టేషనులోని స్తంభానికి వ్రేళ్లాడేసిన బొమ్మలు చూస్తూండగా చెల్లాయికి అతడిపై మనస్సు లగ్నమయింది. చాలా రోజుల తర్వాత ఒక క్రొత్త బైస్కోపు వచ్చింది. ఒక రోజున అతణ్ని అడిగింది -. ఢిల్లీ, ఆగ్రా మొదలైన నగరాలు ఎప్పుడైనా చూశావా లేదా

అని. అతను అడిగిన మాటకు సమాధానం ఇయ్యకుండానే, ఆ బాక్సు బిల్లు ముందు కన్ను పెట్టి వింతగా ఉన్న తలకాయల బొమ్మల్ని చేత్తో, ఈగల్ని తోలినట్లుగా, త్రిప్పుతూ చూస్తున్నాడు.

ఆ మనిషి పైనే చెల్లాయి మనస్సు లగ్నమయింది. చాలా రోజుల తర్వాత ఊళ్లోకి ఒక క్రొత్త బైస్కోపు వచ్చింది. ఆ మనిషి వస్తాడా రాడా అని చెల్లాయి చాలా రోజుల నుంచి తర్కించుకుంటోంది. తర్కించుకుని, కుతుబ్‌మినార్ తాజ్‌మహల్, విమానం ఎక్కడం, మొదలైనదంతా (రావణుడు జటాయువుతో యుద్ధం చేసినట్లుగా, తన కళ్ల ముందు చిత్రించుకుంది. ఎడ్వర్టయిజ్‌మెంటు బొమ్మలు చూస్తూండగా ఆమెను దూసుకుంటూ వచ్చింది ఒక నూతన వధువు. ఆమెను చూడగానే తన వైపే చూస్తున్నట్లు గ్రహించుకుంది. బొమ్మపై అక్షరాలు ఇంగ్లీషులో వ్రాయబడి ఉన్నాయి. గొణుక్కుంటూ ఆ అక్షరాలు చదివింది. వాలు చూపుతో వధువు వైపే చూసింది. ఆమె బట్టల నుంచే ప్రియకరమైన సుగంధం వస్తోంది. మెల్లిగా ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది చెల్లాయి. ఆ సువాసన చాకలెట్ పై కప్పిన కాగితంలోంచి వచ్చినట్లుగా ఉంది.

"ఏ మాత్రం అందంగా లేదు"

చెల్లాయి మెడ త్రిప్పింది. వధువు బొమ్మ వైపు చూపించింది.

"దసరా పండుగల్లో వెళ్లాను. బాబోయ్! రానూ పోనూ ప్రయాణం ఎంత చిరాకో, హొటళ్లల్లో రేట్లు ఎంత పెరిగిపోయాయో".

చెల్లాయి చాలాసేపు ఆ వధువు సుగంధాన్ని తన గుండెలోకి పీల్చుకుంది. అంది- అందంగా లేదన్నారు, అక్కడ ఇలాగా".

"ఏమీ బాగుండలేదు. అవన్నీ అథవుల బొమ్మలు. అక్కడకు ఎవరు వెళతారు? అంతకంటె ఆ బొమ్మ, కోనారక బొమ్మ - అక్కడ చూడవలసినది నిజంగా ఉంది".

"మీరు వెళ్లారా అక్కడికి?"

"మా బావ వెళ్లాడు".

"ఇప్పుడెక్కడికి వెళుతున్నారు?"

"రాణీగంజ్"

"ఎవరి దగ్గరికి వెళతారు?"

ఈసారి వధువు నవ్వింది. బొమ్మలో అంత అందం గానూ నవ్వింది. తర్వాత ఏదో అనబోయి అనకుండానే మళ్లీ నవ్వింది. ఆమెను చూసి చెల్లాయి కూడా నవ్వింది.

"వచ్చే ఏడాది ఆయనకు సెలవు దొరికితే నన్ను కాశ్మీరు తీసుకు వెళతారు".

"అక్క 7వ నంబరు ప్లాట్‌ఫారం నుంచి వెళుతుంది, ఇప్పుడే".

బండి నడుస్తూండగా సూట్‌కేస్ పట్టుకుని వచ్చాడు ఒక నిక్కరు వేసుకున్న

కుర్రవాడు. పేము బుట్ట చేతుల్లో ఆడిస్తూ, వధువు అంది: "సరే, నడు".

వాళ్ళు వెళ్లిపోయారు. అడుగులో అడుగు వేసుకుంటూ, రెయిలింగ్ పైన చేయి వేసుకుంటూ, 7 వ నంబరు ప్లాటు ఫారం పై నిలబడ్డ ట్రెయిను వైపు వెళ్లింది - చెల్లాయి.

...........

అయినా ఇంత గొడవ ఏమీ వినిపించలేదు. స్తంభానికి వీపు ఆనించి కొయ్యలా నిలబడి పోయింది. నెత్తి మీద ఎర్రటోపీ, ఖాకీ బట్టలు ధరించిన వ్యక్తి ఈ వైపూ, ఆ వైపూ చూసుకుంటూ ఆమె వైపే వచ్చాడు. అక్క ఇదంతా ఏమీ వినిపంచుకో లేకపోతోంది. ప్రక్క నుంచి వెళ్లిపోయాడు వ్యక్తి. వెళ్లేటప్పుడు ఒక్కసారి చూశాడు అక్కయ్య అనుకుంది. వెయిటింగ్ రూం లోకి వెళ్లి ఎదురుచూస్తే మంచిది అని. బహుశా చెల్లాయి అక్కడే ఉంటుంది.

బెంచి పై ఖాళీ లేదు. అక్కయ్య గోడకు ఆనుకుని నిలబడింది. ఇంతక్రితం పలకరించిన ఆవిడే ఎక్కడినుంచో తిరిగి మళ్లీ వచ్చింది. కూర్చునేందుకు చోటు లేక ఆమె వద్దకు వచ్చి అంది - "లేదు, ఇంకా రాలేదు".

"ఎవరు వస్తారు?"

ఏదో మాట మాట్లాడాలని ఆమె అడిగింది; అడిగి ఊరుకొంది. ఊరుకుని చూసేసరికి, ఆవిడ రెండు ముఖాలంత పెద్దగా ఉన్న రెండు కళ్లూ పెద్దవిచేసి, చుబుకం క్రింద రెండవ చుబుకం వణుకు తూండగా అంది: "ఎవరేమిటి? ఎవరూ లేదు".

మరో గొంతుతో సరిగ్గా అదే మాట. బుర్ర లోపలతాపం పెరుగుతోంది. రెండు రూపాయిలిచ్చి పెద్దమ్మ అంది: "ఇంత ముందుగా వస్తే నేనేం చేయగలను?" ఇంటి ప్రక్కవాళ్లు ఎవరో వెళ్లారు. తిరిగి వచ్చేటప్పుడు పెద్దమ్మ "ఎవరేమిటి? ఎవరు లేరు" అని అనడం వింది అక్కయ్య.

"30 రూపాయలు ఎక్కువ జీతం వస్తుందని 150 మైళ్ల దూరం పోయాడు నౌకరీ కోసం. దానికేం అవసరముందో తెలీదు. స్కూలులో నేను సంపాదించే దానికి అతని సంపాదన కూడా కాస్త కలిస్తే ఏడుగురు మనుష్యుల సంసారం ఏదో బాగా గడుస్తుంది".

అక్కయ్య తల ఆడించింది.

"నా మాట ఎప్పుడూ వినడు. 8 ఏళ్ల నుంచి చూస్తున్నాను. అయినా మా పెళ్లి ముందు నా డబ్బు ముట్టుకోలేదు".

"ఆయన ఎక్కడ పనిచేస్తున్నారు?"

"డి.వి.సి. (దామోదర్ వాలీ కార్పోరేషన్) లో".

"మా అన్నయ్య అక్కడ పనికి ప్రయత్నించాడు. కాని అతనికి దొరకలేదు".

"అదేంటి వాళ్ళు చాలా మంది ప్రయత్నించిన వాళ్లకు పనికల్పించారే! ఇంకా ఏమైనా ఖాళీలు ఉన్నాయేమో కనుక్కుంటాను. సరే ఇక్కడే ఉంటారా? ట్రెయిను టైము అయిపోయిందా?"

"లేదు లేదు, మా ట్రెయిను టైము అవలేదు. నేను ఉంటాను".

ఈసారి అక్కయ్యకి ఏమీ వినపడలేదు. ఆవిడ గుండెలో మట్టుకు ప్రతిధ్వనిస్తోంది. "నేనుఉంటాను, నేను వెళ్లను" అని.

"నేను ఇంకో సారి బాగా చూసి వస్తాను".

పెద్దమ్మ వెళ్లింది. అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లింది ఆవిడ. అంతమంది జనం మధ్య ఆవిడ అదృశ్యం అయింది. అక్కయ్య వెనక్కి వచ్చింది. స్టేషను గేటు దగ్గరకు వచ్చి నిలబడింది. సాయంత్రం ముగుస్తోంది. బస్సు స్టాండులో ఆఫీసు నుంచి తిరిగి వచ్చే వాళ్ళు కిటికీ లోంచి బైటకు చూస్తున్నారు. తుప్పు పట్టిన పెట్టిలా ఉన్నాయి వాళ్ల ముఖాలు. హౌరా బ్రిడ్జిలో ఎండ క్రమంగా క్షీణిస్తోంది. స్టీమర్లు గంభీరమైన శబ్దాలు చేస్తూ నడుస్తున్నాయి హుగ్లీ నదిలో. ట్రాలీ వాడు హౌరా బ్రిడ్జి ఎత్తు పైకి వంగుని ట్రాలీని ఈడుస్తున్నాడు. డ్రైవరు బస్సు దిగి బీడీ పొగ ఆకాశంలోకి వదులుతున్నాడు. సాయంత్రం అయి పోవచ్చింది. 'లిలియా'లో ప్రభుత్వ అనాధ బాలికల వసతి గృహం ఉంది. పారిపోయి వచ్చిన ఆడపిల్లలను మొట్టమొదట అక్కడ ఉంచుతారు పోలీసులు. "నేనిక్కడే ఉంటానంటున్నాడు, నాకు ఇల్లు లేదు, ఎవ్వరూ లేరు అని అనగలవా?" అలా అంటూంటే అన్నగారి ముఖం ఈ సాయంకాలం లాగే అయిపోయింది.

అక్కయ్య మళ్లీ స్టేషను షెడ్డు క్రిందకు వచ్చింది.

రెయిలింగ్ పట్టుకుని ట్రెయిను వెళ్లడం చూసింది చెల్లాయి. ట్రెయినులోని కిటికీ లోంచి ముఖాలు ప్లాట్‌ఫారం వైపు చూసి నవ్వుతున్నాయి. నవ్వుతూ నవ్వుతూ వెళ్లిపోయారు. అల్లాగే ఆమెకు కూడా వెళ్లాలని ఉంది. రైల్వే లైను పైన అయి మూలగా ఒక బ్రిడ్జి ఉంది. ప్లాట్‌ఫారం ప్రక్క నుంచి నేల ఎత్తు చేసి బ్రిడ్జికి త్రోవ నిర్మించారు. చేతుల్లో సంచులు పట్టుకుని ముగ్గురు మనుష్యులు ఆ త్రోవమ్మట నడుస్తున్నారు. వాళ్ళు ఏదో కొండ ఎక్కినట్లు ఎక్కుతున్నారు.... తర్వాత ఆమె తనకోసం అక్కయ్య ఎదురు చూస్తో వుంటుందనుకుంది.

వెయిటింగు రూంలో అక్కయ్య కనుపించక పోయేసరికి ఆమె తిరిగి షెడ్డు క్రిందికి వచ్చేసింది. తూకం చూసుకునే మెషీన్ పై ఒక వృద్ధుడు బరువు చూసుకుంటున్నాడు. వృద్ధుడు ఆ వివరాల కార్డు చదివి హడావుడిగా

వెళ్లిపోయాడు.

"ఇంక మూడే నిముషాలు ఉంది. ఇంకా రాలేదు. ఎంత బాధ్యతారాహిత్యం.

ముఖం త్రిప్పి చూసింది చెల్లాయి. 6,7 గురు బాలబాలికల గుంపు ఒకటి కనుపించింది.

"దాని కోసం ఎదురు చూస్తే, మనం ట్రెయిను మిస్సు అవతాం".

"అయితేనేం?"

వాళ్లల్లో వాళ్లు ఆలోచించుకుంటూ వ్యాకులంగా ఉన్నారు. కొంతసేపయే సరికి కళ్లజోడు పెట్టుకున్న అమ్మాయి ఒకర్తె ఇవతలకు వచ్చింది. బాగా చిక్కిపోయిన పిల్ల. 7వ తరగతి చదువుతూ ఉంటుంది బహుశా. ఆమెను చూసేసరికి చెల్లాయికి అనిపించింది – దీన్ని గురించే ఆ గుంపు చర్చించు కున్నారని.

"వాళ్లు ఇప్పుడే వెళ్లిపోయారు".

"వెళ్లిపోయారు!"

ఆ పిల్ల చేతిలోని చర్మపు సంచి బాగా గట్టిగా నొక్కిపట్టుకుంది. ముక్కు మీద కళ్లజోడు సద్ది కూర్చుంది. 'నేనేం చేయాలి!' అంటూ ఆలోచిస్తున్నట్లు కూర్చుంది తర్వాత.

"ఒక్కర్తెవూ వెళ్లలేవా?"

"ఎందుకు వెళ్లలేను? వాళ్లందరితోనూ కలిసి ఇంటికి వెళితే త్రోవలో ఏమీ బెంగ ఉండదు" అని అంటూ, 'అరే' అని లేచి కూర్చుంది ఆ పిల్ల. ఒక పిల్లవాడు గాభరాపడుతూ వచ్చాడు. అతడినే ఇప్పడే ఆ బాలబాలికల గుంపులో చూసింది చెల్లాయి....

"మీరు ఇదే రావడమా?" అని అడిగాడు పిల్లవాడు.

"అవును! మీరు?"

"నేనూను".

"అల్లాగయితే!" ట్రెయిను వెళ్లిపోయింది. "ఉన్. ఒక దొక్కు ట్రాము ఆగిపోవడం మూలాన ఇంత గొడవ జరిగింది".

"ఈ ఊరేగింపు ఎప్పుడు ఆగుతుందో! పోనీ, ఇప్పుడేం చేయాలి. వెళ్లడానికి వీలు లేదు".

"ఇంట్లో తిరిగి వచ్చేసరికి రాత్రి 10, 11 అవుతుందని చెప్పి వచ్చాను. పెళ్లివారి ఇల్లు. ఇప్పుడే తిరిగి వెళితే వాళ్లంతా నవ్వుతారు!"

"నడవండి. ట్రెయినులో 'బ్యానదేల్' షికారు వెళ్లి తిరిగి వద్దాం".

"కాని ముందు కొంచెం ఏదైనా తిందామా?"

వాళ్ళిద్దరూ వెళ్లిపోయారు. అదే సమయంలో స్టేషనులో లైట్లన్నీ వెలిగాయి.

ఒక ట్రెయిను వచ్చింది. తోసుకుంటూ జనం ఎక్కుతున్నారు, దిగుతున్నారు. ఇంతమంది జనాన్ని చూసేసరికి చెల్లాయికి బాగుండలేదు. తిరిగి వెయిటింగు రూములోకి వెళ్లింది.

............

తమ్ముణ్ని లెంపకాయ కొట్టి అంది తల్లి: "సిగ్గులేక పోతే ఇంకొంచెం ముందు వెళ్ళలేక పోయావా?" ఎక్కడో పెళ్లి వారి భోజనానికి పిలుపు లేకుండా వెళ్లి వాళ్లచేత దెబ్బలు తిన్నాడు.

అక్క ముఖం కేసి చూసి అకస్మాత్తుగా 'హ,హ' అంటూ లేచాడు. అప్పుడు ఆమె తమ్ముడి ముఖం మీద లెంపకాయ గుర్తు చూసింది.

మరొక చిత్తరువు దగ్గరగా అక్కయ్య ముందుకు సాగింది. గోడ తీగ మీద నుంచి తెగిపడి ఉన్న ఫొటో దగ్గరగా వెళ్లింది. అద్దం పైన తన ముఖం ప్రతిబింబించింది. తన ముఖాన్ని బాగా చూసేందుకు కొంచెం వెనక్కు తగ్గి మూలగా చూసేసరికి అనిపించింది- 'ఎంత అవకరం! ఎంత భయంకరం! అన్నగారు దుఃఖిస్తూ అన్నాడు ఒక రోజున: "నేనేం చేయను? నేనేం చేయను? ప్రయత్నించాను". గాజు పెంకులన్నీ ఏరి అన్నగారి ముఖం చూసింది. అతని లాగే ఒక మమతలో సతమతమవుతూ ఉండిపోయింది. తీగనుంచి ఫొటో పడిపోవడం గురించి ఇంకా దుఃఖించింది....

అక్కయ్య ఆ పెద్దమ్మను చూసింది. మొగవాడి చేతిలో బెడ్డింగు, సూటుకేసూ; అతను మాట్లాడడం లేదు. ముందుకు వెళ్లి అక్కయ్య పెద్దమ్మ చేయి పట్టుకుంది.

పెద్దమ్మ బుజాలు ఆడించింది.

"ఆయన చిరునామా ఇయ్యండి. అన్నయ్యకు పంపుతాను".

ఆ మాట అని ఆ పెద్దమ్మ కేసి చూసింది - రెండు ముఖాలంత పెద్దవైన రెండు కళ్లు. ఊగిసలాడే రెండవ చుబుకం, కుంపటి లోంచి తీసిన మట్టి ముద్దలాంటి పెదవులు గల పెద్దమ్మకేసి.

"అక్కడ ఉద్యోగాల తగ్గింపు గురించి నోటీసు ఇచ్చారు".

పెద్దమ్మ వెళ్లిపోవడం చూస్తే అక్కయ్యకు బుజాల మీద బెడ్డింగూ, సూటుకేసూ పెట్టినట్లుంది. చూడగా చూడగా అక్కయ్యకు కునుకు వచ్చేలా ఉంది. కంటి రెప్పలు బరువెక్కాయి. ఎల్లాగో నాలుగు వైపులా కళ్లు తెరిచి చూసేసరికి చెల్లెలు ఎదురు చూస్తోందేమో అనిపించింది.

వెయింటింగు రూంకి తిరిగి వచ్చి చెల్లెలిని చూడగలిగింది.

ఇద్దరూ మాట్లాడకుండా ప్రక్కప్రక్కగా కూర్చున్నారు. ఒక మాటు అక్కయ్య

అంది? "ఇక్కడ కూర్చుని ఏం లాభం? అలా వెళదాం రా".

వాళ్లు మెల్లిగా తలవంచుకుని నడుస్తూ స్టేషను మరో మూలకు వెళ్లారు. చెల్లాయి అంది: "మనం ఇప్పుడు ఏం చేద్దాం?"

అక్కయ్య నిలబడి ఆలోచించింది: "కాస్సేపు నిలబడదాం"....

రెస్టారెంటు తలుపులు తెరుచుకుని ఆ బాలబాలికల జంట బైటకు వచ్చారు. చెల్లాయి అనుకుంది, "వాళ్లిప్పుడు షికారు వెళతారు".

దగ్గు వచ్చి ఉమ్ము వేసింది. అక్కయ్య ఆమె వీపు మీద చేత్తో నిమిరి గుండె దగ్గరగా తీసుకుంది ఆమెను.

అంది: "ఏంటన్నావు?"

"ఏం లేదు"

"నీకు ఆకలేస్తుందా?"

"లేదు"

మళ్లీ రెస్టారెంటు తలుపు తెరుచుకుంది. చప్పుడు వినపడింది. విని కునుకుతూ కునుకుతూ ఉండడం మొదలుపెట్టింది. ట్రెయిను కూత కూసింది. చెల్లాయి అంది: "శంఖంలా ఊదింది కాదూ?"

"అవును"

"అక్కా నీకు జ్ఞాపకం ఉందా, నాన్నతో వెళ్లి గంగానది ఒడ్డున ఒక ఎంజను బండి ఎక్కాం".

"ఉంది"

"డ్రైవరుకి ఒక బంగారు పన్ను ఉంది. నన్ను కౌగలించుకున్నాడు".

"అతను ఎంజను బండి బూరా నొక్కాడు. నువ్వే భయపడి అతని గుండెలో నీ ముఖం దాచుకున్నావు.

చెల్లాయి నవ్వింది.

అక్కయ అంది: "అదుగో చూడు!"

పెళ్లి చేసుకుని వరుడు వధువుతో ఇంటికి వెళుతున్నాడు. క్రొత్త ట్రంకు పెట్టి; క్రొత్త మంచం పరుపూ, క్రొత్తవీ గట్టివీ వస్త్రాలు. భయంతో ముడచుకు పోయినట్లు నడుస్తోంది నూతన వధువు. వరుడు సిగరెట్టు పొగ గుప్పుగుప్పుమంటూ పీలుస్తున్నాడు.

"అక్కా, జుట్టు చూశావు? ముందు పలచబడింది"

"అవును"

"వరుడు చాలా పెద్దవాడేం"?

"అవును"

"అన్నయ్య ఆ స్నేహితుడింకా రాలేదేమో!"

"ఎవరికి తెలుసు?"

"మంచి సరదాగా కబుర్లు చెపుతాడేం!"

అక్కయ్య ఇంక జవాబు చెప్పలేదు.

"ఒక రోజున చాకలెట్లు తీసుకొచ్చి ఇచ్చాడు, జ్ఞాపకం ఉందా?" జవాబు ఇవ్వకపోయినా చెల్లాయి ఊరుకోలేదు." "నువ్వంటే అతనికి అంత ఇష్టం అంది అమ్మ".

"నోరు మూసుకో ఇంక".

చెల్లాయి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. దగ్గుతో వంగి పోయింది. పేలవమైన గొంతుతో అంది: "మంచినీళ్లు త్రాగుతా"

"వెళ్లి త్రాగు"

చెల్లాయి వెళ్లలేదు. అక్కయ్యకు కునుకుపాట్లు వస్తున్నాయి.

తదేక దృష్టితో ముందుకు చూసింది. ఆ సంగతి కనిపెట్టి చెల్లాయి అంది: "ఇప్పుడు మనం ఇంకేం చేద్దాం?"

"తెలియదు"

"అన్నయ్య ఏమని చెప్పాడు"

అక్కయ్య ఆలోచిస్తున్నట్లు అభినయించింది.

"అతను ఈసారి వస్తాడా?"

"ఏం?"

"మనం ఇంకెందు కొచ్చామనుకుంటున్నావు?"

అక్కయ్య కళ్లు త్రిప్పి నాలుగు వైపులా చూసింది. మనుష్యులు, లైట్లు, శబ్దాలూ కనుపించాయి, వినిపించాయి; ఇంకా తదేకదృష్టితో చూస్తూ ఉంది. తర్వాత నిద్ర గొంతుతో అంది: "మనం ఎదురుచూద్దాం. అతను వస్తాడు, అడుగుతాడు - కూడా ఎవరు వచ్చారు, ఎక్కడకు వెళుతున్నారు ఎందుకు వెళుతున్నారు. మనిద్దరం బొంబాయి వెళదామని" కూడా ఎవరూ లేరని, అక్కడ సినిమాలో నటిద్దామని వెళుతున్నామని' చెపుతా. అప్పుడు అతను మనల్ని పట్టుకు తీసుకు పోతాడు. చిరునామా కనుక్కుంటాడు. మనతో చెప్పడు. ఇంక ఆ పైన మనని ఏదో అనాథాశ్రమంలో చేర్చేస్తాడు".

"అక్కడేం చేయాలి?

"తెలియదు"

"అక్కా, నడు, పారిపోదాం".

ఒక్కొక్కటే అక్కయ్య కలలు కల్లలౌతున్నాయి. చల్లని గొంతుతో అంది

"ఎక్కడకు పారిపోదాం?"

"ఎక్కడికో ఓ చోటకి".

"అటుపైన?"

చెల్లాయి ఊరికే చూస్తూ ఉండిపోయింది. అక్కయ్య చెయ్యి జాపి ఆమెను గుండెకు చేర్చుకుంది. ముఖం పట్టుకుని అంది: "భయం వేస్తోందా?" చెల్లాయి గుండెలో ముఖం దూర్చి తీవ్రంగా వణుకుతోంది. ఆమె వీపు మీద చెయ్యి వేసి అక్కయ్య ఆమెను తిన్నగా కూర్చోబెట్టింది.

అప్పుడొకరు అనుకున్నారు: "మానవుల ముఖాలు తుప్పు పట్టిన డబ్బాలా ఉంటాయి".

మరొకరు చూసారు: "నవ్వుతూ నవ్వుతూ ట్రెయిను ముఖం వెళ్లిపోయింది".

---

(ఏరిన కథలు, 1971)

# అనావృష్టి

*సునీల్ గంగోపాధ్యాయ*

ఛివ్‌దేహ్‌నుంచి డాల్టన్ గంజి వెళ్లే త్రోవలో బండి చెడిపోయింది. తళ తళ లాడే క్రొత్త స్టేషను వాగను ఇంత అకస్మాత్తుగా చెడిపోతుందని ఎవరూ కలలోనైనా అనుకోలేదు. బ్రిడ్జి రాగానే దానికి ముందు ఉన్న ఎత్తు ఎక్కడంలో రెండు మూడుసార్లు నీరసమైన చప్పుడు చేస్తూ కాస్సేపటికి పూర్తిగా ఎప్పుడైతే ఆగిపోయిందో బండి, అప్పుడు ప్రయాణికులు ఒక్కరూ కూడా ఏమీ లెక్క చేయలేదు: "ఆగింది, మళ్లీ అదే వెళుతుంది" అని అనుకుంటూ ఎవరి మనస్సుకి తోచినట్లు వాళ్లు కిటికీలోంచి బైట ప్రకృతి దృశ్యాన్ని తిలకిస్తున్నారు. ఖేమ్‌కా సిగరెట్ కేసు తెరిచి ముందుకు సాచాడు. అందరూ ఇంగ్లీషులోనే హిందీలోనే బెంగాలీలోనే వరుసగా తమ తమకు కావాలని తెలియజేసారు. కేస్‌లో 8 సిగరెట్లు ఉన్నాయి ఒక్కసారి పూర్తి అయిపోయాయి. 10 నిమిషాలు అయినా బండి కదలలేదు, వెనకాల నుంచి ఒక లారీ వచ్చి హారన్ కొట్టింది. ఖేమ్‌కా అప్పుడు స్వయంగా బండి దిగాడు.

వంతెన చేరుకునే త్రోవ సన్నంగా ఉంది. నదికి ప్రక్కగానే వచ్చి ఆగింది. నది కాదు; నది ఎముకల గూడు - రక్త మాంసాలేమీ లేవు. బండిలో దారుణమైన వేడిగా ఉండబట్టి, అరుణ్ కూడా దిగి నిలబడ్డాడు రెండు చేతులు వెనక్కి జాపి, ఛాతీ ముందుకుఎత్తి వళ్లంతా సాగదీసుకుంటున్నాడు; వళ్లంతా తేళ్లూ, జెర్రలూ ప్రాకుతున్నట్లుంది. స్నానం చేస్తే కాని ఈ చిరాకు పోదు. నదిలో కనక నీరుంటే అప్పటికప్పుడు అందులో మునిగేవాడు. మధ్యాహ్నం 11 $\frac{1}{2}$ గంటల సమయమేమో ఎండ వళ్లు కాల్చేసేలా ఉంది. ఇంక ఇప్పుడు చాలా మంది బండి మరమ్మత్తులో ఉందని తెలుసుకున్నారు. దిగి చూశారు పర్వతం అంచులపై చదువుకున్న వాళ్లు బొగ్గులతోనే, సుద్దలతోనే ఏవేవో వ్రాశారని. కాని సుద్దముక్క ఎక్కడ దొరుకుతుంది; ఇంట్లోంచి బైటకు వెళ్లేటప్పుడు ఎవరైనా జేబులో సుద్దముక్క పెట్టుకుని వెడతారేంటి? ఆ వ్రాతలు చిత్రాలన్నిటిలోకి బాగా ఎక్కువగా మెరుస్తున్నవి ఇవి - మందిరా (అమ్మాయి పేరు), సంభోగపు గుర్తు, ఎర్రకలం, అన్నీ ఒకేరకపు అశ్లీల చిహ్నాలు. గొంతుతో అన్నాడు అరుణ్ వాటిని చూసి, అస్పష్టపు గొంతుతో అన్నాడు - హెల్! గుడ్ హెవెన్స్!

డ్రైవర్ బోనెట్ ఎత్తాడు; అక్కడే ఖేమ్‌కాగారి తొంగి చూసే ముఖం కూడా. బండిలో హెరాల్డు ట్రిబ్యూను పత్రికకు చెందిన లాహిరీ విసుగు చెంది అరిచాడు "సే థాంక్స్".

ఖేమ్‌కాగారు చాలా చాకచక్యమైన సమయస్ఫూర్తి గలవాడు; కంగారు పడకుండా తల ఆడిస్తూ అన్నాడు. బండి ఎప్పుడైతే ప్రయాణానికి సిద్ధంగా ఉంటుందో అప్పుడు మనం ఎక్కుదాం. దగ్గరే 'రూపాటూంగ్రీ' డాక్ బంగలా ఉంది. అక్కడ భోజనం చేద్దాం.

అదే సమయంలో మరో ముగ్గురు, నలుగురు బండిలోంచి క్రిందకు దిగారు. లాహిరీకి ఒక్కొక్కప్పుడు ప్రొద్దున్నప్పుడు మనస్సు బాగుండదు. ప్రొద్దుట సమయంలోనే ప్రతి వాక్యం ముందు హెల్! అంటూంటాడు. అని అరుణ్ కనిపెట్టాడు. ముఖం వికారం గా పెట్టి చేతి గడియారం కేసి చూశాడు. లాహిరి టైము చూసేందుకు కాదు తారీఖు కోసం అన్నాడు. "ఈవేళ ఎనిమిదో తారీఖు ఈ వేళే నేను పాట్నా చేరుకోవలసి ఉంది; మీ కంపెనీ ఈ డొక్కు బండి మనకిచ్చింది...."

ఖేమ్‌కాగారు 'హహ్హా' అంటూ నవ్వాడు. అన్నాడు-"ఇది క్రొత్త బండి; అందుచేతనే యిబ్బంది పడుతోంది, నడు, నడు, బంగళా బాగుంటుంది. నీకక్కడ చాలా బాగుంటుంది. రంగాచారిగారూ, ఏమంటారు?"

రంగాచారిగారికి అభ్యంతరం లేదు; నిజానికి ఎవరికీ అభ్యంతరం లేదు. అయితే లాహిరీ అన్నిట్లోకి పెద్ద ఇంగ్లీషు పేపరుకి చెందినవాడు; అందుకే అతనికి అందరికంటె ఎక్కువ టెక్కు కూడాను. అతను సణుక్కుంటూ అన్నాడు: "డాల్టన్ గంజిలోని డి.ఎమ్.ఏ. తో నాకు 3 గంటలకు అప్పాయింట్‌మెంటు ఉంది.... అదంతా.... బంగళా ఎంత దూరంలో ఉంది? ఇంత ఎండలో నడవాలా?"

"చాలా దగ్గరే! చూద్దాం రండి".

"అక్కడ తినేందుకు అన్నీ దొరుకుతాయా? ఈ చుట్టు ప్రక్క లెక్కడా తినేందుకు దొరకదు".

"అది నాకు వదిలేయండి. నా దగ్గర వస్తువులు ఉన్నాయి, ఏమీ అసౌకర్యం ఉండదు".

ఖేమ్‌కాగారు దీన్ని గురించి బెంగపెట్టుకోడు. లాహిరీ తో చిరునవ్వు ముఖం పెట్టి మాట్లాడాడు. ఈసారి డ్రైవరు వైపు తిరిగి ముఖ కవళిక పూర్తిగా మార్చి ఒక కర్కశపు ముసుగు తొడుక్కున్నట్లు, కోపంతో కూడుకున్న గొంతుతో అతణ్ని గట్టిగా మందలించాడు. వెంటనే మళ్లీ ముఖం చిరునవ్వుతో లాహిరీ తో అన్నాడు: "మధ్య మధ్య ఈ రొటీను మార్చే సంఘటనలు నాకు చాలా నచ్చుతాయి! నడవండి!"

స్టేషను వాగను క్లీనరు వెనకాలే సామగ్రి తీసుకు వస్తున్నాడు. ఒక కేసు బీరు,

మూడు కేసులు విస్కీ అప్పుడు మిగిలి ఉన్నాయి. తినుబండారాలు అన్నీ ఖాళీ అవలేదు. వాటికేసి ఒక దొంగ చూపు చూశాక లాహిరీ ముఖ రేఖలో చాలా మటుకు మార్పు వచ్చింది.

బంగళాలో రెండు గదులు, బాత్‌రూముతో సహా, ఉన్నాయి. ముగ్గురు బంట్రోతులున్నారు. కొద్ది సమయం వెనుక ఒక కేంద్ర మంత్రి ఆయన పరివారం అక్కడ బసచేసి వెళ్లారు. అందుమూలాన బంట్రోతులు ఇంకా వాళ్ల యూనిఫారం విప్పలేదు. భేమ్‌కాగారు క్రికెట్ ఆటగాడి మోస్తరుగా అన్ని ఏర్పాట్లు తేలికగా అలస్యం లేకుండా చేశాడు; మూడు గొప్ప కోడి పుంజులు దొరకనందుకు కొంత చింత ప్రకటిస్తూ బీరు సీసాలు తెరవడం మొదలుపెట్టాడు. లాహిరీ ముడతలు పడ్డ భ్రూమండలం ఇప్పుడు కొంచెం సరళత పొందింది. టేబులు మీద అయిమూలగా తన రెండు కాళ్లు జాపి అన్నాడు: "భేమ్‌కాగారూ, ఈ చుట్టుప్రక్కల్లో మీ తాతా కంపెనీ వాళ్ల 'లంగర్ ఖానా' కాని 'టంగర్ ఖానా' కాని ఏమైనా ఉన్నాయాండి?"

"లేవు, ఈ ప్రక్కన లేవు మాకు 4 పాయింటు రిలీఫు అప్పజెప్పారు. దాన్నే రేపు విజిట్ చేస్తాం".

"పోనీండి, బ్రతికిపోయాం. ఈ మూడు రోజులూ మీరు జరిపించిన 'అత్యాచారం' చాలు".

"టార్చ్‌ర్! వుయ్ మస్ట్ ఫేస్ లైఫ్ ! మీరు జర్నలిస్టులు...."

"ప్రొద్దున్నే వెధవ బూతు మాటలాడకండి.

"దేశం పరిస్థితి మీ కళ్లతో మీరు చూడరా? విదేశీ రిపోర్టరులే...."

"దేశం పరిస్థితి తెలుసుకోవలసినంత అవసరం ఏముంది మీకు?

"మరీ వెర్రి వాగుడు వాగకు. వల్‌గర్! ఏయ్, అరుణ్, నీ దగ్గర సిగరెట్టు ఉంటే ఒకటి ఇలా పడెయ్".

భేమ్‌కాగారి సిగరెట్ కేన్ మళ్లీ నిండింది. అది స్టయిలుగా తెరిచి వాళ్లముందు పెడితే లాహిరీ అన్నాడు: "గోల్డు ఫ్లాకులు కాల్చగా కాల్చగా నోరు మొద్దు బారిపోయింది. తోసెయ్, ఇయ్యి, అరుణ్, చార్‌మినార్ ఇయ్యి!"

అరుణ్ దూరం నుంచి పాకెట్ విసిరి, అన్నాడు: "ఈవేళ ఇక్కడనుంచి వెళ్లడం జరుగుతుందా? చోటు చాలా ఏకాంతంగా ఉంది ఇక్కడ".

"నీకేమయ్యా? ఏడు రోజులు సెలవు దొరికింది. మేం ఎల్లుండే కలకత్తా వెళ్లి ప్లేను ఎక్కాలి; ఒక్క రోజే ఉంది మాకు ఈ లోగా - బుర్ర ఒక్కసారి తిరిగిపోతోంది ఏమీ బాగుండలేదు మనస్సు".

భేమకాగారు అన్నాడు: "నిజానికి సహించలేం. ఇటువంటి కరుణామయ

దృశ్యం..."

"ఏమిటి కరుణామయం? ఏమిటి? అఁ?"

లాహిరీ కాళ్లు క్రింద పెట్టి తిన్నగా కూర్చున్నాడు. పెద్దముఖం, వెడల్పయిన నోరు లాహిరీది; కళ్లపై పెద్ద పవర్ ఉన్న కళ్లజోడు. ఒకేసారి అతని ముఖంలో పిల్లవాడిలో లాగ కోపం, ఆశ్చర్యం, విసుగు, ఆశాభంగం - అన్నీ స్పష్టంగా ద్యోతకమవుతున్నాయి. ఇప్పుడు పూర్తి విస్మయంతో అడిగాడు: "ఏమిటా కరుణామయ విషయం? అఁ ?"

బాంబే ట్రిబ్యూన్ దేశపాండే అన్నాడు: నేనొక ఫొటో తీసాను. బెల్గా రిలీఫ్ సెంటర్‌లో లైనులో ఉండగా నే ఒక ముసలివాడి ఒడిలో తల పెట్టి ఒక ముసలమ్మ చనిపోయింది. ఎవడైనా ఇటువంటి దృశ్యం చూసి ఊరుకోగలడా? నేను చూశాను జయప్రకాశ్‌గారు మాటిమాటికీ చెమట తుడుచుకోవడం; నా మటుకు నాకు కళ్లమ్మట నీళ్లు తిరిగాయి.

రంగాచారి నవ్వుతూ అన్నాడు:"కళ్లల్లో నీళ్లు నిండేముందు కెమేరాతో ఫొటో బాగానే తీశావు కదా! ఇప్పుడింక ఈ ఫొటో టైమ్సుకా లేక గార్డియన్ కా అమ్మడం..."

దేశపాండే తీవ్ర స్వరంతో అన్నాడు:"ఎప్పటికీ అలా జరగదు. మన దేశపు ఇటువంటి అభాగ్య దృశ్యాలను నేనెప్పుడూ విదేశీయులకు విక్రయించను".

లాహిరీ శ్రద్ధగా విన్నాడు; ఈసారి అన్నాడు :"ఇదేం కరుణామయ దృశ్యం! అంతకంటె మన అవస్థ కరుణామయమైనది కదా? ఈ దుర్మార్గుడు ఖేమ్‌కా...."

ఖేమ్‌కాగారు పళ్లిగిలించి నవ్వి, కూడా కూడా భయం నటిస్తూ అరిచాడు:"అరే! అరే, నేనేం తప్పు చేశాను?"

"తస్సాదియ్యా, నువ్వే ఈ ఆపదకు కారణం".

"ఎల్లాగ? దేశంలో ఏం జరుగుతుందో మీరే...."

"దేశంలో ఏమవుతుందో మేం మా అవసరాన్ని బట్టి చూస్తాం. మా పేపరు మమ్మల్ని చూసి రమ్మంది. నువ్విప్పుడు మమ్మల్ని ఆహ్వానించి ఇదంతా చూడమని ఎందుకు లాక్కొచ్చావు? ఎవరైతే డబ్బు దానం చేస్తారో వారే ప్రచారం గురించి చూసుకోవాలి. ప్రజలు చావడం చూడమనా మమ్మల్ని ఆహ్వానించావు? రాత్రింబగళ్లు విస్కీ త్రాగాము. విశ్రాంతి పొందాం - మళ్లీ మధ్య మధ్య ఒక్కసారిగా వెళ్లి ప్రజలు చావడం చూడడం - తస్సాదియ్యా, నువ్వు ఇవన్నీ మాకు అర్పిస్తున్నావని చెప్పి నిన్ను మేమేదో సంతోషపెడతాం అనుకోకు. 'త్రాగుబోతు జనం మంచి సరుకు చూసి విడిచిపెట్టలేరు' - అలా అనుకోవడమే నువ్వు చేసిన అత్యాచారం".

భేమ్‌కాగారు పూర్తిగా మారిపోయి, నెమ్మదిగా చప్పట్లు వేసి అన్నాడు: "తమాషాగా మాట్లాడుతున్నారు. నేను మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. కాని ఇది నా బాధ్యత..."

లాహిరీ కుర్చీ మీంచి లేచి వరండాలోకి వెళ్ళి ఉమ్మేసాడు. జేబులోంచి రుమాలు తీసి ముక్కు చీదాడు. కళ్లజోడు తీసేసరికి అతని ముఖం తీరు పూర్తిగా మారిపోయింది, అదే నిస్సహాయతతో కూడుకున్నట్లు గా ముఖం పెట్టి అన్నాడు: "నిజమే, బాగులేదు. చూడు వంట అయిందేమో ఆకలేస్తుంది. ఇంకో పెగ్ వేసుకుంటే తర్వాత అన్నం తినాలనిపించదు".

డాక్ బంగళా ఆవరణలో ఒక పెద్ద నుయ్యి ఉంది. అందులోంచి నీళ్లు తోడుకునేందుకు గుంపులు గుంపులుగా జనం వచ్చారు. ఒక బంట్రోతు అక్కడ నిలబడి వాళ్లను కాపలా కాస్తున్నాడు; ఒక్కరికీ కూడా ఒక బిందె కంటె నీళ్లు దొరకలేదు. అరుణ్ అటువైపే చూస్తున్నాడు. లాహిరీ అతని దగ్గరకు వచ్చి అన్నాడు: "ఏమిటి చూస్తున్నావు? ఆడపిల్లలనా? ఏడు సంవత్సరాల క్రితం ఒకసారి ఇలాంటి సందర్భంలోనే ఇక్కడకు వచ్చాను. అప్పుడు నా వయస్సు నీ వయస్సుతో సమానం. అప్పుడు నేను చూసి నప్పుడు ఈ ఆడపిల్లలు ఎంత ఆరోగ్యంగా ఉండేవారో! ఇప్పుడు చూడు ఒక్క ఆడపిల్లకైనా గట్టి పృష్ఠం కాని, వక్షస్థలం కాని లేదు...."

అరుణ్ మాట్లాడకుండా లాహిరీకేసి చూసి నవ్వాడు. లాహిరీ మళ్లా అన్నాడు: "అయితే నువ్వేం భాషలో భావిస్తున్నావు? నీ బెంగాలీ పేపరు ఏదో పెద్ద పెద్ద కవిత్వం అల్లుతుంది. లేదు, నేననేది, వ్రాసేది, అశేషజనానీకం ప్రతి ముఖంలో గోచరించే విషాదపు ఛాయాచిత్రం - కాదు, ఛాయాచిత్రం కాదు, 'ఛాయాచిత్రం' అన్న మాట పాతబడి పోయింది - విషాదం యొక్క చెమట, అంత కంటె ఇంకా బాగుంటుంది విషాదం యొక్క స్వేదం అంటే, ఎండ చెవిటి ఎండ - లేదు తమాషా హెడింగు దగ్గర నుంచీ చెప్పేస్తున్నాను - ఆకాశంలో చెవిటి ఎండ, నేలపై విషాదపు స్వేదం - కవిత్వం!"

జవాబియ్యకుండా నవ్వాడు అరుణ్? ఈసారి నువ్వు మరొక రకమైనది. లాహిరీ దాన్ని గమనించాడు: "ఏం కాస్త అతివాగుడు వాగానా? ఈ విషాదం గురించి ఆలోచించు: వేలకొలది మానవులు తిండిలేక గిలగిలా కొట్టుకుంటున్నారు - మన పనేంటి మరి? దాన్ని వర్ణించేటప్పుడు ఏం భాష వాడాలనే విషయం గురించి బుర్ర వేడెక్కించుకోవడం కాదూ? బాగుండ లేదు!"

"ఈ మధ్య ఎక్కడి నుంచో ఒక 'సాధు' వచ్చి చాలా మంచి పనులు చేస్తున్నాడని విన్నాను"

"సాధు? ఎటువంటిసాధు?"

"బొంబాయి నుంచి ఎవరో సాధు (సన్యాసి) వచ్చి, రోజూ ఒక వెయ్యిమందికి అన్నం పెట్టిస్తున్నాడుట. ఆ సాధువుగారి ధనవంతులైన భక్తులు డబ్బూ, బియ్యం పంపిస్తున్నారట. వ్యవహారం ఆసక్తిదాయకంగా ఉంది. ఇక్కడికి ఎల్లాగైనా వచ్చాం కాబట్టి నడవండి, వెళ్లి ఈ విషయాన్ని కవర్ చేద్దాం".

"సాధుగారు అన్నం పెట్టిస్తున్నారూ? ఆ గొడవ నీకూ నాకు ఎందుకురా పిచ్చి తమ్ముడూ?"

"అది చాలా వైభవోపేతమైన విషయం కదా! అందులో మీ ఇంగ్లీషు పత్రికలు అల్లాంటి వాటిపై మంచి కథ తయారు చేస్తారు".

"ఉఫ్, నోరు ముయ్యి. బీరేంటి ఇంత చేదుగా ఉంది - జిగట విరేచనాల మందులాగ? ఇదేం కల్తీ సరుకురా బాబూ?"

"బీరు కాస్త చేదుగానే ఉంటుంది కదా?"

'అనవసరపు గొడవ పెట్టకు. నువ్వింకా బొడ్డూడని కుర్రకుంకవు నువ్వు నాకు బీరు చేదుగా ఉండదా అని తెలియనట్లు చెపుతావా?"

లాహిరీ ముఖం ముడుచుకుని కూర్చున్నాడు. కళ్లజోడు తీసిన దిగులు ముఖంతో.

ఒకసారి వీడి దగ్గరకు, మరొక సారి వాడి దగ్గరకూ, వెళ్లి, ఏదో అస్పష్టంగా వెర్రివాగుడు వాగి, వాళ్లెవరైనా సమాధానం చెప్పితే వాళ్లని తిట్టి. "నోరు ముయ్యి" అంటున్నాడు.

అకస్మాత్తుగా భేమ్‌కాగారిని గట్టిగా అరుస్తూ పిలిచాడు: "ఒరేయ్ భేమ్‌కాగాడా! నీ మీద రుస్తుంజీ కి కంప్లెయింటు చేసి నిన్ను రాంచీకి ట్రాన్స్ఫరు చేయిస్తాను చూడు".

భేమ్‌కా వరండాకి బాగా చిగురుగా కూర్చున్నాడు. అతని ముఖం మీద, కళ్లమీద ఎండ పడుతోంది. అందుమూలాన అతని ముఖం ఎండలో మెరుస్తోంది. తియ్యని గొంతుతో అన్నాడు: "అల్లాచేస్తే, నా మంచి కోసమే అది. యూఆర్ మై ఫ్రెండ్".

"పోరా, ఫ్రెండూ లేదు గిండూ లేదు!"

"ఆల్వేస్! కానీ, నా తప్పేమిటి ఇప్పుడు"?

నడుం మీద చేతులు పెట్టి నిలబడ్డాడు లాహిరీ. తీక్షణంగా చూస్తూ భేమ్‌కాలోని దోషాలను వెతుకుతున్నాడు. ఇటూ అటూ చూసి, ఆఖరికి తన చేతిలోని ఖాళీ గ్లాసును గమనించాడు. అన్నాడు: "ఎప్పటినుంచో ఈ దేశవాళీ బీరే తాగుతున్నాను. నీ మగ్‌లో విస్కీ అంతా నింపుకున్నావురా? ఏం?"

వెంటనే లేచి భేమ్‌కా టేబుల్‌పైని విస్కీ బైట పెట్టి అన్నాడు: "మనస్సు బాగుండలేదు, కాబట్టి, విస్కీ బదులు బీరే త్రాగుతారు. అనుకున్నాను మీరు అందుమూలానే...."

"నా మనస్సు బాగోలేదని నీకెవరు చెప్పారు, గాండూ? నాకు ఆకలేస్తోంది. ఎప్పటినుంచో నీకు చెపుతున్నాను భోజనం సిద్ధం చేయించమని...."

అన్నం ఇప్పుడే తయారైంది. తెల్లగా మెరుస్తున్న వరి అన్నం, డబ్బా (లోని) వెన్న, బంగాళాదుంపల కూర, వేడి చికెన్ సూపు. రంగాచారి రహస్యంగా అరుణ్‌తో అన్నాడు: "ఈ మధ్య నేను తిన్న వరి అన్నం అంతటిలోనూ ఈ వేళటిదే నాకు బాగా నచ్చింది. అన్నింటిలోకీ అనావృష్టి ప్రాంతంలోని బియ్యమే బాగుంది అనిపిస్తోంది. కాదూ?"

అరుణ్ అన్నాడు: "కోడిమాంసం కూడా కమ్మగానూ చాలా రుచికరంగానూ ఉంది. పందారో లేక...."

కొంచెం కారం ఎక్కువగా ఉంది.

ఇంతట్లో లాహిరీకి మత్తు బాగా ఎక్కింది. వ్రేళ్లతో అన్నం కలుపుకుని తినడానికి ప్రయత్నించాడు కాని, ఏమీ తినాలని లేదు అతగాడికి. కళ్లు రెండు మసకలు కమ్మేశాయి. ఈ వేళంతా ఇలాగే జరుగుతుంది అతనికి. అయినా అరుణ్ కనిపెట్టాడు- ఇతను బైపు చేయడం మొదలు పెట్టేసరికి అతని ముఖంలో మరొక ప్రవర్తన కనిపిస్తుందని. అనన్య సామాన్యమైన జ్ఞాపక శక్తి, సునిశితమైన శైలీ, వర్ణనాతీతమైన ఏకాగ్రతా అప్పుడు అతని ముఖంలో ప్రస్ఫుటిస్తాయి. అరుణ్ అన్నాడు. "మీరేం తినరేం?"

"లేదు - ధూత్! ఏం తినను - బాగుండలేదు, కుళ్లు. కోడిమాంసం కుళ్లుగా ఉంది".

ఆశ్చర్యం ప్రకటించే ముఖంతో భేమ్‌కా అన్నాడు: "అప్పటికప్పుడు బ్రతికి ఉన్న కోడితో చేసిన మాంసం కుళ్లిందా? హహ్హా! అందరూ నవ్వారు. కోపపు గొంతుతో లాహిరీ అన్నాడు: "వాట్ ఈజ్ ఫన్నీ? ఆ? తప్పకుండా కుళ్లింది. ధూత్!"

లాహిరీ వ్రేళ్లతో అన్నమూ, మాంసమూ కలిపి ఇటూ అటూ పారేయడం చూసి దేశ్‌పాండే అన్నాడు: "అన్నయ్యా, నువ్వు తినకపోతే పోనీ, అవన్నీ కెలికి పాడు చెయ్యక బాబూ!"

"బాగు చేస్తానే, పాడు చేస్తానే. నీ కెందుకు!"

"అదేం అన్యాయం! ఇంత మంది జనానికి తిండి లేదు. అలాంటప్పుడు మనం పొట్ట చెక్కలయ్యేలా తినడమే తప్పు. దానికి పైగా తినకుండా ఆహారం పాడు

చేయడం...."

"ఆః! నేరుముయ్యి! బాగా చేస్తాను పాడుచేస్తాను".

"అదేం బాగుండలేదు. బంగాళా బేరర్లు తిననేనా తింటారు లేకపోతే ముష్టివాళ్లకు పెడతారు".

"షటప్! నేనేం వినదలచుకోలేదు. తినలేకపోతే, ముష్టి బాగులేదు, ఇంక నేను భరించలేను. ఇదేం క్రొత్తకాదు.... ఇంతవరకూ ఎవరూ తినలేదనుకుంటా.... తర్వాత పిలిచి చూడాలి. ఏ ఖేమ్కా, నేను నీకు వార్నింగ్ ఇస్తున్నాను - ఈ రోజంతా ఇక్కడ ఎవరైనా తినకపోయినా సరే, ఆ తినడం పారెయ్యడం అలాంటి గొడవలు చెప్పొద్దు. ఇనఫ్! ఈ రోజంతా సెలవు. తిరిగి రండి. ఈరోజు దుర్భిక్షం నుంచి సెలవు! అలా అలా తిరిగి రండి. ఈవేళ కేవలం సారా ( మత్తూ), ఆడపిల్లల గురించి మాత్రమే మాట్లాడాలి- ఖబర్దార్! ఇంకేం మాట్లాడినా సరే...."

"దానికేం అవసరం ఉండదు. బండి మరమ్మత్తు అయింది, భోంచేసి మనం స్టార్ట్ అవవచ్చు".

"దీని అమ్మ! ఇంకేంట్రా! భోం చేసి ఇప్పుడు నీ డొక్క బండిలో ఎక్కుతాననుకుంటున్నావా? నేనీ వేళ ఇక్కడే ఉండిపోతాను!"

"కాని మీరే అన్నారు కదా ఎల్లుండి కలకత్తాలో విమానం ఎక్కాలి అని?"

"నేను విమానం ఎక్కవలసి ఉంటే, నీ కెందుకు ఇంత ఆలోచన? చెప్పాను కదా ఈ వేళ సెలవు!"

ఢిల్లీనుంచి వచ్చిన ఇద్దరు పత్రకారులు అప్పటికప్పుడే వెళ్లిపోదలచుకున్నారు. దేశ్‌పాండేకి కూడా ఉండాలని లేదు. అతను తీసిన ఫొటోలు వాటి నవీనతను కోల్పోతే వాటికి విలువలేదు. ఆఖరికి నలుగురు వెళ్లిపోయారు. మిగతా నలుగురు ఉండిపోయారు, వాళ్ల కోసం బండి మళ్లీ వస్తుంది.

వరండాలో ఈజీచైర్‌లో కూర్చున్నాడు అతను. మళ్లీ గ్లాసులో విస్కీ పోశాడు; గబాగబా త్రాగి, మరో గ్లాసుడు కూడా పుచ్చుకున్నాడు. ఆల్కహాల్ ఇప్పుడు రక్తంలో కలిసింది. శరీరంలోని ప్రతి నాడిలోను ప్రవేశించి రక్తంతో లీనమైపోయింది. లాహిరీ పూర్తిగా సతమతమై పోతున్నాడు. ఒకసారి కుర్చీలోంచి లేచి, అటూ ఇటూ పచారు చేసి, మళ్లీ వచ్చి కూర్చున్నాడు. ఎండ తళతళలాడుతోంది ఈ ధగధగమనే ఎండకు సాయంగా గాలి వీస్తోంది; ఒక వింత శబ్దం చేస్తూ ఈ శబ్దంతో కూడుకున్న వాయువు అడవి మధ్యనుంచి వస్తోంది.

నూతిలో నుంచి నీళ్లు తోడుకునేందుకు ఎడతెగకుండా స్త్రీ పురుషులు వచ్చి పడ్డారు అప్పుడు. ఆ గిలక గడ గడ ధ్వనీ, దానికి తోడు వాళ్ల వింత భాషలో దెబ్బలాటలు. తన తోటి వాళ్లతో లాహిరి అన్నాడు: "ఏమిటి మీరంతా

ఊరుకున్నారు? మాట్లాడండి. ఏయ్ రంగాచారి, ఈసారి నువ్వు రష్యా నుంచి తిరిగి వచ్చావు; అక్కడి అడపిల్లలు ఎలాగ ఉంటారు? ఏమైనా లొంగేవారా?"

రంగాచారి అవులించి అన్నాడు: "నాకు వాళ్లను వేటాడేందుకు టైము లేకపోయింది. అంత టైట్ ప్రోగ్రామ్".

"నువ్వు అడపిల్లల కోసం వెతకలేదన్న మాట ఎవరు నమ్ముతారు? అప్పుడేసారి జర్మనీ వెళ్లావు. అక్కడి సంగతి చెప్పవా?"

"మీరే చెప్పండి".

"నేనింకేం చెప్పను? జుట్టంతా పండిపోయింది. అదే దుఃఖం. ఇప్పుడింక - ఏయ్ అరుణ్, నీ దింకా లేత వయస్సు నీ కింకా పెళ్లి అవలేదు. నీ ప్రేమా గ్రీమా గురించి ఏదైనా ఒకటి రెండు కథలు చెప్పు".

"లాహిరీ అన్నయ్యా, అంతకంటె స్పెయినులో జరిగిన మీ విషయం గురించి చెప్పడమే మంచిది".

రామ్‌యశ్‌సింగ్ చాలా సీరియస్ రకం మనిషి. ఎవరి నైనా ఇంటర్వ్యూ చేసేటప్పుడు తప్ప ఇంకెప్పుడూ అట్టే నోరు తెరవడు. త్రాగినా సరే నిశ్శబ్దంగానే ఉంటాడు. రంగా చారి అతణ్ని రహస్యంగా అడిగాడు:"బీహారులో ఎంతమంది అనావృష్టి వల్ల దెబ్బతిన్నారు అయ్యారూ?"

రామ్‌యశ్ సింగ్ సంక్షేపంగా అన్నాడు: "55% శాతం ఇంతవరకు".

"తిండి లేకపోవడం వల్ల ఎంతమంది చనిపోయారు?"

"ఏమీ అఫీషియల్ రికార్డు లేదు".

లాహిరీ హుంకరిస్తూ లేచాడు: "ఏమిటీ వెధవ గొడవ? మీకీ పిచ్చి ఎప్పుడు వదులుతుంది? చెప్పలేదా ఈ వేళ సెలవని? ఒక్క రోజైనా మీ చాకిరీ గొడవ మరవండ్రా!"

"మిస్టర్ లాహిరీ! ఇది చాకిరీకి సంబంధించిన ఇంటరెస్టు కాదు హ్యూమన్ ఇంటరెస్టు.

"షటప్ ఏమీ వినదలచుకోలేదు!"

నో యూస్ ఆర్గ్యూయింగ్ విత్ ఎ డ్రంక్. పూర్తిగా డ్రంక్ కాదు! ఇతరుల డబ్బుతో సారా కోడి మాంసం దొరికితే ఇంకేముంది - హ్యూమన్ ఇంటరెస్ట్ ఇప్పుడు అడపిల్ల మాటలు చెప్పాలి. సారా, మాంసం అయ్యాక అడపిల్లల విషయమే సరిగ్గా పట్టించుకోవాలి.

"అయితే చెప్పండి, వినడానికి రాజీ పడ్డాం".

"నిరుడు జనవరి మాసంలో మాడ్రిడ్ వెళ్లాను. అప్పుడ హోటల్లో రాత్రి వేళ అడపిల్ల బాత్ టబ్బులో వళ్లు ముడుచుకుని ఉంది - నేను స్నానం చేద్దామని

తువ్వాలు కట్టుకున్నాను- నేనప్పుడు బాగా తాగి ఉన్నాను...ఏయ్, చూడు, నిద్ర పోతున్నావా - ఏయ్ రంగాచారి - ఏయ్'.

రంగాచారి పొడుగు ముక్కు ద్వారా గుర్రు శబ్దం విని పిస్తోంది. 3,4 సార్లు అతణ్ని అరిచి పిలిచాడు లాహిరీ, ఏమీ సమాధానం లేదు. తూలుతూ, తూలుతూ ముందుకి వెళ్లి అతని జుట్టు లాగి అన్నాడు లాహిరీ. "ఏరా గుండూ, రంగాచారీ, "రంగాచారి గుంజుకుంటూ లేచాడు. అన్నాడు: "ఓహెూ, నిద్రొచ్చేసింది - చూడండి, భేమ్కా కూడా నిద్రపోతున్నాడు".

"ఈ వెధవ భేమ్కా సంగతి రుస్తుంజీ గారితో చెపుతాను. ఏయ్ (ముద్రించడానికి వీలులేని బూతు) భేమ్కా!"

భేమ్కా కళ్లు తెరిచి అన్నాడు: "నేను నిద్రపోలేదు. ఊరి కే ఇలా కళ్లు మూసుకున్నాను. మీరు చెప్పండి. . నేను వింటాను. అపైన తువ్వాలు చుట్టుకున్న ఆడపిల్ల...."

"నేనొక్కసారి తువ్వాలు ఊడపీకేసాను. చూసేసరికి జగజ్జననీ స్వరూపం, ఉరఫ్! ఒట్టు వేసుకు చెపుతున్నాను: అలాంటి పిల్ల కోటికి ఒకర్తె కూడా ఉండదు- ఒళ్లంతా ఒక కత్తి అంచు అంత నాజూకు. వక్షస్థలం ఎల్లాగ - రెండు సెర్చిలైట్లు, ఇంక తొడలా - అమ్మాయి మొదట ఏమంది, ఏమంది? అమ్మాయి నాతో అప్పుడు ఏమంది?"

ఎవరు జవాబిస్తారు! ముగ్గురు ముక్కులలోంచి నిద్ర నిశ్వాసం నెమ్మదిగా బైటకు వస్తోంది. తల వంచి, అందరూ నిద్రపోతున్నారు. ఒక్క అరుణ్ మటుకు లేచి ఉన్నాడు. కొద్దిగా నవ్వుతున్నాడు.

లాహిరీ ముఖంలో ఆవేదన గుర్తులు పూర్తిగా కనుపిస్తున్నాయి. కళ్లు బాగా తెరిచి అరిచాడు: "అందరూ నిద్ర పోతున్నారేం? మగ మనుషులు? ఆడపిల్లల మాట వినేసరికి నిద్ర వచ్చిందా? హ్యూమన్ ఇంటరెస్ట్ వెధవలు...."

అరుణ్ అన్నాడు "లాహిరీదా, మీరు చెప్పండి, అమ్మాయి ఏమంది?"

"విను. నా చేతిలో తువ్వాలు, గర్వంగా నవ్వి అమ్మాయి అంది: "నా వీపు తడిగా ఉంది. కాస్త తుడు'. నేనప్పుడు - 'దూత్, బాగులేదు!'.. ముగ్గురి దున్నపోతుల ముక్కుల నుంచి గుర్రు దాని శబ్దం మధ్య ఈ కథ. నడు, లేచి వెళ్లి, అలా తిరిగి వద్దాం".

"ఇంత ఎండలో ఎక్కడకు వెళతాం? కూర్చోరా? లాహిరి దా, మీరు ఎక్కడ పుట్టారు?"

"అలహాబాదులో. మా నాన్నగారు అక్కడ ఆఫీసరుగా పనిచేశారు. ఏం, నీ కెందుకీ విషయం?"

"ఊరికే అడిగాను".

"ఆ విస్కీ బాటిల్ కాస్త ఇలా తీసుకురా! అఛ్ఛా, ఉండు, ఇంక తాగనులే, బాగుండలేదు. ఇప్పుడేం చేద్దాం, చెప్పు".

"మీరు కూడా పడుకోండి".

"మిట్టమధ్యాహ్నం వేళ పడుకుని నిద్రపోవడమా? ధూ! అంతకంటె బైటకు వెళ్లి పోవడమే మంచిది. ఈ దున్నపోతులతో కూడా కూడా ఉండడం ఉందే - నువ్విప్పుడేం చేస్తావు?"

"ఏమీ లేదు. నేనిక్కడే ఊరికే కూర్చుని ఉంటా. నాకనేక సంగతులు ఇప్పుడు జ్ఞాపకం వస్తున్నాయి...."

"ఏం సంగతులు? ప్రియురాలు...."

"లేదు, లేదు. నేను తూర్పు బెంగాలులో పుట్టాను. వంగదేశం లో అప్పుడు 50వ మన్వంతర సంవత్సరం. 1943 వ సంవత్సరం లో - అప్పుడు నేను తూర్పు బెంగాలులో ఉన్నాను - అ రోజుల్లోని సంగతులే ఇప్పుడు జ్ఞాపకం వస్తున్నాయి అకస్మాత్తుగా".

"కాని అప్పుడు నువ్వు బాగా చిన్న కుర్రవాడివి కదా?"

"అవును. అప్పుడు నాకు కడుపులో చాలా అసౌఖ్యంగా ఉండేది. ఎప్పుడూ అకలి వేస్తూండేది. రోజస్తమానం ఆకలితో బాధపడుతూ ఏడుస్తూ ఉండేవాడిని. ఇంట్లో వాళ్లకి చాలా బాధ కలిగించే వాడిని".

"అరినీయమ్మ! హఠాత్తుగా ఇప్పుడొచ్చి ఆ సంగతులు ఎందుకు జ్ఞాపకం వచ్చాయి?"

"మా నాన్నగారు కలకత్తాలో ఉపాధ్యాయుడుగా పనిచేసే వారు. ఆ రోజుల సంగతి మీకు తెలుసు కదా! నాన్నగారు నెలనెలా ఏదో కూడబెట్టి డబ్బు పంపుతూండేవారు. అప్పుడు మాకు తూర్పు బెంగాలులో మా ఊళ్లో మణుగు బియ్యం 56 రూపాయిలుండేది! ఇంట్లో 5 గురు మనుష్యులు. రోజంతకీ ఒక్కసారి మాత్రమే అన్నం గంజి కలిపి మేమందరం కలిసి తినవలసి వచ్చేది. ఇంక బంగాళా దుంపకూర ముక్కలు ఎప్పుడూ జేబులో పెట్టుకుని ఉండేవాడిని - అప్పుడు నాల్గవ తరగతి చదువుతూండే వాడిని. స్కూలు కి వెళ్లి జేబులోంచి బంగాళాదుంపలు బైటకు తీసి తినేవాడిని. క్లాసులో పిల్లలందరూ కూడా ఇంటి నుంచి దుంపలు తెచ్చుకునే వారు బెంచిపైన ఉప్పు నా కు అది సయించేది కాదు; నేనేమో అజీర్ణ రోగంతో బాధపడే వాడిని కదా, గంజి అన్నం ఇష్టం గా ఉండేదికాదు; బంగాళా దుంపకార ఇష్టమయ్యేది కాదు, అందుచేత అకలి; అమ్మని సతాయించే వాడిని; అమ్మ అన్నం తినేందుకు కూర్చున్నప్పుడు ఆవిడ ఆహారం లాక్కుని

తినేసేవాడిని".

కారణం ఏమీ లేకుండా లాహిరీ తల ఆడించడం మొదలుపెట్టాడు: "అర్థం అయింది, అర్థం అయింది".

తర్వాత లాహిరీ అక్కడనుంచి లేచి వరండా మూలలోకి వెళ్లాడు, మరింకో పక్కకు వెళ్లి అన్నాడు: "తెలిసింది మీ అమ్మ బ్రతికి ఉందా?"

"లేదు ఆ సంవత్సరమే మా అమ్మ క్షయ వ్యాధి వల్ల మరణించింది. ఒక భూతం లాగ ఆవరించింది నన్ను ఆకలి. కడుపులో ఏదీ పడేది కాదు. అయినా అమ్మ భోజనం వాటా లాక్కుని తినేవాడిని. ఎవరితోనూ ఏమీ చెప్పకుండా అమ్మ రోజూ అన్నం తినకుండా ఉండిపోయేది. అప్పటినుంచే ఆమెకు టి.బి. వ్యాధి వచ్చింది. అప్పుడు నాకర్థం అవలేదు - ఇప్పుడవన్నీ గుర్తుకొస్తున్నాయి. నిన్న 'లాంగర్‌ఖానా' (ఉచిత భోజనం వడ్డించే చోట) క్యూ చూసి ఒక్కసారిగా ఏదో విధంగా అనిపించింది. ఒక విధమైన 'మజా' అని పించిందని ఒప్పుకోవాలి. ఏమనిపించిందంటే ఆశ్చర్యంగా, నేను హాయిగా బతికిపోయాను, అని".

లాహిరీ హుంకరించి అన్నాడు: "మజా" అనిపించిందా? ఇదేమైనా మజా కలిగించే వ్యవహారమా!"

అదే అర్థరహితమైన విధంగా అరుణ్ నవ్వాడు: "అవును అదే 50వ మన్వంతర సంవత్సరపు కరువు రోజుల్లో నేను చనిపోవలసిందే! కాని చావలేదు! మా అమ్మ చనిపోగా నేను బతికాను. బతికి పోవడం ఒక మజా అయిన సంగతి కాదా!"

సిగరెట్టు ఆఖరి పీక వ్రేలుపైన పెట్టి దూరంగా విసిరాడు లాహిరీ. పాంటు జేబులో చెయ్యి పెట్టి చిల్లర పైసలు తీసి వాటిని గణగణ లాడించడం మొదలు పెట్టాడు. ఒక చేతితో తల జుట్టు పట్టుకున్నాడు. ఉండి ఉండి ఒక్కసారి ఎగిరి వరండాలోంచి క్రిందికి దిగి, ఒక పువ్వు కోశాడు. తర్వాత కేక వేశాడు "హే అరుణ్, నువు గదిలోకి పో కొంచెం సేపు గది చీకటి చేసి పడుకుంటే బాగుంటుంది నీకు".

అరుణ్ తీక్షణంగా లాహిరీ ప్రవర్తనను గమనించాడు. తర్వాత జవాబు చెప్పాడు: "లేదు ఇక్కడే చాలా బాగుంది".

లాహిరీ నూతివైపుకు సాగాడు. ఒక అమ్మాయి అప్పుడే బిందెలో నీరు నింపింది. ఆమెతో అన్నాడు: "కాస్త నీరు ఇయ్యమ్మా, కొంచెం నీళ్లు, ముఖం తోముకోలేదు!"

ఆ అమ్మాయి కొంచెం కొయ్యబారినట్లు అయిపోయింది. లాహిరీ మత్తు ఎక్కిన ఎర్ర ముఖం కేసి చూసింది. తర్వాత భుజం మీద నుంచి బిందె దింపి వంగి కొన్ని నీళ్లు ఇచ్చింది అతనికి. దోసిట్లో నీళ్లు పట్టి తన కళ్ల జోడు తీసిన ముఖాన్ని

చల్లగా కడుక్కున్నాడు. అటుపైన మళ్లీ దోసిలి పట్టి కొన్ని మంచినీళ్లు త్రాగాడు. అప్పుడు అమ్మాయితో అన్నాడు: "రా, నీకు నేను నీళ్లు తోడి ఇస్తా".

బంట్రోతుని తప్పుకోమని అన్నాడు: "ఠీక్‌హై, తుమ్ జావో (సరే, నువ్వు వెళ్లిపో) నేను వీళ్లందరికీ నీళ్లు తోడి ఇస్తాను".

తొంగి చూస్తే, నూతిలో చాలా అట్టడుగుకి నీరు ఉంది. అయినప్పటికీ పూర్తిగా నీరు ఎండిపోలేదు.

---

('ఏరిన కథలు', 1972)

# ప్రాణరక్షణ కోసం

ప్రఫుల్ల రాయ్

మాఘమాసం గడిచింది.

అయినప్పటికీ శీతాకాలం గడిచిపోలేదన్నట్లు, ఈ రోజు తెల్ల వారు ఝాము నుంచి ఆకాశంలో ఈ ప్రక్క ఆ ప్రక్క పర్వతాల్లాంటి మేఘాలు ఆవరించి ఉన్నాయి. మధ్య మధ్య కొంచెం కొంచెం ఎండ తొంగిచూస్తోంది. మేఘావృతమైన ఆకాశం చటుక్కున వెలగడం ప్రారంభించి, మరుక్షణమే ఆ వెలుగు మటుమాయమై పోయింది.

విష్ణుపద్ వయస్సు ఇంచుమించు 40 సంవత్సరాలు. ఒక ఎత్తయిన గుట్టలాంటి ముక్కు. మసకగా తడిగా కాంతి లేని కళ్ళు; కనుబొమ్మలు కనిపించ వనే చెప్పవచ్చు. నల్లటి తుట్ట పెదవి క్రిందకు వ్రేళ్లాడుతున్నట్లుంటుంది. బొంగురు గొంతుక అతనిది. చాలా పొడుగు మనిషి. ఒంటిమీది నల్లటి గరుగు చర్మం నుంచి పొట్టు రాలుతుంది. మొత్తం మీద ఒక ఎండిపోయిన నిరుపయోగమైన తాడి చెట్టులా ఉంటాడు. అతని వళ్లంతా బంద బారిపోయి, లావైన ఎముకల ముద్దలా ఉంటుంది. ఈ ఎముకల గూడుకి ఇంకొంచెం మాంసం కూడితే, విష్ణుపద్ పర్వతం లాగ చాలా బలవంతుడై ఉండి ఉండేవాడు.

అతని వేషం ఎలాంటిదంటే ఒక మాసి పోయిన ముతక లంగోటా; ఒక వెయ్యి అతుకులు వేసిన రంగుల రంగుల బనీను. తలకి తువ్వాలు చుట్టు కున్నాడు. ఇదీ కాక, బుజం మీద ఒక గొడ్డలి పెట్టుకున్నాడు; నడుముకి ఒక కొడవలి తగిలించాడు.

ఈ వేళకి మూడు రోజులనుంచి పనిలేదు విష్ణుపద్‌కి. పని లేదా పని లేకపోతే ఆదాయం లేదూ పొలం పుట్రా లేకుండా రోజు కూలి మీద బ్రతికే వాళ్ల ఇళ్లల్లో, డబ్బు ప్రోగు చేసుకుని బంగారం దాచుకోవడం, హాయిగా కూర్చుని అన్నం తినడం అనే ప్రశ్నేలేదు. 2,3 కుంచాల జొన్నలూ, బియ్యం ఉండేవి; అవి క్రితం రోజుతో అయిపోయాయి. ఈవేళేమైనా సంపాదించ గలిగితేనే, భార్య బిడ్డలు తిండి తినగలరు. లేకపోతే వాళ్లు పస్తుండవలసిందే.

నిద్రలేచి పని వెతుక్కునేందుకు బైటపడ్డారు విష్ణుపద్. కాని ఎక్కడ పని దొరుకుతుంది? తిరిగి తిరిగి అలిసిపోయి నిరాశతో ఉన్న అతనికి ఆ ఉత్తర దిక్కుగా ఉన్న మైదానం లో ఒకప్పుడు జరిగిన సంగతి జ్ఞప్తికి వచ్చింది.

ఈ ఉత్తర దిక్కు మైదానమే అనేకసార్లు విష్ణుపద్‌ని రక్షించింది. ఇక్కడి నుంచి ఒక్కొక్కప్పుడు పళ్లూ, ఒక్కొక్కప్పుడు కూరలూ, ఒక్కొక్కప్పుడు పక్షులూ, ఒక్కొక్కప్పుడు నేల తాబేలూ, ఒక్కొక్కప్పుడు కుందేలూ అల్లాగ తీసుక వెళ్లి

కుటుంబానికి ప్రాణరక్ష చేసేవాడు. ఈవేళ కూడా అదే ఆశతో వచ్చాడు.

మైదానంలో కొంతసేపు ఊరికే నిలబడి ఉన్నాడు విష్ణుపద్. స్థలం అంతా నిర్మానుష్యం. కుడీ, ఎడమా కంటి చూపు మేర అంతా పచ్చగడ్డితో నిండి ఉంది నేల. ఈ శీతగట్టులో ఆ గడ్డి ఏమంత సజీవంగానూ స్వచ్ఛమైన ఆకుపచ్చదనంతో నిగనిగలాడుతూనూ లేదు. ఏదో పేలవంగా ఉంది. గడ్డికి మధ్యలో అక్కడక్కడ దుబ్బా, చీపురు గడ్డీ, చిన్నచిన్న మొలకలూ. మైదానం గుండా ఒక కాలువ కూడా ప్రవహిస్తోంది.

నాలుగు ప్రక్కలా తిలకించి ఒకసారి ముందుకు నడవసాగాడు విష్ణుపద్. ఈ సంజవేళ నెత్తిపై నుంచి ఝుమ్మంటూ పక్షులు ఎగిరి వెళుతున్నాయి. విష్ణుపద్ అనుకున్నాడు 'ఉండేలు బద్ద తెచ్చి ఉంటే ఆకాశంలో ఎగిరే ఒకటి రెండు పక్షులు పడగొట్టి ఉండేవాడిని. ఛా, చాలా పొరపాటు చేశాను".

నడవగా నడవగా ఏదో దుబ్బో లేక మొక్క దగ్గరకో వచ్చాడు; అక్కడ సునిశిత దృష్టితో చూశాడు విష్ణుపద్. గడ్డి పెరిగిన ఆ నేలలో ఎక్కడా తనకు కావలసిన వస్తువు ఏదీ కంటికి గోచరించలేదు.

మరి చాలా సేపు నడిచాక అకస్మాత్తుగా అతని దృష్టి పొలం మధ్య ప్రవహిస్తున్న కాలువ వైపు పడింది. కాలువ ప్రక్కన ఒక ఆడపిల్ల నిలబడి ఉంది. రెప్పవేయకుండా తదేక దృష్టితో ఆమెను చూశాడు.

తాను నిలబడ్డ చోట నుంచి ఆ అమ్మాయి ఉన్న చోటు 10 అడుగులు ముందుకు వేస్తే వస్తుంది. అంత దగ్గరగా ఉండబట్టే స్పష్టంగా చూడగలిగేడు. అమ్మాయి కళ్లు, భయపడుతున్నట్లూ సందేహిస్తున్నట్లూ ఉన్నాయి.

ఈ నిర్మానుష్య స్థలంలో శీతాకాలపు వేళకాని వేళ ఎక్కడ నుంచి వచ్చింది చెప్మా ఈ అడపిల్ల! విష్ణుపద్‌కి ఆలోచన తట్టడం లేదు. ఆమె కూడా అతణ్ని చూసింది. ఆమె రంగు చామనచాయ. గుండ్రని, చలువరాయి లాంటి శరీరం. తప్పడ ముక్కు, ఎత్తయిన వక్షస్థలం ఆమె ఆరోగ్యం ఎంత దారుఢ్యమైనదో అచంచలమైనదో - దానిని ఆమె కట్టుకున్న పొట్టి చీర దాచడంలేదు. ఆమె చేతిలో ఒక పెద్ద కత్తి.

కొంచెం సేపు అలా చూసి, అడిగాడు విష్ణుపద్. "ఎవరమ్మా, అమ్మాయీ, నువ్వు?"

బాగా కటువైన స్వరంతో అమ్మాయి అంది. "ఎవ్వరూ లేదు. నువ్విక్కణ్నుంచి వెళ్లిపో విసిగించక".

"వెళ్లమంటే వెళ్లిపోతానా? నాకిక్కడ పని ఉంది"

"ఏం పని"?

"ఏదో ఉంది" అని కొంతసేపు ఆగాడు విష్ణుపద్. తర్వాత మళ్లీ ప్రశ్నించాడు: "ఇల్లాంటి మనుష్యులు లేని చోట ఒక్కర్తెవూ ఏం వచ్చావ్?"

అమ్మాయి అంది: "నాకూ పని ఉంది".

తనకు తెలియకుండానే ముందుకు నడిచాడు విష్ణుపద్. అమ్మాయి గట్టిగా అరిచింది: "జాగ్రత్త! ఒక్క అడుగు ముందుకి వేసావంటే, కత్తి తో పొడిచేస్తా".

విష్ణుపద్ చకితుడయ్యాడు. ఆమెకేమీ భయం లేదని కనిపెట్టాడు. ఆమె కనుగుడ్లు ఇప్పుడు ఎగరేస్తోంది.

భయపడుతూనే విష్ణుపద్ అన్నాడు: "ఎక్కువ తెలుసుకోవాలని లేదు. ముందుకు నడవనులే. కాని నువ్వు ఏ ప్రాంతపు దానివి, మరి ఎక్కడినుంచి వచ్చావు. ఆ మాట చెపితే తప్పేం ఉంది?"

ఏదో ఆలోచించుకుని కొంచెం మెత్తబడింది అమ్మాయి. "నేను 'తాల్‌డాంగా'లో ఉంటాను. ఇక్కడికి ఉత్తరంగా...."

"అది చాలా దూరం. వెళ్లాలంటే రెండు క్రోసులు వెళ్లాలి".

"అవును"

"అంత దూరం నుంచి వచ్చావా?"

"అవసరం ఉంటే రావలసి వస్తుంది కదా?"

"అవసరం ఏమిటో, చెప్పవా?"

అమ్మాయి అంది: "అంత ఇప్పుడు తెలుసుకోవాలని ఉంటే, విను, నేను పళ్లూ, గిళ్లూ, కూరలూ, నారలూ సంపాదించుకుందామని వచ్చాను ఇక్కడికి".

విష్ణుపద్ నిర్ఘాంతపోయాడు. విస్మయంతోనే అడిగాడు: 'ఎంత ఆశ్చర్యం'. నేనూ వాటి కోసమే వచ్చాను".

అమ్మాయి కంటిగుడ్లు ఇంకా ఎక్కువగా ఎగరేస్తో అంది: "ఉత్తిమాట".

"తల్లి మీద ఒట్టు: ఉత్తిమాట కాదు. విష్ణుపద్ వ్యాకుల భావంతో అన్నాడు: "దేవుడి మీద ఒట్టు. పొద్దుణ్నుంచి పెళ్లాం పిల్లలకు తిండి లేదు. 3 రోజుల్నించి ఒక్క పైసా అయినా సంపాదించ లేదు నేను. ఈ పొలంలో ఏదైనా తిండికి దొరికితే కాని మా కుటుంబానికి బతికే అవకాశం లేదు".

అతని గొంతుకలోని సహజత్వాన్ని గమనించి అతని మాట నమ్మింది అమ్మాయి. అంది : "అయితే నీ మనస్సేం బాగులేదేం?"

'అవునమ్మా. దేవుడి మీద ఒట్టేసి చెపుతున్నాను. సరే, కాస్త ముందుకు రా, నీ ఒంటిమీద చెయ్యేసి ఒట్టుపెట్టుకుంటా".

"ఒళ్లు ముట్టుకోవడానికి లేదు. నీ ఇల్లెక్కడ?"

"పయార్‌పుర్- దక్షిణం వైపు" అని దక్షిణ దిక్కుగా వ్రేలు పెట్టి చూపించాడు

విష్ణుపద్.

"నీ ఇల్లు కూడా చాలా దూరమే. 3 రోజుల నుంచి పని లేదేం?"

వంకరటింకరగానూ, పసుపుపచ్చగానూ ఉన్న తన పళ్లు బైటకు కనుపించేలాగ నవ్వి అన్నాడు: "అవును, నువ్వన్నట్లు అవసరాన్ని బట్టి దూరం నుంచైనా రావాలి...."

అమ్మాయి: "అంతేకదా?"

విష్ణుపద్: "ఇంతవరకూ మాట్లాడుకున్నాం. కాని ఒకళ్ల పేరు ఒకరికి తెలియదు. నా పేరు విష్ణుపద్. నీది?"

అమ్మాయి: "నిశ -నిశిబాల"

విష్ణుపద్: నువ్వు దేనికోసం వచ్చావో నేనూ అందుకే. రా, మనిద్దరం కలిసి వెతుకుదాం. ఏదైనా తినేందుకు దొరుకుతుందేమో. చలికాలం, అప్పుడే చీకటి పడుతోంది. నువ్వ ఒకర్తెవూ పడుచుపిల్లవు. ఇలా వెళితే ప్రమాదం".

కాస్సేపు తటపటాయించి నిశ అంది: "బాగా ఉంది. సరే నడు. నీతో వస్తా" తనంతట తానే అతనికి దగ్గరగా నడిచింది.

తర్వాత పొలంలో తిరగ్గా తిరగ్గా ఇద్దరూ ఒక అలిఖితమైన ఒడంబడికకు వచ్చారు - అక్కడ ఏమైనా తినేందుకు దొరికితే ఇద్దరూ సమానంగా పంచుకోవాలి.

ఆ పొలంలో ప్రతి దుబ్బూ, ప్రతి గొయ్యి తరచి తరచి వెతికారు విష్ణుపద్, నిశానూ. కాని మొత్తంమీద చిన్న చిన్న నేల తాబేళ్లూ నాలుగు తప్ప వాళ్ల కింకేమీ దొరకలేదు. వాటిపై ఉన్న గట్టి గుల్ల తీశాక ఇంకేమాత్రం మాంసం దొరుకుతుంది?

నోరు మూసుకుని ఆహారార్థం తిరుగుతూండగా ఒకసారి నిశ అడిగింది విష్ణుపద్‌ని: "మీ ఇంట్లో ఎంత మంది ఉన్నారు. పిల్లా, జెల్లా?" ఈ కలిసి తిరిగిన కాస్సేపటిలో ఆమెలో అతనంటే అనుమానం, భయం పోయాయి. అతణ్ని పూర్తిగా విశ్వసిస్తోంది. ఇప్పుడు నిశ.

విష్ణుపద్: "పిల్లలూ, తల్లీ"

నిశ: "ఎంతమంది పిల్లలు అని అడిగాను".

విష్ణుపద్: "ముగ్గురు ఇద్దరు మొగపిల్లలు ఒక ఆడపిల్ల".

నిశ: "అయితే మొత్తం మీరు 5 గురు అన్నమాట".

విష్ణుపద్: "అవును"

నిశ:"నువ్వేం జేస్తుంటావు".

విష్ణుపద్: "కూలిపని"

నిశ: "సరిపోతుందా?"

విష్ణుపద్: "ఏదో గడుస్తుంది. పని దొరికిన రోజున పొట్ట సగం నిండుతుంది.

లేని రోజున పస్తు".

కొంచెం ఆలోచించి నిశి అంది: "పొలం పుట్రా ఏమీ లేదా?"

విష్ణుపద్: "పొలం ఎక్కడినుంచి సంపాదిస్తాను?"

నిశి: "ఊరికే రెక్కల మీదే నమ్ముకుని బతకాలా?"

విష్ణుపద్: "అవును".

ని: "అల్లాగయితే చాలా కష్టం".

వి: "కష్టం అయితే మటుకు ఏం చేయగలను? ఇలాగే రోజులు గడిచిపోవాలి".

కొంచెం సేపు పోయాక విష్ణుపద్ అడిగాడు: "ఊరికే నా మాటే అడుగుతున్నావు? నీ మాటా ఏమీ...."

నిశి అంది: "నా కథ చెప్పవలసింది ఏం ఉంది? నాకూ రెక్కాడితేనే డొక్కాడుతుంది".

వి: "ఆ సంగతి నాకు తెలుసులే. నేనడిగింది అది కాదు".

ని: "ఇంకేం అడిగావు?"

మెడ త్రిప్పి ఆమెకేసి తీక్షణంగా చూశాడు ఒక్క నిమిషం.

అప్పుడన్నాడు: "నీ తల మీద కుంకం పుణ్య లేదు. నీ కింకా పెళ్లవలేదా?"

పరధ్యానంగా అంది నిశి: "అయింది"

"అయితే మరి?"

విష్ణుపద్ ఏం తెలుసుకోదలచుకున్నాడో నిశికి అర్థం కాలేదు. పెళ్లి అయినా చేతికి శంఖంతో చేసిన గాజు లేదు. తల మీద కుంకుమ రేఖ లేదు. అందుమూలాన అతను కలవర పడుతున్నాడు. బాధా సూచకమైన స్వరంతో నిశి అంది: "మా ఆయన లేడు".

నాలుకతో సానుభూతి సూచకమైన శబ్దం చేసి అన్నాడు. దుఃఖిత స్వరంతో: "ఓహో అల్లాగా? ఇంత చిన్న వయస్సులో మొగుణ్ని పోగొట్టుకున్నావా?"

నిశి సమాధానం చెప్పలేదు.

విష్ణుపద్ మళ్లీ అన్నాడు: "ఏమయింది? జబ్బు చేసిందా?"

నిశి అంది: "లేదు రైతులతో కొట్లాటలో చచ్చి పోయాడు. వాళ్లు ఆతణ్ని బల్లెంతో పొట్టలో పొడిచేశారు. నరాలూ, మాంసం బైటికొచ్చేశాయి. అదికళ్లతో చూడలేక పోయాను..."అంటూ, అకస్మాత్తుగా ఆ నిర్జన నిశ్శబ్ద ప్రాంతంలో గొంతెత్తి ఏడవడం మొదలు పెట్టింది :"అయ్యబాబోయ్, అంత యవ్వనంలో ఉన్న మా అయన్ని చంపేసార్రోయ్..."

విష్ణుపద్ కొంచెం సందిగ్ధావస్థలో పడ్డాడు. తర్వాత నిశి చెదిరిన జుట్టుని నిమురుతూ అన్నాడు: "ఏడవకమ్మా, పాపా, ఏడవకు. అయినదేదో

అయిపోయింది".

చాలాసేపు తర్వాత, ఆమె శోకం ఉపశమించాక, అడిగాడు: 'నీ కెంత మంది పిల్లలు?"

అస్పష్టపు గొంతుతో అంది: 'లేరు"

"అయితే బతికిపోయాం".

నిశి మాట్లాడలేదు.

విష్ణుపద్ మళ్లీ అడిగాడు: "మీ ఇంట్లో ఇంకెవరున్నారు?"

"ముసలి అత్త ఉంది. పగలూ - రాత్రి తినడానికి నోరు తెరుచుకుని ఉంటుంది; ముసలిదానికి చాలా ఆకలి. అంత పర్వతం లాంటి కొడుకుని పోగొట్టుకున్నా, ఆమె ఆకలిని పోగొట్టుకోలేదు. ఆమె ఆకలి తీర్చలేక నేనే ఒక రోజున చస్తాను".

"పొలం, గిలం లేదా?"

"ఉంటే ఇలా ఈ చేనులో ఆకూ, అలం కోసం పడిచస్తానా".

ఇద్దరూ మళ్లీ ఆహారం కోసం వెతకడానికి వెళ్లారు. కాని అంత విశాల మైదానం అంతా దయా, దాక్షిణ్యాలు లేకుండా ఉంది. ఆ నాలుగు తాబేళ్లు పోతే, పచ్చి వెలగకాయలు ఐదు తప్ప ఇంతవరకూ ఇంకేమీ దొరకలేదు. చెరి సగం చేసుకొనేసరికి అందులో ఏమాత్రం దక్కుతుంది?

ఇక శీతగాలి మరింత దుర్భరంగా వీస్తోంది. ఎండా గిండా ఏమీ లేదు. సూర్యుడు పశ్చిమాబ్ధిలో మునిగాడు. విష్ణుపద్‌కి కాని నిశికి కాని ఇంకేం దొరకలేదు. వెంటనే నాలుగు వైపులా చీకటి కమ్మింది.

తెల్లవారురఝామునుంచి ఆకాశంలో మేఘాలు ఇటూ అటూ పరిభ్రమిస్తున్నాయి; ఇప్పుడవన్నీ హఠాత్తుగా గుమిగూడినట్లున్నాయి. టపటప మంటూ వర్షం కురవడం ప్రారంభించింది. దాని మీదట ఒళ్లు వణికింపజేసే ఉత్తర గాలి. వంటిలో మాంసాన్ని భేదించుకుని ఎముకల్లోకి చొరబడినట్లు వీస్తోంది చలిగాలి. తడిసిన గడ్డినేల నుంచి పొగమంచు పై కెగురుతోంది.

కుడి ప్రక్క నుంచి నిశి అంది: "ఈవేళ చాలా చలిగా ఉంది, కదూ?"

అన్యమనస్కుడిగా ఉన్న విష్ణుపద్ అన్నాడు: "అవును".

"దానికి తోడు ఈ వర్షం ఒకటి".

"అవును".

విష్ణుపద్ నిశికి జవాబిస్తున్నాడన్న మాటే గాని, మనస్సులో మరొకటేదో ఆలోచిస్తున్నాడు. వాటా పంచుకున్న రెండు తాబేళ్లు, రెండున్నర వెలగ కాయలు ఇంటికి పట్టుకెళ్లి ఎవరి నోటికి అందించడం? అతనన్నాడు: "ఇంకేమీ దొరక్కపోతే

లాభం లేదు, అమ్మాయీ, మా ఇంట్లో 5 నెళ్ళున్నాయి".

నిశి అంది: "నీ మాట నిజమే. కాని చీకటి పడింది; వాన కురుస్తోంది. ఇంకిప్పుడేం దొరుకుతుంది", ఆమె కళ్ళు, ముఖం, గొంతులో అంతా అనుమానం.

'చూడు' అంటూండగా విష్ణుపద్ కళ్ళు తీక్షణ దృష్టిని పొందాయి. ఎదురుగుండా వ్రేలు జూపి కొంత ఉత్తేజితమైన గొంతుతో అడిగాడు: "అదేమిటయ్యోయ్".

ఆ వైపు చూసి నిశి అంది: "పంది అనుకుంటాను".

"అవును"

"ఆ మొద్దు అక్కడేం జేస్తోంది?"

బాగా పరిశీలించి చూశాడు విష్ణుపద్. అప్పుడన్నాడు: "మట్టి దాలుస్తోంది".

నిశికి తెలుసు - పంది ఎప్పుడైతే నేల దొలుస్తోందో, అక్కడ ఏదో దొరికి తీరుతుందని. భూమి లోపల ఏమీ లేకపోతే పందులు అక్కడ మట్టి పెట్టి త్రవ్వవు.

విష్ణుపద్ అన్నాడు: "నడు, ముందుకు వెళ్లి చూద్దాం". అతని మస్తిష్కంలో విద్యుల్లత లాగ మరొక చింత మెరుస్తోంది. అక్కడ ఇంకేమీ దొరక్కపోయినా ఆ పందిని చంపేయాలి.

నిశిబాలకు సగం వాటా ఇచ్చాక కూడా, వాళ్ల కుటుంబానికి 3,4, రోజులకు కావలసిన ఆహారం దొరుకుతుంది. 3,4, రోజులు బ్రతికి ఉంటే, తర్వాత సంగతి తర్వాత చూసుకోవచ్చు.

తన మనస్సులో మాట నిశికి చెప్పాక ఆమె అంది: "నువ్వన్నది బాగానే ఉంది కాని...."

"ఏంటి?"

"ఇంత పెద్ద అడవి పందిని పట్టుకోగలవా నువ్వు? దానికి చాలా కోర పళ్ళుంటాయి. అప్పుడు నిన్ను నువ్వు రక్షించుకోగలవా?"

విష్ణుపద్ అన్నాడు: "నా దగ్గర గొడ్డలి ఉంది కొడవలి ఉంది".

నిశి అంది: "గొడ్డలి, కొడవలితో ఇంత దెయ్యం లాంటిదాన్ని గాయపరచగలవా?"

పిచ్చి పట్టుదలతో విష్ణుపద్ అన్నాడు: "చేయగలనో లేదో చూద్దాం. అయినా ఒకసారి ప్రయత్నించకుండా వదలను. తిండిలేక చావడం కంటె అడవి పందితో యుద్ధం చేసి...." నిశికి మరింకేమీ ఆలోచించేందుకు కాని, మాట్లాడేందుకు కాని అవకాశం ఇవ్వకుండా విష్ణుపద్ ముందుకు సాగాడు. నిశి ఇంకేం చేస్తుంది? అతని వెనకాలే నడిచింది.

దగ్గరకు వెళ్లి చూసేసరికి అది కోరపళ్ల పంది కాదు, అడవి పంది. దొలిచి దొలిచి,

చాలా గొయ్యి చేసింది ఆ జంతువు. గోతిలోకి చూసేసరికి రెండు కళ్ళూ మెరిశాయి విష్ణుపద్‌వి. ఒక పెద్ద నాటు బంగాళాదుంప సగ భాగం మట్టిలోకి పాతుకుపోయి ఉంది; మిగతా సగం ముఖంతో త్రవ్వి బైటకు లాగుతోంది అడవి పంది.

ఆ దుంప బరువు కనీసం పదిసేరు లేనా ఉంటుందని అంచనా వేశాడు విష్ణుపద్? ఒక వేళ పందిని చంపలేకపోయినా ఆ బంగాళాదుంపని సంపాదిస్తే ఏమంత తక్కువ పనికాదు. ఆలోచించేసరికి ఆ పందితో తిన్నగా ఘోర యుద్ధం జరపడం కంటె దాన్ని తరిమేసి, నాటు బంగాళా దుంపని పీకుకోవడం మంచిదని అనిపించింది అతనికి.

వెనకాల నుంచి ఆశతో కూడుకున్న గొంతుతో నిశి అంది: "ఎంత పెద్ద బంగాళా దుంపో! చూశావా, అబ్బాయి".

విష్ణుపద్ "అవును" అన్నాడు.

తన మానాన తను త్రవ్వుతోంది పంది. మానవుల గొంతు వినిపించేసరికి హఠాత్తుగా తల ఎత్తింది. దాని చిన్న కళ్లు మసకగానూ ఎర్రగానూ ఉన్నాయి. దాని పళ్ళూ, ముఖం అంతా మట్టి.

దాన్ని తరమడం కోసం నోటి తోటి చప్పుడు చేయడం మొదలు పెట్టాడు విష్ణుపద్ "రే-రే-రే-హట్, హట్, హాయ్"

పంది కదలకుండా, విష్ణుపద్‌కేసి చూస్తోంది. దాని చిన్న కళ్ళు సంశయంతో గట్టిపడడం మొదలెట్టాయి. విష్ణుపద్ మళ్లీ చప్పుడు చేశాడు. అతనితో పాటు నిశి కూడా నోటితో కేకలు పెట్టింది. ఇంకా పంది స్థిరంగానే ఉండిపోయింది.

విష్ణుపద్ అన్నాడు: "తస్సాదియ్యా ఇది చాలా పొగరుబోతు. ఏం కదలడం లేదు".

నిశి అంది: "మనం ఈ నాటు బంగాళదుంప తీసుకుంటామని కనిపెట్టినట్లుంది".

"అంతే అయ్యుంటుంది", అని ఇంకా ఇలా అన్నాడు విష్ణుపద్:"నోటి తో గొడవ చేస్తే ఏం లాభం లేదు, అమ్మాయీ, ఈ వెధవ మొద్దుని గొడ్డలితో ఒక దెబ్బ వేస్తే అప్పుడు తెలిసి వస్తుంది". అంటూనే ముందుకి వెళ్లి బుజం మీంచి గొడ్డలి దించి పంది మెడ ప్రక్కగా ఒక దెబ్బ వేశాడు దాంతో.

దెబ్బ తిన్నగా తగలలేదు. పంది మెడ నుంచి ఒక చిన్న తోలుముక్క తెగి పడింది అంతే. ద్వేషం, క్రౌర్యంతో కూడుకున్న కళ్లతో ఒక్క క్షణం చూసి ఆ జంతువు హఠాత్తుగా అతణ్ని తరిమేసింది. అది తరిమేస్తుందని విష్ణుపద్ ఊహించ లేక పోయాడు. అతను శ్వాస బిగించి పరిగెత్తాడు.

అతణ్ని అలా చాలా దూరం తరిమి వెనక్కి వచ్చి పంది నాటు బంగాళాదుంప

దగ్గర నిలబడింది. అయినా విష్ణుపద్ ఎక్కువ సేపు వెనక్కు తగ్గలేదు. మళ్లీ పంది దగ్గరకు వచ్చాడు. రాగానే మళ్లీ ఇంకో దెబ్బవేశాడు పందిని. ఈసారి వీపు మీద చాలా కోతలు పడ్డాయి. రక్తం కార్చుకుంటున్న జంతువు మళ్లీ విష్ణుపద్‌ని తరిమింది.

తరుమబడి చాలా దూరం వెళ్లవలసి వచ్చింది విష్ణుపద్‌కి. అయితే ఏమనుకుంటున్నాడంటే మళ్లీ వెనక్కి వచ్చి సమయం కాచి ఆ పందిని ఒక్క గొడ్డలి దెబ్బతో పడగొడ్దామని. అలా అనుకుంటూ చాలా సేపు నడిచి వెళ్లాడు.

ఇటు చలికాలపు సాయంకాలం ఇంకా గాఢంగా క్రమ్ముకుంది. చెట్లూ చేమలలోని ఖాళీలలోని నీడలు ఇంకా నిబిడాంధకారాన్ని పొందాయి. కొంచెం సేపు క్రితం నుంచి కొద్ది వర్షం పడుతోంది; అది ఇప్పుడు మరీ జోరుగా పడుతోంది. దానికి తోడు ఉత్తర గాలి ఇంకా గట్టిగా వీస్తోంది.

నిశి నిరాశ చెందింది. అంది: "అబ్బాయి, వదిలి పెట్టెయ్యి. ఈ దెయ్యం నేల్లోంచి నువ్వు బంగాళదుంప లాగగలవా?"

విష్ణుపద్ మొండిపట్టు పట్టాడు. అన్నాడు: "నేనే మైనా మానను దుంప లాగకుండా నేను విడిచి పెట్టను. అదును కనిపెట్టి బంగాళాదుంపా లాగుతాను! వెధవ పందిని కూడా చంపేస్తాను. నా బుర్రకో ఆలోచన తట్టింది. ఈసారి ఇద్దరం దాని ముందర నిలబడవద్దు. నువ్వు వెనకా, నేను ముందూ నిలబడదాం. అది నన్నెప్పుడైతే తరముతుందో నువ్వప్పుడు వెనక నుంచి దాన్ని దెబ్బకొట్టు. నిన్ను తరుముతున్నప్పుడు నేను దాన్ని దెబ్బతీస్తాను".

ఆ ప్రకారం అతను పంది ముందూ, ఆమె పంది వెనుకా వచ్చి నిలబడ్డారు. పంది ఏం అనుకుందో చెప్పలేం. బహుశా అనుకుని ఉంటుంది- "ఇంత కష్టపడి సంపాదించిన దుంపకు పోటీ వాళ్లు వచ్చారు" అని.

దెబ్బ తగిలే ముందే తల వంచి విష్ణుపద్‌ని తరిమేందుకు అతని వైపు పరిగెట్టింది పంది. అది ఎంత శీఘ్రంగా వచ్చిందంటే అతనికి ఆత్మరక్షణకు అవకాశం దొరకలేదు. ప్రొద్దుటి నుంచి విష్ణుపద్‌కి తిండి కూడా లేదు. నీరసంగా ఉంది వళ్లంతా. మబుగు బరువైన పంది దాడి మూలాన ఎప్పుడైతే పారిపోవడం మొదలెట్టాడో దాని తర్వాతనే అతనికి తన తొడల్లో దాన్ని పళ్లు దూర్చి గాయపరిచిందని తెలుసుకున్నాడు.

విష్ణుపద్ అరుపులు మొదలు పెట్టాడు: "చచ్చాన్ రోయ్, చచ్చాన్ రోయ్, రక్షించండి -" అంటూండగానే అతని చెయ్యి నడుము దగ్గరకు చేరింది. ఒక్క సెకనులో కొడవలి లాగి ఆ పంది ముక్కు మీద శక్తి కొలది కొట్టాడు దాంతో. కూడా ఒక చిమ్మగొట్టు లాగ రక్తం ప్రవహించింది.

ఇటు వెనకాల్నుంచి వచ్చి నిశి పందిని కొట్టడం మొదలుపెట్టింది. బాగా గాయపడిన జంతువు విష్ణుపద్‌ని విడిచి వెనక్కి తిరిగి నిశిపై దండెత్తింది. దాడి తప్పించుకోలేక పోవడం వల్ల ఆమె కూడా పడిపోయింది, పంది కోరపళ్ళు ఆమె చీరన్నూ, శరీరాన్ని ముక్కలు ముక్కలు చేయడం మొదలు పెట్టాయి. అట్టి పరిస్థితిలో గ్రుడ్డిగా చేతిలోని కత్తితో పొడవడం ప్రారంభించింది నిశి ఆ పందిని.

విష్ణుపద్ తొడలు బాగా గాయపడ్డాయి. గొట్టంలా రక్తం పైకి చిమ్ముతోంది. అయినా అతను ఊరికే కూర్చోలేదు. పిచ్చి వాడిలా పంది ముఖంపై గొడ్డలితో కొట్టాడు. నిశిని వదలి మళ్లీ విష్ణుపద్ పై దాడిచేసింది పంది. ఇంతట్లో నేలపై నుంచి లేచి వెనుకనుంచి పందిపై యుద్ధం చేస్తోంది నిశి.

దెబ్బతిన్న పంది ఒకసారి విష్ణుపద్ వైపు, తర్వాత నిశివైపు పరుగు పెడుతోంది. చూడగా చూడగా ఈ శీతకాలపు తుది కాలంలో ఈ నిర్జన ప్రదేశం పృథివి ఆదిమ కాలం నాటి రణభూమిగా మారింది. ఆహారం కోసం మానవజాతికి చెందిన ఒక పురుషుడూ, ఒక స్త్రీ ఒక క్రూరజంతువుతో యుద్ధం చేస్తున్నారు.

చాలా సేపు ఇలా సంఘర్షణ జరిగాక, తన ముఖంపై గొడ్డలి దెబ్బలు తీవ్రంగా తగలడం మూలాన ప్రాణ సంకటం కలుగుతున్నట్లు అరవడం ప్రారంభించింది పంది. భరించలేని బాధతో కొంతసేపు మట్టిలో అటూ ఇటూ దొర్లి, తర్వాత ఒక బాణంలా జువ్వుమంటూ పడమర వైపు ఉన్న అడవిలోకి పారిపోయింది.

పంది మాయమయ్యాక విష్ణుపద్, నిశి చాలాసేపు నిశ్చేష్టులై పడి ఉన్నారు. తర్వాత అయాసపడుతూ లేచి ఆ నాటు బంగాళా దుంప మిగిలిన ముక్కను బైటకు లాగారు.

నాటు బంగాళాదుంప, తాబేలు, వెలక్కాయ- ఇవన్నీ ఒక చోట ప్రోగు చేసి వాళ్లు పంచుకునే సమయంలో వర్షం మళ్లీ పడడం ప్రారంభించింది. యుద్ధం జరిగినంత సేపూ వాళ్లిద్దరికీ ఆ సహజ ధైర్యం, క్రౌర్యం హడావుడిలో శారీరకమైన, మానసిక మైన ఏ బాధ తెలియలేదు. ఇప్పుడు విష్ణుపద్ ఆ బాధనంతా అనుభవిస్తున్నాడు; చలితో వణుకుతున్నాడు. ఎముకల్లోకి కూడా చొరబడినట్లున్న చలితో గజగజలాడిపోతున్నాడు. పళ్లు ఊడిపోతున్నట్లని పిస్తోంది అతడికి.

అన్నాడు: "ఎంత ఎడతెగని వాన వచ్చిపడిందయ్యా!

నిశి చలితో వణుకుతూ వణుకుతూ అంది: "ఇక్కడ ఉండిపోతే మనం నిక్కచ్చిగా చస్తాం అబ్బాయీ. ఏదో ఒక ఏర్పాటు గురించి ఆలోచించు".

"నువ్వే చెప్పు ఎక్కడికి వెళ్లగలమో".

ఏమాలోచించిందో, నిశి అంది: "పడమటి దిక్కున ఒక స్మశానం ఉంది కదా?

అక్కడ ఒక చిన్నపాక ఉంది. నడు, అక్కడికి పోదాం".

విష్ణుపద్‌కి కూడా జ్ఞాపకం వచ్చింది: "అవునవును. నడు...."

ఇద్దరూ పరుగెత్తి స్మశానంలోని పూరిల్లు చేరుకున్నారు. ఆ గుడిసె ఒకప్పుడు శవ వాహకులు, శవంతో కూడా వెళ్లే బంధు మిత్రులూ కూర్చునేందు కోసం నిర్మింపబడింది.

ఒంటిమీద రక్తం తుడుచుకుని వాళ్లిద్దరూ కాస్సేపు అక్కడ కూర్చుని ఆయాసం తీర్చుకున్నారు. అప్పుడు విష్ణుపద్ అన్నాడు: "అమ్మాయీ, నాకు చాలా ఆకలేస్తోంది".

నిశి అంది: "నాకూనూ".

"తినేందుకు ఏర్పాటు చేయి".

బంగాళాదుంప కత్తితో నిశి కోసింది; విష్ణుపద్ ఒక తాబేలు గుల్ల పగలగొట్టి మాంసం బైటకు తీశాడు.

అంతకు కొద్దిగా ముందర శవాన్ని కాల్చిన చితిలోంచి కొంచెం నిప్పు తీసుకు వచ్చి మాంసం, దుంప ఉడక బెట్టి ఇద్దరూ తృప్తిగా తిని త్రేన్చారు.

విష్ణుపద్: "ఈ రోజంతా ఇదే తినడం".

నిశి: "నేనూ అంతే".

విష్ణుపద్: "తిండి అయింది. ఇప్పుడో బీడీ కావాలి".

నిశి: "అవును నాకు తాంబూలం బాగా అలవాటు. దొరికితే బాగుండును ఇప్పుడు".

మళ్లీ వర్షం జోరుగా కురుస్తోంది. ఆకాశం ముక్కలు ముక్కలు చేస్తున్నట్లు మెరుపులు మెరుస్తున్నాయి.

నిశి అంది: "ఈ వర్షం ఈవేళ తగ్గేలా లేదు".

"అవును –" అని తల ఆడించాడు విష్ణుపద్.

"ఈ రాత్రంతా ఇక్కడే గడపాలి".

"అవును". అని కొంచెం సేపు పోయాక అన్నాడు విష్ణుపద్: "కూర్చుని ఏం జేస్తాం. నేను నిద్రపోతాను".

నిశి: "నేనూ నిద్రపోతాను".

ఇద్దరూ గుడిసెలోని చెరో ప్రక్క పడుకున్నారు. ఇద్దరి మధ్యా తగినంతదూరం ఉంది.

రాత్రి బాగా గడిచాక నిశి అంది "అబ్బాయీ...."

తన దూరస్థానం నుంచి విష్ణుపద్ అన్నాడు: "ఏమయింది?" నిశి: "నా దగ్గరకు రా".

విష్ణుపద్: "ఎందుకు?"

ఈ దుర్భరమైన చలికాలం రాత్రిలో వెచ్చదనం కోసం నిశి, విష్ణుపద్ ఒకళ్లనొకళ్లు కౌగలించుకుని పడుకున్నారు.

మర్నాడు తాబేలు వెలక్కాయి, దుంప సమానంగా పంచుకుని నిశి ఉత్తర వైపూ, విష్ణుపద్ దక్షిణ వైపూ ఎవరిదారిన వారు వెళ్లారు.

---

("శారదీయ అమృత్", 1970)

# నన్ను చూడండి

శీర్షేందు ముఖోపాధ్యాయ్

దయచేసి నన్నొక సారి చూడండి. నే నిప్పుడెల్లాగున్నానో అదే. ఇంతకు కొంచెం ముందు నేను తోసుకుంటూ బస్సు ఫుట్‌బోర్డు ఎక్కాను. తర్వాత ఆ దట్టమైన జనసమూహం మధ్య అటూ ఇటూ దూరి, సరిగ్గా ఒక ఎలుక గొయ్యి త్రవ్వి నట్లు త్రోవ చేసుకుని, ఇంత దూరం వచ్చి పడ్డాను. బస్సు పై ఊచలు చాలా ఎత్తు - వాటిని అందుకుని వ్రేళ్లాడలేను. నేను పొట్టి వాణ్ని- అంచేత సీట్ల వెనకాల పట్టుకుని నిలబడ్డాను, వాటి మీద వళ్లు అనించుకుని బస్సు కుదుపుకి నేను ఊగవలసి వచ్చినప్పుడు, ప్రక్క వాళ్ల మీద పడి సర్దుకోవలసి వచ్చినప్పుడు, చుట్టు ప్రక్కల ఉన్న జనం నన్ను కోపగించుకోలేదు. కారణమేమిటంటే నా బరువు చాలా తక్కువ, నేనెవరి మీద్దైన పడ్డా వాళ్లకి నా వల్ల ఏం దెబ్బతగలదు. అవును, నేను బస్సు లోపల ఒక సీటు వెనకాల పట్టుకుని నిలబడ్డాను. నా ఇరుప్రక్కలా ఉన్న మనుష్యులు పర్వతాలంత ఎత్తుగా ఉన్నారు. వాళ్లు నన్నెంతగా మూసేశారంటే, అసలు వాళ్లు నన్ను చూడనే లేదనిపిస్తోంది. లేకపోతే చూసి కూడా నన్ను ఎవరూ లెక్క చేయడం లేదు. ఇదే చిక్కు. నన్ను ఎంత చూసినా, ఎవ్వరూ లెక్కపెట్టరు. ఇప్పుడు నేనెవరి ప్రక్క ఉన్నానో, లేక ఎవరికి ముఖాముఖిగా ఉన్నానో, వాళ్లు నన్ను చూస్తే చూసి ఉండవచ్చు, కాని నిర్లక్ష్యం తోటే. నేను ఉన్నా లేకపోయినా వాళ్లకు లాభం కాని నష్టం కాని లేదు. నా ముఖంలో కూడా ఏమి ప్రత్యేకత లేదు- ఎవరైనా నన్ను వేరే గా గుర్తు పట్టేందుకు. అవును బాబూ , నేను 5 అడుగుల 2 అంగుళాల మాత్రం ఎత్తయినవాడిని; సన్నని వాడిని. అయినా పెద్ద సన్నమూ కాదు; చాలా నలుపూ కాదు: ఎవ్వరైనా నా కేసి అసలు మళ్లీ ఒకసారి చూస్తే సంగతి. 40 సంవత్సరాల తర్వాత నా తల క్రమంగా పండిపోయింది. నా జుట్టు పలచబడి పోయింది. అయినప్పటికీ బట్టతల కాదు. బట్టతల వాడిని కూడా కొందరు చూస్తారు. అటుపైన నా ముఖం- అది చాలా అసహ్యం అయినదీ కాదు, సుందరమైనదీ కాదు - నా ముక్కు తప్పడా కాదు చిన్నదీ కాదు; కళ్లు పెద్దవీ కావు, మళ్లీ మెరిసేవీ కావు. అందుమూలాన ఇలా గుంపు మధ్యలోకి నేను వస్తే నన్నెవరైనా చూస్తారా? చూడరు, ఒక వేళ చూసినా లెక్కపెట్టరు. ఈ సంగతి నాకు బాగా తెలుసు.

నా పెళ్లి అయ్యాక ఒక బాగా కలవర పరిచే తమాషా సంఘటన జరిగింది. పెళ్లి భోజనం అయిన ఒకటి రెండు రోజుల తర్వాత నేను నా భార్యను తీసుకుని బజారు పనిమీద బైటకు వెళ్లాను. మళ్లీ కొన్నాళ్లు పోయాక నా భార్యను

కాపురానికి తీసుకురావడం కోసం కొన్ని లాంఛనాల బట్టలూ మొదలైనవి కొనవలసి వచ్చింది. రోడ్డుమీద బైటకు వచ్చి నా భార్యను అడిగాను. "న్యూ మార్కెటు" వెళదామా? నా అవస్థ ఎటువంటి దంటే న్యూమార్కెటు సరుకులు కొనేందుకు తగిన డబ్బు లేదు. బస్సు పక్కన ఉన్న అంగడిలో ఏవో చవక బట్టలూ గిట్టలూ కొనేందుకు చాలిన డబ్బు మటుకు గటాగటీగా ఉంది. అయినా ఆ మాట నేనెందుకన్నానంటే ఒకటి నా భార్య పల్లెటూరిది ఎప్పుడూ న్యూమార్కెటు చూడలేదు; రెండవ కారణం నాతో పోలిస్తే మా అత్తింటి వాళ్లు కొంచెం ధనవంతులు. అంచేత నేను న్యూమార్కెట్ చెప్పేసరికి నా నూతన వధువు చాలా సంతోషిస్తుందనీ, అక్కడ బట్టలూ గిట్టలూ కొంటే ఆ సంగతి తెలుసుకుని మా అత్తవారి తాలూకు వాళ్ల కనుబొమ్మలు కాస్త పైకి లేస్తాయని. కాని ఈ న్యూ మార్కెటు ప్రస్తావన కొంచెం ప్రాణ సంకటం కలగజేసే తప్పు అయింది. కారణం ఏమిటంటే అక్కడకు వెళ్లకుండా ఉండి ఉంటే తర్వాత జరిగిన సంఘటన జరిగి ఉండకపోను అనిపిస్తుంది. ఏమయిందంటే న్యూ మార్కెటు లో ప్రవేశించి అక్కడ ఆ తళతళలాడే కొట్లలోని సరుకులు చూసేసరికి మా ఆవిడకి వళ్లు తెలియలేదు. ఏదో ఓ కొట్టు ముందు నిలబడి, షోకేసు కేసి, చూసి ఒక్కటే -అడుగు ఒక్కటే - అడుగు వేసి నడవడం. నా వైపు చూడడమే మరిచిపోయింది. అప్పుడు ఆమె నూతన వధువు, అందుమూలాన నాకు ఉడుకుమోతు తనం ఉండడంలో ఆశ్చర్యం లేదు. నేను ఆమెను అటూఇటూ చూసి కొంచెం నేను చెప్పినట్లు వినేలాగ ప్రయత్నించాను. కానీ ఆమె ఏ ఒక వస్తువు పైనా ప్రత్యేకించి శ్రద్ధ చూపించక, అన్ని వస్తువులనూ పరిశీలిస్తూనే ఉంది. నా ఉడుకు మోతు తనం ఎక్కువ అయేసరికి నేను నడక తగ్గించి కొద్దిగా ఆగినా, ఆమె అలా అన్నీ చూస్తూ నడుస్తూనే ఉండిపోయింది. అది కనిపెట్టి ఇక నేను ఒకచోట నిలబడి పోయాను. అయినప్పటికీ నూతన వధువు అలా నడుస్తూనే ఉంది. గార్డ్ ఆఫ్ ఆనర్ ఇచ్చేటప్పుడు సోల్జర్లు ఎలా నడుస్తారో ఆ పద్ధతిలో ఆమె దుకాణాలలో సరుకులు చూస్తూ నడుస్తోంది.

నేను దూరం నుంచి నిలబడి చూశాను - నా భార్య జన సమూహంలోంచి తోసుకుంటూ అలా ఆ మెరిసే దుకాణాలకేసి చూస్తూ నడుస్తూనే ఉంది. మధ్య మధ్య ఆమె ఏదైనా నేను ప్రక్కన ఉన్నాననుకుని మాట్లాడినా, నిజానికి నేను ఉన్నానా లేదా అన్న సంగతి పట్టించుకోలేదు. ఇల్లా చాలా దూరం నడవగా నడవగా ఆమె ఒక సరుకు చూసి ఆకర్షింపబడి నేను ప్రక్కను ఉన్నాననుకుని ముఖం త్రిప్పింది; ఎప్పుడైతే నేను కనుపించ లేదో నన్ను వెతుక్కుంటూ నిలబడింది. నాలుగు వైపులా వ్యాకుల భావంతో చూస్తోంది నా కోసం. అప్పుడు

తమాషా చేద్దామని ఆమెకు కనుపించేలా ముందుకు వెళ్లలేదు. న్యూమార్కెట్టు లో ఉండే గుండ్రంగా ఉన్న సందుల్లో ఒక చోటుకు హఠాత్తుగా వెళ్లి దాక్కున్నాను. ఇంకా పల్లెటూరి పిల్ల నా కోసం వెతుకుతూనే ఉంది. ఆమె ఎంతసేపు నన్ను లక్ష్య పెట్టలేదో అంతసేపూ తమాషా చేయాలనుకున్నాను. నాలో నేను నవ్వుకున్నాను. ఒక ప్రక్క నుంచి ఆమె ఏడుపు ముఖంతో ఇటూ అటూ నా కోసం నాలుగు ప్రక్కలా వెతికి బయలుదేరిన చోటికి తిరిగి రావడం కనిపెడుతున్నాను. ఒకసారి నేను ఆటబొమ్మల కొట్ల దగ్గర ఉన్నానేమోనని చూసింది. కాని ఎన్ని సార్లు తిరిగినా ఆమె నన్ను కనిపెట్టలేదు. గాభరా లో నన్ను వెతుకుతున్న మనిషి నన్ను ప్రక్క నుంచి దాటిపోయింది. కాని గుర్తు పట్టలేకపోయింది. ఈ పల్లెటూరి పిల్ల గడుసుదే కాబట్టి ఆమె కావాలనే నన్ను చూసి కూడా చూడనట్లు నటిస్తుందేమో అనుకున్నాను; కాని ఆమె ముఖంలో క్రమక్రమంగా దీనతరంగం కనుపిస్తున్న కవళికలు చూస్తే ఆమె అలా తమాషా చేస్తోందని అనుకోలేకపోయాను. అయినా అఖరికి ఒక గడియారాల దుకాణం ముందు ఆమె త్రోవకు అడ్డువెళ్లి అన్నాను. "హేయ్!" ఆమె ఉలికిపడి నోట మాట లేకుండా నా కేసి చూసింది. అలా చాలాసేపు చూసి జోరుగా ఊపిరి విడిచి, వణుకుతూ నవ్వి అంది:. "నువ్వు! నువ్వు! ఎక్కడున్నావు ఇంత సేపూ నువ్వు! నేనెంత సేపటినుంచి నిన్ను వెతుకుతున్నానే!" ఆశ్చర్యం ఏమిటంటే, అప్పుడు ఆమె నిజం చెపుతుందని అనుకున్నాను. బస్సులో తిరిగి వెళ్లేటప్పుడు నేను ఆమెతో చెప్పాను - ఇలా నేను దాగుడు మూతలాడేటప్పుడు ఆమెకు చాలాసార్లు దగ్గరగానే ఉన్నానని; ఆమె ముందే నిలబడ్డానని. మొదట ఆమె నా మాట నమ్మలేదు, కాని నేను తిరిగితిరిగి నొక్కి చెప్పాక ఆశ్చర్య పడి అంది. "నిజంగానా అల్లాగయితే ఇంకెప్పుడూ అలా దాక్కోక. అల్లా చేస్తే చాలా ప్రమాదకరం".

"అపు, కండక్టర్ భాయీ, నేనిక్కడ దిగుతా"....చూడు, దాదా చూడండి, భాయి, నా కళ్లజోడుని కాస్త కనిపెట్టండి.... అయ్యో చూడండి, ఎవ్వరూ నా మాట వినరా", నేను దిగే ముందరే కండక్టరు బస్సు వెళ్లే గంట కొట్టేశాడు. తలుపుకి అడ్డంగా మొద్దు బండ లాగ ఒక అతను కదలకుండా నిలబడ్డాడు, హవాయ్ షర్టు కట్టు కున్న కుర్రవాడు మోచేతితో త్రోసుకుంటూ వచ్చినా కళ్లజోడు వంకర చేసేశాడు. అందుకే అన్నాను: "ఎవ్వరూ నన్ను లెక్క చెయ్యరు - బస్సులో కాని, ట్రాములో కాని, రోడ్డు మీద కాని....

ఇప్పటి రోజులు చాలా చక్కగా ఉన్నాయి. చల్లని గాలిలో ఎండ, వంటిని, సుఖంగా స్పృశిస్తున్న రోజు. వర్షాకాలం కాబట్టి ఎండ వేడి తక్కువగా ఉంది. ఇప్పుడు ఈ త్రోవమ్మట నడుస్తుంటే నాకు చాలా హాయిగా ఉంది. కొంచెం

దూరంలో ఒక క్రాసింగు, దాని తర్వాత మా ఆఫీసు. అది చూసి నేను క్రాసింగు దగ్గరకు వచ్చి రోడ్డు దాటడానికి కాలుపెట్టేసరికి ట్రాఫిక్ పోలీసువాడు చెయ్యి అడ్డుపెట్టి చాపాడు. నేను దాటవలసిన రోడ్డు అడ్డుపడింది; బండి మీద బండి వెళుతోంది రోడ్డమ్మట. ఏం ట్రాఫిక్ పోలీసు భాయీ, నేను రోడ్డు దాటాలని చూడడం లేదా? కాస్త నీ చెయ్యి దింపితే నీ చేతికేమైనా హాని కలుగుతుందా?

నేను ఫస్టుఫ్లోరు పైకి వెళ్లేందుకు ఎక్కే లిఫ్టు ఒక వంద సంవత్సరాల పూర్వానిది. దీనికి నాలుగు వైపులా నల్ల ఇనుము గ్రిల్ సరిగ్గా ఒక తెరిచిన పంజరం మోస్తరు, మధ్యమధ్య వణుకుతూ, మెల్లిమెల్లిగా పైకి నడుస్తోంది. గత 13 సంవత్సరాల నుంచి నేను ఈ లిఫ్టు వాడుతున్నాను. ఈ 13 సంవత్సరాలు లిఫ్టుబాయి రామస్వరూప్ అభోగీ నన్ను పైకి తీసుకు వెళుతున్నాడు. ఏం భాయీ రామస్వరూప్, నువ్వు నన్ను చిన్నప్పటినుంచీ చూస్తున్నావు నా 26 వ ఏట లేక 27 వ ఏట నుంచీ, నా ముఖం పై ముసలి రూపు రానప్పటి నుంచీ. ఇప్పుడు చెప్పు నా పేరేంటి? అల్లా అడిగేసరికి రామస్వరూప్ నవ్వుతూ అంటాడు గదా– ఆహా, తప్పకుండా, తమరు అరవింద బాబుగారు కదా? అది నా పేరేం కాదు. నేనెప్పుడూ అరవింద బాబుని కాను. నేను చిరకాలం నుంచీ అదే చిన్నప్పటి నుంచీ అరిందమ్ బసూని మాత్రమే.

నా ఉద్యోగం బాంకులో మా ఆఫీసు మొదటి అంతస్తులో. అంతకు పూర్వం నేను వివిధ డిపార్టుమెంటుల్లో పనిచేశాను – పదేళ్లనుంచి కాషియర్‌గా ఉంటున్నాను. నేను అవలీలగా డబ్బు లెక్కపెట్టగలను. లెక్కల్లో కూడా ప్రవీణుడను. అందుచేత నాకు కాష్ పని తప్ప మరొకటి ఎక్కడా ఇయ్యరు. ఒక వేళ ఇచ్చిన మళ్లీ తిరిగి రావలసిందే కాషియర్‌గా. 10 ఏళ్లనుంచి నేను సామర్థ్యంతో ఆ పనిచేస్తున్నాను. ఒకప్పుడు పేమెంటు; ఒకప్పుడు రిసీవింగ్ పేమెంటే ఎక్కువ. ఎందుకంటే మానవులకు ధనం ఇవ్వడం కంటె పుచ్చుకోవడానికి ఎక్కువ అవసరం ఉంటుంది కాబట్టి. ఒక తీగల పంజరం మధ్య నేను కూర్చుంటాను. నా గుండెకాయకు దగ్గరగా అనేక సరుగులు గల ఒక డ్రాయరు. దాని మూలల్లో ఎన్ని రూపాయల నోట్లున్నాయో, ఎంత చిల్లర ఉందో నేను కళ్లుమూసుకుని తప్పు లేకుండా చెప్పగలను. పేమెంటు చేసేటప్పుడు నేను డ్రాయరు తెరిచి లెక్కగా డబ్బు బైటకి తీసి, తర్వాత డ్రాయరు మూసి, మళ్లీ డబ్బు లెక్కపెట్టి, మళ్లీ డబ్బు ఇచ్చాక మరో పేమెంటు కోసం చెయ్యి జాపి టోకెన్ తీసుకుని, మళ్లీ డ్రాయరు తెరిచి డబ్బు బైటకు తీసి లెక్కపెట్టి దాని తర్వాత మళ్ళీ ఇలాగే వ్యవహారం నడుస్తుంది. నా ఎదురుగుండా కదులుతూన్న వాళ్లు నా పని చూసి బహుశా 'ఏమిటి ఈ మానవుడు ఒకే ఎనుగు పుట్టే పద్ధతిలో పనిచేస్తున్నాడు!' అని

అనుకుంటూ ఉంటారు.

రామ్‌బాబు మాకు బాగా పాత ఖాతాదారు. అతనికి పెద్ద ఫ్యాక్టరీ ఉంది. ఏజెంటు కూడా అతణ్ని బాగా గౌరవిస్తాడు. చాలా ఛాదస్తపు నిక్కచ్చి అతనిది. చాల మటుకు ఎవళ్లనీ పంపించకుండా తనే చెక్కులు క్యాష్ చేసుకుంటాడు. నేనెప్పుడు అతనికి పేమెంట్ చేసినా, అతను ఊచల మధ్య నుంచి ప్రసన్న ముఖంతో నాకు ధన్యవాదాలు చెపుతాడు.

ఒక మాటు మా పెద్ద బావమరిది కలకత్తా వచ్చి పట్టణం అంతా తిరుగుతూ చాలా డబ్బు తగలపెట్టాడు. ఆ సందర్భంలో అతను నన్ను పార్కుస్ట్రీటు లోని ఒక రెస్టారెంటుకి తీసుకెళ్లాడు. అక్కడ మాకు రామ్‌బాబు కనిపించాడు. ఒక్కడూ కూర్చున్నాడు, చేతిలో తెల్ల జిన్ - సురాపానం ఉన్న గ్లాసు; కళ్లు ఏవే కలలు కంటున్నట్లున్నాయి. నిజం చెప్పాలంటే డబ్బున్న వాళ్లమాట నేను ఏమంత గొప్పగా భావించను. అందు మూలాన రామ్‌బాబుతో మాట్లాడాలని నా కనిపించలేదు. అందుచేత నాకు తెలిసున్న పాత స్నేహితులున్న చోటకు ముందుకు నడిచాను. రామ్‌బాబు కనుబొమ్మలు ఆశ్చర్యంతో ఎత్తి అన్నాడు: "ఎక్కడో చూసినట్లుందే! జ్ఞాపకం రావడం లేదు! అప్పుడు మా బావమరిది ముందు నాకు చాలా సిగ్గువేసింది. అతను నిజంగా గుర్తు పట్ట లేకపోతే, నిజంగా ఇటువంటి అహంకారాన్ని ప్రదర్శిస్తే నాకు గౌరవహీనం అనిపిస్తుంది. అప్పుడు నేను చేసేది లేక మా బాంకు పేరు చెప్పి, నేనక్కడ కాషియర్‌ని అని చెప్పాను....అప్పుడు అతని చేతిలోని జిన్ లాగే అతని ముఖం స్వచ్ఛంగా పరిష్కరించబడినట్లయింది; గుర్తు పట్టాను అని, ప్రసన్నతతో ఇంకా ఇలా అన్నాడు. "ఏం చెప్పం, ఆ ఊచల మధ్య ఆ పంజరం మధ్య మిమ్మల్ని చూడడం అలవాటైన వాళ్లు, అకస్మాత్తుగా ఇలాంటి చోట చూస్తే 'తెలియదు' అని చెప్పవచ్చు! అసలు సంగతి ఏమిటంటే, ఈ పర్‌స్పెక్టివ్ తప్పిస్తే, ఒక మనిషిని ఇంకో మనిషి గుర్తుపట్టాలంటే వేరే మార్గం ఏముంది.

"ఆ పంజరం మధ్య ఊచల లోపల నుంచి మీరు ఎలాగో అలాగే ఈ కోటూ, పాంటూ, బట్టతలా వీటితో ఉన్న నన్ను చూడండి. వీటినుంచి వేరు చేస్తే, అప్పుడు మీకు తెలుస్తుంది - మీకూ, నాకూ నిజమైన పరిచయం లేదని. ఈ మాట గ్రహించరా, ఇప్పుడే నేను పర్‌స్పెక్టివ్ మాట ఎత్తాను. నా చిన్నప్పుడు నేను రైల్వే కాలనీలో ఉండేవాణ్ని. మా నాన్నగారు టాలీక్లర్క్ ఉద్యోగం చేసేవారు. 'కాటిహార్' లోని రైల్వే క్వార్టర్స్‌లో మా ప్రక్క యింటి నుంచి ఒక అమ్మాయి వచ్చేది. ఆ అమ్మాయి తన తల్లి ఇంట్లో ఆదరం లేక, మా ఇంటికి వచ్చి, అప్పుడప్పుడు మా అమ్మకి వంటింట్లో సాయం చేస్తూండేది. ముడతలు పడి, చిరిగిపోయిన గౌనులో

మోకాలు దూర్చి, పరోటా వత్తేది; అప్పుడప్పుడు మా చిన్న చెల్లెలు ఏడిస్తే దాన్ని ఎత్తుకుని అల్లలా త్రిప్పి పడుకో బెట్టేది. మా అమ్మ అంటూ ఉండేది - (దీనితో నీకు పెళ్లి చేస్తాను' అని. ఆ మాట విని ఆ పిల్ల నేను ప్రేమతో చూసేవాడిని. అందువల్ల చాలా మత్తు కలిగేది. ఎంతో దారుణంగా ఎండిపోయి, చుండు పట్టిన తల అయినా ఎంత చురుకుగా అందంగా ఉండేది! కాని ఈ జగత్తులో ఎక్కువ రోజులు అలా ఉండలేదు ఆ పిల్ల".

అంతవరకూ చెప్పి రామ్‌బాబు ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు. అప్పుడు నేను బాధతో అడిగాను - 'తర్వాత ఏమైంది, ఆమె చనిపోయిందా?" ఆయన తలాడించి అన్నాడు - లేదు, లేదు, చావడం ఎందుకు? పెద్దయ్యా దాన్ని నేను పెళ్లాడాను. అది ఇప్పుడు నా భార్య. ఇప్పుడు బండగా, మోటుగా లావయింది; ఎప్పుడూ విసుక్కుని సాధించే స్వభావం దానిది; నన్ను పూర్తిగా తన అదుపులో అట్టే బెట్టుకుని దండిస్తుంది. నౌకరులు 'ఫ్రిజ్' తెరిచేటప్పుడూ, వస్తువులు పెట్టిలో పెట్టేటప్పుడు, డ్రైవరుని కారు బైటికి తీయమనేటప్పుడూ ఆమె దూషణం వింటూంటే కష్టపు రోజుల్లో మా అమ్మ రెండు నారింజపళ్లు ఇస్తే, నోటినిండా నవ్వే ఆ మనిషేనా ఈ మనిషి అని ఆశ్చర్యం కలుగుతుంది. ఇప్పుడు చూడండి, దానితో దెబ్బలాడి బైటకొచ్చాను. మనస్సు గాయపడింది - ఈనాడు ఆ ప్రేమ అంతా ఎక్కడికి మాయమైపోయింది? కానీ ఇక్కడ ఒంటరిగా కూర్చుని ఉండగా, ఆ పూర్వపు రోజులూ, అది వంటింట్లో కూర్చుని నిప్పంటించడం; ముడతలు పడిన, చిరుగు గౌనులో దాని మోకాళ్లు దాచుకోవడం; దాని అప్పటి కూర్చునే తీరూ అవన్నీ జ్ఞాపకం వస్తున్నాయి. మా అమ్మ ముఖం - ఏ ముఖం అయితే దాని దీనతను చూసి జాలిపడేదో అది కూడా జ్ఞాపకం వస్తుంది. అల్లాగే మళ్లీ ఇప్పుడు నా మనస్సు ప్రేమతో నిండుతోంది. ఇంటికి తిరిగి వెళ్లి దాని కోపాన్ని పోగొట్టాలి. అర్థం అయిందా..." అని రామ్‌బాబు ఆ తెల్లటి జిన్‌తో కొంత టోన్ వేసుకుని నవ్వాడు. అన్నాడు - "ఈ ఊచల కిటికీ ఉందే - దేనిలోంచైతే మిమ్మల్ని చూస్తానో అదే అసలు - ఈ ఊచల కిటికీ ఇప్పుడు 23-26 సంవత్సరాల మధ్య యువకుడొకడు పేమెంట్ కోసం వచ్చి నిలబడ్డాడు. టకటక లాడిస్తూ అన్యమనస్కుడై కౌంటరు బల్లమీద కొడుతున్నాడు. అతనికి నేను తెలుసు. వాళ్ల నాన్నకి పాతకార్లు కొని అమ్మడం వ్యాపారం. ఇంతకు పూర్వం వాళ్ల నాన్న వస్తూ ఉండేవాడు; ఇప్పుడు ఇతడొస్తున్నాడు బ్యాంకుకి. మధ్యలో అతని కంటికి గోచరమైనప్పుడు అడిగాను - "ఏం, మీ నాన్నగారు బాగున్నారా?" అతను సంతోషించి బుజం వంకరగా పెట్టి "ఆ" అన్నాడు. కాని నాకేమని అనుమానం ఉందంటే - ఒక రోజున ఎప్పుడైనా ఇక్కడ నుంచి నన్ను బదిలీ చేస్తే, ఈ స్థానంలో

ఇంచుమించు అందరిలాగా ఉండే ముఖం గలవాడెవ్వడైనా కూర్చుంటే, అప్పుడు అతను ఆ తేడా కనిపెట్టలేడని. అప్పుడుకూడా ఇతను కౌంటరు మీద దప్పు వేస్తూ, అన్యమనస్కుడై నిలబడి, క్రొత్తగా వచ్చిన కాషియర్ కంటపడితే, అతనివైపు కూడా పూర్వ పరిచయం ఉన్నట్లు చిరునవ్వు నవ్వుతాడు. తన తప్పు కనిపెట్టుకోవడానికి కొంతకాలం పడుతుంది అతనికి. ఎందుకంటే, అతను నన్నింత క్రితం ఎప్పుడూ సరిగ్గా చూడలేదు. అతను బహుశా అతని క్రొత్త గరల్‌ఫ్రెండు మాట ఆలోచించుకుంటూ ఉండవచ్చు ఇప్పుడు. లేకపోతే త్వరలో స్కూటరు కొనుక్కునే విషయం ఆలోచిస్తూ ఉండవచ్చు. అతను మెడత్రిప్పి రిసెప్షన్ పిల్లకేసి చాలాసార్లు చూశాడు; తర్వాత గడియారం చూశాడు. ఒకసారి టోకెన్ నంబరు చూశాడు; ఊచల కిటికీలోంచి నేను అలసిన చేతులతో ఒక పెద్ద రూపాయి కాగితాల కట్ట లెక్క పెట్టడం చూశాడు ఒకసారి. నా ముఖం కేసి ఒక సెకను చూసి మళ్లీ కళ్లు మరల్చాడు. నాకు తెలుసు అప్పుడు కూడా అతను నన్ను సరిగ్గా చూడలేదని. ఇంక 2 గంటలు కొట్టేందుకు 15 నిమిషాలు ఉంది. అప్పుడు నేను కాష్ అంతా మూసేసి టిఫిన్ తినేందుకు క్రిందకు వెళ్లాను. అప్పుడు ఒక వేళ అతను నన్ను త్రోవలో చూస్తే; ఫుట్‌పాత్ ప్రక్కన ఉన్న దుకాణంలో నేను బిస్కట్లు తిని, టీ త్రాగుతూండగా చూస్తే, అతను నన్ను గర్తు పడతాడా?

'అరటిపండు ఎంతయ్యా?' జత 40 పైసలు -అన్నావా? ఆ, ఆ, 'మర్తమాన' పండు నాకు తెలుసు, 'మర్తమాన్, అరటి పండుని నేను కనిపెట్టలేనా? ఆ చక్కని పచ్చని రంగు, మెత్తని తొక్క పెద్ద ఆకారం 'మర్తమాన' చూడగానే గుర్తు పట్టవచ్చు. పోతే, ఈవేళ నేను అరటి పండు తినే రోజు కాదు. నిన్ననే తిన్నాను. నేను రెండేసి రోజులకొక సారి అరటిపండు తింటాను. ఒక్కటి ఇయ్యి. లేదు, లేదు ఇది ఒక్కటే. ఇదిగో 20 పైసలు, తమ్ముడూ. ఆహా, బాగుంది అరటిపండు. ఆశ్చర్యం, పండు తిన్నాక కూడా నేను ఛాలాసేపు తొక్క గుప్పిట్లో అట్టేబెట్టుకున్నాను. ఏదో స్మృతి చిహ్నంగా 10, 15 నిమిషాల సేపు ఇటూ, అటూ తిరిగి వచ్చాను - అరటిపండు తొక్క నా చేతిలో ఉంచుకునే. నాకు నాలుగు వైపులా జనం మామూలుగా నడిచిపోతున్నారు. వాళ్ల ముఖాలలో పూర్తిగా నిర్లిప్తత కనిపిస్తోంది. వీళ్లెక్కడా యుద్ధంలో పాల్గొనలేదు; తన దేశం కోసం తన జాతి కోసం కానీ ప్రాణాలు త్యాగం చేయలేదు; అలాంటి ఏ ఒక్క ఘనకార్యం వీళ్లందరిలో ఎవరూ నిర్వర్తించలేదు. జాతి క్రమక్రమంగా నిర్వీర్యం అయి పోతుంది. ఎవరి మట్టుకు వాళ్లు ఏదో లోపల ఆలోచనలలో నిమగ్నులై నడుస్తున్నారు, వెళుతున్నారు, ఒకళ్ల గురించి ఇంకొకళ్లు ఏమీ పట్టించుకోకుండా.

వీళ్లకి కాలం విలువ తెలియదు, 1969 అంటే వీళ్లకి ఒక అంకె మాత్రమే- 2 వేల సంవత్సరాల చరిత్ర వీళ్లకి తెలియదు. వీళ్లకి 'భారతవర్షం' అన్నా, "టెలిపతీ" లేక "గ్రీక్ - రోమన్" ఒకటే అర్థం.

దయచేసి నన్ను చూడండి. ఈ నన్ను అరిందమ్ బసూని- ఏ అరిందమ్ బసూ అయితే పొడుగూ కాదో, బక్కచిక్కిన వాడూ కాదు, మంచి రంగు కలవాడూ కాదు ఆ నన్ను. నేను 'టెలిపతీ' కాదు; 'గ్రీక్ & రోమన్' కాదు, "భారతవర్షం" కాదు -ఈ మాటలకూ 'అరిందమ్ బసూ' అన్న పేరుకూ కొంచెం తేడా ఉంది. కాని మీరు ఆ విషయం ఎప్పుడైనా పట్టించుకోగలరా?

పోనీండి, వదిలేయండి ఈ గొడవంతా. కాని అప్పుడప్పుడు నాకీ సందేహం వస్తుంది - నేను నిజంగా ఉన్నానా అని. అవును కాదూ? బ్యాంకులోని ఈ ఊచల మధ్య నుంచి ప్రజలు నా చేతి లోంచి డబ్బు తీసుకుని లెక్క పెడతారు, కొందరు నాకు ధన్యవాదాలు చెపుతారు. కాని నా స్థానంలో మరెవ్వరైనా వస్తే, ఈ డబ్బు లెక్కపెట్టుకునే వాళ్లూ, ఈ కృతజ్ఞత తెలియచేసే కొందరూ, ఈ ఊచల కిటికీకి అవతల ఉన్న వ్యక్తిలో మార్పు గమనించరు. ఆ న్యూమార్కెట్ సంఘటన తీసుకోండి: నా భార్యే నడుస్తూ నడుస్తూ నన్ను వెతికింది కాని, ఎదురుగుండా కళ్లముందే ఉన్న నన్ను గమనించకుండా దాటి వెళ్లిపోయిందంటే, ఇంక మిగతా వాళ్లు నన్ను గమనించక పోవడంలో ఆశ్చర్యం ఏముంది?

నిక్కచ్చిగా కావాలనే నేను అరటిపండు తొక్క ఫుట్‌పాత్ మధ్య పడేశాను. పరధ్యానంగా నడిచే పెద్ద మనుషులు ఎవరైనా దీని మీద కాలు వేస్తే, అప్పుడు వెనక్కాల నడుస్తున్న మీరు ఒక్కసారి చకితులై మీమీ వళ్లు దగ్గర పెట్టుకుని ఉంటారు. మీకు పెద్ద దెబ్బ తగలకపోతే, పడినా మళ్లీ సద్దుకుని లేస్తే; మీకే తెలుస్తుంది ఈ అనుభవం వల్ల వచ్చే విశేష లాభం. అప్పుడు నాలుగు దిక్కులూ చూస్తారు; ఏ త్రోవమ్మట నడుస్తున్నారో గుర్తుంచుకుంటారు, ఒక వేళ దుర్ఘటన అపాయకరంగా జరిగి మీ కాళ్లూ, చేతులూ, లేక బుర్రా పగిలితే, అప్పుడు బాగా మీకు మీ పరిసరాలకి ఉన్న విపత్కర మైన సంబంధాన్ని సావధానంగా తర్కించుకుంటారు. బహుశా మీలో నిద్రిస్తున్న నేను మేల్కొని అనుకుంటాను బ్రతికి ఉంటే ఎంత బాగుంటుందో! అప్పుడు బహుశః తోటి మానవులతో మీకు ఉన్న సంబంధం గురించి కొంచెం సచేతనంగా ఉంటారు: ఇలా ఏం చెప్పలేం - బహుశా ఈ మాట మీరు గుర్తుంచుకోగలరని, ఈ రోజు 1969వ సంవత్సరం జూలై 16వ తేదీ మీ వెడ్డింగ్ అనివర్సరీ (ఏదైతే మీరు ఒక్కసారి పూర్తిగా మరిచి పోయారో) అనీ; అల్లాగే మీ వయస్సు సంవత్సరం 40 ఏళ్లు దాటుతుందని. అప్పుడు ఈ యుద్ధరహిత, విప్లవహీన భారతదేశంలో ఒక మామూలు

మధ్యాహ్నపు వేళ నేను కావాలని త్రోవ మధ్యగా అరటి పండు తొక్క వేయడం మీకు పూర్తిగా అపకారకరమైన పని కాదని మీరు గమనించగలరు.

మీరిప్పుడు చంద్రమండలం మాట ఆలోచిస్తున్నారు! ఆ ముగ్గురు సాహసవంతులైన అంతిరిక్షయాత్రికుల మాట! ఆలోచించకండి! మీ ఆలోచనతో నాకేం పని? నిరర్థకంగా జీవించే మానవుడు దారుణంగా ఆవేశపడి, ఒక్కొక్కప్పుడు అమాంతంగా ఆయాసపడి పోతాడు కూడాను. అతను పూర్తిగా ఒక యంత్రంలా అయిపోతాడు; తిన్నగా చంద్రుడిపై అధిరోహిస్తాడు; మళ్లీ సరాసరి తిరిగి వచ్చేస్తాడు; కానీ అదంతా తలుచుకుని మీరు మరింత ఆవేశ పడడంగాని, పరధ్యానం వహించడం గాని చేయకండి. త్రోవ చూసుకుంటూ నడవండి. రాజభవనానికి ఎదురుగుండా ఉన్న వంపు చుట్టూ తిరిగి చూడండి. ఎంత మనోహరమైన విశాల మైన మైదానమో, ఎంత స్వేఛ్ఛా గగనమో! ఆ ప్రక్కగానే నడిచి వెళ్లి మానవులను పరిశీలించండి– ఒక చోట చూసిన వాళ్లను మరో చోట చూస్తే గుర్తు పట్టడం ఎంత వరకూ సంభవమో మీరే చెప్పండి. ఈ మనోహరమైన మైదానంలో సాయంకాలం మీ ప్రక్కనుంచే నడుస్తున్నాను - నన్ను చూడండి. ఇప్పుడు నేను నా ఆఫీసు నుంచి తిరిగి వస్తున్నాను. ఏదో ఆట చూస్తానని చెప్పి ఈ వేళ కొంచెం ముందుగానే వదిలి పెట్టాను ఆఫీసు. మీరు కూడా ఇలా వస్తారు కాదూ?

చూడండి ఆ వెర్రికుర్రాడు - పక్కగా నిలబడి మంచి ఛాన్సు ఎలా జారవిడుచుకున్నాడో. ఇంక పది నిముషాలే ఉంది. ఇంకా ఒక్క గోల్ అయినా కొట్టలేదు. ఈ కుర్రాడు అయ్యో! దేవుడా, వీడికి ఈ ఎరుపూ - బంగారపు రంగు కలిపిన బనీను ఎవరు ఇచ్చారు. వాణ్ని మైదానంలోంచి తొలగించాలి. అయ్యా వాణ్ని 'దెయ్యం' అని తిట్టి సరాసరి మీరంతా బైటికి గెంటి పారెయ్యండి! ఇంక నా నోటి నుంచి చెడ్డ మాటలు బైటకు రావు. కాని చూడండి, చిక్కిన నాకు చెయ్యా కాలూ వణుకుతున్నాయి. చంద్రమండలం, ముగ్గురు సాహసయుతులైన అస్ట్రోనాట్స్ గురించిన మాటలు ఆలోచిస్తే, ప్రొద్దుటనుంచీ నా నరాలు బిగుసుకు పోయాయి. దానిపైన చూడండి ఈ చేతకాని జట్టు మా జట్టుకి ఒక పాయింటు తగ్గిపోయింది; ఒక్క పాయింటు ఎంత ఘోరం! అటు చూస్తే 8,9 నిమిషాల టైము మాత్రం మిగిలి ఉంది. ఏమంటారు, అన్నయ్యా, గోల్ కొడతారంటారా? ఏం చేస్తా రంటారు? చేతకాని టీమ్ వాళ్లంతా వెనక్కి వచ్చి గోలు ముందు అడ్డంగా నిలబడ్డారు. ఇంక వాళ్ల ఆట చూడండి, వాళ్లకి గోలు కొట్టాలని కోరికుందని ఎవ్వరైనా చెప్పగలరా? వీడీ కుర్రాడున్నాడే ఆఫ్సైడ్ లో నిలబడి ఈ వేళ ఆటలో అందరిలోకి ఛాన్సులు ఎక్కువ పాడుచేసిన వాడు - వాడి ఎదురుగుండా వెళ్లి

చెప్పాలని ఉంది: "ఒరేయ్, నన్ను చూడు, నేను అరిందమ్‌బసూని, మీ టీమ్‌ని నేను చిన్నప్పటి నుంచీ సపోర్ట్ చేస్తున్నాను. నెగ్గితే దేవుడికి పూజచేయించేవాడిని; ఓడిపోతే, ఆత్మహత్య చేసుకోవాలనుకునే వాడిని. ఇదంతా నీకేమైనా తెలుస్తోందా, బాబూ? నేను - ఈ జనాభాలో ప్రత్యేకించి నేను ఒక్కడిని - ఎంత దుఃఖంతో చెమ్మగిలిన కళ్లతో గడియారం కేసి చూస్తున్నానో నీకు బోధపడదు. నిజానికి ఎవరికి ఏం పట్టింది? నేనుఏడిస్తే ఎవడికి కావాలి? నవ్వితే ఎవడికి కావాలి? లేక వెళ్లిపోతే ఎవడికి కావాలి? ఎవ్వరూ నన్ను చూడరు కదా!

లేదు సార్ 'గోల్' అవ్వలేదు. రిఫరీ దీర్ఘంగా ఆఖరి విజిల్ ఊదాడు. ఆట అయిపోయింది. ఇప్పుడు దయచేసి ఒక్కసారి నన్ను చూడండి ఎలా దీనతా గ్రస్తుణ్ణయి బుజాలు వంచుకుని కూర్చున్నానో. చూడండి. మా టీమ్‌ని నేను ఎంతగా ప్రేమించానో, కాని నా గొడవ ఈ టీమ్ ఏమైనా పట్టించుకుంటుందా? వాళ్లు నన్ను ఎరుగరు, ఇంకా నేను ప్రతి గెలుపు తర్వాత ఎంతగా నవ్వేనో, ఎగిరేనో, దుమికానో. నాకు అపరిచితులైన ప్రక్కన కూర్చున్న వాళ్ల వీపు మీద ఎలా తట్టేవాడినో ! వ్యర్థం! నేనెంత మొత్తుకున్నా ఎవ్వరూ పట్టించుకోరు. నేను, అవును; ఈ నేను ప్రొద్దుటి నుంచి, చంద్రమండలం పైకి వెళ్తున్న ముగ్గురు ధైర్యవంతులైన ఎ స్ట్రొనెట్సు గురించి తెలుసుకున్నాక ఎంత చింతాక్రాంతు డనయ్యానో - అసలు నాకు అన్నం కూడా సయించలేదు ఈ వేళ. అయినా ఎవరికి కావాలి నా గొడవ?

దయచేసి నన్నొక్కసారి చూడండి. లేదు నాకు తెలుసు మీరు లీగ్ టేబుల్ లో మీ జట్టు స్థానం తెలుసుకుని ఎంత విసుగుపడి ఉన్నారో. అదీకాక మీకు ఆ చంద్రమండల యాత్ర ఆ అంతరిక్ష యాత్రిక త్రయం గురించి తెలుసుకోవాలన్న ఉత్సాహం ఉంది. ఎన్నెన్ని విశేషాలు జరిగాయో భూమిపై. 29 $\frac{1}{2}$ అడుగుల లాంగ్ జంప్ చేశాడు మానవుడు. అమెరికను ప్రెసిడెంటును గుండుతో ప్రేల్చి చంపాడు; ఎలెక్షనులో ఓడిపోయింది తన పార్టీ; విప్లవం రావడంలో చాలా అలస్యం అవుతోంది. కాగా,నేను -అరిందమ్ బసూ, బ్యాంకులో కేషియరు - మీకు ఇంత దగ్గరలో కూర్చున్నప్పటికీ మీరు నన్ను చూడలేకపోతున్నారు.

ఇప్పుడక్కడ మొదటి అంతస్తు రేలింగు మీద వంగుని నిలబడిన వాడు మా చిన్న అబ్బాయి నాలుగు సంవత్సరాల 'హాపూ', చాలా అల్లరి పిల్లాడు. తెల్లవారుఝామ్మునుంచి పట్టుపట్టాడు - "నాన్నా, రథోత్సవానికి వెళ్లాలి. 'తొరగా ఇంటి కొచ్చెయ్యి' అని. ఇప్పుడిక్కడ నా కోసం ఎదురు చూస్తూ నిలబడ్డాడు. వాడి చిందరవందర జుట్టు లోపలి నుంచి తళతళ మెరుస్తున్న కళ్లు ఇంత దూరం నుంచీ నాకు స్పష్టంగా కనుపిస్తున్నాయి. నేను మెట్టు మీద అడుగు పెట్టానో లేదో వాడు

పై నుంచి పరిగెట్టుకుంటూ దిగి వచ్చేశాడు వాళ్లమ్మ పై నుంచి అరుస్తోంది – 'హాపూ ఎక్కడికి కెళ్లావు? ఓ హాపూ! ఓయ్! " అని నేటి నిండా నవ్వుతూ ఎగిరిపడుతూ వచ్చి అడిగాడు: "ఇంత ఆలస్యం చేసావేం, నాన్నా? వెళదామా?" అవును, బాబూ, బైటనుంచి తిరిగి వచ్చాను, నా వాళ్ల మధ్య కాస్త విశ్రాంతి పొందవచ్చు' అని. చంటిపిల్లవాడిని నేను చంకలో ఎత్తుకున్నాను . వాడి వంటి మీద కొంచెం హాయిగా ఉన్న చెమట కంపు, శీతకాలపు ఎండలా వాడి మెత్తటి శరీరం కవోష్ణంగా ఉంది. ముఖం నీటిలో ముంచి ఏమైనా అర్ధస్నానం చేసినట్లున్నాడు. అన్నాను – "వెళదాం బాబూ, చాలా ఆకలేస్తోంది, కాస్త విశ్రాంతి తీసుకుని, ఏదైనా కొంచెం తిన్నాక వెళదాంలే".

ఎప్పుడైతే నేను విశ్రాంతి మాట ఎత్తానో అప్పుడు హాపూ నా మీద పడి, చిరాకుతో అన్నాడు: "తొరగా తెములు మరి!" వాళ్లమ్మ వాణ్ని తిడుతూ ఉంటే చాలా సరదాగా అన్నాను: "ఓహో, వెర్రి వేషాలెయ్యకు, చిన్న పిల్లాడు కదా! అసలు నాకు వీడి మొదటి పట్టు చూస్తే ముద్దొస్తోంది".

చాలా అల్లరి కుర్రాడు. తీర్థంలో అడుగుపెట్టాడో లేదో నా చెయ్యి విడిపించుకుని నడవడం మొదలెట్టబోయాడు. నేనన్నాను: "అల్లా చేయకు. హాపూ, చెయ్యి పట్టుకుని ఉండు. నా చెయ్యి పట్టుకుని ఉంటేనే నీకు తీర్థం చూపిస్తాను". వాడు ఊరికే ఇటూ, అటూ, చూసి, తర్వాత గట్టిగా అరిచాడు: "అదేంటి నాన్నా? ఇక్కడ కూడానా? నన్ను స్వతంత్రంగా అన్నీ చూడనీ – ఆ రంగులరాట్నం అన్నీను. అదుగో సర్కసు గుడారం అక్కడ ఉంటుంది. మృత్యుకూపం".

చేతిలో ఒక పాపిడి పట్టుకుని మెల్లిగా రంగుల రాట్నం ఎక్కాడు హాపూ. ఆ రాట్నం ఆకాశానికి పైకి ఎగురుతున్నప్పుడు, మళ్ళీ నేలపై దిగుతున్నప్పుడు, హాపూ 'హి, హి' అంటూ నాకేసి చూసి వళ్లు తెలియని ఆనందంతో నవ్వుతున్నాడు. వాణ్ని చూడగా నా మనస్సు సంతోషంతో నిండింది.

'మృత్యుకూపం' దగ్గర ఉన్న ఎత్తైన దిమ్మె పై నిలబడి. క్రింద చెవులు పగిలే హోరు చేస్తూ వేగంగా తిరుగుతున్న మోటారు సైకిలు ఫీట్లు చూశాము. హాపూ నా చెయ్యి గట్టిగా పట్టుకుని అంతా చూశాడు.

ఆ తర్వాత ఒక అరగంట సేపు మేమిద్దరం సర్కసు చూశాం. రెండు తలల మనిషి పాడే బొమ్మ ఎనిమిది అడుగుల ఎత్తు మనిషి మొదలైనవి. హాపూ మాటలు ఆగాయి. వాడి కళ్లు మటుకు తళ తళ మెరుస్తున్నాయి.

బైటకు వచ్చాక వాడి చెయ్యి వదిలిపెట్టేశాను. నా ప్రక్కగా నడుస్తున్నాడు. వాడి చెయ్యి పట్టుకున్నప్పుడు చమట పట్తోందని చేతికి, చెయ్యి విడిపించాను.

ఇప్పుడు నా చెయ్యి విడిపించుకుని ముందు వెళుతున్నాడు!

దుకాణంలో చక్కగా ప్రదర్శింపబడిన చాలా ఈలలు చూసాడు వాడు వంగుని; ఇంకొంచెం ముందుకు వెళ్లి ఏరో ప్లేనుల వరస చూశాడు నిలబడి. తర్వాత మెల్లిమెల్లిగా నడుస్తూ ఆట తుపాకీలు, రంగు రంగుల బొమ్మలూ చూస్తున్నాడు.

నెమ్మదిగా అడుగు వేస్తున్నాడు. క్రమంగా జన సమూహంలోకి చొచ్చుకున్నాడు హాపూ. నేనప్పుడు మా జట్టు విషయం ఆలోచిస్తున్నాను - వ్యర్థం! ఒక పాయంటు పోయింది ఈవేళ మా టీముకి.

చంద్ర మండలం వైపు వెళుతున్నారు ముగ్గురు ఈవేళ - వాళ్లు అక్కడకు చేరుకోగలరా?

హఠాత్తుగా ఆలోచన తట్టింది, హాపూ ఎక్కడా కనుపించడం లేదు. గుంపులోకి నీలం చొక్కా తొడుక్కుని వెళ్లడం. ఒక్క సెకను చూశాను. వెంటనే టప్పుమని తప్పిపోయాడు. 'హాపూ' అని పిలుస్తూ నేను ముందుకు వెళ్లాను....

అవును సార్, మీ రెక్కడైనా చూశారా నీలం చొక్కా తొడుక్కున్న నాలుగేళ్ల బ్బాయిని? వాడి పేరు హాపూ చాలా అల్లరి కుర్రాడు. చూడలేదా? గుంపు జుట్టు తల; మిలమిల మెరిసే రెండు చిలిపి కళ్లు.... లేదు, ఈ బొమ్మల కొట్టుముందు నిలబడ్డవాడు కాదు - వాళ్లిద్దరూ చూడడానికి ఒకేలా ఉన్నారనుకోండి. లేదు, వాడి ముఖంలోని ప్రత్యేకపు గుర్తులు నాకిప్పుడు మనస్సుకి తట్టడం లేదు. మామూలు ముఖం నా ముఖం లాంటిదే. నేను చెప్పగలిగిందల్లా వాడి వయస్సు నాలుగేండ్లు; వంటి మీద నీలం చొక్కా, నీలం చొక్కా తొడుక్కున్న కుర్రాళ్లు ఇక్కడ చాలామంది ఉన్నారు; అలాగే నాలుగేళ్ల వాళ్లూనూ. లేదండి, నేను నిక్కచ్చిగా చెప్పలేను - ఈ వేలకొలది ఉన్న బాల బాలికల మధ్య మా హాపూ ఎవరో నా మట్టుకి; వాడి మట్టుకు వాడు చెప్పలేడు కూడా. ఈ జనసమ్మర్దంలో ఎవరో నిక్కచ్చిగా నేను ఎవరో మరచి పోకండి, వాళ్లమ్మ కూడా ఒకప్పుడు నన్ను గుర్తు పట్టలేక పోయింది ...."

ఒక వేళ మీరు హాపూని చూస్తే దయచేసి వాడితో చెప్పండి - నేనే, నేనే వాళ్ల నాన్ననని.

ఈ నన్ను కాస్త చూస్తూ ఉండండి. ఎక్కడికి వెళ్లినా ఈ మాటలు మరవకండి.

# పశ్చాద్భూమి

దేవేశ్ రాయ్

గాలి అస్తవ్యస్తంగా వీస్తోంది – రోజంతా. రోజస్తమానం చైత్రమాసంలో లాగ గాలి అస్తవ్యస్తంగా వీస్తోంది – రోజంతా. క్లాసు అయ్యాక కామన్ రూముకి వెళ్లేటప్పుడు వాళ్ల స్కూలుకి ఉత్తర దిక్కుగా ఉన్న ఇంటిపై పడింది. వినయ్ చూపు. అక్కడ నుంచి క్లాసుకి వెళ్లేటప్పుడు వినయ్ చూపు యూకలిప్టస్ చెట్టు శిఖరంపై పడింది – ఆ స్మశానం ఇక్కడి నుంచి కనుపించదు, దేనికి ఆగ్నేయ మూలగా ఈ చెట్టు ఉందో.

ఈ గాలి శరీరంలోని నీటి ఆవిరిని అతిరిక్త పరిమాణంలోకి పెంచి చర్మాన్నంతా కరకరమని ఎండ బెట్టిస్తోంది. నోట్లోంచి మాట వస్తే జ్వరం వాసన. శుభ్రంగా చలవ చేసి ఉతికిన బట్టలు చిరిగితే, ఇవేళ గెడ్డం గీస్తే – అప్పుడు కూడా ఇంత కరకరలాడి ఎండిపోయి నట్లనిపించదు వళ్లు.

కొన్నాళ్లు స్కూలుకి ఉత్తరంగా ఉన్న ఇంటిపైన ఆకాశం తప్ప ఏమీ ఉండేది కాదు; యూకలిప్టస్ చెట్టు కంటె ఎత్తుగా ఏమీ ఉండేది కాదు. ఈ ఆకాశం, యూకలిప్టస్ రెండూ పూర్తిగా లేకపోతే, ఇంటిలో పెద్దవారి మృత్యువు తరవాత తోచే శూన్యత మాదిరిగా ఒక లోటు తోచేది. ఏమైతే ఆ రోజుల్లో ఉండేదో, అవి ఇప్పుడు లేవు – నాటకం అయిపోయాక స్టేజిలా ఉంది ఇప్పుడు. ఈ శూన్యతను తన నిజ జీవితంతో వినయ్ ఎంతగా ముడిపెట్టుకున్నాడంటే ఈ అకాలపు వసంత వాయువు అతణ్ణి ఆనందింపజేయడం బదులు, ఏదో అతీత కాలపు దుఃఖ తాపాలు అతనికి అనుభూతమవుతున్నాయి. మైదానంలో అశోక్, తోటి పిల్లల్ని తీసుకు వెళ్లి క్రికెట్ ఆడుతున్నాడు. అశోక్ కట్టుకున్న పాంటూ, వికెట్ వెనక్కాల అతను ఇప్పుడు నిలబడిన తీరూ, ప్రత్యేకించి వినయ్ మనస్సుని ఆకర్షించాయి. వినయ్ నల్ల బోర్డు పై తెల్లటి సుద్దముక్క పెట్టి తన చేత్తో బొమ్మ గీస్తూ, చెట్టు కొమ్మపై నుంచి ఎగరడానికి సిద్ధంగా ఉన్న పక్షికేసి చూశాడు, తరువాత, గుమ్మంలోంచి వస్తున్న ఆ కలవర పరిచే గాలిలో నిలబడి ఉన్నాడు. ఈ వేళ ప్రొద్దున్నే గెడ్డంగీసి ఉన్నట్లయితే, లేక చొక్కా ఈవేళ ఉతికి ఉన్నట్లయితే, అప్పుడు వసంత వాయువు మాదిరిగా ఉన్న ఈ గాలి ఆకర్షణీయత విలువను గ్రహించగలిగి ఉండేవాడు. వంటిలోని ద్రవ పదార్థం ఎండిపోగా, ముఖం మీద చీటి తీస్తూ, చెక్కిలి పై గాలి వీస్తుండగా, కళ్లు చికిలించి వినయ్ లోలోపల విసుక్కుంటున్నాడు. వసంత వాయువు దక్షిణం నుంచి వీచే మలయ మారుతం. ఇది ఉత్తర వంగదేశం, దక్షిణ దిక్కుగా సముద్రం; సముద్ర తీరంలో కలకత్తా. కలకత్తా నుంచి వస్తోంది ఈ గాలి

- ఎలాగంటే ఒక విధంగా వినయ్‌ను చీకాకు పెట్టేలాగ. తర్వాత జరిగే క్లాసులో అతను బోర్డు మీద ప్లేటు పైన కప్పు బొమ్మ గీశాడు.

సాయంకాలం గాలి పడిపోయింది. కృష్ణపక్షపు చంద్రుడు అలస్యంగా ఉదయించాడు. గాలి పడిపోయాక రాత్రి ఇంకా దారుణమైన చలివేస్తోంది. రోడ్డమ్మట దుమ్ము ఎగిరి పోయింది.

కాలి జోళ్లు ఎటువంటి అవస్థలో ఉన్నాయంటే, నడుస్తూంటే అడుగు చప్పుడు ఒక వింత ధ్వని కలిగిస్తోంది ఒక లాంచి లాగ. ప్రజల పద ధ్వని వినిపింప జేయకుండా, మళ్లీ ఈ సాయంసమయపు జన రాహిత్యం వల్ల మరింత సుస్పష్టంగా వినయ్ చెవికి వినపడుతోంది. ఈ లాంచి చప్పుడు లాంటి పద ధ్వని చెవిన పడింది. అర్ధరాత్రి సమయంలో అకస్మాత్తుగా నిద్రాభంగం అయితే గడియారం చప్పుడు వినిపించినట్లు ఒకే ఒక మోస్తరు, ఏం మార్పు లేకుండా, ఏమీ అర్థం లేకుండా. ఎంతగా వినయ్ మనస్సు విసుగు పుట్టే ఒకే ఒక జీవిత విధానంపై విసుగు చెందిందంటే, అతనికి ఒక చోట ఉండాలనీ లేదు. మరొక చోటికి వెళ్లాలనీ లేదు. ఒక్కసారి హఠాత్తుగా ఆగిపోయాడు. అడుగు చప్పుడు కూడా ఆగింది. "అయితే, ఈ చప్పుడు నా కాలిజోడుదే. నా నడకదే. నాదే". ఆ నిశ్చయానికి వచ్చి వినయ్ మళ్లీ ముందుకు సాగాడు. లాంచి శబ్దం లాంటిది విసుగుతో బండగా ఒకే ఒక ధోరణిలో మారదు, నిలవదు. ఇక్కడ జోళ్లు సరిచేయించాలి, ఇక్కడే. నాలుగు వైపులా, ముందూ చూస్తాడు. ఉపాయం లేదు. కలకత్తాలోని అందరి జోళ్ల చప్పుడూ నా జోడు లో చొరబడింది - ఇంక వేరే ఎవరి అడుగు చప్పుడూ లేదు. ఎలాగైతే మరణోన్ముఖుడైన రోగి కాళ్లూ చేతులూ ముడుచుకు పోతూండగా, కళ్లు తేలేస్తూ, ఏదో అనిర్వచనీయమైన కునుకుల్లో పడతాడో, అలాగే వినయ్ జోడు మరమ్మత్తూ చేయించ వలసిన అవసరానికి వ్యగ్రుడై క్రుంగిపోయాడు. సిగ్గు - ఈ కిర్రు, సిగ్గు ఈ కిర్రు చప్పుడు. ఒకే శబ్దం, ఒకే ఒక శబ్దం. చీకటి కానీ వెలుగు కానీ, కృష్ణపక్షం కానీ శుక్ల పక్షం కానీ, గెడ్డం గీసుకోనీ గెడ్డం గీసుకోక పోనీ ఏది ఏమవనీ - ఒక్కటే శబ్దం. ఒక్కసారి ఈ జనం ఆగితే-లేదు - అందుచేతే 'ఛ్యా" అంటూ గుర్రం బండి నడుస్తున్నా, ఎద్దు బండి నడుస్తున్నా, కిర్రుకిర్రు మంటూ, ఏడుస్తున్నట్లున్నా, బాధపడుతూ ఏడుస్తున్నట్లున్నా, లెక్కపెట్టే వాడెవరూ లేరు, జాగ్రత్త పడడం లేదు; ఎవ్వడూ నౌకరు లేడు; ఎవ్వడూ యజమాని లేడు; అందరూ కూడా ఒకే పబ్లిక్ ఛా - ఈ కిర్రు సిగ్గు! జ్వరం వచ్చిన వాడిలో కొన్ని కరుకు చప్పుళ్లు చేస్తూ వినయ్ తన అనుభవాన్ని విడిపించుకోదలచుకున్నాడు; మళ్లీ కాళ్ల చప్పుడు నుంచి అతని మనస్సుకి తగులుకున్నది ఏమిటంటే, ఈ చప్పుడుని అరికట్టే విధానం తనకు తెలియదు. ఈ నగరానికి తెలియదు - అందుకోసం సిగ్గు

- కి్రు చప్పుడు చేస్తూనే నడవాలి.

రోజస్తమానం తను అనుభవించిన చిరాకు, ముఖ్యంగా సాయంత్రం వేళలో రోడ్డు మీద నడిచినప్పుడు పడ్డ బాధ, ఈ విధంగా ప్రకటించాక, వినయ్ కడుపునుంచి కంఠం దాకా 'భక్, భక్' మనే నవ్వు లాంటిది వాంతి వస్తున్నట్లు చుట్టుకుంది లోపల.

మామూలుగా నవ్వే విధానం మరచిపోయి, ప్రాణం పోయేటట్లుగా ఉన్నప్పుడు త్రాగుబోతు వాడిలా నవ్వడానికి ప్రయత్నించాడు వినయ్- అల్లా చేయడం వల్ల నవ్వులోని దుర్వాసన పీల్చుకోగలిగే ఉద్దేశం ఉన్నట్లు. బైటకు కక్కుకుంటున్నట్లనిపించినప్పుడు అతను ఆపుకోలేదు - ఎందుకంటే అన్నం తిన్నాక ఏదైనా చిన్న వస్తువు పొట్టలో చుట్టుకుపోయి ఉందేమోనని.

ఆః, హాః, హుషార్! ఉల్లిపాయ, బంగాళాదుంప, మాంసం కలిపికొట్టు, సాయంకాలం - ఆలోచన ముగిస్తూ ముగిస్తూ అతను మూడు, నాలుగు సార్లు త్రేణ్చాడు. కంఠ నాళంలో ఒక విధమైన నెప్పి కలిగింది. మళ్లీ ఆలోచన ముగించాక ఒకటి రెండు సార్లు త్రేణ్చాక నోరు అవులించడం మరచిపోవడం మూలాన వాసన పీల్చడం కుదరలేదు; ఈసారి నోరు అవులించాక ఒకటి రెండు సార్లు ప్రయత్నిస్తే - ఆహా, ఏమయింది. తన్ను తను దూషించుకుని మళ్లీ నడవడం మొదలెట్టాడు. కూడా కూడా అదే శబ్దం వినిపించింది. సిగ్గు - ఓహో ఈ కిర్రు, సిగ్గు ఈ కిర్రు శబ్దం వినిపించుకోకుండా ఉందామనుకుని వినయ్ అనుకున్నాడు - నడిచాడు. కాని ఎక్కడికీ అన్నది ఆలోచించలేదు, ఆలోచించాడా? లేదు, ఇంటి నుంచి బయలుదేరేటప్పుడు ఆ మాట ఆలోచించాడా? లేదు, ఇంటి నుంచి బయలు దేరేటప్పుడు ఆ మాట ఆలోచించలేదు. ప్రొద్దుట టీ త్రాగినట్లు సాయంకాలం అప్పుడు నెమ్మదిగా ఇంటికి వెళ్లడం కుదురుతుందా! ఏదో ఒకటి అవుతుంది లేకపోతే మళ్లీ దినపత్రిక చదువుకుంటా. అదీ కాకపోతే అరుబైట ఉన్న బెంచీ మీద పడుక్కుంటా, మళ్లీ అదీ కుదరకపోతే, అదే ఆ అమ్మాయి పేరేంటి? గులాబీ, లేదా యాస్మిక (మల్లెపూవు)? ఆ 'మోని' ఉందే అది మాంచి టక్కరి ఆడపిల్ల కదా!

వినయ్ ఆలోచనా సూత్రం తెగింది. ఇలా సూత్రం తెగిపోయాకే. అతను మరొక దారాన్ని పేనాడు. సిగ్గుదో కిర్రు చప్పుడు సిగ్గు - కిర్రు - సిగ్గు ! ఏ దోలా కాలిచప్పుడు గురించి అతను చేతనారహితుడయ్యాడు, కాని మళ్లీ ఏదో ఒక లోటు అతణ్ణి ఆక్రమించుకుంది. సిగ్గు- కిర్రు చప్పుడు. సిగ్గు - ఛా! వెళ్లను, వెళ్లను. సుధీర్ బాబు. ఇంటిలోకి వెళ్లను. సందుకు ముందుగా వచ్చాడు. అక్కడ మళ్లీ లోలోపల అనుకున్నాడు వినయ్ - "వెళ్లను ఏమాత్రం వెళ్లను". సందు దగ్గర

చేరుకున్నాడు. ఎడం వైపుకి తిరగకుండా "వెళ్లను, వెళ్లను" అంటూనే మళ్లీ ఒకటి రెండు అడుగులు వేసి, ఆగాడు - ఏమయ్యింది?

అక్కడే సుధీర్‌బాబు ఇల్లు ఉంది, వెళతాను , లేకపోతే అస్తమానం ఇంట్లోనే ఉండవలసి వస్తుంది.

వినయ్ ఎడం వైపు మళ్లాడు. సిగ్గు - ఈ కి్రు సిగ్గు - ఛా! ఇది ఒక దారుణమైన సంతాపం. అన్ని మాటలు కరిగిపోయాయి. ఈవేళ వెళ్లి బాబూ సంగీతం పుస్తకంలో బొమ్మగీసి ఇవ్వాలి. అవును, పిల్ల పేరు 'బాబూ ఈ', బాలిక పేరు 'బాబూఈ' సిగ్గు - కి్రు - ఛా! సిగ్గు- ఈ కి్రు ఒక్కటే చప్పుడు. ఒక్కటే. చీకటి కానీ, వెలుగు కానీ సుధీర్ బాబు ఇంటి దగ్గరకు వచ్చి మొదట వినయ్ దుఃఖం గా ఉన్నట్లున్నాడు. కలకత్తా గురించి అతను చాలా భయపడుతున్నాడు. తల్లీ తండ్రీ. అన్నదమ్ములు అక్క చెల్లెళ్లు ఇంటి నిండా, స్నేహితులతో కాఫీ హవున్ నిండి ఉంది. ట్రాము నిండా జనం. అందు గురించి ఇక్కడ దిగాడు అతను. గేటు తెరిచే ముందు ఆ విసుగు పుట్టించిన పద ధ్వనిని వినేందుకని కొంత సేపు ఆగాడు. గేటు తెరుస్తూ ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు. అటుపైన మళ్లీ సిగ్గు - ఈ కి్రు చప్పుడు. ఒక్కటే శబ్దం. కలకత్తా ఓడ రేవు నుంచి లంగరు లేవదీసి సాయంకాలం అయేసరికి బెంగాలు అస్సాము నుంచి మధ్యప్రదేశ్ వరకూ ఉన్న విశాలమైన పశ్చాద్భూమిలోకి ఓడలో పయనించే నావకుడి లా ఉన్నాడు వినయ్.

మళ్లీ అదే, అదే చప్పుడు అమావాస్య అవనీ, పూర్ణిమ అవనీ; శీతకాలం కానీ, గ్రీష్మఋతువు కానీ; దృశ్యం ఒక్కటే. ఒకే ఒక మార్పులేని దృశ్యం. స్థిర దృశ్యం, సినిమాలా కాదు. చిరకాలంగా ఆకాశం, చంద్రుడు, నక్షత్రాలు, వృక్షాలూ కలిపి ఎవరైతే ఈ దృశ్యాన్ని నిర్మించారో వాళ్లు కూడా నిర్దయులే. అయినా ఈ స్థిరపడటంలోనే వాళ్ల అభినయం ప్రదర్శించడం అనేది అలా జరుగుతూనే ఉంది. అల్లాగే పాత్రధారులూ పాత్ర ధారిణులూ, అందరూ ఆ విధానాన్ని అనుసరించే తమతమ పాత్రలను నిర్వహించడం నేర్చుకున్నారు. అనుకరణలో శిల్పం ఎప్పుడూ ఉండదు. వీళ్లు ఏదైనా శిల్ప రచన చేయదలచుకుంటే, ఈ స్తబ్ధమైన సనాతనమైన దృశ్యంలోనే ఎన్నో ట్రాజెడీలూ, కామెడీలు నిర్మించబడతాయి'. అలా కాకపోతే, అన్నీ ప్రహసనాలయి పోతాయి - అయ్యో!

ఒక్కటే వెలుగైనా, చీకటైనా అర్ధరాత్రిలో దృశ్యం మార్పబడి కృష్ణపక్షం అయిపోతుంది. సాయంకాలం పోలికలో జరుగుతుంది తప్పకుండా ఆ మార్పు. శుక్ల పక్షపు మొదటి రాత్రి, కృష్ణపక్షపు చివరి రాత్రి తరతరాలనుంచి ఒక లాగే ఉన్నాయి. ఆగ్నేయ మూలలో మామిడి తోటలో శీతకాలంలో ఎండ అలస్యంగా వస్తుంది. ఎండ వెతుక్కుంటూ కూర్చోవాలా, చంద్రుణ్ని వెతుకుతూ? వంటిల్లు

పెద్దదీ కాదు, చిన్నదీ కాదు. పై రేకులు మార్పించలేదు. పెద్దమ్మాయి పెళ్లి సమయంలో సుధీర్‌బాబు సిమెంటుతో కట్టించాడు. తర్వాత రైలింగు కట్టించాడు. అది ఇంచుమించు పై కప్పుకు తగులుతూ ఉంది. ఎక్కడా ఊపిరి ఆడడం లేదు.

సుధీర్ బాబు అమ్మగారిది వరండాకి ఒక మూల ఉన్న పాలగది. వంట ఇల్లు తూర్పు వైపున దాని గుమ్మం పడమర్వైపున ఉత్తర దిక్కున ఉన్న ఇంట్లో గదులు రెండు. ఒకటి వంట చెరుకుది. దక్షిణవైపున మరో పెద్ద గది. ఇదీ ఒకే ఒక దృశ్యం. వెలుగవ్వనీ చీకటవ్వనీ. ఉదయపు దృశ్యాలు మారుతాయి. శరదృతువులో కొద్దిగా స్థిర రూపం ఉంటుంది - అది తప్పిస్తే అది మారుతుంది. నడుస్తూ, వెళుతుంటే ఉదయం నుంచి మారాలి, మారాలి, మారాలి. మధ్యాహ్నం చాలా వేడిగా ఉంటుంది. సాయంత్రం నిలబడదు, నిలబడదు. చవక కొబ్బరినూనె వాసన; వంటి మీద వేపుడు బియ్యపు గిన్నె. సాయంత్రం మీనూ జుట్టు ముడివేయాలి, జుట్టు ముడివేసుకోకుండా త్రోవమ్మట మీనూ వెళ్ళితే ఏం జేయాలి? అయినా 15 ఏళ్ళ మీనూకి త్రోవమ్మట వెళ్ళవలసే ఉంది. అన్నకీ స్కూలు నుంచి తిరిగి వచ్చాక మీనూ అన్నకీ నాకూ వినయ్‌కీ, బెల్లపు అన్నం తినేందుకు వడ్డించక ఎక్కడకు వెళుతుంది. కాగా, మీనూ కొబ్బరి నూనె వాసన పంచుకుంటుంది నా అన్నపు గిన్నె. అహా, మీనూకి ఎంత కష్టం, ఎంత తాపం! సంధ్యవేళ, ఇక్కడ ఈ సాయంకాలం పురిటి ఇల్లు ముందులాగ నిశ్శబ్దం. ఒడ రేవు వెనక ప్రదేశం చిరకాలం నుంచీ ఇలా స్మశానంలా లేదుకదా? ఇంట్లో కూడా ఇల్లా లేదు కదా? అది నా ఇంట్లో అలా ఎందుకు ఉండాలి. నా మనసులో సిగ్గు - సిగ్గు పుట్టించే ఆ కిర్రు సిగ్గు. ఛా! ఈ కిర్రు చప్పుడు! అందరూ వెళ్లిపోయారు. ఇదే ఇల్లు. ఇంక నేను ఈ ఇంటి బండిలో యాత్రికుడిని. స్టేషను ఎప్పుడు చేరుకుంటుందో కదా!

వంట చెరుకుగదికి ఉత్తరం వైపు గదిలో ప్రక్కనుంచి లోపలకు వెళ్లేందుకు ఒక రేకు తలుపు. గది మూడు వైపులా చాలా కిటికీలున్నాయి; పడమట వైపు గోడకు చేర్చి 'బాబూఇ' టేబులు మీద సరస్వతీ దేవి బొమ్మ ఒకటి; తల ప్రక్కన ముందు - బాలిక తల ప్రక్కన ముందు. ప్రక్క టేబులు పైన లాంతరు వెలుగు ఉంది, కాని బాబూఇ కూర్చుని దానికి అడ్డుగా ఉంటే, వెలుగు కనిపించదు. కానీ 15 లేక 16 ఏళ్లు గల ఆమెపై వెలుగు నాలుగు వైపుల నుంచీ ఒక స్రోతస్సులా ప్రవహిస్తోంది. పడమి కిటికీ మూసి ఉంది; తూర్పు కిటికీ తెరిచి ఉంది; బాబూఇ తూర్పు కిటికీ వెనుకకు తిరిగి వచ్చింది, బాలిక ముఖం వెలుగు ప్రవాహం నాలుగు వైపులకూ తూర్పు కిటికీ నుంచి బైటకు వచ్చింది. ఎవరైనా చూసేవారుంటే చూసి ఉందురు - బాబూఇ టేబులుపై ఉన్న లాంతరు వెలుగు తూర్పు కిటికీలోకి వెళ్లి, ఈ రేకు తలుపు మీద పొగమంచు లాంటి ఒక వెలుగు

రేఖను చిత్రిస్తోందని. ఇంకా వాళ్లేం చూడగలరేంటే - ఈ లాంతరు వెలుగు ముందు బాబూజి ముఖం రూపురేఖని (అది పవిత్రతను ప్రకటిస్తోందా! లేక ఆ రేఖలో ని వర్తులత్వాన్ని సూచిస్తుందా, కొద్దిగా అవకరమైన అవయవాల వైశిష్ట్యాన్ని) అందులో పైకి ఎగురుతున్న పెద్ద జుట్టుని. తను ఒక చిత్రంలో గోచరిస్తున్నట్లు బాబూజికి తెలియదు, చూసేవాడికి తెలుస్తుంది. మానవుడు చిత్ర పటం కాగలడని, కవికి తెలుస్తుంది - చిత్రపటం మానవ రూపం దాల్చి బాబుజి ద్వారా పాటపాడుతుందని. నువ్వు కేవలం చిత్రపటానివా?

రేకు తలుపు గుండా నూతిచుట్టూ, ఉన్న కంచె, మళ్లీ ఉత్తరవైపు గోడమధ్య చీకటిలో తడికెల కంచె గుర్తు గీయాలి, ఒక కిటికీ, దాని ఊచలు. కిటికీకి ఎదురుగా టేబులు; టేబులు ముందు చందన్. చందన్ వ్రేలి చిగురు పంటి మీద పెట్టబడి ఉంది. పడమటి వైపు వీపు పెట్టి, తూర్పు వైపు ముఖం త్రిప్పి ఉన్నాడు చందన్. లాంతరు వెలుగు అతని ముఖం పై ఆ వెలుగు నీడను వ్యాపింపజేసి ఒక చరిత్రను రచింపజేస్తోంది. చీకటి వెలుగుల స్వేచ్ఛా ప్రసారంలో ఏం చరిత్ర రచింపబడుతుంది! లాంతరు కుడి ప్రక్క, చందన్ ముక్కు ఎత్తుగా కనిపిస్తోంది, అతని ఎడమ కంటికోణంలో చీకటి పడింది. చేతులు లేని బనీను, వదులుగా మోటుగా వుంది. అటగాడిలా పొట్టి జుట్టు: దవడలు దృఢంగా ఉన్నాయి; కళ్లు మరి అంత అదృఢంగా ఉన్నాయేమో? గోళ్లు చిగుళ్లు కొరుకుతున్నాడెందుకు చందన్? ముందరి కిటికీలోంచి బయటకు పోతున్న వెలుగు కిరణాలలో వివిధంగా మెరుస్తున్న మనిషి కంఠం కనిపించని తల ఒక్కటీ చూసి చందన్ భయపడ్డాడా!

దాని తర్వాత కొంచెం పైకి నెడమ వైపున వంటిల్లు; వంటిల్లు వరండాలో పాలదాలిలోని మంట అల్లల్లాడే దీప శిఖ, నీడను వ్యాపింపచేస్తోంది - తుడిచినట్లు వెలుగు వ్యాపించింది, కంచెలోని ఖాళీలలోంచి దారం లాంటి వెలుగు వంటింటి క్రింద పై కప్పు నీడ పడితే, మరి ఆ నీడ ఆకాశం నుంచి క్రింద ఇంటిపై దిగితే, క్రింద, సరిగ్గా ఇంటిపై కప్పుపై పడుతుంది. వరండాలో ఒక మూలలో పేడపిడకలూ, బొగ్గుల బస్తా, కట్టెపుల్లలూ- చీకటిలో ఒకదాని నింకొకటి చుట్టుకు పోయి హఠాత్తుగా వచ్చిన వెలుగులో కథల్లో వచ్చే సత్రంలోని యాత్రికుల సామానులా ఉన్నాయి. పాలగది లోపల ఒక చిన్న కుంపటి ముందు వంటచేస్తూ కూర్చుంది సుధీర్‌బాబు భార్య. ఆ గ్రుడ్డి దీపం చిరపరిచితమైన వెలుగులో చైత్ర మాసపు గాలిలాగ వణుకుతూ సుధీర్‌బాబు భార్య 30 సంవత్సరాల వయస్సుది....ఎందుకిలా అపరిచిత అయినట్లుగా ఉంది?

సాయం సంధ్య ఇంచుమించు స్పష్టంగా సమీపించింది. వెనక్కి పడుతోంది. ఊహించు. సంధ్యావేళ ఊహించు. ఊహిస్తూనే ఉండాలి, సాయంవేళ. నేనీసారి

ఊహిస్తున్నాను వదినెతో ఒకటి రెండు మాటలు చెప్పి, దక్షిణ గదిలోని వరండాలో బెంచి మీద పడుక్కుందామని - ఏమిటి - ఏమిటి ఊహించుదామని ఊహించాను, మరి ఇప్పుడు ఏమని ఊహించాను!

"ఎవరు?" వదినె గొంతు వింటూండగానే రెండు కళ్ళూ మూతబడ్డాయి. కొంచెం ఎత్తుగా ఉన్న అరుగుపైన మోకాళ్ళు రెండూ మోపి, మోకాళ్ళ పైన బుజాలు చాపి, కుడి చేతిలో ఏదో వంట సామాను పెట్టుకుని ఉంది. ఎడమ చేతిలో ఏమిటి? అడుగుల చప్పుడు వినగానే నడుం నుంచి పైభాగం తిన్నగా సాచి, ఆతురతతో కంఠం పైకి ఎత్తింది.

"నేను వినయ్‌ని"- అన్నాడు వంటింటి అరుగుమీద కాలుపెట్టి.

"వినయ్! రా! ఇంట్లో అంతా బాగున్నారా" - వినయ్ జవాబు వింటూనే వదినె వంటి పై భాగం విశ్రాంతి పొందింది. ఎడమ చేతితో పొయ్యిలో కట్టెలు త్రోస్తూ పెడుతోంది. నెరుసులు కొన్ని ఎగిరితే, కళ్ళు చిట్లించి ముఖం ప్రక్కకు పెట్టుకుని, లేవదీసిన ప్రశ్న మాదిరిగా అప్పుడు ముఖం తెరిచి వినయ్‌వైపు చూసింది. వినయ్ అన్నింటికి 'ఉఁ' అంటూ సమాధానం ఇస్తూ గుమ్మం మీద కూర్చున్నాడు. వదినెగారు రోజూ ఇదే ప్రశ్న వేస్తుంది ఎందుకు? అలవాటా? రోజూ మాట ఒక్కటే, ఒక్కటే. వేళ విశేషం ఆమె గమనించదన్న మాట. ఆమె మనస్సులోని వాత్సల్యం కంఠంలో దూరం నుంచి వచ్చి నట్లుంటుంది.

"కూ....ర్చో" అని కూర్చుండ చేసింది వదినె వినయ్‌ని. వినయ్ ఒక కట్టె తీద్దామని చెయ్యి చాచాడు. పుల్ల చేతితో లాగి మధ్యకు వంచి విరిచాడు. వదినె కట్టెనూ చూసింది, వంచి విరిచిన పుల్లనూ కూడా. వినయ్ కట్టెను ప్రక్కకు విసిరేసాడు.

"స్కూలుకి వెళ్లావా" - వదినె గారి ప్రశ్న. తర్వాత ప్రశ్న, "అన్నంలో ఏం తిన్నావు!" అని దానికి ముందే అడగబడుతుంది. మరింకెవరైనా వస్తే వదినెగారు బాగా ఇంట్లో మసల గలుగుతుంది. ఆమె స్వంత విషయం విశేషంగా ఏమీ లేదు. తండ్రి ఇంటినుంచి 30 సంవత్సరాల క్రిందట ఏమీ సంభాషణ నేర్చుకుని వచ్చిందే - 5 సంవత్సరాలలో అది అంతా ఆరిపోయింది. ఇప్పుడు ఈ నిరక్షరాస్య పట్టణవాసంలో మాటలు వెతుక్కుంటూ నేర్చుకోలేదు. ఆమె ఎక్కడ పుట్టిందో, అక్కడే నేర్చుకునేందుకు వీలులేకపోయింది మాటలు. వదినె గారు ఏమిటి అలా చూస్తోంది? ఆమె ముఖంలో ఒక చిన్నపిల్ల చిహ్నం ఉంటే, అది చూడగా తెలుస్తుంది - బాబూఇ-చందన్-సోనా-రూపా-మీరా-ఇటువంటి పేర్లు ఆమె ఎందుకు పెడుతుందో? కాని ఇప్పుడు ఆ చిహ్నం లేదు, ఎందువల్ల పొయ్యి దగ్గర వేడెక్కిందా? కంట్లో పొగా?

"సుధీర్ రాలేదా?"వినయ్ అడిగాడు వదినెను.

"లేదు. ఎక్కడికి వెళ్లాడు?" పొయ్యి కేసి చూస్తూ అడిగింది.

"వాడు ఇంట్లో ఉన్నాడు - సుధీర్ అన్నయ్య రాలేదా ఇంటికి?"

"ట్యూషన్‌కి వెళ్లారు".

ఆమె నేను సరిగ్గా చేశానని భావిస్తోందా. సంధ్యాకాలపు ఆలోచన చరిత్ర. మొదటి అధ్యాయం - సోనా, రూపా, మీరా- వాళ్ల అభావం. రెండవ అధ్యాయం - బాబూఇ. మూడవ అధ్యాం - నేను నాలుగవ అధ్యాయం - వదినె. ఐదవ అధ్యాయం - సుధీర్ అన్నయ్య. బాబూఇ ఏమనుకుంటుందో?

సుచిత్రామిత్రా చిత్రం ఒకటి గీసి ఇమ్మంది బూబుఇ ఇవ్వలేదు, ఇవ్వను. బాబూఇ, నువ్వూ చదువు వదిలిపెట్టు., పాట వదిలిపెట్టు బట్టలూ గిట్టలూ ఉతుకు, వంటిల్లు కడుగు, చేతులు పసుపు వాసన అవనీ, వంటిపైన ఎర్ర శాలువ 'స్వాగతం' క్రింద 'విగతం' అయిపో. లేక పోతే నువ్వు చస్తావు. పో, చావు. వినయ్‌కు నవ్వు వచ్చింది; పొట్టలోంచి కాదు, పెదవుల పైనే. బాబూఇ బసూ - చనిపోతోంది, ఎవరు రక్షిస్తారు? సాయంకాలం అప్పుడుఇలాంటి దుర్భావనలు భావించడం కూడదు; దక్షిణ ద్వారంలోకి వెళ్లడం కూడదు. దక్షిణ ద్వారం తెరు, చస్తే చచ్చారు. అనేక దినాలు ప్రక్క పట్టిన దీర్ఘ రోగి పెదవులపైన నవ్వులాగ తన నవ్వును చూడగలిగాడు. అటువంటిదే ఏదో రోగగ్రస్తమైన భావనను భావించాడు. కాని సాయం సమయంలో సరస్వతీదేవి పటం దగ్గర తలకు ప్రక్కగా ముందు వైపు చూస్తూ బాబూఇ సుచిత్రామిత్రా మాట ఆలోచిస్తోందా? ఆలోచించవచ్చు. మళ్లీ ఇప్పుడు ఈ వయస్సులో మరో ఆలోచన ఆలోచించవచ్చు. అన్ని ఆలోచనలూ కలిసి మనస్సు పొంగిపోతున్నట్లు అవుతోంది. మనస్సు భారీ ఎత్తున మారిపోతే పోతుంది. బాబూఇ సుచిత్రామిత్రా (ప్రసిద్ధ బెంగాలీ నాయిక) పటాన్ని కోరింది గీస్తాను, అంతకుముందు అదే పాట వినాలి - "చీకటిలో ఉంచకుః నన్ను చూడనీ" -బాబూఇ, నీ "ఆపనారే" (తనను) ఎక్కడ? నన్ను చూస్తున్నావా? నా "ఆపనారే" ఖాళీ అయిపోయింది. అయ్యో జీవితం అంతా శూన్యాన్నే వెతికాను.

"వినయ్, టీ ఇవ్వనా?"

"వద్దు".

ఇంతకాలం ఏమి విచిత్రపు ఆలోచనలో ఆలోచించాను! లేదు. కాలం చింత స్వరూపం కాదు. చైతన్యం కాదు, అస్తిత్వం. నేను కూడా అదే. వ్యక్తిత్వం ఉంటుంది. వ్యక్తి నగరంలో ఉంటాడు. నాకు 26 సంవత్సరాల పాపం ఉంది. నేను పంచదశి (25-ఏళ్లు) సరళతను కోరాను. బాబూఇ పాట పాడవా - "ఆమార్

అపనారే దేఖ్‌తే దావ్" (నన్ను నేను చూసుకోనీ!)

ఇప్పుడు శరీరంలో ప్రేరణ మనస్సులో? ఎక్కడ? మనస్సు- కొంచెం గడ్డిలాంటిది, ఎంతో కోమలం, సన్ననిది - మనమా! నువ్వెక్కడున్నావు? ఓ మనమా, నువ్వు ఎక్కడ? ఓ మనమా, నువ్వే నా శరీరంలో ప్రవేశించు! రా! రారా! నా ఎండిన దేహంలో తుఫాను తీసుకుని రా! మనసు తీసుకురా!

మనస్సు ఈ తుఫాను మాట ఆలోచిస్తూండగానే ఆకాశం, సముద్రం, పర్వతం అన్నీ కలగాపులగం అయి అతని మనస్సు లో ఒక ఆశ్చర్యకరమైన చిత్రం తయారయింది. ఇదంతా, ఈ అల్పమైన హడావుడీ, సంచలనం వినగా వినగా కొంచెం ఓడిపోయి నట్లయిపోవచ్చు. పెద్ద విశాలమైన శూన్యత -శూన్యం తో పాటు కలిసి మెలిసే ముసలితనం వచ్చింది. వినయ్ అది గ్రహించుకుని దాన్ని తొలగించలేక పోతున్నాడు. వాయడ్ మధ్యనే ఓల్డ్‌నెస్ ఉంటుంది - కొంచెం లేక పోతే దాని చిత్రం గీయాలన్న కోరిక ఎలా పుడుతుంది? ఇప్పటి చిత్రం లాంతరు నాలుగు వైపులా దెయ్యం లాంటి ముఖం, పిల్లవాడిది, గుర్తించలేం. మనుష్యుని శరీర స్వరూపం చిహ్నం, రంగు; గీత వెలుగులో ఉజ్జ్వలమైన రంగులో నీడ పడింది, లేక వదినె - నడుము నుంచి పై భాగం వరకూ అకస్మాత్తుగా చింతా కులితమై పోయింది. ఏదో అడుగుల చప్పుడు, 'ద్రోణలత' వంటి రేఖ, రెండు కాళ్ల మధ్య తల పెట్టుకున్న కుక్క అకస్మాత్తుగా కళ్లు తేలెయ్యడం, జంతువు సుందరమైనదీ, మానవుని కళ్ల మోస్తరు కాని వదినె గారి ముఖంలో ఆ పసితనం ఎక్కడ మటుమాయమయింది? పోగొట్టుకున్న విగ్రహం రూపాన్ని వెతికేందుకు అన్నట్లు వినయ్ కళ్లు మూసుకున్నాడు. ఏ రూపంలో ఉంది వదినె శైశవం?

బాగా కొట్టొచ్చే రంగు, కొంచెం వెడల్పు కొంచెం ఉన్నతమైనది, కొంచెం ఉన్నతమైనది. రూపురేఖ మటుకు మన్మథుని సమస్త సంపదలకు ఆకరం, కాని శరీర ఛాయ ప్రాణ రహితంగా ఉంది. సుచిత్రా మిత్రా బొమ్మ ఎంతగా చూడముచ్చట పడుతుందో కదా బాబూఇ! నేనెంతగా చూడదలచుకున్నానో! చూడనీయండి! నా రూపాన్ని నన్ను చూసుకోనీయండి!

గగనేంద్ర నాథ్ ఠాకూర్ రచించిన 'యక్షపురి' (అస్పష్టమైన వెలుగు, త్రికోణంగా ఉన్న వెలుగు నీడ ఫలకంపై ఎక్కడో స్వర్ణ స్తంభం ఒక్కొక్క చోట మానవ శరీర సూచకంగా నందిని చాప పడినటువంటి వ్రేళ్లు ఎన్నో ఎర్రగన్నేరు పూగుత్తి అసంగతమైన రక్తవర్ణం; అసంగతం, కాదు); అవనీంద్ర నాథ్ 'శాహ్‌జహాఁ' (షాజహాను) - (చాలా విషణ్ణమైన "రూపం" అది ఉందా లేదా అన్నట్లు చిత్రంలోని రేఖలు తుడిచిపెట్టుకు పోయే లాగ, చలికాలంలో అద్దం మీద పడిన ఊపిరి ముసుగు లాగ - సూక్ష్మంగా, 'సయ్‌నా, సయ్‌నా' 'ఓర్పులేక,

ఓర్వలేను' రవీంద్రనాథ్ 'నృత్యం' - ప్రాచీన ఈజిప్టుకి సంబంధించినట్టి చేతులు, కాళ్లు సరళభంగిమ; నైసర్గికత కావాలి, ఆహా, ఎ-లి-మెం-టల్, హేబ్రూ మంత్రోచ్చారణం, చిత్రీకరణ డాబుగా ఉంది, అయినా జటిలమయ్యైన వర్ణం, భంగిమ సైతానుకి హారతిచ్చినట్లుగా; ముఖంలో ఏదో మృతదేహపు (శవ) పేటిక పై చిత్రించినట్టి గాత్ర చిత్రం అమానవీయత, చనిపోవడాన్ని ఎవరైనా తప్పించుకో గలిగితే డాబుగా, రంగు, డాబైన రంగులో, బాబుఇ, దీన్ని గురించే నీ పాటంటే నాకు చాలా ఇష్టం, గట్టి గొంతుక, సుచిత్రా మిత్రా గొంతుకలా ఉదాత్తం, ఉదారంగా ఉంటుంది. బాబూఇ, నువ్వు కూడా ఒక సుచిత్రామిత్రా అవ్వాలి; (బాబూఇ, నువ్వు సుచిత్రామిత్రా అయిపోగలవా?); నందలాల్ బోస్ చిత్రించిన 'శివ' - లేదు, లేదు, లేదులే, లేదు: ఎవరింటిలో అన్నపూర్ణ ఉంటుందో, వారు అన్నం కోసం విలపించడం ఉందే- అది చాలా దారుణమైన "పరమాదం", ప్రమాదం, లేదు లేదు, లేదులే, లేదు; జామినీ రాయ్ 'జన్మాష్టమి' - (చచ్చాంరా, చచ్చాంరా, వక్రమురళి ఊదుతున్న 'త్రిభంగ మురారి'- వంచిన తల, నడుము, కాళ్లు గల బాలకృష్ణుడు - అయితే 'త్రిభంగం ఎక్కడుంది? ఊరికే ఒక్క మోకాలే వంగి ఉంది, దానితో శరీరం అంతా ఒక పల్లంలోకి వంగినట్లు ఉంది ఒక వృక్షం లాగ 'శాల' వృక్షం లాగ గరుకుగా ఉంది; ఒక-చేపలాంటి కళ్లు, పూర్తిగా ఉన్న కళ్లు నిక్కచ్చిగా ఒక పూర్తిగా ఉన్న చేపలాగే, స్వచ్ఛంగా, ఎంతో సరళంగా, ఎంతో విస్మయాన్ని ప్రకటిస్తూ, నాకు వర్ణించే శక్తిచాలదు). భ్యానగాఘ్ క్రాన్ ఆన్‌ది స్ట్రీమ్ (ఓహో నన్ను రక్షించు, నేనీ బాధను భరించలేకపోతున్నాను, నల్ల కాకి, ఆకాశంలో నడక, మెడపైకి ఎత్తి, రెక్క రెక్కకీ సంకెళ్లు, తుఫాను, క్రింద మహాకావ్యంలో వర్ణింపబడినట్టి నది; అయ్యో, ఇది నేను సహించలేను, నన్ను రక్షించేవారెవరు, అయ్యో నన్ను కాపాడే వారెవరో, నల్లకాకి రెక్కల వెనక్కాల సూర్యుడు మాయమయిపోయాడు; ఈ అంధకారపు ముసుగు క్రింద ప్రవాహం ఒడ్డు పడగొట్టి పార్లిపోతుంది; నేను ఒడ్డులేని ప్రవాహంలో తేలిపోయే స్త్రీని, నాకు ఒడ్డు ఇవ్వండి, ఆశ్రయం ఇవ్వండి, బాబూఇ, నువ్వెక్కడున్నావు; కాకులు రక్తాన్ని చప్పరించవచ్చు. నా గుండెలో ఇంకేమాత్రం రక్తం లేదు, ఆ నల్లని చీకటిలో నా రక్తంలోని మహాకావ్యపు సముద్రం ఎర్రబడిపోయింది - బాబూఇ, నువ్వెక్క డున్నావు? నా గుండె పగులుతోంది నందలాల్ బోస్ 'అర్జున్' -ఆహా, పడుకున్నట్టి అర్జునుడు, చిత్తు రేఖ, పెద్ద ముఖం, విశాల వక్షస్థలం తొడలు గోళాకారంగా మోకాళ్ల వరకూ వంగి ఉన్నాయి; మోకాళ్లు వంకర, ఒక మోచెయ్యిపై ఆనిన బుజాల నరాలు మెట్టతామర దళాలలా ఉన్నాయి; మరొక చెయ్యి విశ్రాంతి ఆశ్రయంలాగ విద్రోహం లాగ, శరీరం అంతా నరాలతో ఆశ్చర్యకరంగా,

రెండు మాంసాహారాల మధ్య ముఖం దొరికిన సింహపు గర్జనలా తళుక్కుమంటూ పైకి కనువిస్తున్నాయి, వీపు ఒక విశ్రాంతి ఆశ్రయం లాగ ఉంది - అశ్వత్థ వృక్షం మ్రాను లాగ (నేను, పొందాను, ఎలిమెంటల్, లిరిక్ నేను పొందానో హెూ పొందాను, నేను చిత్రం చిత్రిస్తాను - సముద్రంలా అల్లకల్లోలం అయినది - చరాచర జగత్తులాగ తిన్నగా, ఎపిక్‌లా, ఇతిహాసంలా, మహాకావ్యపు కరుణరసంలా, నేను చిత్రిస్తాను, బాబూఇ, నేను అర్జునుణ్ని.

ఈ ప్రతిజ్ఞా సమయంలో వినయ్ కళ్లు తెరిచి చూస్తూ మళ్లీ మూసేసుకున్నాడు. ఆ ముహూర్త కాలంలో వంటింటి కంచె చిల్లులోంచి నెమ్మది నెమ్మదిగా వంట జరుగుతున్నట్లు వెలుగు కణాలు లేచాయి?, పైకి లేస్తున్న వంటింటి నీడ, ఈ ఇంటి లోపల నుంచి వెలుగు వచ్చి గుమ్మం ముందు దొర్లింది తడిసిన చీరలాగ. ఆ ప్రక్క వున్న రెండు ఇళ్ల కాంతి పొగమంచులా ఉంది. నేను పొందానోయ్, నేను చిత్రిస్తాను - ఈ మంత్రం జపిస్తూ జపిస్తూ కళ్లు తెరిచి, జపిస్తూ జపిస్తూ మూసి, అతను అర్థం చేసుకో గలిగాడు మరొక స్మశానం రోదనం చాలా గంభీరంగా ఉంది. భయంకర రాత్రిలో బహుదూరం నుంచి నక్క కూతలా వినబడింది. లాంతరు దెయ్యపు కాంతి నాలుగు వైపులా చిందర వందరగా పడుతోంది, లాంతరు వివర్ణమైన కాంతిలో ప్రకాశించే రంగులు పేల బారినట్లున్నాయి, తడిసిన చీరలాంటి వెలుగు, మిణుగు పురుగు లాంటి వెలుగు, ద్రోణలత లాంటి శరీర రేఖ, అకస్మాత్తుగా ఉన్నట్లుండి బాల్యం హఠాత్తుగా మాయమై పోవడం; కంచెలో చిత్రించిన పటం కిటికీ, ద్వారం కిటికీ, రెండింటి మధ్య పిల్లవాని పేలవమైన కళ్లు, వెనక్కి తిరిగి పిల్ల ముందున్న తలనొప్పి మందు వినయ్‌ని పరిభ్రమిస్తూ ఉన్నాయి. జాలితో వినయ్ అనబోయాడు నేను ప్రసన్న నారాయణ విద్యాలయాలో డ్రాయింగు మాస్టారుని, నేను చిత్రించలేను, నేను పటం చిత్రించలేను".

"ఎవరు? వినయ్ బాబయ్యా?"

"అవును".

"మాట్లాడకుండా పడుక్కున్నావేం?"

"ఏం చేయను, నువ్వు చదువుకోవడం అయిపోయిందా?"

"ధూత్, చదవడం నచ్చడం లేదు".

"నీకేం నచ్చుతుంది?"

"పాట పాడడం".

"పాడు".

"లేదు అమ్మ తిడుతుంది"

"తిట్టదు, నేను చెపుతాను లే మీ అమ్మకి".

"ఈవేళ నేను నరేన్ బాబయ్య ఇంటికి వెళ్లాను; అక్కడ కింద బెనర్జీ పాట వినేందుకు తీసుకు వెళ్లాడు".

"ఏం ఏం పాడాడు?"

"చాలా బాగా నచ్చింది పాట".

"ఎందు చేత?"

బాబూఇ ఏం మాట్లడలేదు.

పైన, చిన్న గది చుట్టూ ఉన్న తడి చిల్లులోంచి పేరుకు పోయింది మిణుగురు పురుగులాంటి వెలుగు. వాళ్లిద్దరూ ఒకరి నొకరు చూడడం తప్పించుకునేందుకు ఈ చిల్లులోంచి వచ్చే వెలుతురు వైపు అదేపనిగా చూస్తున్నారు. అదే జటిలమైన రేఖా చిత్రం దిక్కుగా చూస్తుంటే ఈనాటి రోజంతా చైత్ర వాయువుని తను అనుభవించినట్లు పడిన గొడవంతా జ్ఞాపకం వచ్చింది అతనికి. దానికి ఫలితంగా ప్రాకృతంగా అతని దేహంలో ఒక శూన్యత మళ్లీ జన్మించింది. బాబూఇ ఏదో అనివార్యమైన పతనం నుంచి రక్ష పొందింది ఈ కాళీలోంచి వస్తున్న వెలుతురు చూసి. ఆమె ముఖం తీరు ఈ విధంగా శోకం నుంచి సుదూరంగా పారిపోదలచుకుంది. ఈ పైనెగస్తున్న కేంద్రంలో ఇద్దరి మధ్య ఒక విధమైన నిశ్శబ్దపు అనుభూతి తేజరిల్లింది - ఏదైతే ఒక్క సెకను దీర్ఘశ్వాసపు శబ్దంలో ఇమిడిపోయిందో. మళ్లీ ఆ సర్వనాశాన్ని అడ్డగించేందు కోసం వాళ్లిద్దరూ కళ్లూ, నోరు కూడా ఒకేవిధంగా అడ్డుపెట్టి తమ చింతను అరికట్టే ప్రయత్నం చేస్తున్నారు. అప్పుడు వాళ్లిద్దరి కళ్లముందు ఒక ఆర్తి నానా రూపాలు ధరించి నానా ఆకారాలుగా శిథిలమయి మళ్లీ నూతనమయి నూతన భావంతో భగ్నమయి మళ్లీ నూతన రూపాన్ని దాల్చింది.

హిస్టీరియా రోగి ఎలాగైతే కొంతసేపు అలౌకికం, అనిర్దేశ్యం అయిన కొన్నింటి కొరకు పోటీపడి, మళ్లీ లౌకికం నిర్దిష్టం అయిన వస్తువుల పై అసహాయంగా తన దృష్టిని ప్రసారిస్తాడో, సరిగ్గా అలాగే ఈ ఇద్దరూ ఒకళ్లనొకరు చూసుకుంటున్నారు. వినయ్ నవ్వాడు - చన్నులో పాలులేని తల్లిలాగ. అయినా బిడ్డ పాలుకోరాడు; అలాగే ఒక పుత్రుడూ, ఒక ఆరోగ్యవంతురాలూ, పాలు ఉన్నట్టే తల్లి ఆచూకీ పొందగలిగాడు. వెంటనే అతను బాబూ ఇవైపు చూసి అన్నాడు: "ఏంటి, చెప్పవా, నరేన్‌బాబు ఇంట్లో ఏం జరిగిందో?"

మోకాళ్లలో ముఖం దాచుకుని ఇంతవరకు కూర్చున్న బాబూఇ, ఇప్పుడు ఆ భంగిమ మార్చి బాసిన పెట్టు వేసుకు కూర్చుంది. ఒకసారి తల ఎత్తి జుట్టు సవరించుకుంది. ఆమె మాట వినేందుకు వినయ్ కూడా తను కూర్చున్న పద్ధతి

మార్చుకున్నాడు. అప్పుడు బాబూఇ ఒక నీటి పావురంలా అయిపోయింది. తరువాత అకస్మాత్తుగా విషాదప్రవాహం వంపులు తిరిగి గొంతుక లోంచి బైట పడినట్లువగా, బాబుఇ ఉచ్ఛస్వరంతో పాడడం మొదలు పెట్టింది: "రాత్రి మనస్సులో ఏం చెప్పబడింది?"

మొదటి అయిదు మాటల మధ్య తాళం తప్పగా, తర్వాత సరిగ్గా సర్దుకుంది శ్రుతి శుద్ధంగా.

మొదటి "కేజాని" (ఏం తెలుసు) మంద్ర స్థాయిలో ఎత్తుకుంది, కంపించే స్వరంతో, రెండవ 'కేజాని' తారస్థాయిలో ఎత్తుకుంది. ఇంకా వణికే గొంతుతో. ఆ గంభీరమైన కంపన విపరీత సంఘాతంలో ఆమె వ్యాకులత ఇమిడి ఉంది.

"సేకిఘుమే" (అతను నిద్రిస్తున్నాడా) - సరళంగానూ గంభీరంగానూ 'ఘు'ను ఆరోహణ 'ఉ' లోంచి అవరోహణ 'మే'లో వెంటనే నిలబెట్టి, చెవులు పైకి నిక్కబెట్టిన కస్తూరి కా మృగం లాగ, ద్రోణ లతలాగ, ఉంచింది.

'సేకి జాగరనే" ('అతను మెలకువలో ఉన్నాడా?')) జా-గ-రనే- ఒక్కొక్క అక్షరం ఒక్కొక్కటిగా దిగువ కాలంలో ఉచ్చరించి, ఆనందం, సంశయం, ఆగ్రహం అన్నింటినీ ఒక్కసారిగా ప్రకటించింది. మళ్లీ మంద్ర స్థాయిలో, చిన్న గొంతుతో 'కీజాని' అని పాడి, కళ్లు మూసుకుంది.

ఈ పెరిగే అంధకారం అస్పష్టతతో, మామిడి చెట్టు పైకి చంద్రుని వెలుగు అందుకోవడం లేదు.

"అనేక.పనులలో అనేక విధాలుగా తిరిగి ఇంటికి తిరిగి, త్రోవలో తిరిగి "ఈ ఇంటి నుంచి ఆ ఇంటికి, ఆ యింటి నుంచి అదే ఇంటికి, త్రోవలో, ఒక్కర్తీ, ఇక అంత సేపు రాత్రింబవళ్లు చెవిలో ఏమిటి చెపుతుందో కదా? మినూని సాయంత్రం పిలిస్తే, మా బియ్యం గిన్నెలో కొబ్బరి నూనె వాసన. అమ్మను రాత్రి వేళప్పుడు - 'అమ్మా నీకు నిద్రపట్టిందా?' "అగోచరంగా ప్రతిక్షణం ఏమిటి ఆ మాట వాయించబడుతోంది" అర్థం అవదు, తెలియదు. ఏడుపే ఏడుపు. "ఏమిటి ఆ మాట నిష్కారణంగా హృదయాన్ని కలవర పరిచేది?" గిరిజా ప్రార్థన సంగీతం లాగ ఒకేసారి కొద్దిగా ఆలపింపబడి, మిగతాది విస్తృతంగా, "ఇదేభయం"? అదే మళ్లీ అయ్యో అవనట్లు మరొక తరంగంలో "ఇదేం జయం?" శబ్ద తరంగం పై తరంగం తట ప్రాంతం విశాలంగా, ఒక మహాప్రార్థన సముద్ర తరంగంలా దెబ్బ పై దెబ్బతీసి, చూర్ణం చేసి, ధ్వంసం చేస్తూ, తేలుతూ, మూలుగుతూ, సంకీర్ణక్షుద్ర మాంసాన్ని కరగబెట్టి, అస్థికల మేదస్సు బైటకు లాగి, ధమనుల రక్తాన్ని పీల్చి టకటకా ఎర్రటి రక్తవర్ణపు ప్రవాళ ద్వీపాన్ని సృష్టించింది. ఓహో, ఎలా తయారయిందో ఆ ద్వీపం, రక్తవర్ణపు ద్వీపం ఓహో సృష్టి అంటే అదే సృష్టి.

భూమిలో ఉన్నంత గాలి పైకి లేచింది - సృష్టి. ఎ-లి-మెం-టల్ లి-రి-కల్ నేను చిత్రం చిత్రిస్తాను, నేను పాట పాడుతాను, నేను*సముద్రం చూస్తాను. ఆహా, ఓ బాలికా, మెడ ఎత్తి, ఎండిన పెదవులలో ఏదో ఆగ్రహంలో ఏదో బాధలో శిలువ వేయబడ్డ ఏసుప్రభువు సాధ్వాంతంపై బడ్డ భక్తుని మోస్తరుగా? ఆహా, ఈ 26 ఏళ్ల ఈ అకాల వార్ధక్యంలో రెండు కాళ్ల మధ్య తలపెట్టి, వెడల్పు వీపుపై అట్లాసు లాగ ఉంచి, పాట విని ఉండగా - ఏదో విషాదం, ఏదో తపన, రాత్రివేళ, ఈ రాత్రి వేళ, మనస్సులో ఏం చెప్పబడింది? "సహించలేను, సహించలేను" ఆ మాట చెవిలో తిరిగి తిరిగి చెప్పబడుతోంది 'ఇంక లేదు మరి ఇంకలేదు' స్థిర దృష్టి, ధ్యాన దృష్టి, అర్థస్థిర నయనాలు, శివుని ధ్యానం, రెండు కనుబొమ్మల ప్రక్కనా రెండు దీర్ఘకుంతలాల రేఖ, హేతువు ఊదుతూ, మన మధ్య మందో, వన మధ్యమందో(?) ఎవరు పిలుస్తున్నారా! ఏమని పిలుస్తున్నారు, ఏం తెలుసు, ఏం తెలుసు - "ఆ మాట ఏమీ నానా స్వరాలలో పలికి నన్ను దూరానికి తీసుకో" అంటూ ప్రతి స్వల్ప శబ్దం అల్పతరంగం, ధాన్యపు సంగతి ఆంతరంగిక విషయం, చెవులు పైకి నిక్క బెట్టి, కస్తూరికా మృగం, ప్రార్థనా తరంగ విధ్వస్తతట భూమి ఆత్మలయలో, నడు, దూరం నడు - నీలాంబు రాశి అప్రమత్తపు తలమందు, దూరంగా సముద్రతలపు ఆకాశంలోకి! నా నాడుల నుంచి రక్తం బైటకు లాగు; ఎముకలలోంచి మజ్జని; ఒక దృష్టి నిర్మిత ద్వీపం, ప్రవాళ ద్వీపం, ఆ వేగపు రక్తవర్ణ ద్వీపం రచించు! బాబూఇ, బాలికా నా సమస్త పాపాలను సేకరించి నీ పాదాలపై పెడుతున్నాను.

పర్వతం నుంచి నది సముద్రంలోకి పయనిస్తుంది. గంగా బ్రహ్మపుత్ర వాహిత మాగాణి భూమిలో ఒక దేశం, భూగోళంలో ఒక పేరు, పృథివిలోని కొందరు మనుష్యులు - వీళ్లందరినీ కలిపి ప్రకృతి ఏదో ఒక శోభను రచించు. నది సముద్రానికి 'చలోదూరే' (దూరంగా నడు) అంటూ పోవాలి సాగర సంగమానికి, గంగాసాగర సంగమానికి; కలకత్తా ఒక ఓడరేవు; కలకత్తా ఒక పేరు; సముద్ర తీరాన; దాని వెనుకా, ప్రక్కనా ఇంకా ఎన్నో పేర్లు. కలకత్తా, దాని తర్వాత సముద్రం. కలకత్తా సముద్రానికి సమీపంలో గంగానది ఒడ్డున ఉన్న ఒక ఓడ రేవు - అస్సాం, బెంగాల్, బీహార్, ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్ తర్వాత 'పశ్చాద్భూమి'. దాని తర్వాత సముద్ర మధ్యం (మధ్య సముద్రం).

ఈ చీకటిలో వాళ్లిద్దరూ రవీంద్రుని ఒక పాట పాండు లిపి అయిపోవాలి -మాట తెగిపోయి. చరణం భగ్నమయి పోయి ఇటూ అటూ చెల్లా చెదరయిపోయిన హస్తాక్షరాలు. ఇక అంతర్వర్తిగా ఉన్నది స్వరంలో పరిపూర్ణతను పొందుతుంది.

---

(ఏప్రిలు, 1960)

## కథకుల సంక్షిప్త పరిచయం

### 1. తారాశంకర్ వంద్యోపాధ్యాయ్ (1889-1971)

శరచ్చంద్రుని తర్వాత వంగ కథా సాహిత్యానికి అధినాయకుడు. కథ, నవల, గేయ రచనలో సిద్ధ హస్తుడు. ఈయన గురించి రవీంద్రుని అభిప్రాయం ఉల్లేఖనీయం-"మట్టినీ, మనిషినీ ఆయన తెలుసుకున్నాడు: వీటిని జత పరిచి ఆయన యోగాన్ని స్థాపించాడు" ఈ యోగం బాహిరమైనది కాదు, అంతరంగికమైనది. శరత స్మారక పురస్కారం (1947), రవీంద్ర స్మారక పురస్కారం (1955), సాహిత్య ఎకాడమీ పురస్కారం (1956), జ్ఞానపీఠ పురస్కారం (1966) - ఈయన పొందిన బహుమతులు. కలకత్తా, ఉత్తర బెంగాలు, యాదవపురం, రవీంద్రభారతి ఈ విశ్వవిద్యాలయాలు ఈయనను డి.లిట్ బిరుదుతో సన్మానించాయి. రాష్ట్రపతిచే నియమించబడ్డ రాజ్యసభ సభ్యునిగానూ, సాహిత్య ఎకాడమీ ఫెల్లో గానూ ఉండేవారు. ఆయన కథలూ, నవలలూ విభిన్న భాషలలోకి అనువదించబడ్డాయి, చలన చిత్రాలుగా ప్రవర్తించబడ్డాయి. 'బీర్‌భూమ' జిల్లాలోని 'లాభ్‌పూర్'లో ఆయన జన్మించారు. కలకత్తాలో మరణించారు. 'బీర్‌భూమి' ఒకనాటి జమిందారీ బిడ్డ రచనయే ఆయన జీవితం. 'పద్మభూషణ్' గౌరవాన్ని పొందారు.

### 2. బన్‌ఫూల్ (1899)

అసలు పేరు శ్రీ బలయాచంద ముఖోపాధ్యాయ కలకత్తా మెడికల్ కాలేజీ నుంచి పట్టభద్రుడై చాలాకాలంగా భాగల్‌పూర్‌లో ప్రాక్టీసు చేశారు డాక్టరుగా. ప్రస్తుతం కలకత్తాలో ఉంటున్నారు. కవిత్వం, కథలు, నవలలు, నాటకాలు, ప్రబంధాలు రచించడంలో నిపుణులు. లెక్కలేనన్ని కథానికలు వ్రాశారు. విషయ విస్తృతంలోను, కథాకథన చాతుర్యంలోనూ ఆయనకు ఆయనే సాటి. కలకత్తా విశ్వవిద్యాలయం శరత్‌స్మారక బహుమతి (1952), 'ఆనంద' బహుమతి (1961), 'రవీంద్ర' బహుమతి (1962) ఆయన పొందారు. ఆయన కథా-నవలా జగత్తు ఒక చారిత్రిక చిత్రశాల. దాని అంతులేని వైచిత్ర్యం పాఠకులను ముగ్ధులనూ, ఆశ్చర్య చకితులను చేస్తుంది. పద్మభూషణ్ సన్మానం పొందారు.

### 3. అచింత్యకుమార్‌సేన్ గుప్తా (1903-1976)

'కల్లోల్-గోష్ఠికి చెందిన ప్రధాన రచయిత. కథ, నవల, కవిత, జీవిత చరిత్ర, బాల సాహిత్యం, నాటకం వీటి లో సవ్యసాచి అయిన లేఖకుడు. సునిశితమైన

పరిశీలన, గాఢమైన సానుభూతి, అపరిమితమైన మమతా, ఆయన కథా-నవలా రచనకు ఆధారభూతాలు. తూర్పు బెంగాలులోని దరిద్ర మహమ్మదీయ స్త్రీ పురుషులు గవర్నమెంటు బంట్రోతులూ, రాజధానిలో హైసొసైటీ లోని వివిధమైన అంతస్తులూ, వీటిని విశ్లేషణాత్మక దృష్టితో ఆయన చిత్రించారు. ఆయన శైలి లావణ్యమైనదీ, స్నిగ్ధమైనదీ. 1975లో 'రవీంద్ర' పురస్కారాన్ని పొందారు.

## 4. అన్నదాశంకర్ రాయ్ (1904)

ఢేంకనులో జన్మించారు. ఐ.సి.ఎస్. (1927), పదవీ త్యాగం 1951; యూరపు ప్రవాసం 1927-29, జపాను యాత్ర 1957; పశ్చిమ జర్మనీ, ఇంగ్లండు దేశాల పర్యటన 1963; సాహిత్య ఎకాడమీ బహుమతి 1962; యాత్రా చరిత్ర 'పథే ప్రబాసే' (1931); ఆయన జీవితంలో ముఖ్యమైన విశేషాలు. సవ్యసాచి లేఖకుడు. ప్రధాన నవలలు 6 భాగాలుగా "సత్యాసత్య" (1932-42); మూడు భాగాలు "రత్నం, మరియీ, శ్రీమతీ" (1956-73). 40 సంవత్సరాలుగా చిన్న కథలు వ్రాస్తున్నారు. రెండు కథా సంకలనాలు: 'గల్ప' (1960) 'కథ' (1970) 100కు పైగా కథలు వ్రాశారు. కథలలో రూప వైచిత్ర్యం వక్తవ్యం రెండింటినీ కూడా సమాన చాతుర్యం తో సాధిస్తారు. సాంప్రదాయిక కథా వస్తువులో ఆయనకు శ్రద్ధ లేదు. వాస్తవికతని అన్వేషించే కథ ఆయన సాధన. ఆయన కథలు రెండు పర్వాలకు చెందుతాయి. ప్రథమ పర్వం 1930-56; ద్వితీయ పర్వం 1959 నుంచి 'మీనప్రియానీ' అన్న కథ ద్వితీయ పర్వానికి ప్రతీక. మొదటి పర్వంలో మానవ జీవితం బాహ్య వాస్తవికత అన్వేషించబడింది, రెండవ పర్వంలో అంతరంగికమైన అన్వేషణ. తన సాహిత్య జీవితం మొదటిలో బెంగాలీ, ఒరియా, ఆంగ్ల భాషలలో రచించారు. ఇప్పుడు కేవలం బెంగాలీలోనే వ్రాస్తున్నారు. ఎప్పుడూ సాహిత్య వ్యాసంగమే. కలకత్తాలో ఉంటున్నారు.

## 5. ప్రేమేంద్ర మిత్రా (1904)

కల్లోల-గోష్ఠి'కి చెందిన రచయిత. కవి, కథాశిల్పి. గీతకారుడు, ప్రబంధ రచయిత, చలన చిత్ర రచయిత, బాల సాహిత్య రచయిత. ఆయన సృష్టించిన 'ఘనాదా' 'పరాశర వర్మ' కథలు, ఆబాలగోపాలాన్ని ముగ్ధులను చేశాయి. కాశీలో కొంత కాలం జీవించారు. అనేకరకాల ఉద్యోగాలు చేశారు. ఆకాశవాణి, కలకత్తా, కేంద్రంలో కొన్నాళ్ళు సాహిత్య విభాగంలో సలహాదారుగా పనిచేశారు. ఆఖరికి ఆయనకు సాహిత్యమే ముఖ్య జీవనాధారంగా అయింది. మానవ జీవితం గూర్చి

బహు సానుభూతి తో సాగిస్తారు ఆయన రచనలు. బాహిర జీవితాన్ని విడిచి అంతర్జగత్తుని అన్వేషించడంలో ఆయనకు అమితోత్సాహం. హృదయాంత రాళంలోకి చొచ్చుకుని పరీక్షించడం ఆయనకు ఇష్టం. 'శరత్‌స్మారక' బహుమతి (1955), 'రవీంద్ర స్మారక' బహుమతి (1958), సాహిత్య ఎకాడమీ బహుమతి (1967) ఆయన పొందారు. 'పద్మశ్రీ' చే బహూకరింపబడ్డారు.

## 6. సతీనాథ్ భాదురీ (1906-1965)

'పూర్ణియా'లో వసతి. చాలా కాలం రాజకీయాలలో పాల్గొన్నారు. బీహారు కాంగ్రెసుతో బాగా పరిచయం. 1941 ఆగస్టు 9 ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లారు. ఆ కారాగార వాసాన్ని పురస్కరించుకుని వ్రాశారు ఆయన మొదటి నవల 'జాగరీ' (నిద్రా రహితం), 1945లో. ఆ పుస్తకం ఆయనకు బాగా పేరు గడించి పెట్టింది. దానికే సర్వ ప్రథమ 'రవీంద్ర స్మారక' బహూమతి 1950లో లభించింది. కథా, నవలా, ప్రబంధాల రచనలలో ఆరితేరిన చేయి. ఆయన "సత్యిభ్రమణ్ కాహినీ" ఒక అసాధారణ జర్నల్. మానసిక తత్త్వపు లోతులలో ఆయన స్వచ్ఛందంగా విహరించారు. మానవ హృదయం సూక్ష్మాతి సూక్ష్మ సమస్యలూ, ఆవేదనలూ విశ్లేషించడంలో నిరహంకారంతో సతీనాథ్ చూపించిన నైపుణ్యం వల్ల ఆయనను 'రచయితల రచయిత' అని వర్ణించవచ్చు. ఆయన 'టోండాయ్ చరిత మానస్' (దెబ్బలాటల మానస చరితం) -2 భాగాలు - భారతీయ నవలా సాహిత్యంలో అద్వితీయమైనది. ఈయన ప్రఖ్యాత హిందీ లేఖకుడు ఫణీశ్వర్‌నాథ్ రేణు సాహిత్య గురువు.

## 7. ఆశాపూర్ణాదేవి (1909)

మానవ మనస్సు రహస్యాలను ప్రకటించడంలో ఈమెకు సహజమైన నైపుణ్యం ఉంది. మానవ జీవనం పై ఈమెకు హద్దులేని సహానుభూతి. సామాన్య సంసార యాత్రలోని నేపథ్యంగా, నగ్నంగా, విస్మయపూరితంగా ఉన్న వైచిత్రిని వెలిగింపజేయడంలో ఈమెకు అసామాన్యమైన చాతుర్యం కలదు. మన సమాజం, కుటుంబం జీవన విధానాన్ని ఈమె చక్కగా చిత్రిస్తారు. 'లీలా' బహుమతి, 'రవీంద్ర' బహుమతి (1966) ఈమె పొందారు. ఆమెవి అనేక పుస్తకాలు సినిమాగా మార్చబడ్డాయి. ఈమె 'జ్ఞానపీఠ' అవార్డును కూడా పొందింది.

## 8. సుబోధ్ ఘోష్ (1910)

అసాధారణ శక్తి గల రచయిత. కథా, నవలా, ప్రబంధ రచనలలో లబ్ధ ప్రతిష్ఠుడు. విచిత్ర విషయాలు చిత్రించడం లో ఆయన కెక్కువ మక్కువ. 'ఫోట్

నాగ్‌పూర్ ప్రాంతంలో ఆయన జీవితం ఆరంభ దశ గడిచింది. ఆయన రచనల 'పటభూమి' ఈ ప్రాంతమే. 'శతకియా' (శతకం) ఆయన సర్వోత్తమ నవల. ఆయన విశాల పరిశీలనా దృష్టికి తోడుగా ఆయన రచనా వైదగ్ధ్యం, శిల్ప నైపుణ్యం ఉంటాయి. 'హాజారిబాగ్'లో జన్మించారు. ఇప్పుడు కలకత్తాలో ఒక దిన పత్రికకు సహాయ సంపాదకుడిగా పనిచేస్తున్నారు. ఆయన శైలి అనన్యసామాన్యమైనది. ఆదివాసుల నుంచి సైనికుల వరకూ గల జీవన వైవిధ్యాన్ని, నృత్యం నుంచి లలిత కళల వరకూ గల విభిన్న విషయాలలోనూ, ఆయన సులభంగా, స్వచ్ఛంగా వివరించగలరు. మానవ హృదయంలో రహస్య మార్గాన్ని వెతికి బయట పెట్టడంలో నిపుణులు ఈయన.

## 9. నరేంద్రనాథ్ మిత్రా (1916-75)

మితభాషీ, మృదుభాషి అయిన నరేంద్రనాథ్ కథలూ, నవలలూ ఒక విధంగా ఆయన మిత భాషణానికి చిహ్నాలు. మధ్య తరగతి కుటుంబాల రూపకల్పనలో నిపుణులు. దుర్విజ్ఞేయమైన మానవ హృదయపు రహస్యాన్ని బయటపెట్టడం, మనస్సు నిపుణమైన విశ్లేషణ ఆయన ఎంత గంభీరమైన అంతర్దృష్టితో పరిచయం చేశారో అది అనల్పం. "మిగతా అందరికంటె బహు సంఖ్యాకమైన గొప్ప చిన్న కథలు వ్రాసిన వారిలో మన మధ్య నరేంద్రనాథ్" అని ఆయన తోటి రచయితలు ఏకగ్రీవంగా చెపుతారు. కథాకథనం లోనూ, చరిత్ర సృష్టిలోనూ ఆయన ప్రదర్శించే సులభమైన నైపుణ్యం అతి సహజంగా దృగ్గోచరమవుతుంది. కలకత్తాలో ఒక దినపత్రికలో పని చేశారు. 'ఫరిద్‌పూర్' లో జన్మించారు.

## 10. నారాయణ్ గంగోపాధ్యాయ్ (1918-1970)

నరేంద్రనాథ్ సహపాఠి అయిన నారాయణ్ సాహిత్య క్షేత్రంలో కూడా ఆయనతో పాటే కాలుపెట్టారు ఆయన. అసలు పేరు తారక నాథ్ గంగోపాధ్యాయ్. "దినాజ్‌పూర్' లో పుట్టారు. కలకత్తా విశ్వవిద్యాలయంలో వంగ భాషా సాహిత్యం రీడర్‌గా ఉండేవారు. కథ, నవల, కవిత, నాటకం, చిత్ర నాట్యం, ప్రబంధం, బాల సాహిత్యం, పాటలు, డైలాగులు, మొదలైన అన్నింటిలోనూ సిద్ధహస్తుడైన రచయిత. ఆయన మొదటి నవల 'ఉపనివేశ్' ఆయనకు వెంటనే సాహిత్య జగత్తులో కీర్తి తెచ్చి పెట్టింది. ఆయన రచనల్లో బహిర్జగత్తు, అంతర్లోకం, రెండూ సమానంగా సమన్వితమై ఉంటాయి. ఆయన ఒక్కసారిగా రొమాంటిక్ రియలిస్ట్ అనీ కూడా చెప్పవచ్చు. ఆయన రూపొందించిన సాహిత్య జగత్తు కావ్యకళా శోభితమైనదీ, వ్యంజనా భరిత మైనదీనూ. మానవునితో పాటు విశాల విశ్వ ప్రకృతి

కూడా ఆయన రచనల్లో సమపాలు పంచుకుంది. నిక్కచ్చిగా సమాజాన్ని పరిశీలిస్తూనే కాల్పనికంగా ప్రకృతి ప్రియుడైన కథకుడు.

## 11. సంతోష్ కుమార్ ఘోష్ (1920)

నరేంద్రనాథ్ మిత్రా, నారాయణ్ గంగోపాధ్యాయ్‌లతోనే సాహిత్య జగత్తులో సమకాలంలో ప్రవేశించారు.'ఫరీదపూర్'లో పుట్టారు. తర్వాత చిన్నతనం నుంచి కలకత్తాలో ఉంటున్నారు. నాగరిక జీవనాన్ని ఏకాంత భావంలో రూపొందిస్తారు. ఎక్కడా జానపద జీవితాన్ని చిత్రించలేదు. కథ, నవల, నాటకం, కవిత, ప్రబంధం మొదలైన వాటిని రచించడంలో కృతకృత్యులు. నిపుణులైన భాషా శిల్పి. ఆయన కథ ఫారంని ప్రత్యేక శ్రద్ధతో నిర్మించి, దాని ఉపస్థాపన రీతిని కూడా మూల్యవంతమైనదిగా తయారు చేస్తారు. సునిశితంగా చెక్కబడిన, వ్యంగ్య గర్భితమైన భాష ద్వారా హృదయంలోని అతి సూక్ష్మ మైన అనుభూతులను వ్యక్తపరచడంలో ఆయనకు సహజమైన నైపుణ్యం కలదు. ఆయన, జీవితాన్ని ప్రేమిస్తాడు. ఆ ప్రేమలో కొంచెం వేదనా, నైరాశ్యం లేకపోలేదు. కవి సమయంలోనూ, కావ్య శిల్పంలోనూ కూడా సచేతనమైన ప్రతిభను సంపాదించారు. కొంతకాలం ఢిల్లీ లో ఉండేవారు. ఇప్పుడు ప్రఖ్యాత దినపత్రిక 'సంవాద పత్ర'కు సంయుక్త సంపాదకునిగా పనిచేస్తున్నారు.

## 12. జ్యోతిరింద్ర నందీ (1912)

యుద్ధానంతర మధ్యతరగతి, నిమ్న తరగతుల సంప్రదాయాల్ని నైపుణ్యంతో చిత్రిస్తారు. మనన శీలియైన ఈ రచయిత మనఃప్రవృత్తి విశ్లేషణలో ఒక ప్రత్యేకమైన బాటను నిర్మించుకున్నాడు. ఆయన శైలి కూడా విలక్షణమైనదే. మానసిక ద్వంద్వ యుద్ధాలను వర్ణించడంలో సిద్ధహస్తుడు. ఆయన కథలూ, నవలలూ కేవలం సమకాలిక దోషాలను వెతకక, మానవ జీవితంలో ప్రకృతి గల ప్రబల భూమికను స్వీకరిస్తాయి. ఈ స్వకీయమైన పంథాలో ప్రకృతి సహజంగా ఉంటూ సాగిస్తారు. ఈయన తన సాహిత్యయాత్ర.

## 13. సమరేశ్ బసూ (1921)

నరేంద్రనాథ్, నారాయణ్, సంతోష్‌కుమార్ వీరితో పాటు ఒకే జట్టులో పేర్కొనబడిన రచయిత సమరేశ్‌బసూ. ఈయన పట్టణ జీవితాన్ని గూర్చి వ్రాయలేదు. వంగదేశపు జానపద జీవితాన్ని చక్కగా చిత్రించారు. 'జీవన వాది'. ఢాక్కాలో జన్మించారు. అనేక రకాల పనులు చేసారు జీవనోపాధి కోసం. సాహిత్య

వ్యాసంగమే ఎల్లప్పుడూ ఆయన 'జీవిక' (జీవనోపాధి). మానవ జీవితం పై అపరిమితమైన కుతూహలం, సానుభూతి. కథా, నవలా ప్రపంచంలో ఆయనకు గల ప్రతిభ మహోన్నతమైనది. కేవలం మానవుడే కాదు, ప్రకృతి కూడా ఆయనకు 'స్వధర్మం'. (ఉపజీవిక). పర్యటన రూపమైన కథలు 'కాలకూట్' అనే మారుపేరు తో వ్రాస్తారు. పాటలు వ్రాస్తారు, పాడగలరు. 'మానిక్', 'తారాశంకర' యుగళ రచయితల వల్ల ఒకప్పుడు ప్రభావితుడైన సమరేశ్ ఇప్పుడు స్వతంత్ర పంథా త్రొక్కుతున్నారు. ఆయన జీవితాన్ని అనుభవం ద్వారా కనుగొన్నారు. ఈ అనుభవంతో మేళవింపబడినది ఆయన దట్టమైన అంతరంగికత.

## 14. విమల్ కర (1921)

మననశీలి. తన వైయక్తికమైన స్వతంత్ర దృష్టితో జీవితాన్ని తిలకించారు. వైద్య విద్యను అభ్యసించడం మొదలు పెట్టారు కాని, పూర్తి చేయలేదు - విద్యార్థి దశలో. అయినా తన తర్వాతి జీవితంలో కథా-నవలా రచన ఒక నిశితమైన, నిర్దుష్టమైన, నిరాసక్తమైన, చికిత్సకునికి సంబంధించిన స్వభావంతో సాగించారు. వంగ కథాసాహిత్యంలో క్రొత్త రీతుల గురించి చేసిన ఆందోళనలో మార్గదర్శి. మననం, బుద్ధి - ఈ రెండు ఆయన 'ఆయుధాలు'. ఆవేగాన్ని ఆయన విసర్జించలేదు, కాని ఎక్కడా దానికి బలి కాలేదు. బాల్యం హాజారి బాగ్‌లో గడిపారు. ఇప్పుడు కలకత్తాలో ఒక ప్రఖ్యాత సాహిత్య పత్రికలో పనిచేస్తున్నారు. 24 పరగణాల జిల్లాలో జన్మించారు. జీవితానికి సన్నిహితంగానే ఆయన మృత్యువుని దర్శించారు. ఆయన రచనల్లో జీవితం, మృత్యువు ఒకే వేషాన్ని వేసుకుంటాయి. ఆయనవి చాలా కథలు 'చలన చిత్రితా'లయ్యాయి.

## 15. రమాపద్ చౌధురి (1922)

వర్తమాన వంగ సాహిత్య కారులలో ఒక ప్రధాన పురుషుడు. రెండవ ప్రపంచ సంగ్రామ సమయంలో తన రచనలు ప్రారంభించారు. ఖరగ్‌పూర్‌లో జన్మించారు. ఉద్యోగరీత్యా ఛోటా నాగపూర్ లో కొంతకాలం ఉన్నారు. చాలా రకాల ఉద్యోగాలు చేశాక ఇప్పుడు ఒక కలకత్తా దినపత్రికలో ఒక విభాగానికి సంపాదకునిగా పనిచేస్తున్నారు. ఒకప్పుడు అరణ్య ప్రాంతాల జీవితం గురించి విశేషించి వ్రాసేవారు. ఇప్పుడు నాగరిక జీవనాన్ని అనుసరించే తన కథలూ, నవలలు వ్రాస్తున్నారు. ఆయన కథలను సినిమాలకు తీసుకున్నారు. ఆయన శైలి చక్కగా శోధించబడి లావణ్యంతో రాణిస్తూ ఉంటుంది. విషయ పరిగ్రహణంలో నూతనత్వం లేకపోయినా, ట్రీట్‌మెంట్‌లో స్వకీయమైన ప్రతిభ. జీవితం ప్రతి

రేవులోనూ అయన తన నౌకను ఒడ్డుకు చేరేసి కట్టారు కాని, అయన అంతరంగంలో ఒక స్థితప్రజ్ఞుడే. 'రవీంద్ర' పురస్కారంతో సన్మానితులయ్యారు.

## 16. సయ్యద్ ముస్తాఫా సిరాజ్ (1930)

భారత స్వాతంత్ర్యానంతరపు పర్వంలోని 'ఆదిమ యువతరానికి చెందిన రచయిత. మూర్షి దాబాద్ గ్రామంలో పుట్టారు. జీవితపు విచిత్ర అనుభూతిని సంపాదించారు. మూర్షిదా బాద్ 'అలక్యాన్' బృందంలో 'మాస్టరు' గీతకారుడుగా పనిచేశారు (1950-58), అంతకు ముందు రిపోర్టర్ గా ఉండేవారు (1949-50). ఇప్పుడు కలకత్తాలో ఒక ప్రఖ్యాత దినపత్రికలో పనిచేస్తున్నారు. తారాశంకర్ పద్ధతిలో వ్రాయడం మొదలుపెట్టి, తర్వాత స్వకీయమైన తరహా సంపాదించుకున్నారు. 'దేశ్' పత్రికలో అయన మొదటి కథ "ప్రేమ, డవున్ ట్రెయిన్" అన్నది ప్రచురించబడింది. ఇప్పుడు సాహిత్యమే అయన జీవనోపాధి. జానపదమూ, నాగరికమూ అయిన వంగ జీవితంతో అయనకి సమాన పరిచయం ఉంది. నిశితమైన సామాజిక చైతన్యం కలవారు. చాలా కథలు వ్రాశారు.

## 17. మతినంది (1932)

ఉత్తర కలకత్తాలో ఒక సంపన్న కుటుంబంలో పుట్టారు. అటోమొబైల్ ఇంజనీరింగులో డిప్లొమా ఉంది. స్టేట్ ట్రాన్స్‌పోర్టులో రెండేళ్లు పని చేసాక, బి.ఏ. పాసయి, పత్రికా విలేఖరిగా తనంతట తానే ఎంచుకుని పనిచేశారు. ఇప్పుడు కలకత్తాలో ఒక దిన పత్రికలో స్పోర్ట్సు సెక్షన్ (క్రీడారంగం)లో ఎడిటర్‌గా పనిచేస్తున్నారు. క్రికెట్ అటలో ప్రత్యేకాభిమానం. అ అట గురించి పుస్తకాలు కూడా వ్రాశారు. "దేశ్" పత్రికలో "ఛాద్" (పై కప్పు) అనే కథ (1956) ద్వారా పాఠకుల దృష్టిని అకర్షించారు. అయన రచనల రీతి కేవల వైవిధ్యాన్ని బాహుల్యాన్ని స్వీకరించదు. రూఢిగా వాస్తవంగా ఉన్న నేలపై నిలబడి మానవుని ప్రతీ విశ్వసనీయ మైన నిలకడనూ అయన సార్థకంగా నమ్ముతారు. మధ్య తరగతి, నిమ్న మధ్య తరగతి జీవితాలను నైపుణ్యంతో చిత్రిస్తారు.

## 18. సునీల్ గంగోపాధ్యాయ్ (1934)

ఫరీద్‌పూర్‌లో జన్మించారు. కవీ, కథకుడూను. "దేశ్"లో ప్రచురింపబడ్డ 'ఒక కవిత' ('ఏకటేకబితా') అయన్ని ఎక్కువ కవిగా గుర్తింపజేసింది. అయన కవిగానా కథకునిగానా ఎక్కువ ఖ్యాతి సంపాదించారన్న సంగతి తేల్చలేము. అనేక రకాల వృత్తులు అవలంబించారు. ఇప్పుడు కలకత్తా లోని ఒక దినపత్రికలో

పనిచేస్తున్నారు. 1960 లో అమెరికా పర్యటించారు. చాలా రచనలు చేశారు. కొన్ని కథలను ఆధారం చేసుకొని సినిమాలు తీయబడ్డాయి. మధ్య తరగతి జీవనాన్ని, దాని ఆవేశానుభూతులనూ, ఆయన హృదయం గమంగా కథానికలలో సంయుక్త పరచి కృతకృత్యులయ్యారు. భాషలోని మాధుర్యం, వస్తు పరిపోషణ, కథా సంవిధానం సునీల్‌లోక ప్రియతకు మూలకారణాలు.

## 19. ప్రఫుల్ల రాయ్ (1934)

ఢాక్కాలో పుట్టారు. ఆ ప్రాంతపు జీవనాన్ని ఆధారం చేసుకుని నవలలు వ్రాస్తూ తమ సాహిత్య జీవితాన్ని ప్రారంభించారు. 'దేశ' లో ప్రకాశించబడిన 'పూర్వపార్వతా' నవల ఆయనకు కీర్తి గడించి పెట్టింది. ఆయన అత్యుత్తమ నవల 'కేయా పాతార్ నౌకా' ('కేతకీ పత్ర నౌక" - రెండు భాగాలు) ఈ నాటి వంగ దేశ జీవన క్రానికల్. ప్రస్తుతం ఒక కలకత్తా దినపత్రికలో ఉపసంపాదకులుగా పనిచేస్తున్నారు. ఆయన పుస్తకాలను అధారం చేసుకొని కొన్ని చలన చిత్రాలు నిర్మింపబడ్డాయి. నిశితమైన, హార్దికమైన అంతరంగికత ఆయన కథల్లో విశేషంగా ప్రస్ఫుటమవుతుంది. కథా సంవిధానం లోనూ, పాత్ర చిత్రణలోనూ సమానమైన కౌశలం కలదు ఆయనకు.

## 20. శిర్షేందు ముఖోపాధ్యాయ్ (1935)

మయన్ సింగ్ (బంగ్లాదేశ్)లో జన్మించారు. ఉపాధ్యాయవృత్తి. 1959 లో 'దేశ్'లో ప్రచురించబడ్డ 'జలతరంగ్' అన్న కథానిక ద్వారా చిన్న కథల రచయితగా లబ్ధప్రతిష్ఠులయ్యారు. ఇంతవరకూ 10 నవలలూ, 50 కథలూ వ్రాశారు. ఆయన కథలూ, నవలలూ వాస్తవికత అంతరంగిక చైతన్యం పడుగూ పేకలను నిర్దేశిస్తాయి. ఆయన కథలలో అస్థిరత లేదు. ఒక నిశ్చలమైన విశ్వాసం ఉంది. స్వీయ చరిత్ర పద్ధతిలో వ్రాయబడిన ఆయన కథలలో అంతర్గతత్తు గంభీర సత్యాలు అన్వేషించబడతాయి.

## 21. దేవేశ్‌రాయ్ (1936)

జలపాయిగురిలో ఉంటున్నారు. వంగ సాహిత్యం అధ్యాపనం ఆయన వృత్తి. 'జాటేర్' దశలో బెంగాలీ కథానికా జగత్తుకి నేతృత్వం వహించారు. కథా వస్తువును ప్రతిపాదించడంలోనూ, భాషను భావానుగుణంగా మలచడంలోనూ సిద్ధహస్తులు. 1969 లో ఆయన మొదటి కథాసంపుటి 'దేవేశరాయేర్ గల్ప్' ప్రకటించబడింది. ఆయన మొదటి నవల 'యామాతి' 1972 లో ప్రచురించబడింది. 'దేశ్' పత్రికలో

పడిన 'హాడ్‌కాటా' ఆయనను పాఠకలోకానికి ప్రధానంగా పరిచయం చేసింది. ఇంచుమించు నూరు కథలు వ్రాశారు.

Printed at Kay Kay Printers 150-D Kamla Nagar Delhi - 110007